# తెలుగుకావ్యావతారికలు



ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ
బహుమతి పొందిన రచన



జి. నాగయ్య, ఎమ్. ఏ., పిఎచ్. డి.,
ఆంధ్రోపన్యాసకులు,

ప్రతులు : 1,000

ప్రచురణ : అక్టోబరు, 1968

❖

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి

❖

మూల్యం :

పది రూపాయలు



ముద్రణ :

ఫ్రీడమ్ ప్రెస్,

138, తిరువత్తియూర్ హైరోడ్డు,

మద్రాసు - 21

ప్రతులకు :

1. గ్రంథకర్త.

2. వేంకట్రామ అండ్ కో., విజయవాడ,

వారి అన్ని బ్రాంచి షాపులు.

# ముందుమాట

నేను తెలుగు ఎం. ఏ. విద్యార్థిగా ఉన్నకాలములో (1960) నే "నన్నయ భారతావతారిక"ను గూర్చిన ఒక వ్యాసమును వ్రాయుమని ప్రోత్సహించినవారు గురువర్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు. ఆనాటి ఆ అల్పారంభమే క్రమముగా విస్తరించి తెలుగు కావ్యము లన్నిటి అవతారికలను పరిశీలించి ఈ విపుల గ్రంథరచన చేయుటకు దారితీసినది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు "ఆంధ్ర కావ్యాలలో అవతారికలు" అను విషయమునుగూర్చి పరిశోధనాపూర్వకమగు గ్రంథమును రచింపజేయుటకు సంబంధించిన పోటీని ప్రకటించుట ఈ గ్రంథపరిసమాపనమునకు తగుప్రోత్సాహము కల్గించి అవ్యవహిత పూర్వకారణమైనది.

తెలుగులో కథలు, కావ్యములు మొదలగు వాని కున్నంత మంది పాఠకులు విమర్శకగ్రంథములకు లేకుండుటకు సాధారణముగా చెప్పు కారణములలో కొన్ని : తెలుగు విమర్శక రచనలలో విషయదృష్టికన్న పాండిత్యప్రదర్శనాభిలాష ప్రబలమగుట, అప్రస్తుతాంశముల నెక్కువగా జేర్చి ప్రస్తుతాంశముల ప్రాధాన్యము తగ్గించుచుండుట, రచనాశిల్పము కొరవడుచుండుట. అట్టి

దోషములను సాధ్యమైనంతవరకు పరిహరించి విషయదృష్టితో, సమ్యగ్ వివేచనముతో పాఠకుల మనస్సుల కెక్కునట్లు రచన సాగింపవలయుననియే ఈ గ్రంథములో నేను ప్రయత్నించితిని. ఆ ప్రయత్నములో నే నెంతవరకు కృతకృత్యుడనయినది చెప్ప వలసినవారు సహృదయపాఠకులు.

ఆంధ్ర కావ్యావతారికలపై పోటీకి వచ్చిన గ్రంథము లన్నిటిలోను ఉత్తమమైనదిగా నిర్ణయించి రెండువేలరూపాయలు పారితోషికమిచ్చి ఇంత శీఘ్రముగా ఈ గ్రంథప్రచురణమునకు తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి,

గ్రంథరచనలో అడుగడుగున అమూల్యములగు సూచన లిచ్చుచు నన్ను సర్వవిధముల ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికి,

ప్రత్యేకశ్రద్ధతో ఈ గ్రంథాన్ని శీఘ్రకాలములో ఈ రూపములో ముద్రించి యిచ్చిన "ఫ్రీడమ్ ప్రెస్" అధినేత శ్రీ బాలసుందరంగారికి,

నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

తిరుపతి,
2-10-'68.

జి. నా గ య్య,
గ్రంథకర్త.

# విషయసూచిక



# సమర్పణ

మా తండ్రి
స్వర్గస్థుడైన
శ్రీ గూడూరు నాగప్ప
పవిత్రాత్మకు

# 1

# ఉపక్రమణిక

## 1. అవతారిక - నిర్వచనము :

ఆంధ్రకావ్యములలోని అవతారికా భాగము ఒక విలక్షణ సాహిత్యసంప్రదాయము. కావ్యకర్త తన కృత్యాదియందు వ్రాయు తదుత్పత్తిక్రమమునే అవతారిక అందురు.

'తౄ' (=దాటుట) ధాతువునకు 'ఇక' ప్రత్యయముచేరగా ధాతువులోని 'ఋ' అను అచ్చునకు వృద్ధి వచ్చి (ఋ = ఆర్) 'తారిక' అను రూపమేర్పడును. ఈ 'తారిక'కు 'అవ' (=దిగుట) అను ఉపసర్గ చేరగా 'అవతారిక' అను శబ్దము నిష్పన్నమగును. "అవతారయతీతి అవతారికా", దిగునట్లు చేయునది అనగా కథను దింపుచున్నది కనుక అవతారిక అని పేర్కొనబడినది. కథలోనికి దిగుటకు పూర్వము చేయబడిన స్తుతిపూర్వకమగు పద్యరచన అవతారిక.

'అవతరణిక' అను మాటకు ఆప్టే (Apte) తన నిఘంటువు[1] న ఈ క్రింది వివరణము నిచ్చియున్నాడు :

"అవతరణికా—1. A short prayer at the beginning of a work which, it is supposed, causes the divinity so addressed to descend from heaven; 2. Introduction, Preface."

---

1. The Practical Sanskrit - English Dictionary—By V. S. Apte. Third Edition, Revised & Enlarged. Gopal Narayan & Co., Bombay.

అవతరణీ—"అవతరతి గ్రంథః అనయా; అవత్యా కరణే ల్యుట్"

స్వర్గమున నున్న దేవతను భూమికి అవతరింపజేయుటకు కృత్యారంభమున స్తుతిపూర్వకముగా చెప్పిన మంగళాచరణమే అవతారిక అని ఆప్టే చెప్పినదానిని బట్టి తెలియును. కాని కాలక్రమమున మంగళాచరణమే గాక పెక్కు అంశములు అవతారికలో చోటు చేసికొనినవి. ఈ అవతారిక కావ్యములోని ప్రథమాశ్వాసాంతర్గతమయినది.

'అవతారిక'కు బదులు 'పీఠిక' అను మాట కూడ వాడుకలో నున్నది.

"పీఠికా—A section or division of a book as 'Purvapithika', 'Uttarapithika of Dasakumaracaritra'"[1]

దండి దశకుమార చరిత్రలోని పూర్వ పీఠిక అవతారికవంటిదే. కాని అది కథావతారికయే గాని కావ్యావతారికమాత్రము కాదు.

కృతికర్త, కృతిభర్త, కావ్యేతివృత్తము, రచనా సంప్రదాయము మున్నగు వానికి చెందిన విశేషాంశములు తెలుగు కావ్యావతారికలలోని ప్రధాన విషయములు.

## 2. సంస్కృత ప్రాకృత కావ్యములు - కృత్యారంభము :

అవతారికా సంప్రదాయము ప్రాచీన సంస్కృత కావ్యములందు మృగ్యము. సంస్కృత కావ్యములు అత్యధికముగా వస్తునిర్దేశపూర్వకముగు మంగళ శ్లోకముతోడనే ప్రారంభింపబడినవి. కాళిదాసుని రఘువంశమువంటి కొన్ని కావ్యములందు మాత్రము ప్రారంభమున దేవతాస్మరణపూర్వకముగు మంగళ శ్లోకము రచింపబడినది. బాణుడు మాత్రము తక్కిన సంస్కృతకవులవలె గాక హర్షచరిత్ర ప్రారంభమున స్వీయవృత్తాంతమును సంగ్రహముగా వర్ణించి తరువాత కథా కథనమును నిర్వహించియున్నాడు. హర్షచరిత్ర ప్రారంభమున భట్టార హరిచంద్ర, సాతవాహన, ప్రవరసేన, వ్యాస, భాస, కాళిదాసాఖ్య కవుల ప్రశంస, వాసవదత్తా బృహత్కథల ప్రశంస కలదు. ఇందు కుకవినింద కలదు. ఇట్లు ప్రాచీన సంస్కృత కావ్యములందు లేని అవతారిక బాణుని హర్షచరిత్రమున కన్పించుచున్నది. సంస్కృతములో పద్యకావ్యములందు కానరాని అవతారిక హర్షచరిత్రమువంటి గద్యకావ్యములందు కన్పించుట ఒక విశేషము.

1. The Practical Sanskrit - English dictionary, V. S. Apte.

ఆంధ్రులు రచించిన సంస్కృతగ్రంథములందు కొన్నిట కృత్యాదిని అవతారిక లున్నవి. గంగాదేవి (1380) 'మధురా విజయము' లోని అవతారిక 25 శ్లోకములలో విపులముగా నున్నది. అందు గణపతి, పార్వతీపరమేశ్వరులు స్తుతింపబడినారు. వ్యాస, వాల్మీకి, బాణ, భవభూతి, కాళిదాసాది సంస్కృత కవులు, తెలుగు కవులలో తిక్కన ప్రశంసింపబడిరి. కుకవినిందకూడ కలదు. కవితా లక్షణాములును అందు వివరింపబడినవి. కృష్ణదేవరాయల నగరి సంగీత విద్వాంసుడైన బండారు లక్ష్మీనారాయణ రచించిన 'సంగీత సూర్యోదయ'మను శాస్త్రగ్రంథమునందును అవతారికాభాగము కలదు. ఇందు కృష్ణరాయల కళింగ జైత్రయాత్ర, రాయచూరు దండయాత్ర మున్నగు చారిత్రక విశేషములను లక్ష్మీనారాయణ అభివర్ణించియున్నాడు. ఈ సంస్కృత గ్రంథములందలి అవతారికా భాగము తెలుగు కావ్య సంప్రదాయము ననుసరించినదనవచ్చును. మొత్తముమీద సంస్కృత కావ్యములందు లేని అవతారికా సంప్రదాయమును తెలుగు కవులు నియతముగా పాటించియుండుట ఎన్నదగిన విశేషము. భాస్కరరామాయణము, ఉత్తర హరివంశము, షోడశకుమార చరిత్ర, విష్ణుమాయా నాటకము, షట్చక్రవర్తి చరిత్ర, కవిజన రంజనము - ఇత్యాది కొన్ని కావ్యములకు మాత్రము అవతారిక లభ్యముకాలేదు.

క్రీ. శ. 8 వ శతాబ్ది ప్రారంభమున వెలువడిన 'గౌడవహా' (గౌడవధ) అను ప్రాకృతకావ్యమునందలి కృత్యాది చాల దీర్ఘమును, బహు విషయములతో కూడినదియు నని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తెల్పియున్నారు.[1] దీనికర్త భవభూతి శిష్యుడైన వాక్పతిరాజ దేవుడు. ఇతడు క్షత్రియుడు. 'గౌడవహ' కృత్యాదిని ఇష్టదేవతా స్తుతి 61 శ్లోకములలో కావింపబడినది. బ్రహ్మ, హరి, నరసింహ, మహావీర, వామన, కూర్మ, మోహినీ, కృష్ణ, బలభద్ర, బలరామకృష్ణ, మధుమథన (మధుసూదన), శివ, గౌరీ, సరస్వతీ, చంద్ర, సూర్య. ఆహి(ది)వరాహ, గణపతి, లక్ష్మి, కామ, గంగాది దేవతలు ఇందు స్తుతింపబడినారు. దేవతాస్తుతి తరువాత 37 శ్లోకములలో కవిప్రశంస కలదు. ఇందు సుకవి పద్ధతి, కుకవి పద్ధతులు కూడ వివరింపబడినవి. ప్రాకృత, కన్నడ కవులు పెక్కుమంది జైనమతాభిమానులగుటచే వారి కావ్యములందు కొన్ని సామ్యము లున్నవి.

1. నన్నెచోడుని కవిత్వము — పుట 66.

సంస్కృత నాటకములందు ప్రారంభమున నాందీప్రస్తావన లుండును. నాంది పూర్వరంగములోని భాగము. ''సూత్రధారః పఠే న్నాందీం'' అని భరతుడు. నాంది యన మంగళశ్లోకము లేక పద్యము. ఈ నాందీపద్యము ఆశీర్వచనముతో గాని నమస్క్రియతోగాని కూడియుండి శబ్దముచేతనో అర్థముచేతనో స్వల్పముగా నాటకేతివృత్తమును స్ఫురింపజేయవలెను. వీనియందు కొన్నింట నాటక పాత్రలు కూడ శ్లిష్టార్థముతో గూర్పబడును. నాందీపద్యము చంద్ర నామాంకితమై యుండవలెనని సంస్కృత లాక్షణికులు తెల్పినారు. ఇట్లు నాందీశ్లోకమున నాటకార్థమును నిక్షేపించుట లేక సూచించుట నాటకపద్ధతి. నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి నటీనట విదూషక పారిపార్శ్వకులలో నొకరితో సరస సంభాషణము చేయును. దీనికి ప్రస్తావన అని పేరు. ప్రస్తావనకు ఆముఖము, స్థాపన అనునవి నామాంతరములు. ప్రస్తావనలో అయిదు అంగము లుండును. 1. కవి గోత్ర నామాది కథనము, 2. ప్రరోచన మనబడు ఉన్ముఖీకరణము, 3. ఋతువర్ణనము, 4. కావ్యార్థ సూచనము, 5. పాత్రప్రవేశ సూచనము. ఈ ప్రస్తావన ప్రవర్తింపజేసి సూత్రధారాదులు నిష్క్రమించినతరువాత నాటకము ప్రారంభమగును.

నాంద్యంతమున సూత్రధారుడు నాటక రచయితను గూర్చి పరిషత్తునకు పరిచయముచేయును. దీనిచే పరిషత్పరిచయముకూడ పాఠకునకు కలుగుచున్నది. తెలుగు కావ్యములందు పరిషత్ స్థానీయుడు కృతిపతి. కవిని గూర్చియు, కృతిపతిని గూర్చియు చెప్పుటయే తెలుగు కావ్యములందలి అవతారికకు ముఖ్యప్రయోజనము. ఈ కారణముచే తెలుగు కావ్యములలో ప్రథమాశ్వాసాంతర్గతమయిన అవతారిక నాటకప్రభావమువలన కలిగినదని కొందరి తలంపు.

ప్రథమాంధ్ర కవి యగు నన్నయకు పూర్వము ఆంధ్రమున కవిత్వమున్నదనుకొన్నను కావ్యమేదియు ఇంతవరకు లభింపలేదు. నన్నయకు సంస్కృత కావ్య నాటకాదులును, ప్రాకృత గ్రంథములును, తమిళ కన్నడ దేశభాషా కావ్యములును తన రచనా వ్యాసంగమునకు కొంతవరకు ఆధారములై యుండవచ్చును. భారతారంభమున నన్నయ రచించిన అవతారిక లక్షణ సామ్యముచే సంస్కృత నాటకములందలి నాందీప్రస్తావనలను బోలియున్నదని భారతావతారికా ప్రాశస్త్యమునుగూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఇట్లు తెల్పియున్నారు : ''నన్నయ భారతారంభమున వ్రాసిన యవతారిక యథార్థమునకును

గాంభీర్యమునకును దావలమై, యతిశయోక్త్యహంకారములకు దూరమై, సహజతా సారళ్యముల కాలవాలమై, యుపపాద్యాంశమును సుస్పష్టముగా వెల్లడించును. మంగళమును స్ఫురింపఁజేయుచు, ముద్దులొల్కు శైలితో నాంధ్ర కావ్య సరస్వతీ ప్రథమావతారమున బరమౌచిత్య భాసురముగాఁ బఠితలకుఁ బ్రత్యక్షము చేయు చున్నది. ఆంధ్ర వాఙ్మయమున నితర కవులు గ్రంథాదుల రచించిన యవతారిక లెన్నో యున్నవి కాని సత్యకథనమునఁగాని, సహజత్వమునఁగాని, సారళ్య మునఁగాని, శైలీసంపదనుగాని యందేదియు నన్నయ యవతారికకు సాటి కాఁజాలదు.''[1]

కాని సంస్కృత నాటకమందలి ప్రస్తావనా భాగమునకును తెలుగు కావ్యావతారికలకును ప్రత్యక్ష సంబంధమును నిరూపించుట దుష్కరము.

## 3. తమిళ వాఙ్మయమున అవతారికలు :

దేశభాషలలోని కవితలలో తమిళమునందలి సంగవాఙ్మయము ప్రాచీన మైనది. క్రీ. శ. 2 వ శతాబ్దికి చెందిన శిలప్పదిగారము. మణిమేకలై అనునవి తమిళ ప్రాచీన కావ్యములలో ప్రధానమైనవి. వీనిలో శిలప్పదిగారములో మాత్రము మంగళాచరణాదికమున్నది. అందు చంద్రుడు, మేఘము, సూర్యుడు కావ్యాదిని స్తుతింపబడినారు. ఇది తొలి కావ్యపద్ధతి. తమిళములోని తరువాతి శైవవైష్ణవ సంప్రదాయ గ్రంథములందు ఆయా మత గురువుల ప్రశంస యున్నవి. బౌద్ధ కథా ప్రధానమగు జీవకచింతామణి కృత్యాదియందు బుద్ధుని ప్రశంస కలదు. తెలుగు వారికి కృత్యాదిని శ్రీకారము ఎంత ముఖ్యమో తమిళులకు కావ్యాదిని 'అ' కారము అంత ముఖ్యమైనది. వారి తిరుక్కురళ్ అకారముతోడనే ప్రారంభమగును. తమిళ కావ్యారంభ పద్యములో ఎక్కడో ఒకచోట 'ఉలగ' (లోకము) ప్రశంస యుండ వలెను. తమిళ కావ్యావతారికలకు, ఆంధ్ర కావ్యావతారికలకు పోలికలున్నట్లు కానరాదు.

## 4. కన్నడ కావ్యములు - అవతారిక :

భారతీయ వాఙ్మయములలో సంస్కృత తమిళములకుపిమ్మట ప్రాచీనతర మైనది కన్నడ సారస్వతము. క్రీస్తు శకారంభకాలమునుండి రాజకీయార్థిక

1. ఆంధ్రవాఙ్మయారంభదశ - ద్వితీయ సంపుటము - పుట. 701.

వ్యావహారిక విషయములలో కన్నడాంధ్రములకు సన్నిహిత సంబంధము కలదు. లభ్యమగు కన్నడ గ్రంథములలో మొదటిది కవిరాజ మార్గము (క్రీ. శ. 850). ప్రసిద్ధ రాష్ట్రకూట రాజగు నృపతుంగునిచే రచింపబడిన పద్యరూపమున నున్న సాహిత్య లక్షణ గ్రంథమిది. ఇందు కావ్యాదిని మంగళాచరణము, పూర్వకవిస్తుతి, సభావర్ణనము, సుకవిత్వప్రాప్తి విధానము, అపండిత నింద, కుకవి నింద, సుకవి కావ్యప్రశంస మొదలగు అంశములతో కూడిన అవతారికాభాగము కలదు. 'దేశీయభాషా కవితలలో అవతారికా రచన కిదియే మొదటిది'[1] అని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయము. కవిరాజ మార్గకర్త తరువాత నాగవర్మ (990) ఛందోంబుధి యందును, పంపకవి (902) విక్రమార్జున విజయము, ఆది పురాణములందును, పొన్నకవి (950) శాంతి పురాణమందును, రన్నకవి (993) అజిత పురాణము, గదాయుద్ధములందును, కన్నపార్యుడు (1112) నేమినాథ పురాణము ఇత్యాదులందును కృత్యాదిని అవతారికలను రచించినారు. శ్రీకారముతో కృతి నారంభించు సంప్రదాయము కన్నడ కావ్యములందు కలదు.

నన్నయకు కన్నడ భాషా సాహిత్య పరిచయమును కల దందురు. అష్ట భాషా కవీశ్వరుడని ప్రసిద్ధిగాంచిన నారాయణభట్టు తనకు భారత రచనమున తోడ్పడినట్లు తానే గ్రంథావతారికలో స్పష్టముగా చెప్పియున్నాడు. కనుక నన్నయ తనకు ముందున్న కన్నడభాషా సాహిత్య లక్షణములను కొన్నింటిని తనకు హిత మైన వానిని తన భారత రచనా సందర్భమున గ్రహించి యుండునని ఊహింప వచ్చును. కాని నన్నయ తన భారతావతారికలో మొదట రచించిన సంస్కృత శ్లోకము సంస్కృత నాటకములందలి నాందీ శ్లోకమును తలపించు చున్నది. ఇది అతని సంస్కృత భాషాభిమానమును వ్యక్తము చేయును. నన్నయ భారతావ తారికను రచించుటలో సంస్కృత నాటకములలోని నాందీ ప్రస్తావనా భాగముల ననుసరించి నాడనుట కంటె కన్నడ భాషా లక్షణములను అనుసరించి నాడను టయే సహేతుకముగా తోచుచున్నది.

కన్నడ కావ్యావతారికా ప్రభావము నన్నెచోడుని కుమారసంభవమున స్పష్టముగా గోచరించుచున్నది. కుమారసంభవములోని అవతారిక సర్వాంగసుంద రము, సమగ్రము నయి ప్రత్యేక ప్రాధాన్యము కల్గినది. కుమారసంభవము అవ

1. ఆంధ్రకవుల అవతారికలు-శ్రీ కోరాడ రామకృష్ణయ్య, భారతి - తారణ, మార్గశీర్షము.

తారికలోని 69 పద్యములలో ఇష్టదేవతా స్తుతి, పూర్వకవి స్తుతి, కుకవినింద, కావ్యప్రశస్తి, కృతికర్తృ వంశాభివర్ణనము, షష్ఠ్యంతములు, కథాసూత్రవివరణము అను విషయములు తెలుపబడినవి.

''నన్నెచోడుని యవతారిక యొక్కన్వప్న వృత్తాంతమును దప్పఁ దక్కిన యంగముల నన్నిటిఁ గలిగి తరువాతి తెలుఁగు కవులకు వరవడి యయిన''దని శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు వ్రాసినారు[1]. నన్నెచోడుడు తన అవతారికలోని వివిధాంగములను కన్నడ కవుల ననుసరించి రచించినను కన్నడ కావ్యములందు కానరాని షష్ఠ్యంతాదులను కూడ చేర్చి యున్నాడు.

## 5. తెలుగున అవతారికా సంప్రదాయము :

తెలుగు కావ్యములందలి అవతారికా సంప్రదాయమును గూర్చి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి యభిప్రాయ మిది: ''ఈ భావమును కవులు బహుశః నాటి శాసన వాఙ్మయమునుండి గ్రహించి యుందురు. నాటి శాసనాదికములలో కవులు రాజుల దాన విషయమును చెప్పుటకు ముందు ఇష్టదేవాభివందన మొనరించి రాజ వంశావళిని వర్ణించి పాలకుని స్తుతించి అతని విజయములను లెక్కించి తర్వాత ప్రతిగ్రహీతను నిర్దేశించి తుదకు దానవిషయమును చెప్పుట ఆచారమై యుండెను. ఈ సంప్రదాయము నాటి కన్నడ శాసనములలో సర్వాంగసుందరముగ కన్పడు చున్నది. తిక్కనకు నాలుగైదువందల సంవత్సరములకు ముందునుండియు కన్నడ కవులు తమ కావ్యపీఠికలలో రాజుల వంశావళులను వ్రాసినారు. ఆ వంశావళులనే శాసనములలో చెక్కించినారు. పొన్న, పంప, రన్న, మహాకవుల కాలమున నీ పద్ధతి సంపూర్ణత నొందెను. ఏ కారణముచేతనో ఆంధ్రకవులు పీఠికలను తిక్కన వఱకు తలపెట్టిన వారుకారు. తిక్కన తర్వాత పీఠిక లభివృద్ధి నందినవి.''[2] నన్నెచోడుడు తిక్కనకు తరువాతి వాడను నభిప్రాయముతో శ్రీ వేదము వేంకట రాయ శాస్త్రిగారు ఈ విధముగా వ్రాసినారు. కాని ప్రథమాంధ్ర కావ్య మనదగు నన్నయ భారతమునందే అవతారిక పెక్కు పద్యములలో వివిధాంశములతో కూర్పబడినది. నన్నయకు తరువాత సకలావయవముల పరిపూర్ణమైన దివ్యకావ్యమగు నన్నెచోడుని కుమారసంభవమున కూడ విస్తృతముగా అవతారికా భాగము నిర్వ

1. కవిరాజ శిఖామణి— పుట 102.

2. ''ఆంధ్ర వాఙ్మయము-చరిత్ర'' భారతి, సంపుటము 26-పుట 73.

హింపబడినది. ఇక తిక్కన భారతావతారికతో తెలుగు కావ్యావతారికకు సమగ్ర రూపము కుదురుకొన్నది. తిక్కనకు తరువాత కావ్యావతారిక లేని కావ్యము తెలుగునందు లేదనిన అతిశయోక్తికాదు. చంపూ కావ్యములందేగాక ద్విపద కావ్యములు, యక్షగానములు మొదలగు వానియందుకూడ ప్రారంభమున అవతారిక నియతముగా కన్పించును.

## 6. ఆంధ్ర కావ్యావతారికలు-వాని ప్రాముఖ్యము :

ఆంధ్ర కావ్యములలోని అవతారికలకు బహుముఖ ప్రాముఖ్యము కలదు. ఆంధ్ర సాహిత్య తత్త్వమును, సంప్రదాయమును, చరిత్రను తెలిసికొనుటకు ఈ అవతారికలు - క్రింద సూచించినట్లు - ఎంతయో ఉపకరించును:

1. కావ్యావతారికలోని కవిస్తుతి కొంతవరకు కవుల చరిత్ర వ్రాయుటకు సాధనమగుచున్నది.

2. అవతారికలందు కొందరు కవులు తమ వంశములోని కవిపండితులను వారు రచించిన కావ్యములను పేర్కొనియుండుట కానవగును. వారు పేర్కొనిన కావ్యములు మనకీనాడు లభ్యము కాకున్నను వాని ప్రశంస వాఙ్మయ చరిత్ర రచనకు ఉపకరించును.

3. తెలుగుకవుల జీవిత వృత్తాంతములు తెలుపు చారిత్రక గ్రంథములు మనకు లేకపోవుటచే వారి జీవిత విశేషములను, ఇతర విషయములను తెలిసికొనుటకు కావ్యావతారికలే ముఖ్యాధారము లగుచున్నవి. కవులు కృత్యాదిని తమ వంశానుక్రమణికలో తమ కులగోత్ర సూత్రాదికమును, వంశవృక్షమును, గురువులను, స్వగుణాతిశయమును, పాండిత్యోత్కర్షను తెల్పుకొనుట కలదు. కవుల జీవిత చరిత్రను సమగ్రముగా నెరుంగుటకు కావ్యావతారికలను పరిశీలించుట అత్యంతావశ్యకము.

4. కృత్యవతరణికలో కవులు తమ పూర్వ రచనలను గూర్చి తెల్పుచుండుటయు కలదు. బహుకృతులు రచించిన కవుల కవిత్వ తత్త్వపరిణామము వాని పౌర్వాపర్యమును బట్టి నిర్ణయింపవచ్చును.

5. కృత్యాదిలోని కవితా ప్రశంస కవుల స్వీయకవిత్వాశయములను కవితా దృక్పథమును వ్యక్తము చేయుచుండును. ఆయాకవుల కావ్యసమీక్షకు కొంత

తోడ్పడును. కావ్యనిర్మాణమునకు పూనుకొనిన కవి పాటింపవలసిన కావ్యరచనా సామగ్రీ సముల్లాససంపద కావ్యావతారికవలన తెలియుచున్నది. కవుల విద్వత్కవితాశక్తులను, విమర్శక ధర్మములను, సత్కృతి లక్షణములను ఎరుంగుటకు కూడ కావ్యావతారిక తోడ్పడును. తెలుగు కావ్యావతారికలు సాహిత్య చరిత్రకారునికేగాక, సాహిత్య విమర్శకునికిగూడ అవశ్య పఠనీయములు.

6. కృత్యాదిలోని షష్ఠ్యంతములుకూడ ఒక విధముగా కవుల కవిత్వాతిశయములను, వారి వ్యక్తిత్వమును, కవి కాలమునాటి సాహిత్య ధర్మములను తెలుపుట కాధారమగుచున్నది.

7. కావ్యావతారికవలన గ్రంథము అనువాదమా? స్వతంత్రమా? పురాణమా? కావ్యమా? ప్రబంధమా? అను అంశములు కూడ కొంతవరకు తెలిసికొనవచ్చును.

8. భిన్న సాహిత్యప్రక్రియలను చేపట్టినపుడు, తమకు పూర్వము ప్రఖ్యాతికి రాని సాహిత్యసంప్రదాయములను ప్రవేశపెట్టినపుడు కవులు తమ కావ్యావతారికలో వాని ప్రాశస్త్యమును, మాహాత్మ్యమును వివరించుటయు, సమర్థించుకొనుటయు కలదు. పాల్కురికి సోమనాథుడు ద్విపదరచనను సమర్థించుకొనుట, నిర్వచనముగా కావ్యమునురచించుట ప్రౌఢత్వమును సూచించునని తిక్కనతెల్పుట, ద్వ్యర్థికావ్యములలోని దుష్కరత్వమును, కథాప్రణాళికను ఏర్పరచుటలోని విధానమును పింగళి సూరన చాటుట, అచ్చ తెలుగుకావ్యమునందు పాటింపవలసిన పద్ధతిని పొన్నికంటి తెలగన సూచించుట - ఇత్యాది అపూర్వరచనా విశేషములు మనకు కావ్యావతారికల వలననే సువ్యక్తమగుచున్నవి.

9. కావ్యావతారికలో కావ్యకథాప్రాశస్త్యము, కథాశ్రవణమువలన కలుగు ఫలములు, కృతిఫలమును, కృతినాయకుని మహిమాదికమును సూచింపబడును. కావ్యకథాప్రాశస్త్యము నెరుంగుటచే పాఠకుల చిత్తవృత్తి ఆ కావ్యమునకు సన్నిహితమగుచుండును.

10. తెలుగు కావ్యావతారికలలో కథాప్రారంభమునకుముందు కథావతారికయు నుండును. కొన్ని కావ్యావతారికలలో కథాసూత్రవిరచనముకూడ కలదు. పాఠకునకు ఆ కావ్యకథ సన్నిహితమగుటయేగాక కథాప్రారంభమున కవి అవలంబించు ఎత్తుగడను కొంతవరకు తెలిసికొనుటకును ఈ కథావతారిక తోడ్పడుచున్నది.

11. దేశీయచ్ఛందస్సులకు సన్నిహితమగు కొన్నివిశేషవృత్తములను, అపూర్వవృత్తములను కవులు తమకావ్యావతారికలందును, ఆశ్వాసాంతములందును వాడినారు. కావున ఛందోవిశేషములనుగూర్చి తెలిసికొనుటకుకూడ కావ్యావతారికల పరిశీలన ఆవశ్యకమైనది.

12. సప్తసంతానములలో కృతియిన్నుయనిచెప్పుట, కృతిపతిని ఉద్దేశించి షష్ఠ్యంతకందములను రచించుట - ఇత్యాది దేశీయసంప్రదాయములు కావ్యావతారికలను పరిశీలించుటవలన తెలియును.

13. సాధారణముగ కృత్యారంభమున కృతిపతి గుణగణములు, అతని వంశావతారవర్ణన, ఆ వంశములోని ప్రసిద్ధపురుషులచరిత్ర, కృతిపతికి పతియైన వానిచరిత్ర, కృతిప్రేరేపకునివర్ణన - ఇత్యాదిఅంశము లుండును. కొందరు రాజులు, మంత్రులు స్వయముగా కావ్యములను వ్రాసియుండుట, కవులచే కావ్యములను వ్రాయించి అంకితము గొనియుండుట తెలుగుసాహిత్యచరిత్రలో చెప్పుకోదగిన విశేషము. కృతిపతులగు రాజులను, మంత్రులను గూర్చిన చారిత్రకవివరములు కొన్ని కావ్యావతారికలందు లభించుటచే దేశచరిత్ర తెలిసికొనుటకుకూడ అవతారికలు ఆధారభూతమగుచున్నవి.

14 కృతిపతులనుబట్టియు, కృతిపతి వంశావళిని వర్ణించు సందర్భమున కవి తెలిపిన కొన్ని చారిత్రకవిషయములనుబట్టియు గురుస్తుతి, పూర్వకవిస్తుత్యాదులనుబట్టియు కవి కాలాదులను, కావ్యరచనాకాలమును నూహింపవచ్చును.

15. ఆంధ్ర కావ్యములలోని అవతారికలలో కృత్యారంభమున బహుదేవతాస్తుతిని విస్తరించి వ్రాయుట కలదు. ఈ దేవతాస్తుతి కవుల, కృతిపతుల శైవ వైష్ణవ అద్వైత మత భావ రీతుల ననుసరించి యుండును. కనుక ఆయా కవుల కృతిపతుల మతాభిమానము లెరుంగుటకు కృత్యాద్యవతారికాభాగము కొంతవరకు తోడ్పడును. దీనివలన తెలుగు సాహిత్యపరిణామమున మతమునకు గల ప్రాధాన్యమును కొంతవరకు నూహింపవచ్చును. కొన్ని కావ్యావతారికలందలి గురుస్తుతి వలన ఆయా కవులమతతత్త్వములు, సమకాలిక మతపరిస్థితులుకూడ బోధపడును. కనుక మత పరిశీలన దృష్టితోకూడ తెలుగు కావ్యావతారికలకు ప్రత్యేక ప్రాముఖ్య మున్నది.

16. కావ్యావతారికలలోని విషయములు కొన్ని ఆశ్వాసాంతభాగములందును గాననగును. ఆశ్వాసాంతగద్యములందుకూడా కవిని గురించి, కావ్యమును గురించి కొన్ని విషయములు తెలియుచున్నవి. గ్రంథము సంపూర్ణమా? అసంపూర్ణమా? అనుటయు తెలియును.

ఆంధ్ర కవిత్వ చరిత్ర వ్రాయుగోరు వారికి ఈ కావ్యావతారికలు ఎంతేని ఉపయోగపడుచున్నవి. ఇంతటి వ్యాప్తిని, వైశిష్ట్యమును, ప్రాముఖ్యమును పొందిన ఆంధ్ర కావ్యావతారికల గుణాధిక్య వైశిష్ట్యాదులను గురించిన సమగ్రపరిశీలనగాని, పరిశోధనగాని ఇంతవరకు జరుగలేదు. ఆంధ్ర కావ్యావతారికలను గూర్చిన విమర్శక గ్రంథమొక్కటికూడ ఇంతవరకు వెలువడలేదు. ప్రసిద్ధులగు నన్నయ, నన్నెచోడులవంటి ఇద్దరు ముగ్గురు కవుల కావ్యావతారికలను గురించి మాత్రము కొందరు విమర్శకులు తమ గ్రంథములందు యథాలాపముగా కొన్ని సంగతులను వెలిబుచ్చియున్నారు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు భారతి పత్రికలో 'ఆంధ్ర కవుల అవతారికలు' అనుపేర ఒక వ్యాసమును ప్రకటించియున్నారు. స్వల్ప మాత్రముగా ప్రకటితమైన ఈ వ్యాసములు విపులములయినవికావు. ఈ కారణము చేత ఆంధ్ర కావ్యములలోని అవతారికల విశిష్టతను సమగ్రముగా తెలిసికొనవలసిన అవసరము ఏర్పడినది.

ప్రసిద్ధములగు ఆంధ్ర కావ్యావతారికలను గ్రహించి, పూర్వవిమర్శకుల సద్విమర్శలను పాటించి వివిధాంశములను ప్రధానములగు కొన్ని శీర్షికలక్రింద విభజించి పదునారు ప్రకరణములలో ఆంధ్ర కావ్యావతారికల ప్రాధాన్యమును, ప్రయోజనమును వివరించుటయే ఈ గ్రంథరచనయందలి ప్రయత్నము.

# 2

# కావ్యారంభము

## 1. శ్రీకారప్రయోగము :

కృత్యారంభ పద్యములో ఆద్యక్షరము, ఆదిగణము మంగళదాయకముగా ప్రయోగింపవలెనని ప్రాచీనాంధ్ర లాక్షణికులు తెల్పినారు. కావ్యాద్యక్షరమున కును కృతిపతి నామ నక్షత్రమునకును పొత్తుకుదురవలెనని కూడ వారు తలంచిరి. శ్రీకారముతో గ్రంథారంభము చేయవలెనను నియమము సంస్కృతభాషలోలేదు. సంస్కృతమున సాహిత్యచంద్రోదయము, అలంకార చూడామణి, చమత్కార చంద్రిక ఇత్యాదులందు వర్ణ గణ శుభాశుభ ఫలములు చెప్పబడినవి. కాని ప్రాచీన సంస్కృత కావ్యకర్త లీ నియమమును పాటించినట్లు కానరాదు. తమిళులకు గ్రంథారంభమున అకారము ముఖ్యమైనది. వారి తిరుక్కురళ్ అకారముతోడనే ప్రారంభమగును. తమిళములో కృత్యారంభ పద్యములో ఎక్కడో ఒకచోట 'ఉలగ' ప్రశంస యుండవలెను. అకారముకూడ శుభకరమైనట్లు ఆంధ్రలాక్షణి కులుకూడ ప్రకటించియున్నారు. కన్నడ వాఙ్మయమున కవిరాజమార్గము (840) నుండి 'శ్రీ'తో గ్రంథారంభము చేయవలెనను నియమము పాటింపబడినది. కావ్యాదిని 'శ్రీ'కారము విలిపిన సకలదోషములు తొలగి శ్రేయస్కరమగుననితెల్పి, అప్పకవి శ్రీకారప్రభావమును ఈ క్రిందివిధముగ వివరించినాడు :

" వేదములకెల్ల నోంకార మాదియైన
కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది

గానఁ గవివరు లెల్లరు దానిఁ దక్క
నితర వర్ణంబు లిడరు సత్కృతుల మొదల."

—అప్పకవీయము (2-354)

"శకారమున్ను రేఫమున్ను 'ఈ' స్వరమున్ను ఈ మూడున్నూ గూడఁగా శ్రీకారమాయెను. అందులోను శకారమునకున్నూ ఈ కారంబునకున్నూ అధి దేవత లక్ష్మీదేవి. రేఫమున కగ్నిదేవుడు. అయితేనేమి; "శ్రియమిచ్ఛే ద్ధుతాశనాత్" అని పురాణవచనము గలుగుటంజేసి అతఁడున్నూ లక్ష్మీప్రదుండే. అటు గనుక మూఁడువర్ణములకున్నూ శుభదేవతలే అయిరి. మొదలి శ వర్ణమునకు గ్రహము గురుడు. రేఫమునకున్నూ ఈ యను స్వరమునకున్నూ శుక్రుఁడొక్కడే. అటుగనుక మూఁటికిన్ని శుభగ్రహములే అయిరి. 'కమలా శ్రీర్హరిప్రియా' అని లక్ష్మీనామముగుటంజేసి శుభవాచకమును ఆయెను. అటుకనుకఁ గృతిముఖము నందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట యాశ్చర్యముగాదు నిశ్చయమే యనుట"

—అప్పకవీయము (2-358). వావిళ్లప్రతి (1962)

తెలుగులో శ్రీకారముతో కృతినారంభించు సంప్రదాయమునకు శ్రీకారము చుట్టినవాడు ఆదికవి నన్నయభట్టు. భారతగ్రంథాదిలో నన్నయ శ్రీకారముతో సంస్కృత శ్లోకముతో మంగళాచరణము గావించినాడు. ప్రాఙ్నన్నయయుగము నందలి శాసనములలో సయితము కొన్నిట శ్రీకారప్రారంభము కలదు.

1. కడపజిల్లాశాసనము—క్రీ. శ. 8 వ శతాబ్ది శ్రీ బందయ 1 వ పంక్తి.
2. కందుకూరుశాసనము—(848-892) శ్రీనిరవద్యుండు...1 వ పంక్తి.
3. కొలవిశాసనము* (వరంగల్లుజిల్లా) (892-922) శ్రీ విక్రమాదిత్య నృపాగ్ర...1 వ పంక్తి.
4. ముతుకూరు శాసనము (కడపజిల్లా) శ్రీహరిదుర్భరావర...1 వ పంక్తి.

నన్నయకు తరువాతి కవులందరు శ్రీకారముతో కృతినారంభించు సంప్రదాయమును పాటించినారు. భాస్కర రామాయణము 'రాముని శుభచరితమ్మును'

---

* చూ. తెలంగాణ శాసనము ప్రథమసంపుటి పుట 163.

1. 4. అముద్రితములు. ఈ శాసన విషయమును డాక్టరు కోరాడ మహాదేవ శాస్త్రిగారు తెల్పినారు. (Annual Report of South Indian Epigraphy 2 241/1937-38.)

అను కందపద్యముతో ప్రారంభమయినట్లు కన్పించును. కృతిముఖమున అమర వాచకములు, మంగళార్థవాచకములు నున్నచో ప్రశస్తమని చెప్పుచు అప్పకవి ఏ కావ్యము మొదట ఏ యే అమరవాచకము లున్నవో ఇట్లు వివరించియున్నాడు :

"అమరవాచకంబులకు నేకావళియందు 'ప్రాలేయాచలకన్యకా' యనియును, కల్పిత కల్పవల్లియందు 'హేరంబ మవలంబే' అనియును, రామాయణమునందు 'రాముని శుభ చరితమ్ములు' అనియును మంగళార్థవాచకంబులకు శ్యామలాదండ కంబునందు 'జయ మాతంగ తనయే' యనియును, త్రిస్థలి దండకమునందు 'విజయనగర హేమకూటంబున న్నిల్చి' యనియును"

—అప్పకవీయము (2-364)

కాని భాస్కర రామాయణము మిగత అయోధ్య కాండాదులు 'శ్రీ'కారము తోడనే ప్రారంభమయినవి. భాస్కర రామాయణమునకు అవతారిక మృగ్యమై నందువలన గ్రంథారంభమునందు 'శ్రీ'కారమున్నదా ? లేదా ? అని నిర్ణయింప లేము. యయాతి చరిత్రలో 'సిరులమెఱుంగుబోఁడి....' అనియు, అచ్చ తెనుగు రామాయణములో 'సిరులకు మక్కిలియై హొంయలు...' అనియును చంపకమాల వృత్తములో గ్రంథారంభము చేయబడినది. ఈ అచ్చ తెనుగు కావ్యములందు ఆయాకవులు బుద్ధిపూర్వకముగనే గ్రంథారంభమున 'శ్రీ'కి బదులు 'సిరి' వాడి యుందురు. కూచిమంచి తిమ్మకవి అచ్చ తెనుగు రామాయణ కావ్యారంభమునందు శ్రీకారమును లోపింపజేసి రచించినను నీలాసుందరీ పరిణయములో మాత్రము గ్రంథారంభమున శ్రీకారమును నిల్పియున్నాడు. మొత్తముమీద కృత్యారంభము నందు శ్రీకారప్రయోగము 19 వ శతాబ్దమువరకు వెలువడిన తెలుగు కావ్యములం దంతటను నియతముగా నున్నదని చెప్పవచ్చును. ఆధునిక కవులీ సంప్రదాయ మును అంతగా పాటించినట్లు కానరాదు.

కృత్యారంభమునందేగాక, ప్రతిఆశ్వాసాదిపద్యము 'శ్రీ'తో ప్రారంభించు సంప్రదాయము తెలుగు కావ్యములందు నియతముగా కలదు. శ్రీకారముతో గ్రంథారంభముచేయుటేగాక 'శ్రీ'తో గ్రంథమును ముగించు నియమమునుకూడ కొందరు తెలుగు కవులు పాటించినారు. శ్రీకారమాద్యంతములందు కూర్చి రచించిన ప్రథమాంధ్రకవి నన్నెచోడుడు. అతడు కుమారసంభవమును మంగళమహాశ్రీ వృత్తముతో మంగళమహాశ్రీ పదముతో ముగించినాడు. గ్రంథమును మంగ

శాంతముగ ముగించుట కన్నడ కవులలోను కలదు. పంపకవి తన విక్రమార్జున విజయములో "భద్రం శుభం మంగళం" అను పదములతో గ్రంథాంతపద్యమును ముగించినాడు. మంగళమహాశ్రీ వృత్తమున ఆ మాటలతో ముగించుట పంపాదులలో కానరాదు. 'మంగళమహాశ్రీ'తో ముగియు తెలుగు శాసనములు చాలగలవు.

| శాసనము | కాలము | ముగింపు |
|---|---|---|
| 1. రుద్రదేవునినాటి కరీంనగరశాసనము(6) | 1170 A.D. | 'మ(ంగళమహా)శ్రీశ్రీ' |
| 2. చినకందుకూరిశాసనము (27) | గణపతిదేవునినాటిది | 'మంగళమహాశ్రీశ్రీశ్రీ' |
| 3. రుద్రేశ్వరశాసనము (53) | — | 'మంగళమహాశ్రీశ్రీశ్రీ' |
| 4. ధర్మసాగరశాసనము (56) | — | 'మంగళమహాశ్రీశ్రీ' |

పైని పేర్కొనిన కాకతీయుల శాసనములు నన్నెచోడునికి కొంచెము ముందు వెనుకలందు వేయింపబడినవే. నాటి శాసనములందలి ఆచారమును పాటించియే నన్నెచోడుడు తన కుమారసంభవమును 'మంగళమహాశ్రీ'తో ముగించి తన దేశీయాభిమానమును వ్యక్తపరచినాడనితలంపవచ్చును. నన్నెచోడుని తరువాత పాల్కురికి సోమనాథుడు అనుభవసారము, పండితారాధ్యచరిత్రలను గ్రంథాంతమున 'మంగళమహాశ్రీలు' అను పదముతో ముగించినాడు. అనుభవసారమున గ్రంథాంతమందు తరువోజ కలదు. జక్కన విక్రమార్కచరిత్రయందును, నందిమల్లయ ఘంటసింగనలు ప్రబోధచంద్రోదయమునందును, ముక్కుతిమ్మన పారిజాతాపహరణమునందును, కాణాదం పెద్దన సోమయాజి (1793) అధ్యాత్మరామాయణమునందును 'మంగళమహాశ్రీ' వృత్తముతో 'మంగళమహాశ్రీ' అను పదముతో తమ గ్రంథములను ముగించినారు. ఈ నియమమును ఆధునికులగు వేదము వేంకటరాయశాస్త్రి తన ఉషానాటకమునందును, శ్రీపాద కృష్ణమూర్తి తన బొబ్బిలి యుద్ధ నాటకమునందును పాటించియున్నారు.

ఈ మంగళమహాశ్రీ వృత్తమునకు తెలుగులో ఒక విశిష్టత కలదు. 'మంగళమహాశ్రీ' అను శబ్దమంతమున గూర్చుటకు కుదిరిక గల వృత్త మిది. తెలుగున వృత్తములలో మొట్టమొదటిది శ్రీ వృత్తము. ఇది ప్రథమ చ్ఛందోజాతము. కడపటిది మంగళమహాశ్రీ వృత్తము. ఇది 26 వ ఛందమున పుట్టినది. కాబట్టి తెలుగు కవులు ప్రథమ చ్ఛందోజాతము అగు 'శ్రీ'తో ప్రారంభించి కడపటి

వృత్తమగు 'మంగళమహాశ్రీ'తో ముగించు సంప్రదాయమును తమ గ్రంథము లందు ఏర్పరచుకొని యుందురు. సంస్కృత చ్ఛందోగ్రంథములగు పింగళ చ్ఛందము, వృత్తరత్నాకరములందు మంగళమహాశ్రీ వృత్తము చెప్పబడలేదు. తెలుగున మొదటి ఛందోగ్రంథమగు కవిజనాశ్రయమందు దీనికి లక్షణ మున్నది.

పై పరిశీలనవలన-కృత్యాదిని శ్రీకారప్రయోగము శుభకర మను సంప్ర దాయమును కవులు పాటించిరి. లాక్షణికులు సమ్మతించిరి.

## 2. పద్యారంభ గణము :

కృతిపతి రాశికి పద్యారంభ గణరాశికి మైత్రియుండవలెనని తెలుగు లాక్షణి కులు తలంచిరి. గణములలో 'మ-భ-స-త' లు శుభకరములనియు తక్కినవి కావ్యాదిని వర్జనీయములనియు లాక్షణికుల అభిప్రాయము. "క్షేమం సర్వగురు ర్దత్తే మగణో భూమిదైవతః" అను చమత్కార చంద్రికలోని వాక్యమును బట్టియు.

> "జగతి గణంబుల కెల్లను
> మగణము గారణముగాన, మగణముఁ గదియన్
> నిగిడించు గణము లెల్లను
> దగ శుభ మొనరించుఁ గీడు తగులదు దానన్"

అని కావ్యచింతామణి లోనిదిగా రంగకవి చూపిన పద్యము ననుసరించియు 'మ' గణమునకు విశేష ప్రాముఖ్య మున్నట్లు వ్యక్తమగును. మ గణముతో కృత్యారంభము మంగళకరమని లాక్షణికులు తెల్పినారు. 'శ్రీ'తో 'మ' గణముతో పద్యము నారంభించుట నన్నయ నాటినుండి వచ్చుచున్నది. పావులూరి మల్లన, నన్నెచోడుడు, కేతన, పోతన, జక్కన — మున్నగు కవులు మగణారంభముగా కృత్యాది పద్యమును రచించినారు. తిక్కన నిర్వచనోత్తర రామాయణము నారంభించుటలో నన్నయ ననుసరించి కృత్యారంభ పద్యాదిని మగణము నుపయో గించినను భారతమునందు భగణారంభముగ ఆరంభపద్యమును రచించినాడు. 'భ' గణము ఆయుష్కరముగ చెప్పబడినది. పండితారాధ్యుని శివతత్త్వసారము నందును, పాల్కురికి సోమనాథుని గ్రంథములందును ప్రారంభమున 'భ' గణము కన్పట్టును. ఎఱ్ఱన హరివంశమును 'మ' గణముతోడను, నృసింహపురాణమును

'భ' గణముతోను ప్రారంభించియున్నాడు. ఇట్లు 'భ' గణముతో కృత్యారంభ పద్యము రచించు సంప్రదాయము తెలుగులోని కొన్ని కావ్యములందును, శత కాదులలో కొన్నిటియందును అనుసరింపబడినది.

కవిజనాశ్రయము ("శ్రీ వల్లభు యతి గణ "....), గట్టుప్రభువు కుచేలోపాఖ్యానము ("శ్రీమద్రవ్యజాంగనా....") మొదలగు వానియందలి కృత్యారంభపద్యములలో ఆదిని 'త' గణము కన్పట్టును. యయాతిచరిత్రయందుమాత్రము కృత్యారంభపద్యమున ఆదిని 'స' గణము ప్రయుక్తమయినది. ఈ 'త', 'స' గణములు రెండును శుభప్రదములగుటచే కృత్యారంభ పద్యాదిని వీనిని చేర్చినను దోషములేదు. కాని తెలుగులోని కృత్యారంభ పద్యములలో ఆరంభగణము 'మ' గణముగాని, 'భ' గణముగాని యుండుటయే నియతముగా నిల్చిన సంప్రదాయము. వీనిలో 'మ' గణమునకే విశేష వ్యాప్తి.

ఇదిగాక మొదటి పద్యము మొదటి పాదములోని మొదటి రెండు గణముల సంయోగము శుభప్రదముగా నుండవలెనని ప్రాచీన లాక్షణికులు కొందరు చెప్పినారు. మగణ సగణ యోగము (అనగా శార్దూలముతో ప్రారంభము) సర్వోత్తమమని చెప్పబడినది. తెలుగులో నన్నయాది కవు లీ సంప్రదాయమును పాటించి తమ గ్రంథములను రచించినారు. మగణ రగణ యోగము (అనగా స్రగ్ధరతో ప్రారంభము) లయకరమని చెప్పబడినది. నన్నెచోడుడు స్రగ్ధర నుపయోగించుట మగణ రగణములను కృత్యాది నిడుటచేతనే మరణము నొందెనని అథర్వణు డిట్లు చెప్పినాడు :

"మగణమ్ముఁ గదియ రగణము
వగవక కృతి మొదట నిలుపు వానికి మరణం
బగు నిక్కమండ్రు మడియఁడె
యగు నని యిడి తొల్లి వేంకణాదిత్యుఁ డనిన్"

కాని నన్నెచోడుని గురించి అథర్వణు డిట్లు చెప్పుటకు వారివారి మత విశ్వాసములే కారణము కావచ్చును. ఎందులకనగా, కవిజనాశ్రయమున 'మర' యోగము మరణయోగముగా చెప్పలేదు. యగణాంతమగు పద్యము శుభకరమని

"తగు పద్య మొండెఁ గర్తకు
యగణాంతము చెప్ప శుభము లయ్యెడుకొలఁకున్"

—కవిజనాశ్రయము; సంజ్ఞాధికారము, ప. 37.

అని కవిజనాశ్రయ కర్త తెల్పినాడు. స్రగ్ధర యగణాంతము. ఇది కర్తకు శుభకరమని భావించియే నన్నెచోడుడు తన కుమారసంభవమును స్రగ్ధరా వృత్తముతో ప్రారంభించి యుండును. సంస్కృతములోకూడ కాళిదాసుని శాకుంతలము, మాలవికాగ్నిమిత్రములందును, విశాఖదత్తుని ముద్రారాక్షసనాటకమందును ఆరంభమున శివమూర్తిస్తవము స్రగ్ధరావృత్తములలోనే చేయబడినది. శూద్రకకవి మృచ్ఛకటికమునందును, దండి దశకుమారచరిత్రమునందును, భవభూతి మహావీరచరిత్రమునందును, 'మంగళాచరణ' పద్యములు స్రగ్ధరావృత్తమున గలవు. కన్నడ కావ్యారంభములందును అధికముగా స్రగ్ధరయే ప్రయుక్తమైనది. రాజరాజ నరేంద్రుని కూతురు సోమలదేవి ద్రాక్షారామమున వేయించిన శాసనమునందు ప్రప్రథమమున స్రగ్ధరావృత్తము కలదు (చూ. సోమలదేవి శాసనము—కొ. వేం. లక్ష్మణరావు- రాజరాజ నరేంద్ర పట్టాభిషేకసంచిక). శివస్తుతి శ్రేష్ఠముగా నుండునని తలచి కాబోలు నన్నెచోడుడు తన కుమారసంభవ ప్రారంభమున స్రగ్ధరను రచించినాడు. నన్నెచోడుని స్రగ్ధరయందు ఆదిని 'త' యుండుటచేతను, అది అశుభప్రదమని భావించుటచేతను తరువాతి తెలుగు కవు లెవ్వరును స్రగ్ధరను కృత్యారంభమున వాడలేదు.

## 3. కృత్యారంభ మంగళ శ్లోకము లేక పద్యము :

ఆంధ్ర కావ్యములలో గ్రంథాదిని మంగళాచరణము గావించుట యందు రెండు సంప్రదాయములు కలవు. ఒకటి తెలుగు గ్రంథమునకు మొదట సంస్కృత శ్లోకముండుట. ఇది నన్నయ ప్రారంభించిన సంప్రదాయము. "శ్రీ వాణీగిరిజాశ్చిరాయ...." అని నన్నయ మంగళ ప్రయోజనమై ఆశీ రూపముగా నున్న సంస్కృత శ్లోకమును భారతారంభమున రచించినాడు. ఆశీస్సు దేవభాషా ప్రయుక్తమగుట మంగళావహమను విశ్వాసము ప్రాచీనుల కెక్కువగా కలదు. భారతీయ భాషలలో సంస్కృతమునను, అందును లౌకిక సంస్కృతము కంటె వైదిక సంస్కృతము నందు చేసిన ఆశీస్సు ప్రభావమహిత మను నమ్మకము నేడును కొందరిలో కలదు. వైదికోక్తుల తరువాత సంస్కృతోక్తులకు పావిత్ర్యము హెచ్చు అను భావముతోడనో, రాజరాజు వైదికమతాభిమానమును వ్యక్తపరచుటకో లేక అతని ఆస్థానమందుండిన వివిధ శాస్త్రపండితులను, కవులను సంతృప్తిపరచుటకో లేక భారతీయ విజ్ఞానమునకు, తాను తెనిగింపదలచిన భారతమునకు మూలము

సంస్కృతభాష యగుట చేతనో నన్నయ భారత గ్రంథాదిని త్రిమూర్తి స్తవము సంస్కృతమున రచించెను. ఈ సంస్కృత శ్లోకము శార్దూల వృత్తలక్షణము లతో నొప్పుచు నన్నయ మార్గకవితాభిమానమును సంవ్యక్తము చేయును. నన్నయ కించుక తరువాతి వాడో, సమకాలికుడో అయిన పావులూరి మల్లన తన సార సంగ్రహ గణితములోను, తిక్కన తన తొలికృతియగు నిర్వచనోత్తర రామా యణము నందును, విన్నకోటపెద్దన తన కావ్యాలంకార చూడామణిలోను, మడికి సింగన వాసిష్ఠ రామాయణమునందును, తరిగొండ వేంకమాంబ వేంకటాచల మాహాత్మ్యములోను నన్నయ సంప్రదాయమును పాటించి మంగళాచరణమును సంస్కృత శార్దూలవృత్తముతో గావించినారు. పావులూరి మల్లన గ్రంథారంభ మునవేగాక ప్రతి అధ్యాయ ప్రారంభమునను గూడ సంస్కృత శ్లోకమును రచించి యుండుట ఒక విశేషము. ఇది నన్నయ పద్ధతికి భిన్నమైనది. మడికి సింగన వాసిష్ఠరామాయణము నందలి కృత్యాదిని రెండు శ్లోకములు కన్పట్టుచున్నవి. వీనిని బట్టి తిక్కనాది కవులు కొందరు మాత్రమే నన్నయ సంప్రదాయమును పాటించి మంగళాచరణ శ్లోకములను కావ్యారంభమున రచించియున్నారని తెలిసికొన వచ్చును.

తెలుగు భాషలో మంగళాచరణము గావించు సంప్రదాయమును మొదట ప్రారంభించినవాడు నన్నెచోడుడు. స్రగ్ధరా వృత్తముతో నన్నెచోడుని కుమార సంభవము ప్రారంభమయినది. ఇది అతని దేశి కవితాభిమానమును వ్యక్తము చేయును. తెలుగుననే కందపద్యములో మంగళాచరణము గావించిన మల్లియ రేచన కాలనిర్ణయము వివాదగ్రస్తమైనది. నన్నెచోడుడు, రేచన కొంచెమించు మించుగా ఒకే కాలమువారు కావచ్చును. పండితారాధ్యుని శివతత్త్వసారము నందును, భాస్కరరామాయణము నందును, అత్తనూరి పాపకవి చెన్న బసవ పురాణమునందును కృత్యారంభ మంగళాచరణము కందపద్యములలో రచింప బడినది.

శార్దూల వృత్తములో మంగళాచరణ పద్యములు రచింపబడిన కావ్యములు తెలుగులో చాల హెచ్చు. నన్నయ మార్గము ననుసరించి కాబోలు తిక్కన నిర్వచ నోత్తర రామాయణమునందును, ఎఱ్ఱన హరివంశమునందును మంగళాచరణ మును శార్దూలవృత్తముతో రచించినారు. జక్కన విక్రమార్క చరిత్ర, శ్రీనాథుని శృంగారనైషధ కాశీఖండములు, పోతన భాగవతము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని

శృంగార శాకుంతలము, జైమిని భారతములు, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము, పెద్దన మనుచరిత్ర, సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనము, రామరాజ భూషణుని వసుచరిత్ర, చింతలపూడి యెల్లనార్యుని రాధామాధవము, కాకమాని మూర్తికవి పాంచాలీ పరిణయము, తెనాలి అన్నయ సుదక్షిణా పరిణయము, రఘునాథనాయకుని వాల్మీకిచరిత్ర, చేమకూర వేంకటకవి విజయవిలాసము, పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయము మొదలగు వానియందు కృత్యారంభమున శార్దూలవృత్తము రచింపబడినది.

తిక్కన నిర్వచనోత్తర రామాయణము నారంభించుటలో నన్నయనే యనుసరించినను భారతమునందు ఉత్పలమాలను వాడినాడు. తిక్కనకు ముందే పాల్కురికి సోమనాథుడు తన తొలికృతియగు అనుభవసారమున ఉత్పలమాలనే కృత్యారంభమున రచించినాడు. పంపభారతము నందును ప్రారంభమున ఉత్పలమాలయే యున్నది. కేతన దశకుమార చరిత్రయందును, మంచన కేయూరబాహుచరిత్రమందును, మారన మార్కండేయ పురాణమునందును, ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణమునందును, శ్రీనాథుని హరవిలాస భీమేశ్వరపురాణము లందును, అనంతామాత్యుని భోజరాజీయమునందును, ముక్కు తిమ్మన పారిజాతాపహరణమునందును, కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందును, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునందును, చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసమునందును, కదిరీపతి శుకసప్తతి మున్నగు వానియందును మంగళాచరణ పద్యముగా ఉత్పలమాల యుపయుక్తమయినది.

పొన్నికంటి తెలగన యయాతి చరిత్రమునందు 'చంపకమాల'యును, గట్టుప్రభువు కుచేలోపాఖ్యానమున 'సీసపద్యము'ను కృత్యారంభ పద్యములుగా కన్పించుచున్నవి. క్రీడాభిరామమునందు ప్రారంభమున 'తేటగీత' కలదు. ఇందు ప్రస్తావన మాత్రమే యున్నందువలన నాందీపద్యము నష్టమైయుండవచ్చునని ఊహింపవచ్చును.

మొత్తముమీద తెలుగు కావ్యములలో ప్రారంభమున 'శ్రీ' కారముండుటయు, కృత్యారంభ పద్యము శార్దూలమో, ఉత్పలమాలయో యగుటయు నియతముగా నిల్చిన సంప్రదాయమని చెప్పవచ్చును. వృత్తములలో శార్దూలమునకే కృత్యారంభమున విశేష ప్రాచుర్య మున్నట్లు విదితమగును.

## 4. ఆశీర్వచనము - నమస్క్రియ :

“మొదంబున సత్కవి ప్రతి, పాదింపఁగవలయు శుభముఁ బడయుటకై కా
వ్యాదిని వరుసను నాశీ, ర్వాదమయిన దేవతాభివాదన మైనన్”

—అప్పకవీయము. 2-362.

అని కావ్యాదిని కృతిపతికి ఆశీర్వాదమయినను, దేవతాభివాదమైనను ప్రతిపాదింప వలెనని అప్పకవి చెప్పుచు ఏ కావ్యము మొదట ఆశీర్వాదమును, దేవతాభివాదమును ఉన్నదో ఇట్లు వివరించినాడు,

‘ఆశీర్వాదంబునకుఁ గృష్ణవిజయంబునందు ‘పాయాదపాయాత్’ అనియును, సాహసాంకంబునందు ‘అవ్యాత్స వో’ యనియును, దేవతాభివాదంబునకు శప్పన్నంబునందు “ప్రణమ్యలోక కర్తార” మనియును...

—అప్పకవీయము 2-364.

సంస్కృత కావ్యము లత్యధికముగా వస్తునిర్దేశముతో ప్రారంభింపబడినవి. సంస్కృత నాటకముల మొదట ఆశీస్సు నియతము. తెలుగు కావ్యములకు పెక్కింటికి కృతిపతులో కృతిప్రేరేపకులో యుందురు. వారికి ఆశీస్సులు ముఖ్యము. ఇష్టదేవతాస్తుతి పూర్వకముగా కృతిపతికి ఆశీస్సులొసంగు పద్యము తెలుగు కావ్యములలో ఆరంభమున నియతముగా కన్పించు ముఖ్య విశేషము. నన్నయ భారతారంభమునందలి మంగళ శ్లోకములో పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులు మీకు శ్రేయోదాయకులగుదురుగాక యను నాశీర్వాదమున్నది. ఇది సంస్కృత నాటకములందలి నాందీశ్లోకములను తలపించును. తిక్కన నిర్వచనోత్తర రామాయణమువందును విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి మున్నగు వానియందును కృత్యారంభ పద్యమున దేవతాస్తుతి పూర్వకముగా కృతిపతికి ఆశీస్సు లొసంగినట్లు రచింపబడినది. దేవతాస్తుతి పూర్వకమగు ఈ ఆశీస్సు ఒకే పద్యములోగాక పెక్కుపద్యములలో పలురీతులుగ నిర్వహింపబడినట్లు నన్నయ తరువాతి తెలుగు కావ్యములలో గమనింపవచ్చును. మానవాంకితములగు తెలుగు కావ్యము లన్నిటిలోను ఇష్టదేవతాస్తుతి పూర్వకముగా కృతిపతికి ఆశీస్సుతో ప్రారంభమగుట నియతము. దైవాంకితములగు కావ్యములలో కొన్నిటియందు దేవతాభివాదనముతో కావ్యారంభమగుట కలదు. పాల్కురికి సోమనాథుని అనుభవసారము, తిక్కనభారతము, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము, కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద, చింతలపూడి యెల్లనార్యుని రాధామాధవము,

కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధచరిత్ర, కవిరాజ మనోరంజనములు, తరి గొప్పుల మల్లన చంద్రభాను చరిత్రము మున్నగు వానియందు నమస్క్రియతో కావ్యారంభమైనది. రామరాజ భూషణుడు నరాంకితములని భావించి కాబోలు నరస భూపాలీయ, వసుచరిత్రములందు దేవతాస్తుతి పూర్వకముగా కృతిపతికి ఆశీస్సుతో మంగళాచరణమును ప్రారంభించినను, తన చరమకృతియగు హరిశ్చంద్ర నలో పాఖ్యానమును నమస్క్రియతో ప్రారంభించినాడు. ఇది శ్రీరాముని కంకితము. మొల్లరామాయణము, కవికర్ణ రసాయనము, పాంచాలీ పరిణయము, వాల్మీకి చరి త్రము, లంకావిజయము ఇత్యాదికావ్యములు కొన్ని దైవాంకితములయినను అవి ఆశీస్సుతోడనే ప్రారంభింపబడినవి. ఇష్టదైవము 'భక్తతతిని( బ్రోచుగాక' అనియో, 'మమ్ము నిర్మలసుఖ శ్రీయుక్తులంజేయుతన్' అనియో ఆ గ్రంథములందు కృత్యా రంభమున ఆశీస్సు గావింపబడినది.

కృత్యాదిని శ్రీకార పద్యములు మొదట భక్తిభావముతోడనే రచింపబడి నట్లు తెలియును. కాని అవి నాచనసోముని నాటినుండి శృంగారరస భూయిష్ఠము లనియు తోచుచున్నది. ఉత్తర హరివంశములోని ప్రారంభ పద్యమును పరి కింపుడు :

"శ్రీ సర్వమంగళా కుచ
వాసంతీ వకుళ గంధ వద్వనమాలా
వాసుకి విలాస! వేద
వ్యాసముని మనో నివాస హరిహర నాథా!"

ఈ పద్యము ఎత్తుగడలోనే వక్షోజ ప్రశంసకలదు. నాచనసోముని తరు వాతి గ్రంథములలో పెక్కింట 'శ్రీ వక్షోజ' అనియో 'శ్రీరామాకుచ మండలీ' అనియో కృత్యాది పద్యములందు కనబడును. నాచనసోముని కృత్యాది పద్యమును గూర్చి వ్రాయుచు శ్రీ ఆరుద్రగారు చెప్పినమాటలివి: "తెలుగుకవి కుమారులందరూ వాస్తవానికి 'చంటి' వారని చెప్పడానికి ఇలాగ గ్రంథాదిని మంగళాచరణంలో అమ్మవారి పాలిండ్లను మొదలే నోటబట్టడంవల్ల మాధి అవుతున్నా మొదటి 'చంటి' వాడు నాచనసోముడు."* కృతిపతి పేరు మంగళాచరణ పద్యమునందు చేర్చి రచించుట శుభప్రదమని అప్పకవి తెల్పినాడు.

* సమగ్రాంధ్ర సాహిత్యం III పుట 197.

"అతి శుభదపద యుగాంత, ర్గతమై పతిపేరు కృతిని గనుపట్టిన నీ
క్షితి వజ్రపంజరాంత, ర్గతు మాడ్కి నభేద్యుఁడగు నరాతులకెల్లన్"
—అప్పకవీయము (2-366)

తెలుగు కావ్యములలోని మంగళాచరణ పద్యములందు ఆయా కవులు తమ కృతిపతులను మాత్రమేగాక కృతిపతి తండ్రిని, అతని పురమును, వంశమును, దైవమునుకూడ చేర్చియుండుట కొన్నింట గమనింపవచ్చును. ఇష్టదేవతాస్తుతి పూర్వకమగు కృత్యారంభ పద్యములందు పెక్కింట కృతిపతి పేర్కొనబడు చుండును.

"నాయకపు కవులు కొందఱు, నాయక కల్యాణ గుణగణములొండె నభీ
ష్టాయత వస్తువు లొండెను, పాయక కీర్తింపుదురు ప్రబంధము మొదలన్"

అని చెప్పి అప్పకవి ఈ క్రింది లక్ష్యముల నిచ్చియున్నాడు.

"నాయక గుణంబులకు నైషధమునందు 'సువర్ణదండైక సితాత పత్రిత జ్వలత్ప్రతాపావళి కీర్తిమండల' యనియును, అభీష్టవస్తువులకు వృత్తరత్నా కరమునందు 'సుఖసంతాన సిద్ధ్యర్థ' మనియును లక్ష్యంబులు గలిగియుండు"—
అప్పకవీయము (2-364)

తెలుగులో అగుమంచి కథ, భట్టు రాయబారము మొదలగు వానియందు ప్రారంభమున నాయకుడగు కాటమరాజు గుణగణములను కీర్తించినట్లు గలదు. ఇట్లే కొన్ని పల్నాటివీరుల కథలలో ప్రారంభమున వీరులను స్తుతించి యున్నట్లు గుర్తింపవచ్చును.

మొత్తముమీద తెలుగునందు ఇష్టదేవతా స్తుతిపూర్వకముగా కృతిపతికి ఆశీస్సుతో ప్రారంభమగు కావ్యములు హెచ్చు. నమస్క్రియతో ప్రారంభమగు కావ్యములు తెలుగులో అల్పసంఖ్యాకములే అని చెప్పవచ్చును.

## 5. కృత్యాది - సూచ్యార్థ సూచనము :

నాందీ పద్యమున శబ్దము చేతగాని అర్థము చేతగాని నాటకార్థమును సూచించుట నాటక పద్ధతి. తెలుగు కావ్యములందును మహాకవులట్లే కృత్యారంభ

మందలి పద్యమున కావ్యార్థమును సూచించినారు. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము నందలి కృత్యారంభ మంగళపద్య మీ క్రిందిది:

"శ్రీ విద్యానిధియై మహామహిమచేఁ జెన్నై వసిష్ఠాజలూ
తావాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్క్రూర రా
జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యా వామాంగము దివ్యలింగము మదీయాభీష్టము ల్సల్పెడున్"

పై పద్యమునందు కావ్యవస్తువు స్పష్టముగా సూచింపబడినది. వసిష్ఠ, అజ, లూతా, వాతాశన, సామజ, ఆటవిక, గోత్రాదేవ, నత్క్రూర, రాజీవాక్షీయుగ, యాదవాధిపుల కథాసూత్రములతో దివ్యలింగమాలంబన బిందువుగ శ్రీ కాళహస్తి మాహాత్మ్యము సాలీని పటమువలె అల్లబడినది. కృతయుగమునాటి సాలెపురుగు, త్రేతాయుగమునాటి పాము, ద్వాపర ప్రారంభమునందలి ఏనుగు, కలియందలి ఆటవికుడు కాలాపరిచ్ఛిన్నమైన తత్త్వమునందు సాయుజ్యమునందుట—అను ఈ వస్తువే భావించిన కొలది హృదయమును వివిక్త మొనరింప జాలియున్నది. వీరందరు కవితో సమాన ధర్ములు. ఆ సమాన ధర్మము శివభక్తి. ఒకరొకరుగ వారు తమ తమ మార్గములలో సాయుజ్యాభిముఖముగా నడచిరి.

ఇట్లే కళాపూర్ణోదయమునందలి ప్రారంభపద్యమునకూడ కావ్యవస్తువు సూచితమై యున్నది.

"శ్రీ లావణ్యవతీ కుచద్వితయ కాశ్మీర ప్రభా చారు వ
క్షోలంకార మణి ప్రకాండము నవీనార్కుండుగా సన్మనో
నాళీకావిరత ప్రభాతమగుచు న్భాసిల్లు తత్త్వంబు నం
ద్యాల శ్రీ నరసింహ కృష్ణ విభు నిత్యశ్రీయుతుం జేయుతన్"

—కళాపూర్ణోదయము (1-1)

ఇందు కథలోని 'సుగాత్రి' ('కాశ్మీర ప్రభా' అనుటచే), మణిహారము ('మణిప్రకాండ' మనుటచే) కళాపూర్ణోదయము, సరస్వతీ రతి కూజితమును రంభకూయుట ఇత్యాది అంశములు ధ్వనితములు.

'అష్టదిగ్గజములు' అను గ్రంథమునందు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వ్యాసమునుండి గ్రహించినానని తెల్పుచు శ్రీ తిమ్మావజ్ఝల

కోదండరామయ్యగారు మనుచరిత్రము—ఉపోద్ఘాతములో ఈ క్రింది వాక్యముల నుదాహరించిరి.

"భారతీయ నాటకములలో నాగామి విషయ సూచనకుఁ బ్రాధాన్యము హెచ్చు. సంస్కృత నాటకములలోఁ బెక్కుచోట్ల గండమను నొక యంగము కల్పింపఁబడుచుండును. అదే సూచ్యార్థసూచనము. అల్లసాని పెద్దనకూడ నట్టి పద్ధతి నవలంబించి తన ప్రబంధమున నాసంప్రదాయమును నిబంధించెను."

మనుచరిత్ర కృత్యాదిని గల మొదటి మూడు పద్యములీక్రిందివి :

శా. "శ్రీ వక్షోజ కురంగ నాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలా సమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారు సనంద నాది నిజ భక్త శ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్.

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనుట మీ కులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁత నవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత దివ్య శరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభ ప్రతిపాది గావుతన్.

ఉ. నాలుగు మోములన్ నిగమ నాదము లుప్పతిలం బ్రచండ వా
తూల హతిన్ జనించు రొదతోడి గుహావళి నొప్పు మేరువుం
బోలి పయోజ పీఠి ముని ముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగమున్న ధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్"

"ఈ మూడు పద్యములలో నొక చమత్కారము కలదు. అది సూచ్యార్థ సూచనము. మొదటి పద్యమున భ్రాంతి యక్కఱలేనిచోట భ్రాంతి కనఁబడు చున్నది. రెండవ పద్యములో అననుభూత స్మృతి ప్రాపణము కలదు. మూఁడవ పద్యమునఁ భ్రాంతి తెలిసి చేసిన హేళన గోచరించుచున్నది. ఇట్లే మూఁడు పద్యములందును భ్రాంతి విషయమే ప్రస్తావింపఁబడియున్నది. మనుచరిత్రము నందలి పూర్వకథలో వరూధిని ప్రవరాఖ్యులవృత్తాంతము కలదు. అందు వరూధిని ప్రవరుని యాకారమును గాంచి యతఁడు విలాసపరుఁడని భ్రాంతి జెందినది. ప్రవరుఁడు హవ్యవాహనుని వేఁడి యరుణాస్పదపురమరిగినపిదప వరూధినిని

వలచియుండిన గంధర్వుఁడు మఱునాఁ డుద్యానవనమునఁ బ్రవరవేషమున వరూధిని కగపడఁగా నామె యాతఁడే ప్రవరుడని భ్రాంతిఁజెందినది. ప్రవరుఁడను భావముతోనే యతనితో సంసారము చేసినది. తనకు గర్భము కలుగుట యాతని మూలముననే యని యామె భ్రాంతి, ఆ భ్రాంతి కడఁదనుక నామెకట్లే యుండినది. ఆమెకు నిజము తెలియదు. ఇట్లు కథాభాగమునఁగల యీ భ్రాంతిని సూచించుటకే పెద్దన కృత్యాదిని గల మొదటి మూఁడు పద్యములలో భ్రాంతి విషయమునే యభివర్ణించినాఁడు.''

తెలుఁగు కావ్యములలో కృత్యాది పద్యమున కావ్యార్థ సూచనము ప్రత్యక్షముగా గాని లేక ధ్వనితమగునట్లుగా గాని చేయు సంప్రదాయముకూడ కలదు.

# 3

# దేవతాస్తుతి

దేవతా స్మరణమైన లేకుండ కృత్యారంభ పద్యము రచించు నాచారము సాధారణముగా తెలుగు కావ్యములందు లేదు. సంస్కృతమున ఆదికావ్యమగు రామాయణము—

"తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్"

అను వస్తు నిర్దేశపూర్వకమగు శ్లోకముతో ప్రారంభింపబడినది. కాళిదాసు రఘువంశమున గంభీరార్థ యుక్తమగు ఈశ్వర స్తవముతో.

"వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ"

అను శ్లోకమును ప్రారంభమున రచించినాడు. భారవి కిరాతార్జునీయమును "శ్రియః కురూణామధిపస్య పాలనమ్" అని లక్ష్మీ స్మరణ పూర్వకముగాను, మాఘుడు శిశుపాల వధను

"శ్రియఃపతి శ్శ్రీమతి శాసితుం జగ
జ్జగన్నివాసో వసుదేవ సద్మని"

అని విష్ణు స్మరణ పూర్వకముగాను ప్రారంభించి యున్నారు. ఇట్లు సంస్కృతమున కృత్యారంభ శ్లోకములలో కొన్నిట దేవతా స్మరణము ధ్వనితమై యున్నదే

తప్ప నియతము మాత్రము కాదు. సంస్కృత కావ్యములు ప్రాయికముగా వస్తు విర్దేశముతో ప్రారంభింపబడినవి. సంస్కృత నాటకములందలి నాందీశ్లోకమున మాత్రము దేవతాస్మరణము నియతముగా కన్పించును.

కృత్యాదిని దేవతాస్తుతిని విస్తరించి వ్రాయు నాచారము ప్రాకృత కన్నడ కవుల కావ్యములందు కలదు. వాక్పతి రాజదేవుని 'గౌడవహ' (గౌడవధ) మను ప్రాకృతకావ్యమునందు బ్రహ్మాదిదేవతాస్తుతి అరువదియొక్క శ్లోకములలో కలదు. కన్నడమున కవిరాజమార్గమునందు మొదటి రెండుపద్యములలో విష్ణుస్తుతి రూపముగా నృపతుంగప్రశంస, పిదప సరస్వతీప్రశంస చేయబడినది. నాగవర్మ తన ఛందోంబుధిలో ''ఆదిత్యం, అంబికాం, విష్ణుం, గణనాథం, మహేశ్వరం'' అను పంచాయతనదైవతములను, సరస్వతిని కావ్యాదిని స్తుతించినాడు. పంపాది కవులుకూడా కృత్యాదిని దేవతాస్తుతిని విస్తరించి వ్రాసియున్నారు.

ఆంధ్రకవులకు కృతిప్రారంభకర్తవ్యము అవశ్యాచరణీయమయినది. గ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తియగుటకు, కావ్యమునకు ప్రకాశమును, పవిత్రతను ఆపాదింపజేయుటకు, దేవతాస్తుతిపూర్వకముగా కృతిపతిని ఆశీర్వదించుటకు, కృతిభర్త కభీష్టఫలప్రది పరమపురుషార్థసాధనకు - కృత్యారంభమున తెలుగు కావ్యములందు దేవతాస్తుతి నియతముగా చేయబడియున్నది.

నన్నయ భారతారంభశ్లోకమున శ్రీ వాణీగిరిజలను, పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరులను స్తుతించి వెనువెంటనే రాజరాజనరేంద్రుని ప్రశంసించి, తాను భారతరచన కావించుటకు గల కారణములను తెలిపి తరువాత కథారంభమున ఉపక్రమించుటకు ముందు "హరిహరాబ్జ గజాననార్క షడాస్యమాతృసరస్వతీ గిరిసుతాదికదేవతాతతికిన్" అని ఒకపంక్తిలో పలువురు దేవతలను స్తుతించినాడు. తిక్కన నిర్వచనోత్తరరామాయణమున ''శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తమ్భే'' అను శ్లోకమున మనుమసిద్ధిని ఆశీర్వదించి 'హరిహరపద్మగర్భులను' అని మరొకపంక్తిలో స్తుతించినాడు. భారతమునమాత్రము తిక్కన ఒకపద్యములో హరిహరరూపమగు పరతత్త్వమును గొల్చినాడు. మంచన కేయూరబాహుచరిత్రమున కృత్యారంభపద్యమున 'శ్రీ' ని స్తుతించి తరువాతి రెండవ పద్యమున దేవతలందరిని ఒకేపద్యమున ఇట్లు స్తుతించినాడు :

''కరిముఖుఁ డశ్వినుల్ శ్రుతులు కంజ సముద్భవు మోము లంబికే
శ్వరు మొగముల్ తదాత్మజుని వక్త్రములు లాదిమునీంద్రు మండలం

బురగ పతుల్ గ్రహంబులు పయోరుహనాభుఁడు తారకంబులున్
బోరిఁ బోరి నెల్లసంపదలు పొలయగుండనిచ్చుఁ గావుతన్."

—కేయూరబాహుచరిత్ర. (1-2)

ఏకదంతుడు, ఇద్దరు అశ్వినీదేవతలు, మూఁడు వేదములు, నాలుగు బ్రహ్మ ముఖములు, అయిదు మహేశ్వరుని మొగములు, ఆరు కుమారస్వామి వక్త్రములు, సప్తర్షులు, అష్టనాగులు, నవగ్రహములు, విష్ణుని దశావతారములు, అనంతములైన నక్షత్రములు కృతిపతికి సకలసంపదలు ప్రసాదింతురని పై పద్యమున ఆశీర్వదింప బడినది. ఇందు ఒకటినుండి అనంతముపరకు సంఖ్యలు చెప్పబడి చక్కని క్రమము పాటింపబడినది. ఒకేపద్యమున పలువురు దేవతలు స్తుతింపబడినారు. ఇట్లు ఒకేపద్యమున పలువురు దేవతలను స్తుతించు పద్ధతి తెలుగు కావ్యములందు చాల తక్కువ.

దేవతాస్తుతిని విస్తరించి పెక్కు పద్యములలో వ్రాసిన మొదటి కవి నన్నెచోడుడు. అతడు తన కుమారసంభవమున శివుని మూడు పద్యములలోను, విష్ణు, బ్రహ్మ, అర్క, గజానన, షణ్ముఖ, మన్మథ, పార్వతీ, భారతులను ఒక్కొక్కపద్యములోను ప్రత్యేకముగా పేర్కొని స్తుతించినాడు. ఇది నన్నయ పద్ధతికి భిన్నమైన నూతనమార్గము. కృత్యారంభమున దేవతాస్తుతిని విస్తరించి వ్రాయుపద్ధతిని నన్నెచోడుడు కన్నడ కవులనుండి గ్రహించియుండును. నన్నెచోడునికి తరువాతి కవులు ఈ మార్గమును అనుసరించి కృత్యారంభమున దేవతాస్తుతిని విస్తరించి వ్రాసియున్నారు. కేతన ఆంధ్రభాషాభూషణములో దేవతాస్తుతి కవిస్తుతులు ఒకేపద్యమున గావించియున్నను దశకుమారచరిత్రయందు మాత్రము హరి, శంకర, బ్రహ్మ, సూర్య, వినాయక, మయూరవాహన, మన్మథ, భైరవులను వేర్వేరు పద్యములలో స్తుతించినాడు. కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయ కృత్యారంభమున దేవతాస్తుతి, సుకవిస్తుతి, కుకవి నిరసనము—అన్నిం టిని ఒకేపద్యములో గావించియున్నను నిరంకుశోపాఖ్యానములో మాత్రము కృత్యారంభమున ఒకపద్యమున కందుకూరి సోమేశ్వరస్వామిని, తరువాత కందపుర జనార్దనుని, బ్రహ్మను, లక్ష్మిని ఒక్కొక్క పద్యములో ప్రత్యేకము గాను, కాళికను, వాణిని - ఒక్కొక్కరిని రెండుపద్యములలో ప్రత్యేకముగాను స్తుతించియున్నాడు. అప్పకవి తన లక్షణగ్రంథప్రారంభమున ఈ దేవతాస్తుతిని ఇరువదిఅయిదు పద్యములలో తనివితీర చేసినాడు. ఇట్లు కృత్యారంభమున

పలువురి దేవతలను పలురీతుల పెక్కుపద్యములలో పేర్కొని స్తుతించుట తెలుగు కావ్యములందు పెక్కుంట కాననగును.

దేవతాస్తుతి కృత్యారంభ పద్యములందే గాక అవతారికయందే కథారంభ మున కుపక్రమించుటకు ముందు కొన్ని కావ్యములందు కన్పట్టును. చింతలపూడి యెల్లనార్యుడు తన రాధామాధవమున కృత్యారంభమున దేవీ సహితులైన విష్ణు శంకర బ్రహ్మలను క్రమముగా ఒక్కొక్క పద్యమున వినుతించి పిమ్మట గణ నాథుని, సరస్వతిని ప్రత్యేక పద్యములలో కీర్తించి వెనువెంటనే కవిస్తుత్యా దులు, కావ్యరచనా హేతువు తెల్పిన తరువాత షష్ఠ్యంతములకు ముందు మరల సరస్వతిని పునః ప్రణామంబాచరించినాడు. ఈ పద్యమును చూడుడు :

"మకుటోద్యన్నవ రాజకందళముతో మందస్మితోదార గ
మ్యకపోలస్థల దర్పణద్వయముతో మాణిక్యవీణాస్వర
ప్రకటోన్మీలిత లోల పక్ష్మములతోఁ బ్రత్యక్షమై భారతీ!
సకృపా! తోడగుమమ్ము యిప్పుడల నస్మత్కావ్య బంధాళికిన్"

—రాధామాధవము (1-34)

కూచిమంచి తిమ్మకవి కూడ తన రాజశేఖర విలాసము, రుక్మిణీ పరిణయములందు కథాప్రారంభమున కుపక్రమించుటకు ముందు తిరిగి ఇష్టదైవమగు కుక్కుటేశ్వ రుని పలువిధముల స్తుతించియున్నాడు.

ఆంధ్ర కావ్యములందు కృత్యాదిని నియతముగా నున్న దేవతాస్తుతిని 1. నిఖిల దేవతాస్తుతి 2. ఇష్టదేవతాస్తుతి 3. అన్యదేవతాస్తుతి అని మూడు విధములుగ వర్గీకరించి పరిశీలింపవచ్చును.

## 1. నిఖిల దేవతాస్తుతి :

పరతత్త్వరూపుడగు భగవంతు డొక్కడే యైనను తత్తత్కర్మానుసార ముగా మానవాదు లనేక రూపముల ప్రశంసించుటలో పరమాత్మున కనంత రూపనామము లేర్పడినవి. కాని ఈ పరిణామము క్రమక్రమముగ వాదములలోనికి వ్యాపించినది. త్రిగుణాత్మకమవి క్రమముగ విష్ణు, బ్రహ్మ, శివరూపము లేర్పడి నవి. ఈ విధముగ పరమాత్మను అనేకవిధములుగ నుతించుట కవకాశము లభించినది.

మడికి సింగన తన వాసిష్ఠరామాయణ ప్రారంభమున దేవతాస్తుతిలో పరమాత్మను ఇట్లు స్తుతించినాడు:

"శ్రీకరలీలఁ బ్రాణుల సృజింపఁ దలంచి విధాత తానయై
చేకొని వానిఁ బ్రోచునెడ శ్రీ విభుఁడై, యని సంహరింప భీ
మాకృతిఁ దాల్చి మువ్వురకు నవ్వల నొక్కటియై, వెలుంగు సు
శ్లోకుఁ బురాణుఁ బుణ్య పురుషున్ బరమాత్ముని భక్తిఁ గొల్చెదన్"

—వాసిష్ఠ రామాయణము *(1-1)*

చేమకూర వేంకటకవి తన విజయ విలాస ప్రారంభమున దేవతాస్తుతిని చేయుచు త్రిమూర్త్యాత్మకుడగు తేజోనిధిని ఇట్లు తలంచినాడు:

"మొగుడుం దమ్ముల విప్పనప్పుడు రథంబున్ జక్రవాకంబుఁ గొం
డగడిన్ దేలుఁగఁ జేసిన పట్లఁ దమముల్ మందేహులన్ దోలి వా
నిగడ లోకస్తుతి యందు సత్త్వముఁ బ్రకాశింపన్ ద్రిమూర్త్యాత్మకుం
డగు తేజోనిధి వేడ్కఁ జేయు ఘనతాభాగ్యుఁ దేజోనిధిన్"

—విజయ విలాసము (1-5)

నన్నయ భారతారంభమున "సకల భువన రక్షణ ప్రభువులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమా వాణీపతుల స్తుతియించి"నాడు. బమ్మెరపోతన తన భాగవత గ్రంథాదిని విష్ణు, శంకర, బ్రహ్మలను 'నిఖిల భువన ప్రధాన దేవత'లుగా పేర్కొని స్తుతించినాడు. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములో ప్రారంభమున మూడు పద్యములలో ఉమామహేశులను, పద్మాకంజాక్షులను, వాగ్విధాతలను ప్రత్యేకముగా స్తుతించి "సకల భువన ప్రవర్తన హేతువులైన పురాతన మిథునంబులం గొనియాడి"నాడు. కూచిమంచి తిమ్మకవి తన రాజశేఖర విలాసము, రుక్మిణీ పరిణయములందు శివుడు, పార్వతి, విష్ణువు, లక్ష్మి, బ్రహ్మ, సరస్వతి, విఘ్నేశ్వరుడు, నవగ్రహములను 'నిఖిలభువన' దేవతలుగా కృత్యారంభములందు వినుతించినాడు. ఇట్లు ఇష్టదేవతాస్తుతికి పూర్వమే నిఖిల దేవతాస్తుతిని చేసియున్నట్లు కొన్ని కావ్యములందు కాననగును. బ్రహ్మ స్తుతితో ప్రారంభమగు తెలుగు కావ్యమేదియును లేదు. త్రిమూర్తులలో హరిహరులను, నిఖిల దేవతలుగా మాత్రమేగాక ఇష్టదేవతలుగాను పలువురుకవులు భావించి తమ కృత్యాదులందు స్తుతించియున్నారు. త్రిమూర్తులను స్తుతించు సందర్భమున ఒక పద్యములో ఒకరిని వెంటనే ఇంకొక పద్యములో అతని దేవేరిని ఈ విధముగ వారిని వారి దేవేరు

లతో స్తుతించుట బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము, సముఖము వేంకట కృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము, కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసము, రుక్మిణీపరిణయము, రత్నాకరము అప్పప్పకవి శశిరేఖా పరిణయము ఇత్యాది కావ్యములందు కాననగును. దేవీ సహితులైన విష్ణు శంకర బ్రహ్మలను క్రమముగా ఒక్కొక్క పద్యములో స్తుతించుట రాధామాధవమువంటి కొన్ని కావ్యములందు కలదు. రత్నాకరము అప్పప్పకవి ఉదయమున బ్రహ్మగాను, మధ్యాహ్నవేళ శంకరునిగాను సాయంసమయమున విష్ణువుగాను భాసించుదేవుని నుతించినట్లు తెల్పియున్నాడు. చూడుడు :

"ఉదయంబున బ్రహ్మయునై
సదయత మధ్యాహ్నవేళ శంకరు రీతిన్
ముదమున న స్తమయంబున
విదితంబుగ విష్ణువనెడు వేల్పు నుతింతున్"

—శశిరేఖా పరిణయము (1-8)

త్రిమూర్తులతోపాటు వారి దేవేరులకు కూడ విశిష్ట స్థానమిచ్చి కృత్యారంభమున కవులు స్తుతించినారు. లక్ష్మి, పార్వతి, సరస్వతులలో సరస్వతి బ్రహ్మపత్నిగా మాత్రమేగాక చదువుల తల్లిగాకూడ తెలుగు కావ్యములందు విశిష్టస్థాన మాక్ర మించినది. శ్రీనాథుడు, పినవీరభద్రుడు, దూబగుంట నారాయణకవి మున్నగువారు సరస్వత్యుపాసకులుగా కూడ అయినట్లు వారి గ్రంథావతారికలనుబట్టి తెలియు చున్నది. సరస్వతి ఇష్టదేవతగా కూడ పలువురు కవులచే స్తుతింపబడినది. ఇక లక్ష్మి పార్వతులలో సంపదలొసంగు లక్ష్మిని తెలుగు కవులు తమ కృత్యారంభ మున అధికముగా పేర్కొని స్తుతించినారు. మంచన కేయూరబాహుచరిత్ర లక్ష్మి స్తుతి తోడనే ప్రారంభింపబడినది. కేయూరబాహుచరిత్రలోని కృత్యారంభ పద్య మిది :

"శ్రీ వసియించుఁ గాత సుఖసిద్ధి వహించి యనేక బంధు హం
సావళియుం బ్రహృష్ట సరసార్థి సముత్కర షట్పదంబునై
జీవనమెప్పుడున్ సుకవి సేవ్య మనం బొగడొందు సర్వ పు
ణ్యావహమైన గుండ సచివాగ్రణి గేహ సరోవరంబునన్"

మంచన పార్వతీ, సరస్వతులను పేర్కొనక లక్ష్మిని మాత్రమే స్తుతించి యుండుట ఒక విశేషము. వెన్నెలకంటి సూరన తన విష్ణుపురాణములో పార్వతిని

మాత్రమే స్తుతించియున్నాడు. విన్నకోటపెద్దన 'శ్రీ గిరిజేశ పాదయుగళుడ' నని చెప్పికొన్నను తన కావ్యాలంకార చూడామణిలో కృత్యారంభమున లక్ష్మీ సరస్వతులను మాత్రమే స్తుతించియున్నాడు. పార్వతిని పేర్కొనలేదు. ఎఱ్ఱన నృసింహపురాణము, పినవీరభద్రుని శృంగార శాకుంతలము, దగ్గుపల్లి దుగ్గన నాసికేతూపాఖ్యానము, దూబగుంట నారాయణకవి పంచతంత్రము, ముక్కు తిమ్మన పారిజాతాపహరణము ఇత్యాదులందు కావ్యాదిని లక్ష్మీ సరస్వతుల ప్రశంస యున్నను పార్వతీస్తుతిమాత్రము లేదు. రామరాజభూషణుడు కావ్యాలంకార సంగ్రహములో పార్వతిని స్తుతింపకున్నను వసుచరిత్రలో స్తుతించినాడు. ఇట్లు తెలుగు కావ్యములందు కృత్యాది దేవతాస్తుతిలో సరస్వతీ, లక్ష్మీ, పార్వతులకు క్రమముగా ప్రాధాన్యమున్నట్లు విదితమగుచున్నది.

## 2. ఇష్ట దేవతా స్తుతి :

'ప్రారిప్సిత గ్రంథ నిర్విఘ్న పరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేదలక్షణ ఫల సాధనంబుగా నిష్టదేవతా ప్రార్థనము'ను కవులు తమ కావ్యారంభమునందు చేసినారు. ఈ ఇష్టదేవతాస్తుతి సాధారణముగా కవుల, కృతిపతుల మత భావ రీతుల ననుసరించియే యుండును. కథాసందర్భమున కనుకూలముగ దేవతలనుగూడ ఇష్టదేవతాస్తుతిలో కొందరు కవులు పేర్కొనుట కొన్ని కావ్యములందు కలదు. కవుల, కృతిపతుల ఇష్టదేవతలు తెలియుటే గాక వారి మత భావము లెరుంగుటకును కృత్యాది ఇష్టదేవతాస్తుతి కొంతవరకు తోడ్పడుచున్నది.

కుమారసంభవమునందలి కృత్యాది ఇష్టదేవతాస్తుతి నన్నెచోడుని శివ పారమ్యభావమును వ్యక్తముచేయుచున్నది. నన్నెచోడుడు శివుని 'మహాదేవు'డని, 'అంబికాధవు'డని 'పరమేశ్వరు'డని పేర్కొని మూడు పద్యములలో స్తుతించినాడు. తదితర దేవతలనుగూడ శివునితో సంబంధము కలవారినిగా నన్నెచోడుడు వర్ణించినాడు. శివుని వామాంగమునందుబుట్టి నియమస్థితిగొల్పి అఖిలలోకములను గాచునట్టి విష్ణువు, పరమేశుని దక్షిణాంగమున జన్మించి అతని చిరకాలముగొల్చి తత్ప్రసాదమున విశ్వము సృజియించి పొల్చునట్టి బ్రహ్మ ప్రత్యేక పద్యములలో స్తుతింపబడినారు. రవి శివుని అష్టమూర్తులలో నొకమూర్తి; త్రిలోచనములలో నాదిలోచనము. గణనాథు డభీష్టఫలప్రదాత. షణ్ముఖుడు అపర్ణాస్థాణువులు జననీ జనకులుగా గలవాడు. హరుని కామాతురునిగ వశముచేసికొన్నవాడు మన్మథుడు.

వీతరాగిని అర్ధనారిని చేసినది పార్వతి. వేదాగమరూపమున మహాదేవుని అపార గుణమహాస్తుతిసంపాదిత భారతి. ఇట్లు కుమారసంభవమునందలి కృత్యాది దేవతా స్తుతి నన్నెచోడుని శివపారవశ్యమును వ్యక్తపరచుచున్నది. కూచిమంచి తిమ్మకవి కూడ రాజశేఖరవిలాసములో శివస్తుతితో కావ్యారంభము గావించినాడు. శివుని, పార్వతిని ప్రత్యేక పద్యములలో స్తుతించినాడు.

భక్తిమార్గము గైకొన్న శైవము ఆవేశపూరితమై వీరశైవమయినది. పాల్కురికి సోమనాథుని అనుభవసార, బసవపురాణ, పండితారాధ్య చరిత్రలందు కృత్యాదిని వీరశైవమతప్రతిపాదకముగా శివుని సర్వోత్కృష్టత, శివభక్తి ప్రతిపాదింపబడినవి. వీరమాహేశ్వరాచార్యులగు శివభక్తులు మాత్రమే అందు స్తుతింపబడినారు. అన్యదైవప్రసక్తి వానియందు కానరాదు. పిడుపర్తికవుల కావ్యము లందలి కృత్యాదులోను ఈ విధముగనే పాటింపబడినది. అత్తనూరి పాపకవి చెన్నబసవపురాణము, బచ్చు సిద్ధకవి 'మండెబసవపురాణము' మున్నగు కావ్యము లందు కృత్యారంభమున పురాతనదంపతులు స్తుతింపబడినారు. మొత్తముమీద వీరశైవమతప్రతిపాదకముగా ఇష్టదేవతాస్తుతి నిర్వహింపబడిన కావ్యములు తెలుగులో అల్పసంఖ్యాకములే!

గౌరన నవనాథచరిత్రలో మల్లికార్జున భ్రమరాంబికా హేరంబులనే గాక కథాసందర్భమున కనుకూలముగా వీరభద్ర, నందికేశ్వర, ప్రమథగణములను, సిద్ధముఖ్యులను గొల్చినాడు. హరిశ్చంద్రోపాఖ్యానమునకూడ గౌరన తన ఇష్టదైవమగు శివునితోపాటు భ్రమరాంబికా, హేరంబ, వాణులనుకూడ కృత్యారంభమున కొల్చినాడు. దీనినిబట్టి గౌరన శైవుడని చెప్పుకొన్నను వీరశైవుడు మాత్రము కాదనుట స్పష్టమగుచున్నది. శైవమతావేశముచే ప్రారంభింపబడిన కావ్యములును తెలుగులో ప్రసిద్ధి పొందలేదు.

గోన బుద్ధ భూపతి రంగనాథరామాయణము కృత్యారంభమున "మా దేవు గమలాక్షు మమ్మేలు దేవు - నాదినారాయణు నఖిలలోకేశు భావించి, కీర్తించి, ప్రార్థించి, మ్రొక్కి సేవించి" అని విష్ణువును సుమారు ముప్పది ద్విపద పంక్తులలో స్తుతించినాడు. విష్ణువును పలురీతుల స్తుతించుటవలన, ఒక్క వాణిని తప్ప తక్కినదైవతములను పేర్కొనకపోవుటవలన గోన బుద్ధ భూపతి వైష్ణవ భక్తి విదితమగుచున్నది. తాళ్లపాక చిన్నన్న ఉషాకళ్యాణములో మాత్రము కథా సందర్భమున కనుగుణముగ గౌరీశంకరులనుకూడ పేర్కొని స్తుతించియున్నను,

అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసములందు శుద్ధవైష్ణవదేవతలనే స్తుతించియున్నాడు.

కృత్యారంభమున సంప్రదాయముగా ఏర్పడియుండిన ఇష్టదేవతాస్తుతిలో వాడుకగాచెప్పు దేవతలనుగాక కృష్ణదేవరాయలు సర్వవిలక్షణముగా శుద్ధవైష్ణవ దేవతలనే ఆముక్తమాల్యదయందు స్తుతించినాడు. ఆముక్తమాల్యద కృత్యారంభ పద్యమున శ్రీ కృష్ణదేవరాయలు శ్రీ వేంకటేశ్వరుని స్తుతించినాడు. రెండవ పద్యమున "భజింతు న్నిరంతరముం దాంతుని నయ్యనంతుని నతీతబ్రహ్మకల్పాంతునిన్" అని విష్ణుశయ్యయగు అనంతుని స్తుతించెను. మూడవపద్యమున విష్ణువాహనమగు గరుడుని "పతగ సమ్రాట్పతత్త్రి ప్రభంజనము" అని వర్ణించినాడు. నాల్గవపద్యమున విష్వక్సేనుని బెత్తమును "సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్" అని వర్ణించెను. అయిదవపద్యమున "పాంచజన్యమొసఁగుం గళ్యాణసాకల్యమున్"అని పాంచజన్యమును స్తుతించెను. ఆరవపద్యమున"నందకం బఘలతాశ్రేణిచ్ఛిదం జేయుతన్" అని నందకమును, ఏడవపద్యమున "కౌమోదకి మోదకీలిత సముజ్వల కల్పక మాల్యఁ గొల్చెదన్" అని కౌమోదకమును, ఎనిమిదవపద్యమున "శార్ఙ్గధనుర్లత కామఁ గావుతన్" అని శార్ఙ్గమనెడి ధనువును, తొమ్మిదవ పద్యమున "సుదర్శనదేవుఁ గొల్చెదన్" అని సుదర్శనమును వర్ణించెను. ఇక పదవ పద్యమునందు "ఇలఁ బన్నిద్దఱు సూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్" అని పన్నిద్దఱాళ్వారులను స్తుతించెను. ఆముక్తమాల్యద కృత్యారంభమున ఇష్టదేవతాస్తుతి పది పద్యములలో నున్నను, తరువాత గాన వచ్చెడి గురుస్తుతి, సుకవిప్రశంస, కుకవినిందలు ఎచ్చటను కానరావు. ఈ ప్రబంధమున నిది యొక అపూర్వ విశేషము.

రామాభ్యుదయము, వైజయంతీవిలాసము, శశాంకవిజయము, శకుంతలా పరిణయము ఇత్యాది కావ్యములందు కృత్యారంభమున శుద్ధవైష్ణవ దైవతములే స్తుతింపబడిరి. ఈ కావ్యకవులు, కృతిపతులుకూడ వైష్ణవు లనుట లేక వైష్ణవ మతాభిమాను లనుట వీనినిబట్టి స్పష్టముగా తెలియుచున్నది.

క్రీ. శ. 13 వ శతాబ్దమునాటికి వీరశైవమతవిజృంభణమువలన నామ మాత్రావశిష్టమైయుండిన అద్వైతమత పునఃప్రతిష్ఠాపనకు ఆంధ్రదేశమున కృషి చేసినవాడు మహాకవి తిక్కన. అతడు భారత కృత్యారంభమున ధర్మాద్వైతము తోపాటు హరిహరాద్వైత ప్రతిపాదకమైన పరతత్త్వమును గొల్చినాడు. తిక్కన

హరిహరాద్వైతముతో శైవ వైష్ణవ మతవిషయకములగు వైషమ్యములు అతని తరువాత చాలవరకు తొలగినవి. తిక్కన మార్గము ననుసరించి ఐక్కన తన విక్రమార్కచరిత్రలో కృత్యారంభమున శ్రీహరిహరేశుని స్తుతించినాడు. నాచన సోముని ఉత్తరహరివంశమునకు అవతారిక లభింపమిచే హరిహరనాథుడు కృత్యారంభపద్యమున స్తుతింపబడినాడో లేదో చెప్పలేము. హరిహరనాథుని కృత్యారంభపద్యమున ప్రత్యేకముగ స్తుతింపకున్నను నాచన సోముని ఉత్తర హరివంశము, కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక, బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము మొదలగు కావ్యములందు హరిహరనాథప్రశంస కలదు. ఈ కావ్యములు హరిహరనాథునికి అంకితముగా రచింపబడినవి.

హరిహరులకభేదము పాటించి ధ్యానింపుట తిక్కనమార్గమేఅయినను హరిహరులను భిన్నభిన్నముగావర్ణించి ఏకమొనర్చి ముగించు సంప్రదాయము నాచనసోముని ఉత్తర హరివంశము ద్వితీయాశ్వాసమునందలి హరిహర స్తవములో కలదు. కొరవిగోపరాజు, బైచరాజు వేంకటనాథునునుగూడ నాచనసోమునివలె హరిహరుల నుపాసించిన అద్వైతులే.

అద్వైతులు మనోనిగ్రహార్థము కల్పిత లాకారింపుటయు ఏదో ఒకఇష్ట దైవము నారాధించుటయు వాడుక. అందును విశేషించి వారు "తథాపి భక్తి స్తరుణేన్దుశేఖరే" అన్నట్లు శివభక్తి నెక్కువచూపుటయు ప్రసిద్ధము. కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికను శివస్తుతితో ప్రారంభించినాడు. సింహాసన ద్వాత్రింశిక ఆశ్వాసాంతపద్యములందు ఒకపద్యము హర సంబోధనముతో ఒకటి హరిసంబోధనముతో వేరొకటి హరిహరసంబోధనముతో ముగింపబడినది. భోజుడు సింహాసనమెక్కుటకై ముప్పదిరెండుమారులు వచ్చినప్పుడును హరినో హరునో ధ్యానించుచువచ్చినట్లు ప్రతికథ మొదటను ద్వితీయాంతములతో ఒక్కొక్కపద్యము రచింపబడినది. గోపరాజు హరిహరులనుమాత్రమేగాక బ్రహ్మ సరస్వతి, గణేశ, షణ్ముఖ, లోకబాంధవులనుకూడ కృత్యారంభమున స్తుతించి నాడు. పావులూరిమల్లన సారసంగ్రహగణితము, చిమ్మకోటపెద్దన కావ్యాలంకార చూడామణి, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము, ఎడపాటిఎఱ్ఱన శృంగారమల్హణ చరిత్ర మున్నగుకావ్యములు శివస్తుతితో ప్రారంభింపబడినవి. ఈ కవులందఱును అద్వైతులే!

"న హరేస్తు పరస్తోత్రితా" అను వాక్యము ననుసరించి అద్వైతులు కొందరు విష్ణుభక్తిని పాటించుటయు కలదు. పోతన భాగవత కృత్యారంభమును విష్ణుస్తుతితో గావించినాడు. భాగవత రచనముతో పోతన వైష్ణవాచారసంపన్నుడని కొందరు తలంపవచ్చును. పోతన తండ్రి తాతలు సహోదరులుకూడ పరమశైవులయినట్లు భాగవతావతారికనుబట్టి తెలియుచున్నది, కాని పోతన భక్తి శివకేశవ భేదములేని కేవలాద్వైతమూలము. ఈ పద్యమును పరికింపుడు:

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁజేటు"

—భాగవతము (1 - 14)

ఈ పద్యము స్వాభిప్రాయద్యోతకము. పోతన చిత్తవృత్తికి సకలదేవతలు నొక్క రూపముగనే కన్పింతురు.

'వైష్ణవధ్యాన సమాహితాత్ముఁ డగు' అనంతామాత్యుడు అహోబిలనృసింహ స్తోత్రముతో భోజరాజీయమును ప్రారంభించినాడు. ఉద్భటారాధ్యచరిత్ర కర్తయగు రామలింగయమే వైష్ణవమతముపుచ్చుకొని రామకృష్ణుడై పాండురంగమాహాత్మ్య మును రచించినాడని విమర్శకుల అభిప్రాయము. పాండురంగమాహాత్మ్యము కృష్ణ స్తుతితో ప్రారంభమైనది. కృతిపతి విరూరివేదాద్రికూడ 'వైష్ణవస్వీకారార్హుడే.' శ్రీ వైష్ణవప్రీతిగా విష్వక్సేనగరుడానంతులనుకూడ రామకృష్ణ కవి కృత్యాదిని స్తుతించియున్నాడు. పార్వతిని స్తుతించుచు రామకృష్ణుడు కోరినది "విరూరివేదాద్రికి విష్ణుభక్తి మహిమాతిశయంబు నయంబునీవుతన్" (1 - 6) అనియే. 'దక్కిన విష్ణుభక్తి' (2 - 207) కలవాడని, 'దనుజరిపు ప్రపావజనిత ప్రతిభానిధి' (2 - 207) యైనను 'మూర్తిత్రయైకనిలయుడు' (1 - 167) అని శివుని పేర్కొనినాడు. రామకృష్ణకవి 'పరమ వైష్ణవరత్నంబులకుఁ బ్రయత్న పూర్వకంబుగ నభివందనం బాచరించి" (1 - 16) నాడు.

బైచరాజు వేంకటనాథుడు హరిహరనాథునియందలి భక్తిపారవశ్యమును తెల్పియున్నను పంచతంత్రమునుమాత్రము కృష్ణస్తుతితోనే ప్రారంభించినాడు.

వేంకటనాథుడు అనూర, గరుత్మంతులనుకూడ కృత్యారంభమున స్తుతించియుండుటచే అతని విష్ణుభక్తి వెల్లడియగుచున్నది.

పింగళి సూరన తండ్రి సోమారాధ్య శిష్యుడై శివభక్తి నెక్కువగా చూపినవాడు. పిత్రాచారమునుబట్టి, 'లలాటేక్షణ భక్తిశీలు'డైన సూరనయు అద్వైతియే. రాఘవపాండవీయమునాటికి 'ఫలాపేక్ష లేని' ఈ కవి కృతిప్రేరకుని ధర్మమనుసరింప నక్కరలేకయే సహజమైన శివభక్తి నెక్కువగా చూపినాడు. కాని అందును విష్ణుస్తుతి చేయకపోలేదు. సూరన కళాపూర్ణోదయమునందు కృతిధర్మము ననుసరించి అందు విష్ణుభక్తి నెక్కువగా కొనియాడినను సందర్భవశమున అందు కూడ శివస్తుతి చేసియున్నాడు. కేవలవిష్ణుభక్తుడగు కృష్ణభూపాలుని మెప్పుగాంచుటకే కళాపూర్ణోదయమున సూరన ఇట్లు విష్ణుస్తుతి నెక్కువగా చేసినాడనవచ్చును. ప్రభావతీప్రద్యుమ్నములోని దేవతాస్తుతినిబట్టి చూచిన సూరన అద్వైతి అనియే చెప్పవచ్చును. పింగళి సూరన రాఘవపాండవీయము రచనాకాలమునాటికి అందలి దేవతాస్తుతినిబట్టి శుద్ధాద్వైతియని, కళాపూర్ణోదయమునుబట్టి విశిష్టాద్వైతియని, ప్రభావతీప్రద్యుమ్నమునుబట్టి అద్వైతియని చెప్పవచ్చును.

వెన్నెలకంటి సూరన, అప్పకవి, చెంగల్వ కాళకవి మున్నగువారు విష్ణుస్తుతితో కావ్యారంభము కావించియున్నారు. అప్పకవి విష్ణు వస్తుభూపవాహనాదులను, పరిజనవ్రాతమును, భాగవతులను కృత్యాదిని పేర్కొని స్తుతించినాడు. బ్రహ్మాదిదేవతలనుగూడ అప్పకవి స్తుతించినాడు.

ఇష్టదేవతాస్తుతిని కవులు తమ అభిమతానుసారముగనే గాక కృతిపతుల అభీష్టము ననుసరించికూడ చేయుచుండుట కలదు. నందిమల్లయ, ఘంటసింగనలు ప్రబోధచంద్రోదయమును తత్కృతిపతి చెందలూరి గంగయామాత్యుడు శైవుడగుటచే శివస్తుతితో ప్రారంభించినారు. ఈ కవులు వరాహపురాణము కృత్యారంభమున వరాహావతారస్తుతిని గావించినారు. వరాహపురాణమును కృతిగొన్న ఈశ్వర నృసింహదేవరాయలు వైష్ణవుడు. మైరావణచరిత్ర కర్తయగు మాడయ్యకవి 'సర్వజ్ఞపాదసేవకుడు', 'భీమేశ్వరస్వామి యారాధకుడు'. తత్కృతిపతియగు అబ్బయ గోపనామాత్యుడు వైష్ణవసంప్రదాయమునకు చెందిన రామానుజమతావలంబి యగుటచే అతని అభీష్టము ప్రకారము మాడయ్యకవి రఘునాథస్వామి స్తుతితో కావ్యారంభము చేసినాడు. పిదప, శివుని, బ్రహ్మను, లక్ష్మి, భవానీ,

వాణీ, గజాననులను స్తుతించినాడు. తెనాలి అన్నయ, ముక్కుతిమ్మన మొదలగు వారు శైవులయినను తమ కావ్యములను కృతిగొన్నవారు వైష్ణవులగుటచే వారి అభిమతానుసారము విష్ణుస్తుతితోనే కావ్యారంభము చేసినారు. కృతిపతి ఇష్టప్రకారము ఇష్టదేవతాస్తుతి నాచరించుట కన్నడ కవులలో కలదు. పంపకవి జైన మతాభిమాని యైనను విక్రమార్జున విజయమున తనప్రభువగు అరికేసరి వైదికమత పక్షపాతము కలవాడగుటచే అందు పంచాయతనదైవములను మన్మథుని, సరస్వతిని స్తుతించియున్నాడు. ఆదిపురాణమున మాత్రము పంపకవి పంచాయతన దైవతముల ప్రశంస చేయలేదు. అందు జైనమత సంప్రదాయానుకూలముగా అర్హత్సిద్ధ, ఉపాధ్యాయ, ఆచార్య, సాధు, యక్షి, సరస్వతుల ప్రశంస కలదు. పంపకవి సరస్వతిని మాత్రము జైన వైదిక మతములకు రెండింటికిని సామాన్యమగు దేవతగా గ్రహించినట్లు తోచును.

ఇష్టదేవతాస్తుతిలో కవులు క్షేత్రదైవములనుకూడ చేర్చి స్తుతించుట కలదు. శ్రీనాథుడు భీమేశ్వరపురాణమును కథానాయకుడగు భీమయ దేవస్తుతితో ప్రారంభించినాడు. హరవిలాసమున కంచి శ్రీ వరదరాజ, కంచిపురీశ్వర, కామాక్షమ కృత్యారంభమున స్తుతింపబడినారు. కాశీవిశ్వనాథ, డుంఠి, విఘ్నేశ, లోలార్క, కేశవ, కాలభైరవ, గంగ, విశాలాక్షులు కాశీఖండ కృత్యారంభమున స్తుతింపబడినారు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శృంగారశాకుంతలమున బిట్రగుంటభైరవస్వామిని, జక్కన విక్రమార్కచరిత్రమున బెల్లముకొండ భైరవుని, పింగళి సూరన రాఘవపాండవీయమున విరూపాక్షమహేశ్వరుని, కందుకూరి రుద్రయ నిరంకుశోపాఖ్యానమున కందుకూరి సోమేశ్వరస్వామిని, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యమున కాళహస్తిలో వెలసిన దైవతములను కృత్యారంభమున పేర్కొని స్తుతించినారు.

ఆయా క్షేత్రములందు వెలసిన వైష్ణవదైవతములనుకూడ కొందరు కవులు కృత్యారంభమున స్తుతించియున్నారు. అహోబలనృసింహుడు ఎఱ్ఱన నృసింహపురాణము, అనంతామాత్యుని భోజరాజీయములందును, మంగళాచల నృసింహుడు కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధచరిత్ర, కవిరాజ మనోరంజనములందును, చెదలువాడ రఘువేశ్వరుడు వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమందును, దత్తాత్రేయ స్వరూపుడగు హరి తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రమందును కృత్యారంభపద్యములందు స్తుతింపబడినారు.

ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, రాజవాహన విజయము-ఇత్యాదులందు వేంకటేశ్వర స్తుతి, కవికర్ణరసాయనము, పాంచాలీపరిణయము మున్నగు కావ్యములందు శ్రీ రంగేశ స్తుతి కావింపబడినవి. మొల్లరామాయణము, బహుళాశ్వచరిత్ర, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, వాల్మీకిచరిత్ర, సత్యభామా సాంత్వనము, శుకసప్తతి-ఇత్యాదులందు కావ్యారంభమున శ్రీరామభక్తి ప్రస్ఫుటముగా గోచరించును. రామరాజభూషణుడు తొలుత వేంకటేశ్వరు నిష్ట దైవముగ నారాధించుచుండినట్లు కావ్యాలంకారసంగ్రహమునుబట్టి తెలియును. క్రమముగా అతడు ఆంజనేయుని సేవించినాడు. ఈ ఆంజనేయ భక్తి తరువాత రామోపాసనగా మారినది. హరిశ్చంద్రనలోపాఖ్యానావతారిక అతని రామభక్తికి మణిదర్పణమువంటిది. ఇందు ఇతర దేవతాస్తుతులను మాని రామపంచాయతనమును స్తుతించినాడు. అందలి సుకవిస్తుతియు రామభక్తి వర్ణనారూపముగనే యున్నది. కాకమాని మూర్తికవికూడ శ్రీరామభక్తుడే. అతడు పాంచాలీపరిణయమున కృత్యాదిలో శ్రీరాముని ధ్యానించు శివుని ఈ క్రింది పద్యమున స్తుతించినాడు— చూడుడు :

"తన కోదండము ద్రుంచెగా తన దొనన్ ఘట్టించి కట్టించెగా
తన చేతన్ వరమందు వాని శిరముల్ ఖండించెగా యిమ్మహీ
తన యేలుండన గా రఘూత్తము గుణస్తోత్త్రంబు గావించు భ
ర్గుని నిర్మత్సరు భక్తవత్సలుని బేర్కొందు నెల్లగా నేర్పునన్"

—పాంచాలీపరిణయము (1-2)

వీనినిబట్టి ఆయాకవుల రామభక్తి ప్రస్ఫుటమగుచున్నది.

కృష్ణభక్తిగలకవులును తెలుగునందు కలరు. భైరవరాజు వేంకటనాథుని పంచతంత్రము, మొల్లరామాయణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, రాధికాసాంత్వనము, కుచేలోపాఖ్యానము మున్నగుకావ్యములందు కృత్యాదిని కృష్ణస్తుతి కలదు. కుచేలోపాఖ్యానమున అయిదు పద్యములలో శ్రీకృష్ణుడు స్తుతింపబడినాడు. వీనివలన ఆయాకవుల కృష్ణభక్తి వ్యక్తమగుచున్నది.

పై పరిశీలనమువలన తెలుగులో శివస్తుతితో ప్రారంభమగు కావ్యములకంటె విష్ణుస్తుతితో ప్రారంభమగు కావ్యములు హెచ్చుఅని, వానికంటె అద్వైతపరములగు కావ్యములు అధికమని తెలిసికొనవచ్చును.

గ్రంథనిర్విఘ్న పరిసమాప్తికి విఘ్నేశ్వరుని, వాక్ఫలాప్తికి, వాక్శుద్ధికి సరస్వతిని స్తుతించుట తెలుగుకావ్యములందు సర్వసాధారణముగా కన్పట్టును. పోతన భాగవతారంభమున నాల్గుపద్యములలోను, కందుకూరి రుద్రకవి నిరంకుశో పాఖ్యానమున రెండుపద్యములలోను సరస్వతిని స్తుతించినారు. కావ్యము మధ్యలో కొందఱు కవులు అవకాశమును కల్పించుకొని సరస్వతీస్తవము చేయుటకలదు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషములో 'సరస్వతీగీత' అనుఘట్టమున తార్క్ష్యుడు అను ముని 'భారతి' ని ఇట్లు స్తుతించినట్లు తెల్పినాడు.

> "అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికా
> డంబర చారుమూర్తి ప్రకట స్ఫుట భూషణ రత్నదీపికా
> చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తివివిక్త నిజప్రభావ భా
> వాంబరవీథి విశ్రుతవిహారి ననుం గృపఁ జూడుభారతీ"
>
> —అరణ్యపర్వము (4 - 216)

ఇది అమూలకము. మూలభారతమున తార్క్ష్యుడు వాగ్దేవతను స్తుతించినట్లు లేదు.

## 3. అన్యదేవతాస్తుతి:

కావ్య సాధారణలక్షణోపస్థాపనాభిప్రాయమున ఇతరోచిత దేవతలనుకూడ స్తుతించుట తెలుగుకావ్యారంభములందు కాననగును.

### కుమారస్వామి స్తుతి:

కన్నడకవుల కావ్యావతారికలందు కుమారస్వామిస్తుతి కానరాదు. కుమార స్వామి, మాతృకలు తూర్పుచాళుక్యుల కులదైవతములను ప్రసిద్ధికలదు. ఆ కారణముచే నన్నయ వారిని భారతావతారికలో పేర్కొని స్తుతించియుండును. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో కొమరస్వామికి గుడికోపురము నెత్తించుట జాతరజరుపుట మొదలగునవి పేర్కొనబడినవి. కుమారస్వామి నారాధించుట తెలుగుదేశములో ఇక్ష్వాకులకాలమునుండి వచ్చుచున్నదని ఆరుద్రగారు ఇట్లు వ్రాసి నారు. "నాగార్జునకొండదగ్గరి విజయపురిలో కార్తికేయవిగ్రహాలు దొరికాయి. చాళుక్యుల ఇలవేల్పు స్వామి మహాసేనుడు, అంటే కార్తికేయుడు. అసలు చాళు క్యుల 'తొలికర్మరంగం' విజయపురే అని అక్కడి శాసనాలవల్ల తెలుస్తున్నది.

పూర్వం కార్తికేయునికి ప్రత్యేకంగా గుడులుండంటే, అవి పావులూరి మల్లన కాలానికి శివాలయంలో వినాయకుడు, నంది, పార్వతి మొదలైన దేవతలతోపాటు కుమారస్వామికికూడ ఒకవిగ్రహం ఉండేస్థితికి వచ్చాయి. రానురాను అదికూడ తగ్గిపోయింది. మొదటి యుద్ధమల్లుడికాలంలోనే ఒకఊరినుంచి ఇంకొకఊరికి దేవుణ్ణి జాతరచేసి తీసుకొనివెళ్ళడం ఆనేఆచారంచూస్తే జనసామాన్యంకూడా రాజుల ఇలవేల్పును ఆరాధించడం జరిగేదని తెలుస్తున్నది.''[1]

నన్నెచోడుని కుమారసంభవమున కుమారస్వామి ఒక ప్రత్యేకపద్యములో స్తుతింపబడినాడు. నన్నెచోడునికి తరువాతి కవులెవ్వరును కుమారస్వామిని స్తుతింపలేదని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఇట్లువ్రాసినారు. ''తరువాతి కవుల యవతారికలలోఁ ద్రిమూర్తులయు తత్కాంతలయు గజాననునియు స్తుతులే కాని యర్కషడాననుల స్తోత్రములుండవు. ఒక్కచేమకూర వేంకటకవిమాత్రము తాను సూర్యవరప్రసాదియగుటచే సూర్యునిస్తోత్రమును బ్రత్యేకముగాఁ గావించెను.[2] కాని అర్కషడాననులను తరువాతి కవులుకూడ స్తుతించియున్నట్లు ఆంధ్ర కావ్యావతారికలను పరిశీలించిన వ్యక్తమగుచున్నది. కేతన దశకుమార చరిత్రము, జక్కన విక్రమార్కచరిత్రము, కొరవిగోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అప్ప కవీయము మొదలగుకావ్యములందలి అవతారికలలో కుమారస్వామిని ప్రత్యేకముగా ఒకపద్యములో స్తుతించుట జరిగెను. మంచిసకేయూరబాహుచరిత్రము, పోతన భాగవతము ఇత్యాదులందు దేవతాస్తుతిలో కుమారస్వామి స్మరణము కూడ ఉన్నది.

లోకబాంధవుడగు సూర్యుడు నన్నయ,నన్నెచోడుల కావ్యావతారికలందే గాక పోతనభాగవతము, కొరవిగోపరాజు సింహాసన ద్వాత్రింశిక - ఇత్యాదులందుకూడ ప్రత్యేకముగా స్తుతింపబడినాడు. మనకు తెలిసినంతవరకు చంద్రుని ప్రత్యేకముగా పేర్కొని స్తుతించిన మొదటికవి ముక్కుతిమ్మన. అతడు పారిజాతాపహరణము లోని కృత్యాది దేవతాస్తుతిలో చంద్రుని ఇట్లు స్తుతించినాడు.

''వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి వే
ల్పులగమి జీవగఱ్ఱ యుడిపోవని చల్వలటెంక, వెన్నెల

1. సమగ్రాంధ్ర సాహిత్యము 1. పుట 85.

2. ఆంధ్రవాఙ్మయారంభదశ — ద్వితీయసంపుటము — నన్నయభారతము — పుట — 690-691.

ల్మోలచిన పాదు పాల్కడలి ముద్దులపట్టి నృసింహ కృష్ణరా
యలఁ గరుణారసంబు నినుపారెడి చూపులఁ జూచుఁ గావుతన్"
—పారిజాతాపహరణము (1 - 6)

ముక్కుతిమ్మన తన పారిజాతాపహరణమునకు కృతిపతియగు కృష్ణదేవరాయలను చంద్రవంశమువాడని చెప్పినాడు. కృతిపతికి వంశకర్తయైన కారణమున కాబోలు చంద్రుని కృత్యారంభదేవతాస్తుతిలో ప్రత్యేకముగా తిమ్మన పేర్కొనినాడు. చంద్ర వంశపురాజులకు కృతియిచ్చిన కవులు పలువురున్నారు. కాని వారెవ్వరును కృత్యాదిని చంద్రుని ఇష్టదైవముగా కొనియాడినట్లులేదు.

మంచనకేయూరబాహుచరిత్ర, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము, అప్పకవీయము, తరిగొండవేంకమాంబ వేంకటాచలమాహాత్మ్య వాసిష్ఠరామాయణములు, పిండిప్రోలులక్ష్మణకవి లంకావిజయము, కూచిమంచితిమ్మకవి రాజశేఖరవిలాసము-ఇత్యాదులందు కృత్యాదిదేవతాస్తుతిలో నవగ్రహస్తుతికలదు. నవగ్రహములను పేర్కొని స్తుతించుసందర్భమున ఈ కవులు సూర్యచంద్రులనుకూడ పేర్కొని యున్నారు.

కన్నడకవులు మన్మథుని దేవతాగణములలోచేర్చి స్తుతించినారు. సంస్కృతములో త్రివిక్రమభట్టు (క్రీ. శ. 10 శతాబ్ది ప్రారంభము) వ్రాసిన నల చంపూగ్రంథమునందు కందర్పదేవుని స్తుతికలదు. ఈ శ్లోకమును చూడుడు:

"జయతి మధుసహాయః సర్వసంసారవల్లీ
జనన జనిత కందః కోఽపి కందర్పదేవః
తదను పున రపాంగోత్సంగ సంచారితానాం
జయతి తరుణ యోషిల్లోచనానాం విలాసః"

సంస్కృతమున అతిప్రౌఢములగు శ్లేషరచనలతో గూడిన నలచంపూకావ్యము ఆ కాలమునందలి కన్నడకవులనేగాక తరువాతికాలమున నన్నెచోడునివంటి తెలుగు కవులనుగూడ నాకర్షించినది. మన్మథస్తుతి గౌడవహావంటి ప్రాకృతకావ్యము లందును కలదు. కృత్యాది దేవతాప్రశంసలో మన్మథునికూడచేర్చిన మొదటి తెలుగుకవి నన్నెచోడుడు. లోక వశీకరణమునకయి నన్నెచోడుడు తనకుమార సంభవమున మన్మథస్తుతి చేసినాడు. కేతన దశకుమారచరిత్రము, చిమ్మపూడి అమ

రేశ్వరుని విక్రమసేనము, నారనసూరన ఉదయనోదయము - ఇత్యాదులందు దేవతా స్తుతిలో మన్మథస్తుతికూడ కలదు.

అప్పకవీయమునందలి కృత్యాదిదేవతాస్తుతిలో అష్టదిక్పాలకులు స్తుతింపబడినారు. మడికిసింగన వాసిష్ఠరామాయణములో ఆదిశక్తి ప్రత్యేకముగా స్తుతింపబడినది. తరిగొండ వేంకమాంబ వేంకటాచలమాహాత్మ్య, వాసిష్ఠరామాయణములందు మాతృకాశక్తులను పేర్కొని స్తుతించినది. వేంకమాంబ నందవరచౌడమాంబను కూడ ప్రత్యేకముగా స్తుతించినది.

విజయ విలాసములోని కృత్యాది దేవతాస్తుతిలో చేమకూర వేంకటకవి గంగను ఇట్లు స్తుతించినాడు :-

"ప్రకట శ్రీహరి యంఘ్రిఁ బుట్టి హరు మూర్ధంబెక్కి యాపాద మ
స్తకమున్ వర్ణన కెక్కు దేవి సహజోదంచత్కులోత్పన్న నా
యక రత్నంబని యచ్యుతేంద్ర రఘునాథాధీశ్వర స్వామికిన్
సకలైశ్వర్యములు న్నిజేశు వలనన్ దాఁగల్గఁగాఁ జేయుతన్"

—విజయవిలాసము (1 - 8)

హరియంఘ్రిని బుట్టినగంగను ప్రత్యేకముగా పేర్కొని స్తుతించుటవలన కవి శూద్రుడని ఊహింపవచ్చును.

ఇట్లు ఆంధ్రకవుల, కృతిపతుల శైవవైష్ణవాదిమత భావరీతులెరుంగుటకు కృత్యాది దేవతాస్తుతి కొంతవరకు తోడ్పడుచున్నదని పై పరిశీలనమువలన వ్యక్తమగును. కృత్యాదిని దేవతాస్తుతి తరువాతి అంశము గురుస్తుతి - పితృప్రశంస. వీనినిగూర్చి ముందుప్రకరణమున చర్చింతము.

# 4

# గురుస్తుతి - పితృప్రశంస

తెలుగు కావ్యావతారికలలో దేవతాస్తుతివలె గురుస్తుతి నియతముకాదు. తమ జీవితమున కాదర్శప్రాయులైయుండి మహత్త్వము చేకూర్చిన గురువులను పవిత్రులుగా భావించి ఆరాధించుట తెలుగు కవులలో పలువురు పాటించిన సంప్రదాయము.

> "గురుః బ్రహ్మా గురు ర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
> గురుః సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః."

అని గురువందనముచేయుట భారతీయ సంప్రదాయము.

నన్నెచోడుని కుమారసంభవము, దూబగుంట నారాయణకవి పంచతంత్రము, సారంగు తమ్మయ వైజంతీవిలాసము, ప్రౌఢకవి మల్లన రుక్మాంగద, అత్తనూరి పాపకవి చెన్నబసవపురాణము ఇత్యాది కృతులందు దేవతాస్తుతి అయిన వెంటనే గురుస్తుతి చేయబడినది. ఎఱ్ఱన హరివంశ, నృసింహపురాణములు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలము, అల్లసాని పెద్దన మనుచరిత్ర, సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనము, చదలువాడ మల్లన విప్రనారాయణచరిత్ర మొదలగువానియందు గురుస్తుతి కృత్యాదియందేగాక ఆశ్వాసాంత గద్యలందును గావింపబడినది. దీనినిబట్టి ఆయాకవుల గురుభక్తి విదితమగుచున్నది. దేవతాస్తుతి, కవిస్తుతి గావించి తరువాత గురుస్తుతి చేసిన కవులలో ముఖ్యులు—భోజరాజీయ కర్తయగు అనంతామాత్యుడు, పంచతంత్రకర్తయగు బైచరాజు వేంకటనాథుడు,

పాండురంగమాహాత్మ్యమును రచించిన తెనాలి రామకృష్ణకవి, రామాభ్యుదయకర్త యగు అయ్యలరాజు రామభద్రుడు, లంకావిజయమును రచించిన పిండిప్రోలు లక్ష్మణకవి, నీలాసుందరీపరిణయకర్తయగు కూచిమంచి తిమ్మకవి అనువారు, నంది మల్లయ, ఘంట సింగనలు తమ వరాహపురాణమున ఇష్టదేవతాస్తుతివి, కవిత్వాశయములను, తమ వంశాదికమును చెప్పి పిమ్మట కవిస్తుతిచేసి అటు తరువాత గురుస్తుతి గావించినారు. ముక్కు తిమ్మన పారిజాతాపహరణ గ్రంథాంతమున తన వంశాదికమును పేర్కొను సందర్భమున గురుస్మరణము చేసినాడు. జైమినిభారతము, రాజశేఖరచరిత్రము, ఉద్భటారాధ్యచరిత్ర - ఇత్యాదులందు ఆశ్వాసాంత గద్యలందు మాత్రమే గురుస్మరణము గావింపబడినది. పాల్కురికి సోమనాథుడు ముగ్గురు గురువులను, అప్పకవి ఆరుగురిని పేర్కొనియున్నారు.

తెలుగు కవులు తమ తమ కావ్యావతారికలలో స్తుతించిన గురువులు శైవాచార్యులో, వైష్ణవాచార్యులో అగుటచే వారినిగూర్చిన చారిత్రకాది విషయములు తెలిసికొనుట కష్టతరము. కాని ఆయా గురువులు అపారమహిమాన్వితులగు యోగీశ్వరులవంటివారని కొందరు కవులు వర్ణించుటనుబట్టియు, నానాశాస్త్ర నిష్ణాతులైనట్లు వారిని పేర్కొనుటనుబట్టియు ఆయా కవుల మతసంప్రదాయములను, విద్యావైదుష్యములను, కవికాలమునాటి మతపరిస్థితులు మున్నగువానిని కొంతవరకు తెలిసికొనవచ్చును.

తెలుగు కవులు తమ గ్రంథావతారికలలో పేర్కొని స్తుతించిన గురువులను ఈ క్రింది విధముగ వర్గీకరించి పరిశీలింపవచ్చును.

## 1. మతాచార్యులు :

రాజులు మతప్రవర్తకులగు శైవ వైష్ణవాచార్యుల కాదరప్రోత్సాహముల నిచ్చి పోషించుచుండిరి. కనుక వారి సామంతులు, మండలాధిపతులుకూడ ఆయా మతముల నవలంబించుచుండిరి. ఈ మతాచార్యులు ప్రజలలో మంచి పలుకుబడి కల్గి వారి గౌరవాదరములకు పాత్రులైరి. ఈ మతాచార్యుల పీఠములు విద్యా పీఠములై ఆయా మతానుయాయులకు విద్యాప్రదానము గావించినవి. శైవ వైష్ణవాచార్యులు తెలుగును అభిమానించి తెలుగున కృతులు రచించుటకు ప్రోత్సాహమిచ్చినారు. మతదీక్ష మాత్రమే గాక సారస్వతదీక్షకు కూడ కారణభూతులైన ఈ మతాచార్యు లెంతేవి అభినందనీయులు.

కృత్యాదిని గురుస్తుతిచేసినవారిలో మొట్టమొదటివాడు నన్నెచోడుడు. అతడు కుమారసంభవమున తన గురువగు జంగమ మల్లికార్జునుని నాల్గు పద్యములలో పలురీతుల స్తుతించి ''సమస్తదేవతాస్వరూపంబైన మదీయ గురుచరణారవిందము లభినందించి'' అని ప్రశంసించినాడు. నన్నెచోడునికి విద్యాగురుడు, ఆధ్యాత్మికగురుడు, సత్ప్రభుడు, కూర్చు నిజేశుడు సమస్తము జంగమ మల్లికార్జునుడే. అతని భావమున గురువగు జంగమ మల్లికార్జునుడు ఈశ్వరుడు నొకరే. వారిరువురికిని అభేదమును పాటించియే అతడు కుమారసంభవమును రచించినాడు.

జంగమ మల్లికార్జునుడు 'అమితాగమవిశారదుడు' (6-168), 'ఆగమచర్యాచార్యుండు' (10-201), 'శివాగమవేది' (11-20) ఇత్యాదిగ కుమారసంభవమున పలుచోట్ల పేర్కొనబడినాడు. ఆగమసంప్రదాయములను పేర్కొనిన నన్నెచోడుడుకూడ శైవసంప్రదాయమునకు చెందినవాడని తలపవచ్చును. కథలోని పార్వతికికూడ తనగురువుచే 'శైవాగమదీక్ష' నిప్పించినాడు నన్నెచోడుడు (6-81).

నన్నెచోడుడు తనగురువును ''భూసురవంశాద్యుడు'', ''భూసురకులాగ్రణి'' అని పలుమారులు పేర్కొనుటవలన అతని బ్రాహ్మణాభిమానము సువ్యక్తమగుచున్నది. అతడు తన గురువుపేర బ్రాహ్మణుల కగ్రహారముల దానముచేసినట్లు తెలియుచున్నది (1-46). వీరశైవులు బ్రాహ్మణాధిక్యము నంగీకరింపరు కావున పైని పేర్కొనినవానినిబట్టి నన్నెచోడుడు వీరశైవుడు కాడనుట స్పష్టము.

జంగమ మల్లికార్జునుడు మల్లికార్జునపండితారాధ్యుడు ఒకటే అని నిడుదవోలు వేంకటరావుగారు ఇట్లు వ్రాసినారు: ''కుమారసంభవ కృతిపతి మల్లికార్జునశివయోగియై పాశుపతశైవము నంగీకరించి తన్మతవ్యాపనకై బ్రహ్మచర్యమును వీడి గృహస్థాశ్రమమును ప్రవేశించి, సవైదికమగు నారాధ్యశైవ సంప్రదాయమును నెలకొల్పి, మల్లికార్జునపండితుఁడై పండితత్రయములో తృతీయుఁడై విలసిల్లెను''.[1] కాని నన్నెచోడుడు తనగురువు విషయమున చెప్పిన మాటలకు పండితారాధ్యు డెంతమాత్రము కుదరడు. కనుక నన్నెచోడుని గురువగు జంగమ మల్లికార్జునుడు సమకాలిక శైవాచార్యుడనియే నిశ్చయింపవచ్చును.

---

1. కుమారసంభవము - పీఠిక. పుట 17. వావిళ్లప్రతి 1953.

జంగమ మల్లికార్జునుడు వాదీంద్రుని వాదమున నోడించినట్లు "పరవాదీంద్ర ఘనాఘనానిలు"[1] అను మాటలనుబట్టి తెలియుచున్నది. కవిజనాశ్రయకర్తయగు మల్లియ రేచన వాదీంద్రుని శిష్యుడు. అతడు ఆశ్వాసాంతగద్యలో "ఇది శ్రీ వాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజానాశ్రయంబు" అని తెల్పినాడు. కనుక రేచన నన్నెచోడుల గురువులు ఒకేకాలమువారను అంశమునుబట్టి వా రిరువురును ఇంచుమించు సమకాలికులని నిర్ణయింపవచ్చును.

వీరశైవమున గురులింగజంగముల కథేనము చెప్పబడినది. "గురులింగ హస్త తనూజాతుఁడ" నని పాల్కురికి సోమనాథుడు తన గ్రంథములలో చెప్పి కొన్నాడు. గురులింగ మనునది దీక్షాగురువున కాతడు ప్రయోగించిన విశేషణమని శ్రీ బండారు తమ్మయ్యగారు తెల్పియున్నారు. "గురువు దీక్షయొసంగునప్పుడు హస్తమస్తక సంయోగమొనర్చి భౌతికశరీరమును లింగశరీరముగ మార్చునంతనే తమకు వేరొక జన్మము కలుగుననియుఁ గావున గురుఁడే జనకుఁడనియు, నాతని హస్తాంబుజమే తమకు జన్మభూమి యనియుఁ దలంచుట వీరశైవుల మతసంప్రదాయము." పాల్కురికి సోమనాథాది వీరశైవ కవులు కొందరు తమ తలిదండ్రులనుగూర్చి స్పష్టముగా తెలుపకపోవుటకు కారణ మిదియే కావచ్చును. "గురువు వలన శివమంత్రోపదేశమును బొంది యా మంత్రమును జపించుచు గురుపాద తీర్థమును దన యన్న పానీయములతో మిశ్రితమొనర్చి చేదా సంధి ముద్రాంకితుఁడై గురుపాద చిహ్నితమైన యిసుకతో స్వయముగ వాలుకా లింగమును నిర్మించు కొని పూజించుచుఁ దత్తీర్థ నిర్మాల్యములను గుర్వాజ్ఞతో సేవించుట పూర్వశైవ లక్షణము."[2] దీనినిబట్టి వీరశైవులలో గురువున కెంతటి ప్రాధాన్యమున్నదో విస్పష్టమగును.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవి వేమనారాధ్యుడను పరమారాధ్యదేవు మనుమని శిష్యుండ మద్గురు లింగ ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ" నని పేర్కొనినాడు. ఈ బెలిదేవి వేమ నారాధ్యుని మనుమడెవ్వరో సోమనాథుడు తెలుపలేదు. అనుభవసారమునగాని, బసవపురాణమునగాని సోమనాథు డితనిని పేర్కొనలేదు. గురులింగమే బెలిదేవి

1. కుమారసంభవము, 8 ఆశ్వా. పుట 197.

2. బసవపురాణము—పీఠిక పుట 6. బండారు తమ్మయ్య-వావిళ్ల ప్రతి (1952).

వేమనారాధ్యుని మనుమడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయపడిరి. సోమనాథు డితనియొద్ద శైవశాస్త్రాదులను చదివియుండును. సోమనాథు ననుసరించి తరువాతి వీరశైవులగు కవులు కొందరు తమ దీక్షాగురువులను పేర్కొని స్తుతించినారు. 'మఱి బసవపురాణ' కర్తయగు బిచ్చు సిద్ధకవి (17 వ శతాబ్ది) సిరిపురి వీరసింగయ్యను తన దీక్షాగురువుగా పేర్కొని స్తుతించినాడు.

నియోగులు ఆరాధ్యశైవులనో, ఆచార్య వైష్ణవులనో గురువులుగ ఆశ్రయించుట పరిపాటి. "వైష్ణవాచార్యు లనేకులు తెలుగు దేశములలో పర్యటనము చేసి వేరు వేరు సంస్థానములకు వెళ్లి అక్కడి పండితులతో శాస్త్రవాదముచేసి వారిని జయించి ముందు మహారాజులకు మతమిచ్చి, తరువాత వారి సామంతులను వశపరచుకొని తమ మతమును వ్యాపింపజేసిరి. వేదాంత దేశికుల వారి శిష్యులును, కుమారులును అయిన శైవాచార్యులను నామాంతరము గల వరదాచార్యులు తెలంగాణాలోని రాచకొండ సంస్థానమునకు వెళ్లి రేచెర్ల మాధవనాయక తనూజుడైన సర్వజ్ఞ సింగమ నాయనికి మతమిచ్చినారు...ఇట్లే ఈ కాలములోని ఇతరాంధ్ర దేశములోగూడ భట్టరువారు, కందాడవారు, తిరుమలవారు, నల్లాని చక్రవర్తుల వారు, మొదలైన సుప్రసిద్ధ వైష్ణవ వంశములవారు పర్యటనముచేసి వైష్ణవ మత వ్యాపనమునకు పూనుకొనిరి."[1] అనంతామాత్యుడు తిరుమల నల్లాన్ గోవింద చక్రవర్తులచే సమాశ్రయణముపొంది విష్ణుభక్తుడై అహోబిల నృసింహదేవుని భజించెను. నల్లాన్ గోవింద చక్రవర్తులనే గాక అతని అగ్రజులను తిర్వేంగళ చక్రవర్తిని, అళగరి చక్రవర్తిని, ఔబళ చక్రవర్తిని, శ్రీ దేవ చక్రవర్తులను కూడ అనంతామాత్యుడు తన భోజరాజీయావతారికలో స్మరించినాడు. నందవరీక బ్రాహ్మణుడగు అల్లసాని పెద్దన పిదప శఠకోపయతి ఉపదేశమున వైష్ణవమతమును స్వీకరించి వైష్ణవుడైనట్లు తెలియుచున్నది. తెనాలి రామలింగకవి గురువు పాలగుమ్మి యేలేశ్వరుడని ఉద్భటారాధ్యచరిత్రమున నున్నది. పాండురంగ మాహాత్మ్యమున భట్టరు చిక్కాచార్యుని తన గురువుగా రామకృష్ణకవి స్తుతించినాడు. ఈ భేదము మతము మారుటచే నేర్పడి యుండును.

---

1. తెలుగుభాషాసమితి— విజ్ఞానసర్వస్వము, 3 వ సంపుటి; మతసంప్రదాయములు- పుట 585.

## 2. వంశాచార్యులు :

తెలుగులో కొందరు కవులు తమ తమ వంశాచార్యులను తమ గ్రంథావతారికలలో పేర్కొని భక్తితో స్మరించుట కలదు. నేడును కొన్ని వంశములలో మతాచార్యులున్నట్లు తెలియుచున్నది.

భారత కవిత్రయములో నన్నయ తిక్కనలకంటె ఎఱ్ఱనలోని విశేషము గురుస్తుతిచేయుట. నన్నయ తిక్కనలు తమ్ముగూర్చి చెప్పుకొన్నప్పుడు గురుప్రస్తావనచేయలేదు. ఎఱ్ఱన తన గురువగు శంకరస్వామిని తన కృతులలో ఎంతో భక్తిపూర్వకముగా ప్రశంసించినాడు.

ఎఱ్ఱన తన గురువునుగూర్చి 'మునీంద్రుడు'. 'సంయమీశ్వరుడు'. 'శివార్చనావ్రతుడు'. 'భక్తవత్సలుడు' అని చెప్పెనేగాని తక్కిన వివరములేమియు తెలుపలేదు. దీనినిబట్టి శంకరస్వామి మహాశివయోగి యని స్పష్టమగును. ఎఱ్ఱన గురువగు శంకరస్వామి ఎఱ్ఱన వెనుక ఆతని వంశీయులకెల్ల దేశికుడైనట్లుగా ఎఱ్ఱన వంశీయుడగు చదలువాడ మల్లన తన విప్రనారాయణచరిత్రమునందిట్లు తెల్పియున్నాడు :

"భక్తకోటికి ముంగొంగు భాతి యగుచు
గరిమఁ బురుషార్థ సిద్ధంబు గలుగఁజేయు
మామకాన్వయ దేశిక స్వామియైన
శంకరస్వామి సంయమీశ్వరు భజింతు" (1—18)

అంతేగాక మల్లన ఆశ్వాసాంత గద్యలందును ఎఱ్ఱనవలె శంకరగురుప్రశంస చేసియున్నాడు. ఎఱ్ఱన తాత ఎఱపోత సూరి 'కంసారిచరణ కమల మధుకరపతి', తాత విష్ణుభక్తుడైనను మనుమడు శివభక్తుడైనాడు. దానికి కారణము ఎఱ్ఱన గురువు శంకరస్వామి. శంకరస్వామి ప్రతిదినము ఎనిమిదియామములను నియమముగా శివార్చనము చేయువాడు. నిత్య శివరాత్రి వ్రతము నిర్వహించువాడు. అతడు అంత శివభక్తుడు కనుక శిష్యుడు అంతకంటెను ఎక్కువగా 'శంభుదాసు' అను 'లక్షణాభిధేయము' పొందినాడు. ఎఱ్ఱన తండ్రి సూరనకూడ శివభాగవతుడు. 'ఆరాధ్య సర్వజ్ఞుడు.'

ఎఱ్ఱన నృసింహ పురాణావతారికలో భారతీదేవిని వస్త్వానరూపమున అపూర్వముగా ఇట్లు స్తుతించినాడు :

"కరకమలంబునందుఁ బటికంపుఁ గమండలు వచ్ఛ కాంతి భా
సురమగు మౌక్తికంపు జపసూత్రము దాల్చుట, బ్రహ్మవాహియై
పరఁగిన హంసముం బిలిచి బాల మృణాళముఁ జూపు చందమా
పిఁ దిలకింప నొప్పు బుధ సేవిత మూర్తిఁ దలంతు భారతిన్"

—నృసింహపురాణము, పీ. 6

ఈ పద్యములోని భారతి అటు వాగ్దేవతకు ఇటు గురువునకు అన్వయించును. ఒకే క్రియతో రెండు కార్యములను సాధించినాడు ఎఱ్ఱన. ఇష్టదేవతా ముఖమున గురుస్తుతిని కావించినాడు. ఈ సందర్భమున నోరి నరసింహశాస్త్రిగారు ఎఱ్ఱనను గూర్చి చెప్పిన ఈ క్రింది మాటలు గమనింపదగినవి.[1]

"తండ్రికంటెను ఎఱ్ఱయ జీవితములో నాతనికి ఆదర్శప్రాయుడై యుండి మహత్త్వము చేకూర్చినది గురువు. 'శ్రీ శంకరస్వామి సంయమీశ్వర సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్యుడ'నని ఎఱ్ఱయ సగర్వముగా తన గద్యము లన్నిటిలో చెప్పుకొన్నాడు. శ్రీ నరసింహావతారములో నాతనిని 'ఎనిమిది యామములను నిత్యశివరాత్రివ్రతముగా శివార్చన మొనర్చు యోగామృతతృప్తుడు త్రిజగదర్చితుడు మునీంద్ర భక్తజనవత్సలుడు' అని నుతించినాడు. హరివంశావతారికలో "కామాదుల పొందు వాసి హృత్పద్మములో సదాశివునిగాంచుచు, తదేకచింతామణియై తుదిఁ దాకిన యున్నతి నున్నవాఁ" డనుచు ఈ శంకరస్వామి "తన తలఁపు సర్వము తానయి యుండుఁగావుత" మని ఆశించినాడు....శ్రీ విద్యారణ్యులు స్తోత్రము చేసిన శంకరానందగురుపాదు లీతడే కావచ్చును. కాకున్న సతీర్థ్యుడై యుండును. శృంగేరి మొదలగు మూలశంకరపీఠముల స్వాములందరు భారతీ సంప్రదాయపరులగుటచే ఎఱ్ఱయ గురువుకూడ భారతీయతియై యుండును. కర్ణాటక ప్రాంతములలో శ్రీ విద్యారణ్యులు చేసినట్టి ఉద్ధరణ కార్యమునే ఈ శంకర స్వామి శ్రీశైలభూమిలో చేసియుండు ననుటకు సందేహములేదు. శంభుదాసుడను లక్షణాభిధేయము ఎఱ్ఱయకీ గురువే ప్రసాదించియుండును."

ఎఱ్ఱన శంభుదాసుడైనను విష్ణు విద్వేషి కాడు. ప్రత్యేకించి విష్ణుభక్తుడు. ఈ క్రింది పద్యమునం దీవిషయము సువ్యక్తమగుచున్నది :

1. తెలుగు భాషా సమితి, విజ్ఞాన సర్వస్వము ; 3 వ సంపుటము పుట - 731.

"గిరిశ పద భక్తి రసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగాఁ
బరఁగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ కెందున్"

—నృసింహపురాణము పీ. 18.

ఎఱ్ఱన తన తాత కలలో కనబడి ప్రోత్సహించుటవలననే నృసింహపురాణమును రచించినాడు. ఎఱ్ఱన శంభుదాసుడైనను అతని తాత అనుభావ విశేషమే అతనియం దతిశయించి గోవిందకథామృతమును రచింపజేసినది. ఈ పరిశీలనము వలన ఎఱ్ఱన మతసమన్వయము సువ్యక్తమగుచున్నది.

నందిమల్లయ ఘంటసింగనలను జంటకవులు తమ కృత్యాద్యవతారికలలో గురుస్తుతి ఈ క్రిందివిధముగ చేసినారు :

"...సర్వేశు తోడి తాదాత్మ్య మహిమ
గలిగి పరిపూర్ణభావ విఖ్యాతులైన
దక్షిణామూర్తి దేశికోత్తము నఘోర
శివుల భజియించి యేకాగ్రచిత్తమునను"

—ప్రబోధ చంద్రోదయము. 1-32.

"నెలకొన్న భక్తి సద్గురు
కులచూడారత్నమగు నఘోర శివాచా
ర్యుల దివ్యపాద పద్మం
బులకు నమస్కృతి ఘటించి పూతాత్ములమై"

—వరాహపురాణము. 1-19.

పై పద్యములనుబట్టి అఘోర శివాచార్యులు ఘంటసింగన కులాచార్యుడనుట స్పష్టము. ప్రబోధచంద్రోదయ కృతిపతియగు చెందలూరి గంగామాత్యుడుకూడ దక్షిణామూర్తి శివాఘోరశివాచార్యుల శిష్యుడే. "శ్రీమదఘోర శివాచార్యగురు కరుణా విశేష లబ్ధ సారస్వత" అని మాదయగారి మల్లన రాజశేఖరచరిత్ర ఆశ్వాసాంత గద్యమందు వ్రాసికొనిన దానినిబట్టి యా శివాచార్యు డతనికి విద్యా గురువనియు తెలియును. ముక్కు తిమ్మనకూడ అఘోర శివాచార్యులశిష్యుడననియే

తన పారిజాతాపహరణమున గ్రంథాంతమున తెల్పియున్నాడు. ఇట్లు మాదయగారి మల్లన, ముక్కుతిమ్మన, మలయమారుతాభిధానుడగు ఘంటసింగయ-వీరికి అఘోర శివాచార్యులు శైవదీక్షయేగాక సారస్వతదీక్షనుకూడ నొసంగి యుండును.

## 3. కవితా విద్యాగురువులు :

గురువు నాశ్రయించి ఆతని కటాక్షముచేత తన కావ్య నిర్మాణ శక్తి యితోధికమైనప్పుడు గురుస్మరణచేయుట సంభావ్యమే। గురువులలో పలువురు మతదీక్షతోపాటు సారస్వతదీక్ష నొసంగినవారుకూడ కలరు.

పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణావతారికలో "ఖ్యాత సద్భక్తిమైఁ గల కట్టకూరి పోతిదేవర పదాంబుజషట్పదుండ" నని చెప్పియున్నాడు. ఈ పోతి దేవర ఎవ్వరో తెలియదు. వీరశైవుడని తలంచుటకు తగిన విశేషణముల నీతని కుపయోగింపలేదు. కనుక ఇతడు సోమనాథున కక్షరోపదేశ మొనర్చిన గురువై యుండును.

పాల్కురికి సోమనాథుని కవితా గురువు కరస్థలము విశ్వనాథయ్య. అనుభవసారమున

"విమలచిత్పరిపూర్తి విశ్వేశ వరమూర్తి
వినయవర్తి భువన వినుత కీర్తి
విభు కరస్థలంబు విశ్వేశు కారుణ్య
జనిత విమల కావ్య శక్తియుతుఁడ"

నని సోమనాథుడు తెల్పియున్నాడు. బసవపురాణావతారిక గద్యలందును కరస్థలి విశ్వనాథుడు కవితా విద్యాగురువుగా పేర్కొనినాడు. పిడుపర్తి సోమనాథుడుకూడ పాల్కురికి సోమనాథుని విద్యాగురువు కరస్థలి విశ్వనాథుడని చెప్పియున్నాడు.

పినవీరభద్రుని గురువు భారతీతీర్థులు. "భారతీ తీర్థయతి సార్వభౌమగురు కృపాతిశయ లబ్ధ కవితా విభూతి గలిగి, గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత" అని శృంగారశాకుంతలము (1-22) లో చెప్పుటచే భారతీతీర్థు లతని కవితాగురువనియు తెలియును. ఈ భారతీతీర్థులు యతిసార్వభౌముడు, పరమ బ్రహ్మానుసంధాత. నానార్థాలంకృత బంధుర శ్రుతి రహస్య జ్ఞాతుడు; ముక్తికాంతుడు. భారతీతీర్థుల మంత్రోపదేశమువలననే పినవీరభద్రుడు, అతని అగ్రజుడగు పెద

వీరభద్రుడు జన్మించినారని పిల్లలమఱ్ఱి వంశస్థుడగు పెనుమళ్ల సోమనామాత్యుడు తన సీమంతినీ పరిణయముకో వ్రాసియున్నాడు. దీనినిబట్టి తన జన్మకు కారణమైన భారతీతీర్థులను పినవీరభద్రుడు తన కృతులందు భక్తిపూర్వకముగా స్మరించినాడని చెప్పవచ్చును.

పోతన వీరభద్ర విజయావతారికలో తన గురువగు ఇవ్వటూరి సోమనను స్తుతించినాడు. "పిన్నవాడవను వెరపుమానుము. నాప్రసాదమహిమచే నెంతయైన గవిత చెప్పగలవు" అని సోమగురువు పోతనతో చెప్పినట్లు వీరభద్రవిజయ కృత్యాద్యవతారికలో కలదు. పోతన తన గ్రంథమును సోమగురునికి వినిపించినట్లున్నది.

అల్లసాని పెద్దన పుట్టుకచేత అద్వైతి. అయినను విశిష్టాద్వైతమును చేపట్టినాడు. "ఆ రోజుల్లో విజయనగరంలో వైష్ణవానిదే పైచేయి. రాయలవారి వజ్రసింహాసనంకన్నా వారి గురువులైన తాతాచార్యులవారి ధర్మాసనమే సభలో ఒక బెత్తెడు ఎత్తుగా ఉండేది"[1] అని శ్రీ షట్టపర్తి నారాయణాచార్యులుగారు వ్రాసినారు. దీనినిబట్టి విజయనగర కాలమునాటి వైష్ణవమతగురువుల ప్రాబల్యము గోచరించును.

"కొలుతుఁ మద్గురు విద్యా
నిలయుఁ గరుణా కటాక్ష నిబిడ జ్యోత్స్నా
దళితాశ్రిత జన దురిత
చ్ఛల గాఢ ధ్వాంత సమితి శఠకోపయతిన్"

—మనుచరిత్ర. పీ. 6.

అని అల్లసాని పెద్దన తన గురువగు శఠకోపయతిని స్తుతించినాడు. "శఠకోప తాపసప్రసాద"మునసే తనకు కవిత్వ మబ్బినట్లు మనుచరిత్ర ఆశ్వాసాంతగద్యమందు పేర్కొనినాడు. తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యమున "కావ్యకళాకలాప మీదేరుటకు" తన గురువగు భట్టరు చిక్కాచార్యులను భక్తితో భజించినాడు. వైష్ణవములోని తెగలనుగూర్చి షట్టపర్తి నారాయణాచార్యులుగారు ఇట్లు తెల్పియున్నారు. "ఆ రోజుల్లో వైష్ణవంలో రెండు తెగలున్నాయి. ఒకటి ఉత్తరాది సంస్కృత సంప్రదాయాన్ని అనుసరించే వడహల తెగ: రెండోది

1. రామకృష్ణుని రచనా వైఖరి—పుట 6.

తమిళ సంప్రదాయాన్ని పాటించే తెంగల తెగ. తాతాచార్యుల వారిది వడహల సంప్రదాయము. రామకృష్ణుని గురువుగారైన భట్టరు చిక్కాచార్యుల వారిది తెంగల సంప్రదాయము. ఈ ఇద్దరి మధ్య స్పర్ధలు ఉండవచ్చు."[1] లింగమగుంట తిమ్మకవి తన చతుర్వాటికామాహాత్మ్యమునందును తన గురువుగా చిక్క భట్టరాచార్యుని స్తుతించెను. రంగనాయకపాద రాజీవయుగ్మ సేవకుడగు చెన్నభట్టరాచార్యుడై యుండవచ్చునని కుందూరు ఈశ్వరదత్తుగా రూహించిరి.

వంకుసాల నృసింహకవి తన కవికర్ణరసాయనము అవతారికలో భట్ట పరాశరుని తనగురువుగా పేర్కొని నుతించినాడు. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయావతారికలో తనగురువుగా ముమ్మడివరదాచార్యుని కొల్చినాడు. సారంగుతమ్మయ వైజయంతీవిలాస అవతారికలో తనగురువగు కందాళ అప్పలాచార్యుని భక్తితో స్తుతించినాడు. పాండురంగమాహాత్మ్యమును కృతిగొన్న విరూరి వేదాద్రిమంత్రికూడ కందాళఅప్పలాచార్యుల శిష్యుడే. కందాళమువారు శ్రీవైష్ణవులు. ద్విపద శ్రీరంగమాహాత్మ్యమును రచించిన ముకుందయోగి కందాళఅప్పలాచార్యుల శిష్యుడనని తనగ్రంథమున తెల్పినాడు. చంద్రభానుచరిత్రమును కృతిగొన్న వేంకటపతిరాయలకు (1586-1614 A. D.) తిరుమల తాతాచార్యులు కందాళ అప్పలాచార్యులును వైష్ణవాచార్యులు మతగురువులుగా నున్నట్లు తరిగొప్పుల మల్లనచంద్రభాను చరిత్రావతారికలో తెల్పియున్నాడు. వేంకటపతిరాయలకు వీర వేంకటపతిరాయలనియు నామాంతరము. ఈతడు వసుచరిత్ర కృతిపతియగు తిరుమలరాయల చతుర్థపుత్రుడు. కనుక పాండురంగమాహాత్మ్యకర్తయగు తెనాలిరామకృష్ణుడు, సారంగుతమ్మయ, ముకుందయోగి, తరిగొప్పులమల్లన 16 వ శతాబ్దమునాటికవులని నిశ్చయింపవచ్చును. క్రీ. శ. 1542 లో గండికోటప్రభువు కందాళ అప్పలాచార్యులకొక దానశాసనమిచ్చినట్లు తెలియుచున్నది. సాంబోపాఖ్యాన కర్తయగు రామరాజు రంగప్పరాజకవికి మంత్రోపదేష్టయగుటయేగాక శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులు కళాపూర్ణోదయ కృతిపతియగు నంద్యాలకృష్ణరాజునకును గురువై యుండెనని కళాపూర్ణోదయ మందలి.

---

1. రామకృష్ణుని రచనా వైఖరి, పుట 7.

2. సౌగంధికప్రసవాపహరణము, ఉపోద్ఘాతము; పుట 23-24 (వావిళ్ల ప్రతి)

"విశ్రుత తిరుమల తాతా
ర్య శ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్యతనూ
జ శ్రీనివాస గురుచర
ణాశ్రయణ సమార్జితాఖిలాభ్యుదయునకున్"

అనుపద్యమునుబట్టి తెలియును. రంగప్పరాజు నంద్యాలకృష్ణరాజుకంటె నించుక పెద్దవాడని వారిమూలపురుషుడగు ఆర్వీటిబుక్కరాజునుండి లెక్కింపగా తెలియును. కనుక రంగప్పరాజు 16 వ శతాబ్ది ప్రథమభాగమువాడని నిర్ణయింపవచ్చును. ఇట్లు కావ్యావతారికలలోని గురుస్తుతి కవుల కాలనిర్ణయమునకు తోడ్పడుచున్నది.

ప్రౌఢకవిమల్లన రుక్మాంగదఅవతారికలో తనగురువును శంభుస్వరూపునిగా భావించి కీర్తించినాడు. చూడుడు :

"ప్రణవ పంచాక్షరీ మంత్ర ప్రణుతి నిగుడ
నాది శంభు స్వరూపమై యధిక మహిమ
నున్నతికి నెక్కు శివదేవయోగిపుత్రు
శక్తినాథుని మద్గురు స్వామిఁ దలఁతు"

— రుక్మాంగద (1 - 12)

అప్పకవి ఆరుగురు గురువులను పేర్కొని స్తుతించినాడు. తనకు రెండవ వేదమునుచెప్పిన మూర్తిసర్వన్నను, శబ్దశాస్త్రములను చదివించిన కాండూరి గిరి దేశికుని, సకలసిద్ధాంతములను బోధించిన సూరభట్టును, లక్షణవేత్తను గావించిన మంచికంటి యోబనకవీంద్రుని, స్మార్తకర్మములెఱింగించి సఫల పూజ్యుని చేసిన కొలిచలిమల్లి పింగరాచార్యులను, ఆగమములుపదేశించిన రాజయోగివర్యుని విద్యా గురువులుగా అప్పకవి తనలక్షణగ్రంథములోనిఅవతారిక (1 - 31) లో స్తుతించి నాడు. పలువురుగురువులనుపేర్కొని నుతించుటవలన అప్పకవి విద్యావైదుష్య వికాసవైఖరులు వ్యక్తమగును.

దూబగుంట నారాయణకవి నాగరార్యుడగు మహేశ్వరుని, శ్రీనివాసవిలాస సేవధికర్తయగు శ్రేష్ఠలూరివేంకటార్యుడు వాధూలఅప్పలాచార్యుని, లంకావిజయ కర్తయగు పిండిప్రోలు లక్ష్మణకవి అనంతాఖ్యుని, లీలాసుందరీపరిణయకర్తయగు కూచిమంచి తిమ్మకవి దెందులూరిలింగయను తమతమ గురువులుగా తమ గ్రంథావ తారికలందు స్తుతించినారు. ఇతరకావ్యావతారికలలోకూడ కవితాగురు ప్రశంసకలదు.

## 4. కృతిపతుల గురువులు :

తమ కృతిపతుల గురువులనుకూడ తమ గ్రంథావతారికలలో కొందరు కవులు పేర్కొని స్తుతించియున్నారు. శ్రీనాథుడు తన సాహిత్యసౌష్ఠవమునకు నుద్బోధకారణములనుతెల్పుచు ఘోడెరాయ బిరుదాంకితుడగు భీమేశ్వరస్వామి పదసేవకూడ నొకకారణముగా తెల్పినాడు. రెడ్డిరాజులగురువులకు "ఘోడెరాయ" అని బిరుదు పెక్కుచోట్ల కానవచ్చుచున్నది. పేమ వీరభద్రారెడ్ల విభవమును వర్ణించుటతోపాటు వారికి శైవగురువును, రాజ్యస్థాపనాచార్యుడును, ఘోడెరాయ బిరుదాంచితుడును నగు భీమయ గురువరేణ్యుని శ్రీనాథుడు స్మరించినాడు. భీమేశ్వరస్వామి "రాయగురుపరమేశ్వర సాధుజన విధేయఘోడెరాయ, సకలకళా ధామాది" బిరుద భాస్వరుడైనవాడు, అతడు పట్టిసక్షేత్రమున తప మాచరించు చుండెనట.

హరవిలాసకృతిపతియగు అవచితిప్పయకు "అక్షరశిక్షయు శైవమార్గ సంపన్నతయున్ వివేకపరిపాటియునుం గృపసేసి" నట్టి గురూత్తముడగు పిల్లలమఱ్ఱి మహాప్రధానిపెద్దన్నను శ్రీనాథుడు హరవిలాసావతారికలో పేర్కొని నుతించి నాడు (1 - 30).

ఇట్లు ఆయాకవుల మతతత్త్వములు, కవితావైదుష్యములు, సమకాలిక మతసంప్రదాయములు, కవికాలాదులు కొంతవరకు తెలిసికొనుటకు కృత్యాది ఈ గురుస్తుతి తోడ్పడునని పై పరిశీలనమువలన గ్రహింపవచ్చును.

## 5. పితృ ప్రశంస :

తెలుగుకవులు అవతారికలో తమవంశానుక్రమణికను తెల్పుసందర్భమునను, ఆశ్వాసాంతగద్యలందును, తమతండ్రితాతలను పేర్కొనుట సంప్రదాయమే. అట్లుగాక ఇష్టదేవతాస్తుతికి పిమ్మట తండ్రిని ప్రత్యేకముగాపేర్కొని స్తుతించిన కవులు అరుదు. ప్రౌఢకవిమల్లన రుక్మాంగద కృత్యారంభమున దేవతాస్తుతితరువాత తనతండ్రిని ఇట్లు స్తుతించియున్నాడు.

"మనమున సేవింపుదు మ
జ్జనకుని శ్రీవత్స గోత్ర సాగర చంద్రున్
ఘనుఁ బోతయ మంత్రీశ్వరు
ననయంబును భక్తి నమ్మళాంబాప్రియునిన్"

—రుక్మాంగద (1-11)

తండ్రిని ప్రత్యేకముగా దేవతవలె స్తుతించిన మొదటితెలుగుకవి ప్రౌఢకవి మల్లనయే. ప్రౌఢకవిమల్లన తరువాత జనకస్తుతిని ప్రత్యేకముగాచేసిన మరొక తెలుగుకవి కూచిమంచితిమ్మకవి. అతడు రుక్మిణీపరిణయము, రాజశేఖరవిలాసము లందలి అవతారికలలో ఇష్టదేవతాస్తుతి, సుకవిస్తుతులను చేసినతరువాత తనతండ్రి యగు గంగామాత్యుని ఒక సీసపద్యములో ఇట్లుస్తుతించినాడు.

సీ. "గురుతర కౌండిన్యగోత్ర విఖ్యాతుండు
బయ్యనామాత్యుఁ డే భవ్యతాత
నిరతాన్నదాన వర్ణిత యశస్సాంద్రుండు
తిమ్మన సచివుఁ డే ధీరు తండ్రి
ఘనులు జగ్గనయు సింగన్నయు నరసన్న
యను మువ్వురే మంత్రి యనుఁగుఁ దమ్ము
లలరఁ దిమ్మన్న రాజన్న జగ్గన్నయు
నూరన్న యేమంత్రి సుతవరేణ్యు
లానరవీరము పాపమే ఘనుని సహజ
అతిపతివ్రత లక్ష్మి యే చతురురాణి
యట్టి శ్రీ కూచిమంచి వంశాబ్ధివిధుని
మజ్జనకు నల గంగనామాత్యుఁ దలఁతు"

—రాజశేఖరవిలాసము. పీ. 12.

ప్రభావతీప్రద్యుమ్నము అవతారికలో పింగళి సూరన బహుంరీతుల తన పితృభక్తిని ప్రకటించినాడు.

"తండ్రియు సుతులకు దైవం
బండ్రుగదా వేదవాదు లది వినియును నే
వీండ్రును వాండ్రును బలె మా
తండ్రిఁ బరమ పూజ్యుఁ గాఁగఁ దలఁపమి తగునే?"

—ప్రభావతీ ప్రద్యుమ్నము (1-7).

అని వితర్కించుకొని,

"ఏనుం బితృపూజన నా
చే నైన నెట్టిదియొనఁ జేయుఁగ వలయున్
గానఁ గృతి యిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశు కృపన్"

—ప్రభావతీ ప్రద్యుమ్నము (1-9).

అవి విశ్చయించి సూరన తనతండ్రియు, గురుడునైన అమరామాత్యునికి అంకితముగ ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించినాడు.

కొందరుకవులు తమగ్రంథావతారికలలో తమపితామహ ప్రపితామహులను కవులుగాపేర్కొని కీర్తించినారు. తిక్కన తనతాత మంత్రి భాస్కరుని కవితా ప్రాగల్భ్యముననైనను తనకావ్యము లోకాదరణము నొందగలదని ఆశించి ఇట్లు చాటినాడు—

"సారకవితాభిరాము గుంటూరి విభుని
మంత్రి భాస్కరు మత్పితామహుని దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేర నా కృతి గుణములు వేయు నేల."

—నిర్వచనోత్తర రామాయణము (1-12)

ఈ మంత్రి భాస్కరుని ప్రశంస తిక్కన తన భారతమునందు చేయలేదు. నిర్వచనోత్తర రామాయణములో తిక్కన చేసిన మంత్రి భాస్కరు ప్రశంసనుబట్టి తిక్కన వంశములో పాండితీపటిమ పరంపరగా వచ్చిన విద్యయే యని ఊహింప వచ్చును. కేతన దశకుమారచరిత్రలో మంత్రి భాస్కరుని ఇట్లు వర్ణించినాడు:

"శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్య వి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం డర్థార్థిలోకావన
వ్యాపారవ్రతుఁడంచుఁ జెప్పు సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరున్ భాస్కరున్."

—దశకుమారచరిత్ర (1-32)

దీనినిబట్టి ఆ కాలమున (1190-1220) మంత్రి భాస్కరుడు ప్రశస్తమయిన కవిత్వము చెప్పియుండవచ్చును. భాస్కరరామాయణమును ఈ మంత్రి భాస్కరుడే రచించెనని డాక్టరు నేలటూరు వేంకటరమణయ్య[1], చాగంటి శేషయ్య[2], నిడుదవోలు వేంకటరావు[3] గార్లు భావించినారు. మంత్రి భాస్కరుడు రామాయణమును రచించినట్లు తిక్కన, కేతన, మారనాదులెవ్వరుకూడ తెల్పలేదు.

1. ఆంధ్రపత్రిక - ఉగాది సంచిక, 1940-41.
2. ఆంధ్రకవితరంగిణి - 2 వ సంపుటము.
3. తెనుగుకవులచరిత్ర - పుట 314.

కాని మనుమడగు తిక్కన తన తాతను స్తుతించుటవలన మంత్రి భాస్కరుడు ఒక కవిగా తెలుగు సాహిత్యలోకమునకు పరిచితుడయినాడు. శ్రీనాథుని తాతయగు కమలనాభామాత్యుడు 'కవితాపితామహు'డని, 'పద్మపురాణసంగ్రహకళాకావ్య ప్రబంధాధిపు'డని, 'కవితావిద్యాధరు'డని, 'సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి' అని శ్రీనాథుడు భీమేశ్వరపురాణము (పీ. 10), కాశీఖండము (పీ. 20) లందు స్తుతించుటవలన తెలియుచున్నది. కమలనాభామాత్యుని పద్మపురాణసంగ్రహము అలభ్యము.

అనంతామాత్యుని ముత్తాత బయ్యన తిక్కన సోమయాజిచే 'భవ్యభారతి' అనిపించుకొన్న మేటికవిరత్నమని భోజరాజీయములోని ఈ క్రింది పద్యమునుబట్టి తెలియుచున్నది.

"క్షితిఁ గ్రతుకర్త్రతా మహిమ చేకొని పంచమ వేదమైన భా
రతము దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నత చరితుండు తిక్కకవి నాయకుఁడాదట మెచ్చ 'భవ్యభా
రతి' యనఁ బేరుగన్న కవిరత్నము 'బయ్యన' మంత్రి యల్పుఁడే?"

—భోజరాజీయము (1-24)

బయ్యన ఏయే గ్రంథములను రచించియుండెనో అనంతామాత్యుడు పేర్కొన లేదు. తిక్కన సమకాలికుడగు భవ్యభారతి బయ్యన అను ఒక కవి యుండెనని మాత్రము అతని మనుమడగు అనంతామాత్యుని స్తుతివలన తెలియుచున్నది.

కొటికెలపూడి సోమనాథకవి (1535) తన విష్ణుమిత్రోపాఖ్యానము అవతారికలో ఒకపద్యములో కవిత్రయమును, నాచన సోముని స్తుతించి తరువాత తన తండ్రియగు కోట సచివుని మాత్రము మరొక పద్యములో స్తుతించినాడు. చూడుడు :

"ప్రతిభట విద్వత్కవి సం
హతికరటి ఘటా మృగేంద్రు నస్మద్గురు నూ
ర్జిత నిర్జిత ఫణి పతి గీ
ష్పతి కొటికలపూడి కోటసచివునిఁ దలతుఁన్."

తుళ్ళూరి శరభరాజకవి తన శరభరాజీయములో శివదేవయను తన మూల పురుషునిగా పేర్కొని 'సంస్కృతాంధ్రకవితావళికెల్ల పితామహుండ'ని శివదేవయ్యను

స్తుతించియున్నాడు. ఎడపాటి ఎఱ్ఱన (1504-1530) తన మల్హణచరిత్రలోను, అయ్యంకి బాలసరస్వతి, తురగా రాజకవులు తమ నాగరఖండము (1586) లోను, పింగళి ఎల్లన (1620) తన తోభ్యచరిత్రలోను శివదేవయ్యను కవిగా పేర్కొని స్తుతించియున్నారు.

కాకమాని మూర్తికవి తన పాంచాలీపరిణయము (1-7), రాజవాహన విజయము (1-12) అందు ఒకపద్యమున తన పితామహుని, ప్రపితామహుని శాస్త్రపండితులుగా, కవులుగా కీర్తించినాడు. ఆ పద్యమిది :

"ప్రబలమతి న్నుతింతుఁ బ్రతిభాస్ఫురితి భాషిత భారతీంద్రులం
గబళిత సర్వదర్శనులఁ గావ్య చమత్కృతి కాళిదాసులన్
నిబిడతపోవిలాసులఁ దృణీకృతవాదులఁ గాకమానిరా
మ బుధ విభుం బ్రబోధసుధ మత్ప్రపితామహునిం బితామహున్."

పెద్దయామాత్యు డను కవినిగూర్చి అతని మనుమడగు జక్కన తన విక్రమార్కచరిత్రావతారికలో స్తుతించుటనుబట్టి తెలియుచున్నది. జక్కన తన తాత భాషాప్రపంచమున చేయగలిగిన నానావిధకవితావధానములను, చిత్రకవిత్వ బంధ కవిత్వాదినైపుణ్యసరణియు విశేషముగా పంద్రెండు పాదములు గల ఈ క్రింది సీసమాలికలో వర్ణించినాడు :

సీసమాలిక —

"సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల ఘటికలో నొక శతకంబుఁ జెప్పఁ
బ్రహసన ప్రకరణ భాణాది బహువిధ రూపకంబులయందు రూఢి మెఱయఁ
జక్ర చతుర్భద్ర చతురుత్తరాధిక క్షుద్ర కావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు మేలుగాఁ దద్జ్ఞులు మెచ్చఁ జెప్ప
నిమ్మల నేరీతి నే ధాతువుల నేమి రసముననైన వర్ణనము సేయ
సరి యేక సంథాద్విసంథా త్రిసంథలఁ దొడరినఁ బొరి బొరిఁ గడవఁ జదువ
నెవ్వ డేయవధాన మెఱుఁగు నయ్యవధానమున వానికించుక ముల్లు సూప
వృత్తకందముఁ గందవృత్తంబునుం జతుష్కందంబు మొదలుగాఁగలుగు గర్భ
కావ్యవర్గముఁ జెప్పగాఁ బ్రబంధంబులు గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ
గా; నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుతకంబు బంధచ్యుతకంబు నామ
గోప్యంబులుం గ్రియాగోప్యంబులును భావగోప్యంబులును జెప్ప గోష్ఠియందుఁ
బద్యంబు గీతికార్ఛటినోఁగిఁ జదువంగ నెల్ల విద్యలనంచు లెఱుఁగ నేర్తు."

—విక్రమార్కచరిత్ర (1-20)

పెద్దయామాత్యుని రచనలు ఏమియు మనకు దక్కలేదు. మనుమడగు జక్కన చెప్పిన పై పద్యమునుబట్టి తాతయగు పెద్దయామాత్యుని గొప్పతనము తెలిసికొనగలుగుచున్నాము.

కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో తన వంశమునుగురించి చెప్పుచు తన పినతాతయైన సత్యనారనను ఇట్లు స్తుతించినాడు :

"రామాయణ కృతి కృతియై
తా మెరయుచు నాంధ్రకవిపితామహుఁడనఁగా
భూమిని మించిన భీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై."

—సింహాసనద్వాత్రింశిక (1-49)

ఈ పద్యమువలన సత్యనారన రామాయణ కర్తయని, అతనికి భీమన అను నామాంతరము కలదని, ఆంధ్రకవిపితామహబిరుదాంచితుడని తెలియుచున్నది. అనంతరకవులుగాని, లాక్షణికులుగాని కొరవి సత్యనారనను స్తుతింపలేదు. సింహాసనద్వాత్రింశిక అవతారిక మూలముననే ఈ కవి తెలియుచున్నాడు.

అయ్యలరాజు రామభద్రుడు తన రామాభ్యుదయములో తన తాతయగు అయ్యలరాజు తిప్పయ్యను కృత్యాదిపద్యములోనే గాక ప్రతి ఆశ్వాసాంతగద్యలో "ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతకనిర్మాణకర్మఠ జగదేకఖ్యాతియయ్యలరాజు తిప్పయ మనీషి పర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్ర పరిశీలితసమిద్ధ రామానుజ సిద్ధాంతామాత్య ముమ్మడి వరదాచార్య కటాక్షవీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయ మహాప్రబంధంబు" అని ప్రశంసించినాడు. దీనినిబట్టి అయ్యలరాజు తిప్పయ్య ఒంటిమిట్ట రఘువీరశతక నిర్మాత అని తెలియుచున్నది.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని తాత, తండ్రి, భ్రాత అందరు "భువన భాసురమైన కృతి నిర్మాత"లట, (జైమినిభారతము, 1-21). పిల్లలమఱ్ఱివారి వంశము "శారదాపీఠకము" (1-21) అని జైమినీభారతమున చెప్పబడినది.

తెనాలి రామభద్రకవి తన ఇందుమతీ కల్యాణములో తన తాతలనుగురించి, సోదరునిగురించి ఇట్లు తెల్పినాడు :

సీ. ప్రౌఢి మీ పెదతాత పాండురంగాది స
త్కృతులు చేసెను రామకృష్ణ సుకవి
యనుజుఁ డప్పన్న మీ పినతాత రచియించెఁ
బెఁగ సుదక్షిణా పరిణయంబు
మీ తాత శ్రీగిరిచార్యు విఖ్యాతి
శ్రీశైల మాహాత్మ్య కృతి యొనర్చెఁ
గడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణార్యుఁ
డన కీర్తిఁ గనె సంస్కృతాంధ్రములను

వారలను మించె మీ యన్న వీరరాఘ
వాఖ్య కవి సర్వకవితామహత్త్వమునను
నిన్నూచాన సంతాను నెన్నఁ దగమె
ప్రాజ్ఞహృదయాబ్జ రవి రామభద్రసుకవి.”[1]

—ఇందుమతీకల్యాణము - అవతారిక.

ఈ పద్యమువలన తెనాలి కుటుంబములోని మూడుతరములవరకు ఎందరు కవు లున్నారో తెలియుచున్నది.

ఇట్లు గ్రంథావతారికలలో తెలుగు కవులు తమ పితృపితామహులను కవులుగా పేర్కొని స్మరించుటనుబట్టి కవులుగా వారి ఉనికియు, ఆ కవుల వంశాధిక్యమును తెలియుచున్నది.

1. సమగ్రాంధ్రసాహిత్యము - VIII, పుట 128 నుండి గ్రహింపబడినది.

# 5

# సుకవి స్తుతి—విద్వజ్జన ప్రశంస

నానాజులభాషా విశేష ప్రాప్తికి. కవిత్వ సమధిక స్ఫూర్తికి, అభిమతార్థసిద్ధికి 'విచిత్ర సత్కళా నిధు'లగు పూర్వకవి పండితులను స్మరించుట తెలుగు కవులలో సర్వసాధారణముగ కన్పట్టు విశేషము. ఆయా కవులకు గల పూర్వకవి విరచితాపూర్వ కావ్య భావ రస సుధాచర్వణమునకు ఈ కవిస్తుతి ఒక ప్రబల తార్కాణ మగుచున్నది. దీనివలన సంస్కృతాంధ్ర కవిపండితులు, వారి కవిత్వా శయములు మనకు తెలియుటేగాక వారిని పేర్కొని స్తుతించిన తెలుగు కవుల కవితా రీతులుకూడ కొంతవరకు వ్యక్తమగుచున్నవి. కవి కాలాదుల నూహించుట కును ఈ కవిస్తుతి కొంత తోడ్పడుచున్నది.

ప్రాచీన సంస్కృత కావ్యములందు కవిస్తుతి కానరాదు. బాణుడు హర్ష చరిత్రములో మాత్రము ప్రారంభమున భట్టార హరిశ్చంద్ర, ప్రవరసేన, వ్యాస, భాస, కాళిదాసాఖ్య కవులను కీర్తించినాడు. మాలవికాగ్నిమిత్రమువంటి సంస్కృతనాటకములందు సూచనప్రాయముగా పూర్వకవులు స్మరింపబడినారు. 'గౌడవహ' అను ప్రాకృత కావ్యములో పెక్కు శ్లోకములలో సుకవి ప్రశంస కలదు. కన్నడమున తొలిగ్రంథ మనబడు కవిరాజమార్గము (850 A.D.) నందు విమలుడు, ఉదయుడు, నాగార్జునుడు, జయబంధుడు, దుర్వినీతుడు అను ప్రాచీన కన్నడ గద్య రచయితలును, శ్రీ విజయుడు, కవీశ్వరుడు, పండితుడు, చంద్రుడు, లోకపాలుడు అను ప్రసిద్ధ పద్య రచయితలును పేర్కొనబడినారు.

కవిరాజమార్గ కర్త తన లక్షణగ్రంథమున లక్ష్యములను ప్రాచీన గ్రంథకర్తల నుండియే గ్రహించినాడు. తెలుగు కావ్యములందును గ్రంథాదిని కవిస్తుతి కలదు.

పాల్కురికి సోమనాథుని గ్రంథములలోను, తాళ్ళపాక చిన్నన్న కృతుల లోను, హరవిలాసము, ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, కాళహస్తి మాహాత్మ్యము, విజయవిలాసము, యయాతి చరిత్ర ఇత్యాది కొన్ని కావ్యము లందుమాత్రము గ్రంథాదిని కవిస్తుతి కానరాదు. కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణమువంటి కొన్ని లక్షణగ్రంథములందును కవిస్తుతి లేదు. కాని అప్పకవీయమున కలదు. మంచన కేయూరబాహుచరిత్రలో దేవతాస్తుతి, కవిస్తుతి చేసిన తరువాత "ఇట్లు కృతిప్రారంభ కర్తవ్యంబు లాచరించి యున్న వాని" అని చెప్పియుండుటచే తెలుగులో కవిస్తుతి అవశ్యాచరణీయమగు కృతి ప్రారంభ కర్తవ్యమనుభావము కల్గుచున్నది. మొత్తముమీద తెలుగులో గ్రంథాదిని కవిస్తుతి యుండుట ఒక సంప్రదాయము.

ప్రాచీన తెలుగు కవులు తమకు మార్గదర్శకులయిన సంస్కృత కవులను తమ గ్రంథములందు ప్రారంభమున పేర్కొని స్తుతించినారు. ప్రథమాంధ్ర కవి యగు నన్నయ ఆంధ్రభారతమున గురుపద్య విద్యకు ఆద్యుడైన వాల్మీకిని, వ్యాసుని భక్తితో స్మరించినాడు. నన్నెచోడుడు తన కుమారసంభవమున 'కవితా మృతోదయాంబుధి'యు, ఆదికవియు, 'వస్తుకావ్యాబ్జరవి'యు నగు వాల్మీకిని, వేదవ్యాసుని, 'వరకవితా సింహాసనమెక్కి కవీంద్రుల దాసులఁగానేలిన' కాళి దాసుని, వస్తుకవితలో జనారాధితుడైన భారవిని, గూఢవస్తుమయకావ్యమును చెప్పి హరునే మెప్పించిన ఉద్భటుని, తన కవితాశక్తిచేతను, శివభక్తిచేతను పోయిన చేతులను తిరిగి బడసిన బాణుని ఒక్కొక్కపద్యములో పేరుపేరున పేర్కొని స్తుతించి, 'విస్తర' మతులైన పురాణకవి సంఘమును, 'ఉత్తమమార్గ' సత్కవీశ్వరులను, 'దేశి' సత్కవులను స్మరించినాడు. నన్నెచోడుని కవిస్తుతి మూలమున అతని కాలమున విస్తర, మార్గ, దేశి, వస్తుకవితలను చతుర్విధ కవితలు వ్యాప్తిలో నున్నట్లు వ్యక్తమగుచున్నది. రంగనాథరామాయణమున వాల్మీకి, వ్యాసుడు, శుకబ్రహ్మమాత్రమే స్తుతింపబడినారు. నిర్వచనోత్తరరామా యణమున తిక్కన "ఆదికవీంద్రుల నూత్న సత్కవీశ్వరులను భక్తిఁగొల్చి తగవారి కృపం గవితా విలాస విస్తర మహనీయుఁ" డైనట్లు తన్నుగూర్చి చెప్పి కొనెను. కాని ఆ కవులెవ్వరో సూచింపలేదు. కాని భారతమున మాత్రము

సంస్కృత భారత కర్తయగు వ్యాసభగవానుని 'భవ్యకవితావేశుని'గాను, తనకు పూర్వము భారతములోని త్రిపర్వములొనర్చిన నన్నయను 'కవిత్వవిశారదు'డని, 'విద్యాదయితు'డని కొనియాడినాడు. కేతన దశకుమార చరిత్రలో 'ప్రాక్తనసుకవుల నియమాత్యక్తుల వాల్మీకి కాళిదాసులఁ గొలిచి'నాడు. ప్రాక్తన సుకవులుగా సంస్కృత కవులను మాత్రమే తమ కృత్యాది కవిస్తుతిలో పేర్కొనిన తెలుగు కవులలో ముఖ్యులు వీరు—గౌరన, పింగళి సూరన (ప్రభావతీ ప్రద్యుమ్నములో మాత్రము), గట్టు ప్రభువు, పాలవేకరి కదిరీపతి. కృత్యాది కవిస్తుతిలో మొదట సంస్కృత కవులు, అటుతరువాతనే పూర్వాంధ్రకవులు స్తుతింపబడుట పెక్కు తెలుగు కావ్యములందు నియతముగా కన్పించును.

మంచన కేయూరబాహుచరిత్రము, నందిమల్లయ ఘంటసింగనల వరాహ పురాణము, రత్నాకరము అప్పప్ప శశిరేఖాపరిణయము మున్నగు వానియందు సంస్కృతాంధ్రకవులు ఒకేపద్యమున స్తుతింపబడినారు. సంస్కృత కవులను మొదట ఒక పద్యములోను తరువాతి పద్యములలో తెలుగు కవులను పేర్కొని స్తుతించుట భోజరాజీయము, పంచతంత్రము (బైచరాజు వేంకటనాథునిది), రుక్మాంగద మొదలగు కావ్యావతారికలందు కాననగును. ప్రముఖులగు వాల్మీకి వ్యాసులను ప్రత్యేక పద్యములలోను మరొక పద్యములో 'మాఘి మెఱయు' సంస్కృత కవులను పేర్కొని స్తుతించుట మాదయ్య కవి మైరావణచరిత్రవంటి కావ్యావతారికలందు కలదు. ఇట్లు కృత్యాది కవిస్తుతిలో మొదట సంస్కృత కవులు అటుపిమ్మటనే తెలుగు కవులు స్తుతింపబడినట్లు ఆంధ్రకావ్యములలోని అవతారికలను పరిశీలించిన వ్యక్తమగును. కృత్యాదిని కవిస్తుతిచేయు సందర్భము నందేగాక కృతిపతికి కృతిపూర్వకముగా ఒక గ్రంథమును చెప్పు సందర్భమున గూడ ప్రాచీన సంస్కృతాంధ్రకవులను స్మరించుట శృంగార శాకుంతలమువంటి కొన్ని కావ్యములందు కలదు.

వాల్మీకి వ్యాసులను సాధారణముగా తెలుగు కవులందరు తమ కావ్యావ తారికలలోని కవిస్తుతిలో పేర్కొనినారు. నన్నెచోడాది ప్రబంధ కవులు తమకు మార్గదర్శకులయిన కాళిదాసాది సంస్కృత కవులను కూడ స్మరించినారు. పలువురు తెలుగు కవులు తమ కవిస్తుతిలో పేర్కొనిన సంస్కృత కవులను ఈ క్రింది పట్టికలో చూడవచ్చును. ఈ పట్టికలో ప్రసిద్ధులగు వాల్మీకి వ్యాసులను చేర్చలేదు.

| సంస్కృత కవులను కృత్యాదిని పేర్కొనిన తెలుగు కవులు | పేర్కొనబడిన సంస్కృత కవులు. |
|---|---|
| నన్నెచోడుడు (1130 - 1160) | కాళిదాసు. భారవి. బాణుడు. ఉద్భటుడు. |
| గోనబుద్ధ భూపతి (1240) | శుకబ్రహ్మ. |
| మంచన (1256) | కాళిదాసు. |
| మడికి సింగన (1347) | కాళిదాసు, బాణుడు, హర్షుడు, శుకబ్రహ్మ. |
| జక్కన (1375 - 1404) | 1. కాళిదాసు, 2. భారవి, 3. మయూరుడు, 4. మాఘుడు, 5. భవభూతి, 6. శివభద్రుడు, 7. సౌమిల్లకుడు, 8. బిలహణుడు, 9. మల్హణుడు, 10. చోరుడు, 11. భాసుడు. 12. ప్రవరసేనుడు, 13. మురారి, 14. శ్రీహర్షుడు. 15. హర్షుడు. 16. సుబంధుడు, 17. దండి, 18. వామనుడు, 19. భామహుడు, 20. రాజశేఖరుడు, 21. జయదేవుడు. 22. హేమచంద్రుడు. 23. కామందకుడు, 24. కవిరాక్షసుడు, 25. వరరుచి, 26. భట్టనారాయణుడు, 27. భట్టగోపాలుడు, 28. శాతవాహనుడు. 29. వినాయకుడు, 30. భద్రుడు, 31. హరి, |
| శ్రీనాథుడు (1375-1455) | 1. కాళిదాసు, 2. భారవి, 3. భట్టబాణుడు, 4. మయూరుడు. 5. మాఘుడు, 6. బిలహణుడు, 10. మల్హణుడు, 11, చోరుడు, 12, భాసుడు, 13. ప్రవరసేనుడు, 14, శ్రీహర్షుడు. 15. దండి, 16. రాజశేఖరుడు, 17. క్షేమేంద్రుడు, 18. భట్టి, 19. చిత్రపకవి, 20. భల్లటుడు, 21, సోముడు, |
| అనంతామాత్యుడు (1435) | కాళిదాసు, భారవి, మాఘుడు, దండి. |
| గౌరన (1385 - 1445) | కాళిదాసు, బాణుడు. |

పోతన (1400 - 1450) — కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, మాఘుడు, శుకబ్రహ్మ, భోజుడు,

నందిమల్లయ ఘంటసింగనలు (1480) — కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, భవభూతి, శివభద్రుడు, శ్రీహర్షుడు,

దూబగుంట నారాయణకవి (1480) — కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, భవభూతి, శివభద్రుడు, శ్రీహర్షుడు.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు (1490) — 1. కాళిదాసు, 2. భారవి, 3. బాణుడు, 4. మయూరుడు, 5. మాఘుడు, 6. భవభూతి, 7. శివభద్రుడు, 8. సౌమిల్లకుడు, 9. బిలహణుడు, 10. మల్హణుడు, 11. చోరుడు, 12. హర్షుడు, 13. శుకబ్రహ్మ, 14. దండి, 15. వామనుడు, 16. భామహుడు, 17. ఉల్లటుడు, 18. భానుడు, 19. భట్టారకుడు.

దగ్గుపల్లి దుగ్గన (15వ శతాబ్ది ఉత్తరార్ధము) — కాళిదాసు, భారవి, భట్టారకుడు, మయూరుడు, మాఘుడు, భవభూతి, సౌమిల్లకుడు, బిలహణుడు, భాసుడు, ప్రవరసేనుడు, మురారి, దండి, రాజశేఖరుడు, బోధాయనుడు.

మాడయ్యకవి (1485-1508) (మైరావణ చరిత్ర కర్త) — కాళిదాసు, భారవి, మయూరుడు, భట్టబాణుడు, మాఘుడు, భవభూతి, శివభద్రుడు, చోరుడు, ప్రవరసేనుడు, మురారి, దండి, ఉద్భటుడు, సోమదత్తుడు.

మొల్ల (1500 - 1550) — కాళిదాసు, భారవి, బాణుడు, మాఘుడు, భవభూతి, శివభద్రుడు,

అల్లసాని పెద్దన (16 శతాబ్ది పూర్వార్ధము) — కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, మాఘుడు, భవభూతి, శివభద్రుడు, సౌమిల్లకుడు, బిలహణుడు, మల్హణుడు, చోరుడు, భాసుడు, మురారి, సుబంధుడు, దండి.

భానుకవి (1510 - 1530) — కాళిదాసు, బాణుడు, మయూరుడు.

| | |
|---|---|
| చింతలపూడి ఎల్లనార్యుడు (1520 - 1530) | కాళిదాసు, మయూరుడు, మాఘుడు, జయదేవుడు. |
| మాదయగారి మల్లన (1515) | కాళిదాసు. |
| అయ్యలరాజు రామభద్రుడు (1550) | కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, మాఘుడు, భవభూతి, బిలహణుడు, మల్హణుడు, చోరుడు, భాసుడు, దండి. |
| ప్రౌఢకవి మల్లన (15వ శతాబ్ది ?) | కాళిదాసు, మయూరుడు, భవభూతి, సౌమిల్లకుడు, మల్హణుడు, చోరుడు, ప్రవరసేనుడు, శ్రీహర్షుడు, భట్టబాణుడు, జయదేవుడు, రాజశేఖరుడు, భోజుడు, భర్తృహరి. |
| శంకరకవి (1550 - 1600) | కాళిదాసు, భారవి, మయూరుడు, మాఘుడు. బాణుడు. |
| రామరాజ భూషణుడు (1557) | కాళిదాసు, భారవి, మయూరుడు, మాఘుడు, భవభూతి, దండి, బాణుడు, చోరుడు, మురారి. |
| కాకమానిమూర్తికవి(16 వ శతాబ్ది) | కాళిదాసు, భారవి, బాణుడు, మాఘుడు, భవభూతి, భాసుడు, శ్రీహర్షుడు, మయూరుడు, చోరుడు, మురారి, పాణిని, కాత్యాయనుడు. |
| చదలువాడ మల్లన (1580) | కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు, మాఘుడు, భవభూతి, శివభద్రుడు, మల్హణుడు, చోరుడు, దండి. |
| ఎడపాటి ఎఱ్ఱన (16 వ శతాబ్ది) | కాళిదాసు, మయూరుడు, మాఘుడు, భట్టబాణుడు, దండి. |
| తెనాలి అన్నయ (1560) | కాళిదాసు. |
| తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి, (నాగర ఖండము కర్తలు) | 1. కాళిదాసు, 2. మయూరుడు, 3. భవభూతి, 4. చోరుడు, 5. దండి, 6. బాణుడు, 7. ధనంజయుడు, 8. భారవి, 9. జయదేవుడు. 10. భాసుడు. 11. శ్రీహర్షుడు, 12. ప్రవరసేనుడు, 13. మల్హణుడు, |

| | |
|---|---|
| | 14. బిల్హణుడు, 15. మాఘుడు, 16. మురారి, 17. క్షేమేంద్రుడు, 18. వటమూలుడు, 19. సోమనాథుడు, 20. శివతత్త్వుడు, 21. శివదేవుడు, 22. చిన్మయుడు, 23. భవదూరుడు, 24. శరభాంకుడు, 25. రాజశేఖరుడు, 26. వేముడు. |
| గట్టు ప్రభువు (16 వ శతాబ్ది ఉత్తరార్ధము) | కాళిదాసు, భారవి, బాణుడు, మాఘుడు, శివభద్రుడు, భవభూతి, బిల్హణుడు, మల్హణుడు, భట్టబాణుడు, వామదేవుడు. |
| రఘునాథ నాయకుడు (1614 - 1633) | కాళిదాసు, బాణుడు, భవభూతి, భాసుడు, రుద్రటుడు, భామహుడు. |
| అప్పకవి (1656) | కాళిదాసు, భారవి, మయూరుడు, మాఘుడు, భవభూతి, మల్హణుడు, చోరుడు, భట్టబాణుడు, దండి, జయదేవుడు, హీరుడు. |
| దామెర్ల వెంగళనాయకుడు (17 వ శతాబ్ది) | కాళిదాసు, బాణుడు, మయూరుడు, భవభూతి, దండి, ధనంజయుడు. |
| పాలవేకరి కదిరీపతి (17 వ శతాబ్ది) | కాళిదాసు. |
| చెంగల్వ కాళకవి (17 వ శతాబ్ది) | కాళిదాసు, భాసుడు. |
| శేషము వేంకటపతి (1704-31) | కాళిదాసు, |
| సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు (18 వ శతాబ్ది) | కాళిదాసు. |
| కనుపర్తి అబ్బయామాత్యుడు (18 వ శతాబ్ది) | కాళిదాసు, భారవి, బాణుడు, మయూరుడు. మాఘుడు, భవభూతి, చోరుడు, శ్రీహర్షుడు, దండి. |
| పిండిప్రోలు లక్ష్మణకవి (1770 - 1840) | కాళిదాసు, బాణుడు, మయూరుడు, మాఘుడు, చోరుడు, భాసుడు, మురారి, సుబంధుడు. |
| ముద్దుపళని (1749) | కాళిదాసు. |
| రత్నాకరము అప్పప్పకవి (19 వ శతాబ్ది) | కాళిదాసు. భవభూతి. |

పై పట్టికలో సుమారు అరువది మంది సంస్కృత కవులు, లాక్షణికులు పేర్కొనబడినారు. కావ్యకవులగు శ్రీనాథాదులును, ప్రబంధ కవులగు పెద్దనాదులును, సంస్కృత కవులను అధికముగా పేర్కొని స్తుతించినట్లు వ్యక్తమగుచున్నది. చిత్రపకవి, భట్టి, భల్లటులను శ్రీనాథుడు పేర్కొనుట వలననే మనకు మొదటి సారిగా తెలియుచున్నారు. సంస్కృత కవులనే గాక ప్రాకృత కవులను కూడ పేర్కొని నుతించిన వారిలో జక్కనయే ప్రథముడు. కామందకుడు, కవిరాక్షసుడు, వరరుచి, హేమచంద్రుడు, జయదేవుడు, భట్టనారాయణుడు, శాతవాహనుడు, భద్రుడు, వినాయకుడు, హరి - అనువారిని జక్కన తన కవిస్తుతిలో మొదటిసారిగా పేర్కొనినాడు. జక్కన పేర్కొనిన వరరుచి హేమచంద్రాదులను తరువాతి తెలుగు కవులెవ్వరును తమ కవిస్తుతిలో పేర్కొనియుండలేదు. లల్లటుని, భానుని, భట్టారకులను పినవీరభద్రుడు, బోధాయనుని దగ్గుపల్లి దుగ్గనయు, భోజుని పోతనయు తమ కవిస్తుతులందు మొదటిసారిగా పేర్కొనినారు. గౌరన ఆంధ్రకవుల నెవ్వరిని పేర్కొనక నవనాథ చరిత్రలో బాణాది సత్కవులను, హరిశ్చంద్రోపాఖ్యానములో కాళిదాసాదులగు మహాకవులను మాత్రము పేర్కొనినాడు. నవనాథ కథా కథన సందర్భమున బాణుని, కవులకు శిరఃకంపంబు కలిగింపగల రసవత్కావ్యరచనా సందర్భమున కాళిదాసును స్మరించుట యుక్తమే.

సోమదత్తుడను సంస్కృతకవిని మైరావణ చరిత్ర కర్తయగు మాడయ్యకవి యొక్కడే పేర్కొనినాడు. తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతుల కృతమగు నాగర ఖండమున బహుకవిస్తుతి యుండుట వలన అది సాహిత్య చరిత్రకు మిక్కిలి ఉపకరించును. ఇందు వటమూలుడు, చిన్మయుడు, శరభాంకుడు, భవదూరుడు, వేముడు అను సంస్కృత కవులు తొలిసారిగా స్మరింపబడినారు. చిమ్మపూడి అమరేశ్వరుడు (15వ శతాబ్దికి పూర్వుడు) తన 'విక్రమసేనము' నందు భట్టనారాయణుని, రాజశేఖరుని, మురారిని నాటక కర్తలుగాను, దండి, వామనుడు, గుణాఢ్యుడు, క్షేమేంద్రులను అలంకార విదులుగను పేర్కొనినాడు. భర్తృహరిని ప్రౌఢకవి మల్లన, హీరుని అప్పకవి, వామదేవుని గట్టు ప్రభువు, రుద్రటుని రఘునాథ నాయకుడు, ధనంజయుని దామెర్ల వెంగళనాయకుడు తమ కృత్యాది కవిస్తుతులందు పేర్కొనుట వలన వారు తొలిసారిగా సాహితీ లోకమునకు పరిచయమగుచున్నారు. ప్రబంధ కవులు సంస్కృత ప్రాకృతాది భాషలలో నిష్ణాతులగుటయు, ఆలంకారిక శైలి, వర్ణనాదుల నభిమానించి కావ్యరచన చేయుటయు

కారణముగ ప్రసిద్ధ సంస్కృత కవులనేగాక లాక్షణికులను గూడ పలువురిని పేర్కొని సంస్మరణ పూర్వకమగు భక్తిని ప్రదర్శించినారు.

రాధామాధవకవి తన రాధామాధవమున చేసిన జయదేవ కవి స్తుతి వలన జయదేవు డొకడు రాధామాధవమును రచించి యున్నట్లు తెలియుచున్నది. ఈ పద్యమును చూడుడు :

"నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పిన విద్యా
చతురానను నీలాచల
పతి హితు జయదేవ సుకవి పంచ ప్రదరున్"

— రాధామాధవము (1 - 10)

గీత గోవింద కర్తయగు జయదేవ కవి, శృంగార మాధవీయ మను చంపూకావ్యమును రచించిన జయదేవుడు, ప్రసన్నరాఘవ నాటక కర్తయగు జయదేవుడు- పెక్కురు జయదేవులున్నారు. వీరిలో రాధామాధవ కావ్యకర్తయగు జయదేవు డెవ్వరో తెలియదు. సంస్కృత కవులతోపాటు వారి కావ్యములను కూడ పేర్కొనుట తెలుగు కవులలో కలదనుట కిది యొక నిదర్శనము.

తెలుగు కవులలో కొందరు తమ కృత్యాది కవి స్తుతిలో సంస్కృత కవుల పేర్లను మాత్రమే స్మరింపక వారి కవితా గుణములను బిరుదులనుకూడ గుర్తించి యున్నారు. అనంతామాత్యుడు ప్రసిద్ధ సంస్కృత కవులగు దండి, భారవి, కాళిదాస, మాఘులతోపాటు వారి కవితా లక్షణములను కూడ పేర్కొని నుతించినాడు. చూడుడు :

"వివిధ పదానుయోజనఁ బ్రవీణుఁడు దండి సముంచితార్థగౌ
రవమునఁ బెద్ద భారవి ధురంధరుఁ డయ్యుపమా కవిత్వ స
త్ప్రవణతఁ గాళిదాసు త్రివిధంబున మాఘుడు మేటినాఁగ ని
ట్లవనిఁబొగడ్త కెక్కిన మహా కవులం బ్రణుతింతు నాథ్యులన్"

— భోజరాజీయము (1-8)

పదలాలిత్యమునకు దండి, అర్థగౌరవమునకు భారవి, ఉపమాలంకార ప్రయోగమునకు కాళిదాసు, ఈ మూడింటికి మాఘుడు లోకమున పొగడ్త కెక్కినారు. ప్రసిద్ధ సంస్కృత కవుల కవితా గుణములను పేర్కొనిన అనంతుని కవితలో కూడ ఆ కవితా గుణములు గోచరించును.

మాడయ్య కవికూడ సంస్కృత కవుల కవితా గుణములను కీర్తించినట్లు ఈ పద్యమువలన స్పష్టమగును.

"సన్నుతి యొనరింతు సర్వజ్ఞ బిరుదాంక
భద్ర వాచాస్థాణు భట్టబాణు
గురుమతి వర్ణింతు వరపదాలంకార
కవితార్థ విన్యాసుఁ గాళిదాసు
మదిలోన వర్ణింతు మహనీయ మధుర వి
స్ఫురిత శబ్దోన్నత్తు సోమదత్తు
వినయోక్తిఁ గొని యాడుదును భూరి గర్వోత
కవిగోత్రపాకారి ఘను మురారిఁ
బ్రార్థనము సేతు శివభద్రు బదరసేనుఁ
జోరు భవభూతి దండి మయూరు బాణు
మాఘు భారవి నుద్భటు మఱియుఁ బేరు
గల కవీంద్రులఁ జింతింతు గరిమతోడ"

—మైరావణ చరిత్రము (1-11)

దోనూరి కోనేరునాథకవి (1547) చేసిన సంస్కృత కవిస్తుతి అతని సంస్కృత సాహిత్య పరిచయమును వేనోళ్ల చాటుచున్నది. ఈ పద్యమును చూడుడు :

"ఆ వాణి యెవ్వాని నీవ నేనని పల్కె-
వరరుచి తోడి సంవాద వేళ
శారద కాళిదాస కవిత్వ సమముగాఁ
దులఁ దూచె నెవ్వాని లలిత కవిత
మృడుని గద్యంబుచే మెప్పించి యెవ్వాఁడు
పంచశాఖము నిగుర్పించు కొనియె
నాలు పద్యములచే (?) నర్కుని గరఁగించి
యెవ్వాఁడు తనువున కింపుఁ గాంచె
ఖండన గ్రంథ మొనరించెఁ గడఁక నెవ్వఁ
డెవ్వనికిఁ బదలాలిత్య మెసఁగు బిరుదు
శివ హరిచరిత్ర కావ్యముల్ చేసి రెవ్వ
రట్టి సంస్కృత కవుల నిత్యము నుతింతు"

— బాలభాగవతము (1-5)

కోనేరునాథుడు 'సంస్కృత ప్రాకృతాదిక భాషామయ కావ్యకర్త'. 'అష్ట భాషా కవి మిత్రుడు.' కనుకనే అతడు సంస్కృత కవులను స్తుతించునపుడు వారిపేర్లను తెలుపక వారి కవితామార్గములనో, గ్రంథములనో, జీవితఘట్టములనో పేర్కొని తన్మూలమున ఆయా సంస్కృత కవులను గుర్తించు సమస్య పాఠకుల కిచ్చినాడు. ఇది కోనేరునాథకవికి గల సంస్కృతభాషాపరిచయమును సువ్యక్తము చేయుచున్నది.

కాకమాని మూర్తికవి కృత్యాదిని సరస్వతిని స్తుతించు పద్యమున సంస్కృత కవుల కవితా సంప్రదాయములను ఏకరువు పెట్టినాడు చూడుడు :

"చోరు నలంక్రియా విఖ్యాతి సొంపు మయూరుని సౌకుమార్యమున్
భారవి కాంతి సంపదయు బాణు గుణాఢ్య తర ప్రయోగ మా
దారి మురారి కోమల పదంబు ప్రసాదము గల్గు నట్లుగా
భారతి యిచ్చుఁ గాతఁ బ్రతిభా రతి మత్కృతికిం జమత్కృతిన్"

—రాజవాహన విజయము (1-6)

చోరకవి కవిత ఉపమాద్యలంకార భూయిష్ఠ మనియు, భారవి కవిత ప్రకాశంబు కలదనియు, బాణుని కవిత్వము ప్రయోగ లక్షణ సమృద్ధి గలదనియు, మురారి కవిత మృదుపద భూయిష్ఠ మనియు పై పద్యమునందలి స్వభావోక్తినిబట్టి గ్రహింపవచ్చును.

శబ్దప్రయోగ చాతుర్యమునకై పాణిని, కాత్యాయనాదులను కూడ మూర్తి కవి ఇట్లు స్తుతించియున్నాడు.

"సూత్రవార్తిక భాష్యముల్ సారిదిఁ జేసి
నట్టి పాణిని మానిఁ గాత్యాయనర్షి
శేషభోగిని సన్నుతుల్ చేయు వాఁడఁ
జతుర శబ్ద ప్రయోగ్యతా సంపదలకు"

—రాజవాహన విజయము (1-10)

భట్టుమూర్తి నరస భూపాలీయములో సంస్కృతాంధ్ర కవులలో పూర్వుల కే యే గుణములు ప్రత్యేకించి కలవో ఈ పద్యమున పేర్కొనినాడు.

"బాణు వేగంబును భవభూతి సుకుమార
తయు మాఘు శైత్యంబు దండి సమత
అల మయూరు సువర్ణ కలన చోరుని యర్థ
సంగ్రహమ్ము మురారి శయ్య తేర్పు




సోము ప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పద ప్రసిద్ధ ధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖసృష్టి
నీక కలదటుగాన ననేక వదన
సదన సంచార భేదంబు సడలు పఱిచి
భారతీ దేవి నీ జిహ్వఁబాదుకొనియె
మూర్తికవి చంద్ర! విఖ్యాత కీర్తి సాంద్ర!"

—కావ్యాలంకార సంగ్రహము (1-15)

సంస్కృత ప్రాకృత కవులను లాక్షణికులను గూర్చిన వివరణమే గాక ప్రాచీనాంధ్రకవులనుగూర్చిన విశేషాంశములు కూడ ఆంధ్ర కావ్యములలోని అవతారికలలోని కవి స్తుతివలన మనకు సువ్యక్తమగును.

ఆదికవియు భారతాంధ్రీకరణ కర్తయు నగు నన్నయ పూర్వాంధ్ర కవుల నెవ్వరిని పేర్కొనలేదు. నన్నెచోడుడు తన కుమారసంభవమున దేశికవితను బుట్టించి తెనుగును నిలిపిన చాళుక్యరాజు మొదలుగ పలువురిని స్తుతించినాడు. "సత్కవు లభినందింతు రాదికవి వాల్మీకిన్" అని నన్నెచోడుడు వాల్మీకిని స్తుతించు సందర్భమున చెప్పుటవలన, వాల్మీకిని స్తుతించిన నన్నయను సత్కవిగా పరిగణించినాడు కాబోలు. తిక్కన తన భారతములో నన్నయను పేర్కొని స్తుతించినాడు. కేతన దశకుమార చరిత్రలో నన్నయను పేర్కొనలేదు కాని ఆంధ్రభాషా భూషణములో నన్నయను స్తుతించినాడు. భారతమును 'ఆంధ్రభాష విశదంబుగఁ జెప్పిన' నన్నయ తిక్కనలను మంచన, మారన, ఎఱ్ఱన, మడికి సింగన మొదలగువారు తమ కావ్యావతారికలందలి పూర్వ కవి స్తుతిలో పేర్కొని నారు. తిక్కన మెచ్చిన కేతనను పూర్వకవు లెవ్వరును తలపలేదు. కొలని గణపతిదేవుడు (1400), భద్రకవి లింగన (1530-1542), బచ్చు సిద్ధకవి (17వ శతాబ్ది), అత్తనూరి పాపకవి మున్నగు శైవ కవులు పాల్కురికి సోమనాథుని పూర్వకవి స్తుతిలో పేర్కొనినారు. కాని ఏకారణముచేతనో నన్నెచోడుని మాత్రము ఎవ్వరుగాని తమ పూర్వకవి స్తుతిలో స్మరింపనైనను లేదు.

తెలుగులో ఎఱ్ఱనకు పిమ్మట కవిత్రయ ప్రశస్తి ఏర్పడినది. ఎఱ్ఱన నన్నయ తిక్కనల మార్గముననే వారి మీది భక్తి పెంపున రచనను సాగించి

'ప్రబంధ పరమేశు' డన బరగి కవిత్రయములో నొకడుగా ప్రఖ్యాతి బడసినాడు. ఎఱ్ఱన స్వయముగా ప్రామాణికుడై నందువలననో, భారతశేష పూరకుడై నందువలననో కవిత్రయములో చేరి ప్రామాణికుడై, తరువాతి తెలుగు కవులచే ప్రశంసింపబడినాడు. ఈ కవిత్రయమునే ఆంధ్ర భాషాధి పతులుగా మార్గదర్శకులుగ జక్కన శ్రీనాథాదికవులు స్మరించినారు. నిశ్శంక కొమ్మన (15 వ శతాబ్ది) తన శివలీలా విలాసములో త్రిమూర్తులవలె కవిత్రయమును పూజ్యులుగా వర్ణించినాడు చూడుడు :

"నన్నయ భట్టు గావ్య రచనా విధిఁ దిక్కన సోమయాజి న
చ్ఛిన్న మహాత్త్వ సంవిహిత శేముషి నెఱ్ఱయ ప్రెగ్గడన్ సము
త్పన్న నవ ప్రబంధ రస భావన నింపున బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలో దలఁతు మువ్వుర మువ్వురఁ బోలు పుణ్యులన్"[1]

—శివలీలా విలాసము, అవతారిక ప. 12.

అత్తనూరి పాపకవి తన చెన్న బసవపురాణములో పాల్కురికి సోమనాథుని ఒక ప్రత్యేకపద్యము (1-7) లో స్తుతించి పిమ్మట మఱొక పద్యములో వాల్మీకి నన్నయలను ఇట్లు స్తుతించినాడు.

"వర వల్మీకజ నన్నపార్య ముఖ గీర్వాణాంధ్రభాషా కవి
త్వ రమాంభోనిధులం జనాక్షి యుగ జీవంజీవ తోషక్రియా
కర తేజో నిధులం నిజానుపమ వాక్య వ్రాత సంపాదనా
స్ఫుర దాశాంబుధులం దలంతు సతతంబున్ గార్య సంసిద్ధికిన్."

—చెన్నబసవపురాణము (1-8)

భవికవులను తలపని వీరశైవ కవులు కూడ నన్నయను కీర్తించిరనుటచే తెలుగులో ఆత డెంతటి ప్రామాణికుడో చెప్పపనిలేదు. పూర్వాంధ్రకవులందరును తమ కవిస్తుతిలో కవిత్రయమును పరమ ప్రామాణికులుగా గ్రహించి కీర్తించినారు. కవిత్రయముతోపాటు పెక్కుమంది పూర్వాంధ్ర కవులును ఆంధ్ర కావ్యావతారికలలో స్తుతింపబడినారు. ఆంధ్ర కావ్యావతారికలలోని పూర్వకవి స్తుతివలన తెలియునట్టి కొంతమంది తెలుగు కవులను, వారిని స్తుతించిన తెలుగు కవులను ఈ క్రింది పట్టికలో పేర్కొందము :

---

1. చూ. History of Reddi Kingdoms, Appendix.

భీమకవిని పేర్కొన్న కవులు :

1. శ్రీనాథుడు (1375-1455). 2. బమ్మెరపోతన (1400-1460). 3. కొరవి గోపరాజు (1500-1530). 4. పెదపాటి సోమనాథుడు (1500). 5. వెల్లంకి తాతంభట్టు (1480-1520). 6. ఎడపాటి ఎఱ్ఱన (1504-1530) (మల్హణచరిత్ర). 7. తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి (1586) (నాగరఖండం). 8. ప్రౌఢకవి మల్లన (16 వ శతాబ్ది). 9. పింగళి సూరన (1550). 10. చిత్రకవి పెద్దన (1550). 11. దామెరల వెంగళనాయకుడు (17 వ శతాబ్ది). 12. ఆంధ్రకవి రామయ్య (15 వ శతాబ్ది). 13. పట్టపు సరస్వతీ సోమయాజి (1670) (పృథుచరిత్ర కర్త). 14. కూచిమంచి తిమ్మకవి (1715). 15. కనుపర్తి అబ్బయామాత్యుడు (18 వ శతాబ్ది). 16. ముద్దుపళని (1749). 17. కృష్ణకవి (18 వ శతాబ్ది) (శకుంతలా పరిణయకర్త). 18. పిండిప్రోలు లక్ష్మణకవి (1770-1840).

రంగనాథుని పేర్కొనిన కవులు :

1. కొలని గణపతిదేవుడు (1400). 2. అనంతామాత్యుడు (1430). 3. పోతన (15 వ శతాబ్ది). 4. కొరవి గోపరాజు (1500-1530). 5. భద్రకవి లింగన (1530-42). 6. భానుకవి (1510-1530) పంచతంత్రికర్త). 7. మొల్ల (16 వ శతాబ్ది). 8. వెన్నెలకంటి సూరన (16 వ శతాబ్ది). 9. తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతులు (16 వ శతాబ్ది) 10. లింగముగుంట తిమ్మన (1560). 11. ఆంధ్రకవి రామయ్య (15 వ శతాబ్ది). 12. ఏకుమళ్ల రంగశాయి (18 వ శతాబ్ది). 13. అప్పప్పకవి - రత్నాకరము (19 వ శతాబ్ది).

భాస్కరుని పేర్కొనిన కవులు :

1. క్రీడాభిరామకర్త (15 వ శతాబ్ది). 2. అనంతామాత్యుడు (15 వ శతాబ్ది). 3. భానుకవి (16 వ శతాబ్ది). 4. వెన్నెలకంటి సూరన (16 వ శతాబ్ది). 5. అయ్యలరాజు రామభద్రుడు (1540). 6. రామరాజ భూషణుడు (1557). 7. ఎడపాటి ఎఱ్ఱన (16 వ శతాబ్ది). 8. ప్రౌఢకవి మల్లన (16 వ శతాబ్ది). 9. దామెరల వెంగళనాయకుడు (17 వ శతాబ్ది). 10. ఆంధ్రకవి రామయ్య (15 వ శతాబ్ది). 11. ముద్దుపళని (18 వ శతాబ్ది). 12. సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు (18 వ శతాబ్ది). 13. కనుపర్తి అబ్బయామాత్యుడు (18 వ శతాబ్ది).

14. కూచిమంచి తిమ్మకవి (18 వ శతాబ్ది). 15. కృష్ణకవి (18 వ శతాబ్ది). 16. పిండిప్రోలు లక్ష్మణకవి (1770-1840) మొదలగువారు.

అమరేశ్వరుని కీర్తించిన కవులు :

1. క్రీడాభిరామ కర్త (15 వ శతాబ్ది). 2. అనంతామాత్యుడు (15 వ శతాబ్ది). 3. కొరవి గోపరాజు (1500-1530). 4. కూచిరాజు ఎఱ్ఱన (1450-1500) [సకలనీతికథానిధానము (1-8) లో]. 5. అయ్యంకి బాలసరస్వతి (1580). 6. బైచరాజు వేంకటనాథుడు (16 వ శతాబ్ది). 7. రామరాజ భూషణుడు (1557). 8. ప్రౌఢకవి మల్లన (1450 తరువాత). 9. దామెరల వెంగళనాయకుడు (17 వ శతాబ్ది). 10. అంగర నృసింహకవి (1650). 11. నూతనకవి సూరన (1700) (ధనాభిరామకర్త). 12. కూచిమంచి తిమ్మకవి (1715). 13. కూచిమంచి జగ్గకవి (1720) మొదలగువారు.

పాల్కురికి సోమనాథుని స్తుతించిన కవులు :

1. కొలవి గణపతిదేవుడు (1400). 2. భద్రకవి లింగన (1530-1542). 3. బచ్చు సిద్ధకవి (17 వ శతాబ్ది). 4. పింగళి ఎల్లన (1620) (తోభ్యచరిత్ర కర్త). 5. అత్తనూరి పాపకవి (18 వ శతాబ్దాంత్యము) మొదలగువారు.

శివదేవయ్యను స్తుతించిన కవులు :

1. తుళ్లూరి శరభరాజకవి (శరభరాజీయము). 2. ఎడపాటి ఎఱ్ఱన (16 వ శతాబ్ది). 3. నాగరఖండము రచయితలు (16 వ శతాబ్ది). 4. పింగళి ఎల్లన (1620). ("చెలగి యథావాక్యముల యన్నమయగారి భజియించి మ్రొక్కిడి పాలకురికి సోమన్నగారిఁ బ్రస్తుతిజేసి ప్రియ మంది శివదేవ ముఖ నవకవుల నెంచి......"—తోభ్యచరిత్రము-అవతారిక).

శరభాంక కవిని పేర్కొనిన కవులు :

1. ఎడపాటి ఎఱ్ఱన. 2. రామలింగకవి (కూర్మపురాణకర్త).

రావిపాటి తిప్పన్నను స్తుతించినకవులు :

1. క్రీడాభిరామ కర్త. 2. కూచిరాజు ఎఱ్ఱన (1450-1500) (తెలుగు కొక్కోకము-ప్రథమ-4). 3. ఆంధ్రకవి రామయ్య.

సోముని స్తుతించిన కవులు :

1. పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు (1490). 2. కొరవి గోపరాజు (1500-1530). 3. వెన్నెలకంటి సూరన (16 వ శతాబ్ది). 4. ఎడపాటి ఎఱ్ఱన (1504-1530). 5. కొటికెలపూడి సోమనాథకవి (1535) (విష్ణుమిత్రోపాఖ్యాన కర్త). 6. అయ్యలరాజు రామభద్రుడు (1540). 7. భానుకవి. 8. బైచరాజు వేంకటనాథుడు (1500-1570). 9. రామరాజభూషణుడు (1557). 10. మొల్ల (16 వ శతాబ్ది). 11. ప్రౌఢకవి మల్లన (16 వ శతాబ్ది) 12. ఆంధ్రకవి రామయ్య (15 వ శతాబ్ది) (విష్ణుకాంచీమాహాత్మ్యకర్త). 13. దామెరల వెంగళనాయకుడు. 14. అప్పకవి (1656). 15 ముద్దుపళని (17 వ శతాబ్ది). 16. సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు (17 వ శతాబ్ది). 17. కనుపర్తి అబ్బయామాత్యుడు (18 వ శతాబ్ది). 18. నూతనకవి సూరన (1700) (ధనాభిరామకర్త). 19. కృష్ణకవి (18 వ శతాబ్ది). 20. పిండిప్రోలు లక్ష్మణకవి.

శ్రీనాథుని కీర్తించిన కవులు :

1. పినవీర భద్రుడు (1490). 2. నందిమల్లయ ఘంటసింగనలు (1480). 3. దగ్గుపల్లిదుగ్గన(15వ శతాబ్దిఉత్తరార్ధము). 4. పెదపాటి సోమనాథుడు (1500). 5. భానుకవి. 6. బైచరాజు వేంకటనాథుడు. 7. రామరాజ భూషణుడు. 8. మొల్ల. 9. పచ్చకప్పురపు తిరువేంగళకవి (1530). 10. రఘునాథనాయకుడు. 11. ముద్దుపళని. 12. అబ్బయామాత్యుడు. 13. కృష్ణకవి. 14. పిండిప్రోలు లక్ష్మణకవి.

అల్లసాని పెద్దనను స్మరించిన కవులు :

1. అప్పకవి. 2. పిండిప్రోలు లక్ష్మణకవి. 3. అప్పప్పకవి.

పోతనను స్మరించిన కవులు :

1. భానుకవి. 2. అయ్యలరాజు రామభద్రుడు. 3. ఎడపా టిఎఱ్ఱన. 4. అప్పకవి. 5. అబ్బయామాత్యుడు. 6. కృష్ణకవి. 7. పిండిప్రోలు లక్ష్మణకవి. 8. అప్పప్పకవి.

జక్కనను స్తుతించిన కవులు :

1. ఎడపాటి ఎఱ్ఱన. 2. కూచిరాజు ఎఱ్ఱన.

కొలని గణపతిదేవుడు (1400) తన శివయోగసారములో పాల్కురికి సోమనాథుని, చక్రపాణి రంగనాథుని ఇట్లు స్తుతించినాడు.

"అసమ శివభక్తి రస మా
నసునిం బాల్కురికి సోమనాథునిఁ గవిరా
జ సమున్నత యశు సద్యః
ప్రసాదియగు చక్రపాణి రంగనఁ గొలుతున్."

చక్రపాణి రంగనను స్తుతించిన మొదటికవి కొలని గణపతిదేవుడే.

సింహాసన ద్వాత్రింశికలో కొరవి గోపరాజు సత్కవుల నిట్లు స్తుతించినాడు:

"అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును, ఘను నాగరాజుఁ గవి సోమునిఁ దిక్కన సోమయాజిఁ గే
తన కవి, రంగనాథు, సుచిత్రజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజు సో
మన, నమరేశ్వరుం, దలఁతు మత్కుల చంద్రుల సత్కవీంద్రులన్."

—సింహాసన ద్వాత్రింశిక (1_12)

గోపరాజు పై పద్యములో పేర్కొనిన పిల్లలమఱ్ఱి వీరరాజే జైమిని భారతాది బహుకావ్యకర్తయైన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడై యుండునని శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు సింహాసన ద్వాత్రింశిక పీఠికలో తెల్పియున్నారు. శ్రీ ఆరుద్రగారును పినవీరభద్రుడే అని భావించి కొరవి గోపరాజు కాలమును ఈ క్రిందివిధముగ నిర్ణయించినారు. "ఇతడు (కొరవి గోపరాజు) పూర్వకవి స్తుతిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని స్తుతించాడు (సింహా. 1-12). పినవీరయ్య కాలం నిర్వివాదం. క్రీ. శ. 1485-1490 లో రాయల సింహాసనం అధిష్ఠించిన సాళువ నరసింహరాయలకు జైమిని భారతాన్ని పిల్లలమఱ్ఱి పినవీరయ్య కృతి ఇచ్చాడు. గోపరాజు క్రీ.శ. 1490 దాటాకనే సింహాసన ద్వాత్రింశిక వ్రాసి ఉండాలి. అందుచేత అతనికాలం క్రీ. శ. 1500-1530 అని భావింపవచ్చును."[1] కవి కాలము నూహించుటకు కృత్యాది పూర్వాంధ్ర కవిస్తుతి తోడ్పడుననుట కిది ఒక నిదర్శనము. చాగంటి శేషయ్యగారు మాత్రము కొరవి గోపరాజుకాలము 1430-1490 అని నిర్ణయించినారు.[2]

---

1. చూ. సమగ్రాంధ్ర సాహిత్యము vii, పుట 25.
2. ఆంధ్రకవి తరంగిణి VI, పుట 147.

ఈ పిల్లలమఱ్ఱి వీరరాజు శ్రీనాథుడు హరవిలాస పీఠిక (ప. 30) లో పేర్కొనిన పిల్లలమఱ్ఱి పెద్దన్న యగునని డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు అభిప్రాయపడిరి.[1] పై పద్యమున పేర్కొనబడిన నాగరాజే పశుపతి నాగనాథకవి అని నిడుదవోలు వేంకటరావుగారు భావించిరి.[2]

ఎడపాటి ఎఱ్ఱన తన శృంగార మల్హణ చరిత్రలో పూర్వాంధ్ర కవుల పేర్కొని ఇట్లు స్తుతించినాడు:

"వినుతులొనరు నాంధ్ర సుకవి ప్రభునన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేమనలఁ బోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్"

శరభాంకుడు 15 వ శతాబ్దికి పూర్వుడై యుండును. లింగమకుంట తిమ్మకవి తన సులక్షణసారమున శరభాంకుని దిట్టుపద్యమొకటి ఉదాహరించినాడు.

తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి అను జంటకవులు తమ నాగరఖండము[3]లో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, సాధుడు, అధర్వణుడు, చంద్రమౌళి, భాస్కరుడు, అనంతుడు శ్రీనాథుడు, భీముడు, సోముడు, అమరేంద్రుడు-అనువారిని స్తుతించినారు. వీరిలో చంద్రమౌళి హరిశ్చంద్రకథను పద్యకావ్యముగా రచించినట్లు ప్రబంధరత్నావళివలన తెలియుచున్నది. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములోని "అకటా చేరెడు నేలకుం దగఁదె..." అను పద్యము చంద్రమౌళి రచించినట్లు గణపవరపు వేంకటకవి తన ఆంధ్రకౌముదియందు తెల్పియున్నాడు.

కూచిరాజు ఎఱ్ఱన (1450-1500) తన సకలనీతికథానిధానము నందలి పూర్వాంధ్రకవిస్తుతిలో మారననుకూడ చేర్చి స్తుతించినాడు. మారనను స్తుతించిన వారిలో ఇతడే మొదటివాడు. ఆ పద్య మిది:

"వినుతి యొనర్తు నాంధ్ర సుకవీంద్రుల నన్నయ భట్టుఁ దిక్కయ
జ్వను నమరేశ్వరున్ జెదలువాడ మహాత్ముని మారనార్యు నా
చన సుతు సోము భాస్కరుని జక్కయనుం గవి సార్వభౌమునిన్
వనరుహ పుత్ర సన్నిభుల వర్ణిత కావ్య కళావిధిజ్ఞులన్"

—సకలనీతి కథానిధానము (1-8)

---

1. పద్యకథా వాఙ్మయము—ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1952-53)
2. భారతి-జూలై, 1945.
3. అముద్రితము R. 294 (సమగ్రాంధ్ర సాహిత్యము IX పుట 163 లో సుదాహరింపబడిన పద్యమునుండి)

ఇట్లు ఆంధ్రకావ్యావతారికలలోని పూర్వాంధ్ర కవిస్తుతివలన అపూర్వముగా ఎందరో తెలుగు కవులు మనకు తెలియుచున్నారు. ప్రాచీనాంధ్ర కవుల చరిత్ర వ్రాయగోరువారికి ఈ కవిస్తుతి చాల నుపకరించును. కృష్ణకవి ఆంధ్ర కవులను మాత్రమే స్తుతించిన ఆంధ్రకవి పక్షపాతి. శకుంతలాపరిణయమున (1-5) అతడు చేసిన కవిస్తుతి గమనింపుడు:

"సోము నన్నపఁ దిక్కన సోమయాజి
భీము శ్రీనాథు భాస్కరుఁ బెద్దనార్యుఁ
బోతనామాత్యు మఱియును బొలుపుఁ గాంచు
నాంధ్ర కవితా నిశాంతుల నభినుతింతు"

రామరాజభూషణుడు బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున ప్రాగల్భ్యమును చూపిన కవులను ఒక పద్యములో స్తుతించినాడు.

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్"
—వసుచరిత్ర (1-10)

ప్రాచీనాంధ్ర కవులను మాత్రమే గాక వారి కవితా గుణములను కూడ పేర్కొని స్మరించుట ఈ కవిస్తుతిలో కలదు. వేమారెడ్డి తన్ను ప్రశంసించినట్లు కాశీఖండ పీఠికలో శ్రీనాథుడు ఈ క్రింది పద్యమును చెప్పినాడు.

"వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్క మాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధమున నొక్కొక్క మాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని త్రోవ
సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు"

భీమకవి ఉద్దండ లీల, నన్నయ ఉభయ వాక్ప్రౌఢత్వము, తిక్కన రసా భ్యుచితబంధము, ప్రబంధ పరమేశ్వరుని సూక్తి వైచిత్రి కలుగ ఒక్కొక్కప్పుడు

ఒక్కొక్క విన్యాసముతో వచియించు వైదగ్ధ్యము శ్రీనాథుని సొమ్ము అని పైపద్యమునుబట్టి వ్యక్తమగును. దీనినిబట్టి పూర్వాంధ్ర కవుల కవితా లక్షణములతోపాటు వానిని పేర్కొనిన కవి కవిత్వాశయములుకూడ తెలియుచున్నవి. రామరాజు రంగప్ప సాంబోపాఖ్యానము (1-58) లో నన్నయ మార్గము, తిక్కన సూక్తి ఫక్కిక, ఎఱ్ఱన ఫణితి, నాచన సోముని గీర్విభవము, రావిపాటి తిప్పన్న వచస్థేమము, శ్రీనాథుని ఉక్తి కొంత నిగుడునట్లు కవిత చెప్పెదనని ప్రతిజ్ఞ చేసినాడు.

ప్రసిద్ధ తెలుగు కవుల బిరుదములనో, వారి కవితా గుణములనో పేర్కొని తన్మూలమున పూర్వకవులను స్తుతించుట అప్పకవీయమువంటి కావ్యములందు కానదగును. అప్పకవీయములోని పూర్వాంధ్ర కవి స్తుతిని చూడుడు :

సీ. శబ్దశాసను పాద జలజంబులు భజించి
యుభయ సత్కవి మిత్రు నభినుతించి
శంభుదాసునకు నంజలి వేడ్క నొనరించి
సహజ పాండిత్యుని సంస్మరించి
సకల విద్యాసనాథ కవీంద్రుఁ గొనియాడి
సౌజన్య జేయు వాక్సరణిఁ బొగడి
తగ నంధ్ర కవితా పితామహు వర్ణించి
సుజన విధేయు హెచ్చుగ నుతించి

తే. "రామరాజ విభూషణ రత్న ఖచిత
చారుమస్త కలాపాది హారి వాక్య
గౌరవము పెక్కు భంగుల గణన చేసి
పిదప నితరాంధ్ర కవులకుఁ బ్రియము వలికి"

—అప్పకవీయము (1-27)

పూర్వకవులను మాత్రమే గాక సమకాలికాంధ్ర కవులను కూడ కొందరు తమ కవి స్తుతిలో పేర్కొనినారు. ఎఱ్ఱన నృసింహ పురాణావతారిక (1-10) లోని కవిస్తుతిని చూడుడు :

"కొండియుఁ దొల్లిటి యిప్పటి
పండితుల మహాకవిత్వ పదవీ గరిమా
ఖండితుల నతుల తేజో
మండితులఁ దలంతు నిండు మనమున నెపుడున్"

పూర్వకవులతోపాటు వర్తమాన కవులను కూడ పేర్కొనిన వారిలో ముఖ్యులు వీరు—పోతన, మొల్ల, అప్పకవి, పోతన, అప్పకవి—వీరు భావి కవులకు కూడ ప్రియము పల్కినారు. ఇది ఆ కవుల వినయ సంపన్నతను వ్యక్తము చేయును.

పూర్వ కవిస్తుతిలో తమ పితామహ ప్రపితామహులను కవులుగా కీర్తించిన వారిలో ముఖ్యులు శ్రీనాథుడు, కాకమాని మూర్తికవి. ఈ విషయము వెనుకటి ప్రకరణములో వివరింపబడినది.

ఇట్లు కృత్యాది కవిస్తుతివలన అపూర్వముగా పెక్కుమంది కవులు, వారి కవితా లక్షణములు మనకు తెలియుటే కాక ఆయాకవులను గూర్చిన విశేషాంశములనుబట్టి వారి వ్యక్తిత్వమునుగూడ కొంతవరకు తెలిసికొనవచ్చును.

పూర్వాంధ్ర కవులను పేరుపేరున పేర్కొనక పోయినను సుకవులను వారి కవితా గరిమమును స్తుతించుట కొన్ని కావ్యావతారికలందు కలదు.

"గుణదోషంబు లెఱిఁగి యిది
గుణ మిది దోష మని పూజఁ గొందురు సుకవుల్"

అని ఆంధ్రభాషా భూషణములో కేతన సుకవులను గూర్చి తెల్పినాడు. "పురాతన సుకవుల సాహిత్యము పనుపఱచిన యట్టి సరసభాషా సరణిన్" ప్రబోధ చంద్రోదయమును రచింపబూనిన నందిమల్లయ ఘంటసింగనలు సుకవుల నీరీతిగా కొనియాడినారు.

"పోరిఁ బోరి నొప్పు సలాకల
నోరసిన కుందనపు బూఁదెయును బోలె సభన్
సురసుల సంఘర్షణమున
వరకవి కావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్"
—ప్రబోధ చంద్రోదయము (1-29)

సంకుసాల నృసింహకవి తన కవికర్ణరసాయనమున సుకవులను వారి కవిత్వమునుగూర్చి నాల్గు పద్యములలో వివరించినాడు. ఘనమతులైన సత్కవులు అందరికిని అకారణ బంధువులు. వారు మనసులో 'నెవ్వగ' మాన్పి కావ్యానందమును కల్గించెదరు. కథాముఖములో ఇంపుగా హితాహిత బోధచేయుదురు. ఇంద్రియాతీతమైన భావములను మహాద్భుతముగా తెలియజేయుదురు. ఈ పద్యమును చూడుడు :

"మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం
బనఘ కథా ముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ
గనుగొను కంటె నద్భుతముగా నెరిగింతు రతీంద్రి యార్థముల్
ఘనమతులెల్ల వారికి నకారణబంధులు గారె సత్కవుల్"

—కవికర్ణ రసాయనము (1-8)

అకారణ బంధువులైన, సత్కవుల నభిమానించినవాడగుటచేతనే నృసింహకవి తన కావ్యమునకు 'కవి కర్ణరసాయనమ'ని పేరుపెట్టి యుండును.

సింహాసన ద్వాత్రింశిక, వైజయంతీ విలాసము, బిల్హణీయము ఇత్యాది కావ్యావతారికలందుకూడ సుకవుల ప్రశంస కలదు. కేతనాదులు తమ కవిత 'సకల సుకవి జన ప్రసాద' మని ఆశ్వాసాంత గద్యలలో తెల్పినారు. శ్రీనాథుడు, దూబగుంట నారాయణకవి మున్నగువారు 'సుకవి జన విధేయుల'మని ఆశ్వాసాంత గద్యలందు పేర్కొనినారు.

'విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద" నని నన్నయ భారతావతారికలో విద్వజ్జనమును ప్రశంసించినాడు. "అపార శబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులు, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర సార గరీయః ప్రతిభులైన తార్కికులు, వైణికగాయకులు నాదిగా" (1-8) గల విద్వజ్జనము రాజరాజ నరేంద్రుని ఆస్థానమున నుండినట్లు నన్నయ భారతావతారికలో తెల్పినాడు. నన్నయ కావ్య శ్రోతృతా పారంగతములయిన సత్సభాంతరములను ఇట్లు కొనియాడినాడు :

"పరమ వివేక సౌరభవిభాసిత సద్గుణ పుంజ వారిజో
త్కర రుచిరంబులై సకల గమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీ వనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్"

—భార. ఆదిపర్వము (1-24)

**ఇది ఎవరి నుద్దేశించి చెప్పినదో తెలియదు. పండిత పరిషత్తుల మూలమున గ్రంథముల గుణాగుణములు నిర్ణయించు సంప్రదాయము ప్రాచీన కాలమున**

నుండెడిది. బౌద్ధులకు సంఘారామములు, తమిళులకు సంగములు పూర్వకాలమున నుండెడివి. కావ్యప్రాశస్త్య నిర్ణయమునకే ఈ పరిషత్తులు ఏర్పడినవి. తమిళ సంగములవంటివే నన్నయ పేర్కొనిన సత్సభాంతరములుకూడ. కవిరాజ మార్గమున కూడ అతిశయధవళుని (నృపతుంగుని) సభావర్ణనము కలదు.

పలువురు తెలుగు కవులు తమ కావ్యావతారికలందు విద్వజ్జనమును స్మరించియున్నారు. నన్నెచోడుడు కృత 'వస్తు' సమితికి మది నెఱుగు విబుధ వర్గమును తలచినాడు. తిక్కన తన నిర్వచనోత్తరరామాయణమును సరసులైన వారి కప్పుడప్పుడు వినిపించుచు వారి సమ్మతి పడయుచుండె నని ఈ క్రింది పద్య మునుబట్టి ఊహింపవచ్చును :

"ఎట్టి కవికైనఁ దన కృతి యింపుఁ బెంపఁ
జాలుఁ గావునఁ గావ్యంబు సరసులైన
కవుల చెవులకు నెక్కినఁ గాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు"

—నిర్వచనోత్తరరామాయణము (1-9)

'విద్వజ్జనానుగ్రహము వడసి'యే మారన మార్కండేయ పురాణమును రచించినాడు. మడికి సింగన విద్వత్సింహముల నిట్లు భజించినాడు :

"అద్వైత తత్త్వ మతుల జ
గద్విదిత విశాల యశుల గతకలుషుల, రా
గద్వేష లోభ రహితుల
విద్వత్సింహముల వేద విదుల భజింతున్"

—వాసిష్ఠరామాయణము (1-6)

శ్రీనాథుడు 'మృదు మధుర చిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరుల'ను కొనియాడినాడు. భీమేశ్వర పురాణావతారికలో విద్యాగోష్ఠులలో వేశ్యలకు కూడ ప్రముఖస్థానమున్నట్లు తెలిపినాడు.

'పాయక పాకశాసనికి భారత ఘోరరణమ్మునందు నారాయణునట్లు' నారాయణభట్టు తనకు తోడ్పడినందుకు నన్నయ భారతారంభమున తన కృతజ్ఞతను తెల్పియున్నాడు. ఆంధ్ర భారత కవితా రచనను గురించిన తీవ్రమైన విద్వత్కలహములో నన్నయకు అతడి సహాధ్యాయుడును, వివిధ భాషా కోవిదుడును నగు

నారాయణభట్టు సహాయపడియుండును. నన్నయ నారాయణభట్టు సాహాయ్యమును స్మరించుట అతని విశాలహృదయమును సువ్యక్తముచేయును. బిల్హణీయమున కూడ నరసింహాచార్యుల సాహాయ్యమును పండిపెద్ది కృష్ణస్వామి ఇట్లు కీర్తించి నట్లు కలదు:

> "మున్నింద్ర తనూభవునకు
> వెన్నుండు సహాయుఁ డైన విధమున నేనా
> సన్నుత సద్గుణ గణసం
> పన్నుండగు కవివరాధిప సహాయమునన్" (1-10)

చేకుమళ్ల రంగశాయి, కంకంటి పాపరాజు, కంకంటి నరసింహము—వీరు తమ గ్రంథరచనలందు తమకు తోడ్పడిన పుష్పగిరి తిమ్మనను తమ గ్రంథములందు పేర్కొని స్తుతించినారు.

అవతారికలందు పూర్వకవుల నామములను పేర్కొని స్తుతించుటే గాక గ్రంథరచనకు తోడ్పడిన వారిని, ఇతర సత్కవులను, విద్వజ్జనములను ప్రశంసించుటయు కొన్ని కావ్యములందు కన్పించును.

# 6

# కుకవి నింద

తెలుగుకవులు కొందరు కావ్యావతారికలందు సుకవిస్తుతితోపాటు కుకవి నిందగూడ గావించియున్నారు. కుకవులన నిట్టివారని ప్రాచీనాంధ్రలాక్షణికులెవ్వరును స్పష్టముగా నిర్వచింపలేదు. నిర్వచించుటకు వీలును లేదు. వ్యతిరేకలక్షణ దుష్కవులు లేనినాడు సుకవులకు ప్రసిద్ధిలేదు, కనుక తెలుగు కావ్యావతారికలలోని ఈ కుకవినింద సుకవుల కధికవిఖ్యాతిని గల్గించుటయేగాక కొంతవరకు కవులవ్యక్తిత్వమును, వారి కవితామతములను చాటుచున్నది. కావ్యక్రమాగతాచారము ననుసరించుటకో లేక కవులు తమ ప్రతిపక్షులను తూలనాడుటకో కుకవినిందను కావ్యావతారికలలో ప్రవేశపెట్టియుందురు.

సంస్కృతకవులలో భట్టబాణుడు తప్ప ప్రాచీన కవులెవ్వరును కుకవి నిందను తమగ్రంథములందు చేసినట్లు కానరాదు. ప్రాకృత, కన్నడకావ్యములందు కృత్యాదిని కుకవినింద కలదు. తెలుగుకావ్యములలో పెక్కింట సుకవిస్తుతితరువాత కుకవినింద నిర్వహింపబడినది.

ఈ కుకవినిందాసంప్రదాయము తెలుగులో ఒక క్రమపద్ధతిలో నియతముగా నున్నట్లు తోచదు. నన్నయ మహాభారతమున కుకవినిందను చేయలేదు. కృత్యాదిని కుకవినిందను చేసిన మొట్టమొదటి తెలుగుకవి నన్నెచోడుడు. అతని తరువాతి వాడగు పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రావతారికలోమాత్రమే కుకవి నిందను చేసినాడు. రంగనాథరామాయణమున కుకవినిందలేదు. తిక్కన నిర్వచ

నో_త్తరరామాయణమునందు కుకవినింద యున్నను భారతమున లేదు. కేతన దశ కుమారచరిత్రలో కుకవినింద లేదు కాని ఆంధ్రభాషాభూషణములో మాత్రము-

"గుణదోషము లెఱుఁగక దు
ర్గుణములె గుణములని పూజఁ గొందురు కుకవుల్"

—ఆంధ్రభాషాభూషణము (1-10)

అని తెల్పియున్నాడు. కాని ఇది కృత్యాదికుకవినింద వంటిది గాదు. మారనగాని మంచనగాని కుకవినిరసనము చేయలేదు. ఒకవిధముగా మంచన కేయూరబాహు చరిత్రలోని "బాలరసాలపుష్ప నవపల్లవకోమలకావ్యకన్యకన్ గూళలకిచ్చి...." (1-13)అనుపద్యము[1] కుకవినిందను స్ఫురింపచేయుచున్నదని చెప్పవచ్చును. ఎఱ్ఱన గ్రంథములలో కుకవినిరసనము కానరాదు. కుకవినింద తరువాతి కావ్యములం దున్నను కవులకిది నియతముగా పాటింపవలసిన సంప్రదాయముమాత్రము కాదు.

కుకవులను పేరిట ఇతరులను నిందించుచు స్వగుణముల నుగ్గడించుట సత్పురుషలక్షణము కాదని భావించియో, పాఠకులకు తమ గ్రంథములందు కలుగగల ఆదరాభిమానములకు భంగముకలిగించుననియో, ఇది అప్రస్తుతప్రసంగమని తలచియో కొందరుకవులు కుకవినిందను పరిహరించియుండవచ్చును. మరికొందరుకవులు కుకవినిందను విడువరాని కవిసమయముగాతలచి తమకావ్యములందు నియమముగా అనుసరించి రచించియుండవచ్చును. సంకుసాలనృసింహకవి గ్రంథావతారికలోనే గాక గ్రంథభాగములోకూడ కుకవిత్వమునుగురించి యెత్తిపొడిచినాడు. ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యములో కృత్యాదిని కుకవినిందను ప్రత్యేకముగా చేయకున్నను తిమ్మట నత్కీరునికథలో కవుల విద్యామాత్సర్యమును చిత్రించినాడు. పరనిందాపరులైనకవులను ధూర్జటి తనకాళహస్తిశతకములో మిక్కిలి గర్హించినాడు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు తనకావ్యములలో ప్రత్యేకముగ కుకవినిందచేయలేదు కాని జైమినిభారతగ్రంథాంతమునమాత్రము "కుకవిమల్లకషోల్లపత్కులిశహస్తపల్లవుడ" నని తన్నుగూర్చి చెప్పికొనెను. ముఖ్యములగు తెలుగుకావ్యములలోని కుకవినిందను కొంత పరిశీలింతము.

నన్నెచోడుడు తనకుమారసంభవమున పూర్వకవిస్తుతిచేసినతరువాత "దోషగ్రాహులఁగు కుకవివరాకులం బరిహరించితి నెట్లనిన" అని వచనగా మూఁడుపద్యము

1. ఇది పోతనచాటువుగా లోకమునఁబ్రసిద్ధి.

లలో కుకవులను నిందించి అంతటితోతృప్తిపడక 'కావున' అని చిన్నవచనము చెప్పి మరొకపద్యములోతిట్టి 'అదియెట్లనిన' అని మరొకవచనముఅతికి తరువాతి పద్యములలో కావ్యప్రశస్తిని చెప్పినాడు. నన్నయ 'మార్గ' కవితకు భిన్నముగ, 'దేశి' సంప్రదాయమునకు ప్రాధాన్యమునిచ్చి, శివోత్కర్షను ప్రధానముగ నిరూపించుచు నన్నెచోడుడు తనకుమారసంభవమును 'ప్రబంధ' మార్గమున రచింప బూనుకొనుటచే "దోషగ్రాహులగు కుకవు"లు అడుగడుగున అతని నెదుర్కొని యుందురు. కనుక వారిని తీవ్రముగ పరిహరింపవలసినఅవసరము నన్నెచోడునికి కల్గియుండును.

నన్నెచోడుడు "దుర్మార్గపదవర్తు లనఁదగు" మార్గకవిత్వాభిమానులను ఈ క్రింది పద్యమున నిరసించినాడు.

"మార్గ కు మార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గ పదవర్తులనఁ దగు
మార్గ వులం దలఁప నలఁతి మహి సుకవులకున్"

—కుమారసంభవము (1-28)

ఈ మార్గదేశికవు లనుభేదమును నన్నెచోడునికితరువాతి కవులెవ్వరును పాటింప లేదు.

బాణుడు హర్షచరిత్రలో-

"సంతి శ్వాన ఇవాసంఖ్యా జాతి భాజో గృహే గృహే
ఉత్పాదకా న బహవః కవయ శ్శరభా ఇవ"

—హర్షచరిత్రము. 1 వ ఉచ్ఛ్వాసము-5 వ పద్యం.

అని కుకవులను కుక్కలతో పోల్చిచెప్పినాడు. నన్నెచోడుడు తన కుమారసంభవమున కుకవినిందాసందర్భమున,

"చెనసి గుణమైన దోషంబు సేయ నేర్చుఁ
గుకవి కృతులందు దోసంబు గుణము సేయ
నేరఁ డది యట్ల దొంతులు సేరి నాయి
దోర్వ నేర్చుఁగా కది యేమి సేర్వ నేర్చు" (1-29)

అనుపద్యమును రచించినాడు. నన్నెచోడునికి తరువాత మడికిసింగన, కొరవి గోపరాజు మొదలగువారు కుకవులను కుక్కలతోపోల్చి కుకవినింద గావించియున్నారు.

"కదిసిన నోరవోయి యొరుకబ్బపు దొంతుల సత్పదార్థముల్
గదుపుచు, సెట్టివారిఁ బొడఁగన్నను గుబ్బని, స్నేహసౌఖ్యముల్
మదికి నసహ్యమై, కునక మార్గమునం జరియించు చున్న దు
ష్పదకవులెల్ల మత్కవితఁ దప్పులు వట్టక వింద్రు గావుతన్"
—మడికిసింగన, వాషిష్ఠరామాయణము (1-7)

"భావరసానుకూల మృదుపాక పదార్థ సమృద్ధి లోకసం
భావన నొప్పు కావ్యముల మర్మము గానఁగ లేక దుర్మతుల్
కావనఁ గాని యెట్టి కడఁ గట్టడిఁ జెప్పఁ గనేర, రెల్లెడం
ద్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే"
—సింహాసనద్వాత్రింశిక (1-16)

కుకవులను పిప్పిమీదవ్రాలు ఈఁగలతో పోల్చి నన్నెచోడుడుచెప్పిన ఈ పద్యమును పరికింపుడు :

"తెలియ రసవంతమగు కృతి కెఱఁగ నేర
రల్ప రసకృతి కెఱఁగుదు రలుపు లెల్లఁ
జెఱకు విడిచిన రసమున కెఱఁగి రాక
పిప్పి కరిగెడు నీఁగల పెల్లు వోలె"
—కుమారసంభవము (1-30)

నన్నెచోడునివలె కుకవులను ఈఁగలతో పోల్చి కుకవినిందనుచేసినకవులలో ముఖ్యులు వీరు-దగ్గుపల్లి దుగ్గన, చిత్రకవి సింగనాచార్యుడు, కనుపర్తి అబ్బయామాత్యుడు. ఈఁగలు వ్రణమర్మములను వెదకునట్లు దుష్కవులు దోసములను వెదుకజూతురని దుగ్గన తన నాసికేతోపాఖ్యానావతారికలో ఇట్లు తెల్పియున్నాడు :

"సలలిత కావ్య బృందముల జాణలు కావ్య రసానుబంధ రీ
తులు గొని యాడ దుష్కవులు దోషము లెన్నఁగఁ జూతు రట్టె యా
వెలఁదుల మేననేర్పరులు విభ్రమ లీలలు చూచి మెచ్చ నీఁ
గలు వ్రణమర్మముల్ వెదకుఁ గాక యెఱుంగునె తద్విలాసముల్"
—నాసికేతోపాఖ్యానము (1-9)

నేర్పరులు వెలఁదుల విలాసవిభ్రమలీలలను మెచ్చుకొనినట్లు కావ్యరసానుబంధరీతులను కొనియాడుదురట. ఇందు దుగ్గన కవితావిలాసములు వ్యక్తపరుపబడినవి. దుగ్గన 'కవితావిలాసభాసమానుండు' కనుకనే అతడు కవితావిలాసములనే ఈ పద్యమున నెక్కువగ తడివినాడు.

"సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగఁ బోరు మ
క్షిక వితతుల్ వ్రణంబు పరికించు గతిం గొదవల్ గణించుటల్
కుకవుల నైజబుద్ధి తెరలోఁ కథ చొప్పన బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమ లుండవె పెక్కులు వెక్కిరించుచున్"
—అబ్బయామాత్యుడు, అనిరుద్ధచరిత్రము (1-12)

"పలుమఱుఁ దప్పులే వెతకఁ బాల్పడి యుండుటగాక దుష్కవుల్
తెలియఁగఁ జాలుటెట్లు రసదీపక కావ్య కళారహస్యముల్
తలఁపఁ బ్రపూతిహేయ కలిత వ్రణశోధన వాంఛగాక యీఁ
గలకుఁ బటీర చర్చిత సుగంధ తనుస్థితి బుద్ధిగల్గునే"
— కవిరాజ మనోరంజనము (1-12)

"నిర్మలావయవమ్ముల నెమ్మి విడిచి
వ్రణములకుఁ బాఱు మక్షికా ప్రతతి భంగి
నొప్పులు గ్రహింప కెప్పుడుఁ దప్పు లరయు
కాకవుల లోకముల నే నిరాకరింతు"
—సింగనార్యుని బిల్హణీయము (1-4)

శంకరకవి కుకవులను దర్వీకరరాజికి పోల్చి ఇట్లు చెప్పినాడు :

"పైకొను కాంక్షఁ జేఁ దగిలి పల్మఱు ఫీకర లోభి గేహ వ
ల్మీకములందుఁ బాయని యమేయ మదోద్ధతదుష్కవీంద్ర ద
ర్వీకరరాజికిన్ వివిధ విశ్రుత కావ్య కళా విశేష దీ
క్షా కుశలార్య తంత్రములు గారుడ మంత్రము లెందు నారయన్"
— హరిశ్చంద్రోపాఖ్యానము (1-14)

కుకవి యెప్పుడైనను సత్కవి కాలేదని చెప్పుచు ఎడపాటి ఎఱ్ఱన తన మల్హణచరిత్రయం దిట్లు నుడివినాడు :

"చెలరేగి యంత కంతకుఁ
జలమున వాఁ దడవఁ గుకవి సత్కవి యగునే
యిలలోన నెంత బలిసినఁ
జెలఁగి వరాహంబు గంధ సింధుర మగునే ?"

ముద్దుపళని కుకవులను అమంగళజనులని పేర్కొని ఇట్లు నిందించినది :

"పాత్రమున నుండు శల్యంబు లెత్తివేచి
శాస్త్రయుక్తిని గాని భేషజంబు సేయఁ
గఁ దగు నాక్షేప జీవక కవులఁ దీర్పఁ
జనదు కృతుల నమంగళజనులు వారు"

— రాధికాసాంత్వనము (1-6)

కాకమానిమూర్తికవి కుకవికిని దొంగకును అభేదమును పాటించి అపూర్వముగా ఈ క్రింది పద్యమును రచించినాడు:

"నవవచో రచన లెంతయు నెఱింగింపఁడు
తమిని రంధ్రాన్వేషణమున కుబ్బు
శబ్దంబు నెరవు నెచ్చటికిఁ జేరఁగ రాఁడు
నలి కళానిధి వర్ణనమున కులుకు
మొదలేరుపడఁ బాదములు ప్రయోగింపఁడు
కులదీప కాసహ్యగుణము లెంచు
బోధ దూరుల యిండ్ల భూషణంబులు దాల్చు
సరస విద్య విచార గరిమఁ జనఁడు
పరవినీత ప్రబంధముల్ భంగపఱుప
మొగిసి ప్రాసంబు చేతనే మోసపోవు
సాధుజన సంచిత పదార్థ చౌర్యరతుఁడు
మైత్రికి నమైత్రికిని ధాత్రిఁ బాత్ర మగుచు"

—రాజవాహనవిజయము (1-13)

దామెరల వెంగళనాయకుడు తన బహుళాశ్వచరిత్రలో కుకవినిందను తవివి తీర పలురీతుల చేసియున్నాడు. చూడుడు:

"శబ్దదరిద్రుఁడై శారదాభ్రముఁ బోలుఁ
బ్రాసంబు విడిచి సంత్రాసిఁ బోలు
నపహృతాన్యాలంక్రియతఁ దస్కరునిఁ బోలుఁ
బృథులార్థ దూరుఁడై పేదఁ బోలు
విగళితౌజస్కుఁడై పగలింటి నెలఁబోలు
నవిదిత ధ్వనికుఁడై చెవిటిఁ బోలు
పద్యానభిజ్ఞతాభంగిఁ బంగవుఁ బోలు
భిన్నమాధుర్యుఁడై పిప్పిఁ బోలు

ముక్తసూక్తప్రసాదుఁడై మూర్ఖుఁబోలు,
జీర్ణ పాదత నదియొడ్డు చెట్టుఁబోలు
లుప్తసముదాయ భావుఁడై లోభిఁబోలు,
సుకవి వాసరధవ దివాంధకవి కుకవి"

"అంగడి యంగడిం దిరుగులాడుటకుం బలు విత్తు లిష్టతిం
బొంగుచుఁ గాసు గవ్వకుఁ బోవుచుఁ బెక్కు పదార్థము ల్గ్రహిం
పం గొఱగాక రోఁతలకుఁ బాల్పడి బిట్టుడికింప ద్రోఁత లె
ల్లం గను కూరగాయ కవులన్ సరకించుక సేతురే కవుల్"

—బహుళాశ్వచరిత్రము (1-10, 11)

లింగనమఖికామేశ్వరకవి తనసత్యభామాసాంత్వనములో కుకవుల స్వభావాదులను అనేకోపమానములతో మొరటుగా చిత్రించినాడు.

"ప్రౌఢులతోఁ బాము పగిదిని పగ చాటి
తెలియకుండను తేలువలెను మీటి
వెసముక్కు దూసిన పసరంబువలెఁ ద్రుళ్లి
బంతిక్రియను బెట్టు పడుచు మళ్లి
కాకికైవడి నింపుగాని కూఁతలు వెట్టి
మేఁకవలెను గన్ను మెక్కఁ బెట్టి
మాట దోఁచక కొంగమాడ్కి ధ్యానము చేసి
యడవి మెకము దారి నాకు రాసి

తికమకలు చెంది మది వకావకలు పొంది,
వికలతను మూఁగ యల్లిక వెగటు గాఁగ
జాఁగ తనమునఁగవినంచు రాయిడించు
కుకవి నుడిగుండ్లు మనుఁ గాతఁ గోటియేండ్లు"

—సత్యభామాసాంత్వనము (అవతారిక)

శేషము వేంకటపతి శశాంకవిజయములో కుకవుల దీనావస్థను ఇట్లు వర్ణించినాడు:

"పరపాకంబులఁ గోరి యెందుకయినం బ్రాల్మాలి వృత్త్యర్థమై
యొరు పాదంబుల నంటి యర్థ కలనా యోగంబు లేమి న్నిరం
తర చింతం దగు రీతి దోపఁక వివర్ణత్వంబునన్ దీనులౌ
నరులం జూచి సుదృగ్జనంబు రసవన్నర్మోక్తులం బల్కునే" (1-20)

ఈ కుకవులను తిక్కన 'దుర్విటు' లనియు, శ్రీనాథుడు, పాలవేకరి కదిరీపతి నాయకుడు, రఘునాథ నాయకుడు (రఘునాథ రామాయణము 1-13 లో) మొదలగువారు 'కాకు'లనియు, కొరవి గోపరాజు 'బాగురుఁ బిల్లు' లనియు, నంది మల్లయ ఘంటసింగనలు (వరాహపురాణములో) 'కీటకము' లనియు, తాళ్లపాక చిన్నన్న (అష్టమహిషీ కల్యాణములో) 'మంకుదోతు' లనియు ఇంకను పలువురు కవులు పలురీతులుగా నిర్దాక్షిణ్యముగా నిందించి అపూర్వములగు పద్యములను రచించినారు. అజ్ఞులని, అవివేకులని, మూఢస్వాంతులని పెక్కురీతుల కుకవులను వారు తమ గ్రంథావతారికలలో నిందించి యుండుటవలన మనకు కుకవుల స్వభావాదులు వ్యక్తమగుచున్నవి.

కవుల కవితా లక్షణము లెరుంగుటకు కృత్యాది కుకవినింద కొంతవరకు తోడ్పడుచున్నది. తద్జ్ఞునందేగాని అజ్ఞునందు కవితా విశేషములు తెలియంగ రావని నన్నెచోడుడు ఇట్లు తెల్పినాడు :

"తద్జ్ఞునం దెర్గ నగు కవితా విశేష
మజ్ఞునం దేమి యెఱుఁగంగ నగు సమస్త
కనక వర్ణోత్కరమ్మొరగంట నొరసి
చూచి కాకెర్గ వచ్చునె సుద్దరాత"

—కుమారసంభవము (1-32)

వృథామత్సరగ్రస్తులై, వృథా గర్వాంధులై కవితా ప్రౌఢిమ లేక అజ్ఞులై యుండు కుకవులను నిరసించుచు జక్కన తన కవితాలక్షణములను కొంతవరకు సూచించినాడు. చూడుడు :

మ. "నవశబ్దార్థ రసాను బంధ పదవిన్యాస క్రియా భావ గా
రవ పాక ధ్వని రీతి శయ్యలఁ గవీంద్ర శ్రేణి కావ్యాళిఁ జె
ప్ప వృథామత్సర మూని దుష్కవులుఁ జెప్పం జూతు రల్లే కదా
శివుఁడుం దాండవ మాడ నాడవె పిశాచీ భూత బేతాళముల్"

మ. నవనానారస భాస్వరార్థ పద విన్యాస క్రియాలంక్రియా
శ్రవణానంద కథా సుధామయ మహా సారస్వతాంభోధిలో
నవలీలన్ విహరించు తద్జ్ఞులు గతాహంకారులై యుండఁగాఁ
గవితా ప్రౌఢిమ లేని యజ్ఞులు వృథా గర్వాంధు లే లౌదురో!

క. "ప్రతిపద్యముఁ జోద్యముగాఁ
గృతి జెప్పిన నొప్పుఁ గాక కృతి నొక పద్యం
బతి మూఢుఁడైనఁ జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షర న్యాయమునన్"

—విక్రమార్క చరిత్రము (1-15, 16, 17)

నవశబ్దార్థప్రధానముగాను, రసానుబంధముగాను, పదవిన్యాసముతోడను, క్రియాభావ గౌరవముతోడను, పాక, ధ్వని, రీతి, శయ్యలతో నొప్పునట్లు కవీంద్రులు కావ్యములను రచింపవలెనని జక్కన చెప్పినాడు. తద్‌జ్ఞులు గతాహంకారులై 'నానారస భాస్వరార్థ పదవిన్యాస క్రియాలంక్రియా శ్రవణానంద కథా సుధామయ మహా సారస్వతాంభోధిలో నవలీలన్ విహరించు'దురట. ప్రతిపద్యము చోద్యగాను, హృద్యముగాను నుండునట్లు రచింపవలెనని జక్కన అభిప్రాయము.

అలంకారమున కొకరు, వార్తా సమృద్ధి కొకరు, శబ్ద స్ఫూర్తుల కొకరు, అర్థసృష్టికి వేరొకరు, రసాభోగతకు మరియొకరు, ఉపమాన చర్చికకు, పద ప్రౌఢిమకు, జాతి శ్లాఘకు కొందరును సంతసింతురు. కాని అందరను ఆనందింప జేయుట సాధ్యము కాదు. 'లోకో భిన్నరుచిః' అనెడి సూక్తిని బైచరాజు వేంకటనాథుడు ఎంత సరసముగా వివరించినాడో ఈ క్రింది కుకవినిందను పరిశీలించిన వ్యక్తమగును.

సీ. "ఒకఁ డలంకారంబునకు వేడుక వహించు
నొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడు శబ్దస్ఫూర్తులకు మాయురే యను
నొకఁ డర్థ సృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మస్తముఁ గదల్చు
నొకఁ డుపమాన చర్చికకు నలరు
నొకఁడు పదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు
నొకఁడు జాతి శ్లాఘ కుబ్బుచుండుఁ

తే. గామి చందానఁ దలవరి కరణి బధిరు
వలె దరిద్రుని గతి వాదిపగిదిఁ గనక
కారుచాడ్పునఁ బంగు వైఖరిఁ గుజాతి,
జాడ నిందఱి ముదలింపఁ జాలు టెట్లు"

—పంచతంత్రము (1-14)

కావ్యములో లోపము ఉండవచ్చునని వేంకటనాథుడు తెల్పినాడు. తప్పు లున్నంతమాత్రమున కృతికిగాని, కవికిగాని కళంక మాపాదింపరాదు. గుణపరీక్షణము చేయవలెను కదా! ఈ సందర్భములో వేంకటనాథుడు చెప్పిన పద్యమిది:

"ఒప్పులు గల కృతిలోనొక, తప్పున్నను గడమ గాదు దానికిఁ గళలం
జొప్పడు శశికిఁ గళంకము, కప్పేర్పడి యేమి నిందఁ గావించెనొకో"
—పంచతంత్రము (1-15)

మాదయగారి మల్లన కుకవి నిందను చేయుచు కవితారచన కొక మార్గమును నిర్దేశించినాడు. ఈ క్రింది పద్యమును చూడుడు :

"గాఢార్థ ప్రతిపాదన క్రమ కళా కౌశల్యములేక వా
చాధశ్కార్భటి తోడఁ దామ తము మజ్ఝా యంచుఁ గైవారముల్
ప్రౌఢిన్ జేయుచుఁ బ్రాజ్ఞుల న్నగుచు గర్వగ్రంథులై యుండు న
మ్మూఢ స్వాంతుల మెచ్చకుండుటయ సమ్మోదంబు మాబోంట్లకున్"
—రాజశేఖర చరిత్రము (1-9)

కవిత్వము నిర్దుష్టమై, ప్రౌఢభావ విలసితమై, రసవంతమై అనర్గళ ధారా విలసితమై మనోజ్ఞముగా నుండవలెనని మాదయగారి మల్లన భావమైనట్లు పైపద్యమునుబట్టి తెలియును.

సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనములో సుకవులను, వారి కవిత్వమును గురించి విపులముగా చెప్పిన తరువాత కుకవిత్వమును గురించి సుదీర్ఘముగా ఇట్లు ఎత్తి పొడిచెను.

"పరభుక్తములైన యలం
కరణముల జుగుప్స లేక కైకొని పదవి
స్ఫురణంబు జూపు కుకవిత
పరికింపఁగ లజ్జలేని బానిస గాదే!

సాంతముగాఁగ శబ్దహృదయజ్ఞులు గా రుచిత ప్రయోక్తలై
వింతలుగాఁ బ్రబంధముల వీథులు ద్రొక్కఁగ లేరు శక్తులై
దొంతర జల్లి బొంత వెడదూర్చి గతార్థము గూర్చు దుష్కవి
భ్రాంతుల సందడిం దడవఁ బాసె రసజ్ఞులకుం గవిత్వముల్.

క. కలకంఠ కలనఁ జూపక
కలకంఠంబూరకున్నఁ గాకము కాదే

కలిత నిజ వాగ్విలాసం
బలరింపని తద్జ్ఞుఁ డైన నజ్ఞుండయగుచ్.
ఖలుఁ డిలఁ దప్పరే వెదకఁ గావ్య రసానుభవంబు సేయలేఁ
డొలుకులు కోరుఁ గాక ముదమానఁగ గర్దభ మొంద నేర్చునే
మలయజ మరుద్విఘాత మధు మాస వికస్వర కేసరావళీ
గళిత పరాగ యోగ పరికల్పిత పేశల తల్ప సౌఖ్యముల్"
—కవికర్ణ రసాయనము (1-15,16,17,19)

నృసింహకవి గ్రంథావతారికలోనే గాక గ్రంథభాగములో కూడ అవకాశ మును కల్పించుకొని కుకవిత్వమును నిరసించినాడు. తృతీయాశ్వాసములో రాజ మార్గమున వచ్చు మాంధాతను పౌరకాంతలు సందర్శించు సందర్భమునను, చతుర్థాశ్వాసములో విటవిటీ వర్ణనా సందర్భమునను, మధుపాన క్రీడా సందర్భ మునను నృసింహకవి కుకవి నిరసనమును గావించినాడు:

"ఇలలేనిఁ జూడఁ జనెఁ దమి
లలన యొకతె దడఁ బడిన యలంకారములో
వలయు వడి గూడని పద
స్ఖలనంబును గలిగి కుకవి కవితయుఁ బోలెన్"
3-154

"శ్రవణయోగ్యం బైన శబ్ద మొక్కఁడు లేక
ప్రియముగొల్పెడు నలంక్రియలు లేక
సరసమై మృదువైన శయ్య గల్గుట లేక
యర్థ సంగ్రహము పై సరి లేక
వరుఁడు పట్టిన చోటఁ బ్రత్యుత్తరము లేక
ప్రాణహానికిఁ గొంకపాటు లేక
వర్ణ గౌరవ లాఘవములపై మతిలేక
వృత్తభంగమునకు వెఱపు లేక
తారు దారయ తక్కెవ్వారు నోరులు
దడవ రొక మూలఁ బడి ప్రసిద్ధములు గాక
యపుడవిద్వత్ప్రబంధంబు ననుకరించె
జారిణీ జార నవరహస్సంగమములు"
4-107

"అనుకూలక్రియ చూప నేరక బలవ్యాకృష్టిచే వక్రయై
యనుమానాకులతం బదంబు మృదు శయ్యం గూర్పఁగా లేక చా
ల నిగూఢంబుగ భావముం గుకవితా లక్ష్య స్థితిం జెంది యై
న నవోఢాంగన చేసె వల్లభున కానందంబు డెందంబునన్"

4-166

ఈ కుకవిత్వ నిరసనమువలన నృసింహకవి కవిత్వలక్షణములు కొంత వరకు ఊహింపవచ్చును. నృసింహకవి శబ్దమర్మజ్ఞుండు, రసజ్ఞుడు. అతని కవితా మార్గము స్వచ్ఛందమయినది. అతని యూహలు అనుకరణములు కావు. అవి స్వీయభావనా జన్యములు. అతని అలంకారములు పరభుక్తములు కావు. స్వోపజ్ఞా కల్పితములు. అతని వర్ణనా మహత్త్వము అప్రతిమానము.

రఘునాథనాయకుడు చేసిన కుకవి స్తుతివలన అతని కవిత్వాశయములు వెల్లడియగుచున్నవి. చూడుడు :

"శ్రీకర వాగ్విశుద్ధి విలసిల్లు కవుల్ రస నిర్ఝరీ పరీ
పాకము మించఁ బల్కవగఁ బల్కఁగ నేర్తురె యందు దుష్కవు
ల్కోకిల సంఘము ల్మధుర కోమల లీలలఁ బల్కఁ గాకలీ
కాకు విశేష సుస్వరము కాకుల మూఁకలు పల్కనేర్చునే"

—రఘునాథ రామాయణము (1-13)

"మృదు శబ్ద పారంపరీ పరీపాకంబు
లోకంబు నవ సుధాప్లుతము సేయఁ
గందళ ద్రస గర్భ సందర్భ సంశుద్ధి
బుద్ధిమంతుల తలంపులు గరంప
భంగ్యంతర ధ్వని వ్యంగ్య వైభవ రీతి
నాతియుఁ బోలె నానంద మొసఁగ
నుల్లసద్బహు విధార్థోల్లేఖి వైచిత్ర్య
చిత్రిత ప్రతిమలు శిరసు లూఁపఁ
గవిత చెప్పంగ నేర్చు సత్కవుల కైనఁ
బ్రణతులొనరింతు శంకాకరమ్ము లైన
పెలుచుఁ గబ్బపు దబ్బ ముండలను జెవులు
వొడుచు వారల పేరైన నొడువఁ జాల"

(ర. రా. 1-4)

"కణభుగ్గ్రంథాధ్వనీసుల్ ఘన పద పదవీ గాథ సద్గాథ లీలా
ఫణభృద్భర్తల్ ప్రకృష్యత్ప్రతిభట కవి హృద్భల్లవాగ్భల్లరు ల్లా
క్షణికాలంకారికాగ్రేసరులు నగు బుధుల్ సత్కృతుల్సేయుచోటన్
గణనామాత్రాతి గర్వ గ్రహిళ కుకవి సంఘంబు లే మూల నుండున్"

—రఘునాథ రామాయణము (1-15)

ఇట్లే ప్రౌఢకవి మల్లన, చింతలపూడి యెల్లనార్యుడు, లింగనమఖి కామేశ్వరకవి మొదలగు వారి కవిత్వాశయములు వారి గ్రంథములందలి కృత్యాది కుకవి నిందవలన తెలియుచున్నవి.

తన కాలమున జనప్రచారమునందు లేక కేవలము ప్రాత పడిన మాటలు చేర్చి కొందరు కవులల్లుచుండిరనియు, నవి జనసామాన్యమునకు రుచింపకపోవు చుండెననియు తిక్కన నిర్వచనోత్తరరామాయణమునందు చేసిన కుకవి నింద మూలమున మనకు తెలియుచున్నది.

"పలుకులపొందులేక రసభంగము సేయుచుఁ బ్రాఁత వడ్డ మా
టలఁ దమ నేర్పు చూపి యొకటన్ హృదయం బలరింప లేక యే
పొలమును గాని యట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటు లట్ల చూడఁగాన్"

—నిర్వచనోత్తరరామాయణము (1-6)

ఈ పద్యమున తిక్కన తన కాలము నాటి సాహిత్య వాతావరణమును చక్కగా విశదీకరించినాడు. ఆనాడు కవులు తమ చిత్తము వచ్చినట్లు విచ్చల విడిగా రచించువారు కాబోలు. కుకవులు, దుర్విటులు పలుకుల పొందులేక రస భంగముచేయుచు, ప్రాతపడ్డ మాటలలో తమ నేర్పు చూపుచు హృదయమును వికసింపజేయలేక, ఏదియుగాని పద్ధతిలో పొంగి పోవుచు లోకములో నవ్వులపా లగుదురట. కావ్యనిర్మాణమునకై పూనుకొనిన కవి అన్నిలక్షణములకంటె జనా దరణము ముఖ్యలక్షణముగా గమనింపవలసినదని యొక సూత్రమును తిక్కన ఏర్పరచుకొనినట్లు ఇందుమూలమున వ్యక్తమగుచున్నది.

దుష్ప్రయోగములు చేయు వారిని గురించి కందనామాత్యుడు (1350) ఇట్లు చెప్పినాడు.

"తెలుఁగని చెప్పి సంస్కృతము తీపును నారడి వుచ్చి శబ్దముల్
తెలుగుఁను గాక యే సభలఁ దెల్పఁగ రాని యప ప్రయోగముల్

పలుమరు గ్రుచ్చి పాదదువఁబాడుచుఁ గబ్బపు దబ్బముండ్లచేఁ
బెలుచన కర్ణముల్ పొడుచు బేలు కవిం గవిగాఁ దలంతురే"
—మడికి సింగన, సకలనీతి సమ్మతము

ఈ పద్యములోని భావమునే గోపరాజు ఇట్లు అనుకరించినాడు:

"తెనుఁగునఁదేఁటగాఁ గథలు చెప్పిన కావ్యము పొందు లేదు మె
త్తన పస చాలదంద్రు విశదంబుగ సంస్కృత శబ్ద మూఁదఁజె
ప్పిన నవి దర్భ ముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁదెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్"
—సింహాసన ద్వాత్రింశిక (1-32)

"........శంకాకరిమ్మలైన పెలుచఁ గబ్బపు దబ్బముంతులను జెవులు, వొడుచు వారల పేరైన నొడువఁ జాల" నని రఘునాథనాయకుడు తన రఘునాథ రామాయణము అవతారికలో (1-14) తెల్పినాడు.

అపప్రయోగములను చేయు కుకవులను రఘునాథనాయకుడు కూడ ఇట్లు విరసించినాడు.

"తెనుఁగు తెలుంగు సంస్కృతము తీరును గాని యపప్రయోగముల్
పెనచిన కబ్బముల్ సభలఁ బెద్దతికంబుగఁ దెచ్చి పెద్దలన్
విను మను వారు నేఁపున వింతలు వింటిమి నేఁ డటంచు న
వ్విన నుతి యంచు నెంచు కుకవి ప్రకరంబుల మెచ్చ సర్వమే"
—వాల్మీకిచరిత్ర (పుట 4)

పద్యములో గణములు, యతి, ప్రాసలును మాత్రమే పరిగణించు కుకవులను శ్రీనాథుడు, కొరవి గోపరాజు, శంకర కవి, సారంగు తమ్మయ, ప్రౌఢకవి మల్లన రఘునాథనాయకుడు మున్నగువారు పేర్కొని విరసించినారు.

"భీమన పద్యమన్నఁ గడుఁ బ్రీతి వహించుచు మేలు మేలు నా
నేమిది చెప్పె నార మన నిక్కమె ప్రాసము గూర్చి నాఁడవా
నేమిది కాదు దీనివడి కిక్కడి కర్థమిదెట్టి దీగణం
బేమని పెట్టినాఁడ వని యెగ్గులు పట్టుఁ గుబుద్ధి పెద్దలన్"
—సింహాసన ద్వాత్రింశిక (1-18)

"గణశుద్ధియు గుణ శుద్ధియు
గణుతింపఁగ లేని వారు కవిత లటంచున్...

గణములు దెలుపు కొనంగా
గుణదోషము లెంచనేల కుకవుల యందున్''
—వైజయంతీ విలాసము (1-13)

''యతియుఁ బ్రాసంబు దప్పని యంతమాత్ర
మునకె తన్నును దామెచ్చి కొనెడు వానిఁ
బాటి సేతురె? రసపరిపాటిఁ దేట
మాటలఁ గవిత్వము ఘటించు మేటి కవులు''
—వాల్మీకి చరిత్రము (పుట 4)

సుకవుల, కుకవుల రచనలను గురించి కూచిరాజు ఎఱ్ఱన ఇట్లు చెప్పినాడు :

''సుకవులు చెప్పిన కవితా నికరములు శిలాక్షరములు నిలుకడ గాంచున్
గుకవులు చెప్పిన కవితానికరములు జలాక్షరముల నీచత నణఁగున్''
—సకలనీతి కథానిధానము (1-10)

కుకవుల కృతులను బైచరాజు వేంకటనాథుడు ఈ క్రింది విధముగ ఈసడించినాడు :

''ఎడపట తారు దారె లిఖియించి పఠించి కృతుల్ ప్రతుల్ జగం
బడిగిన నిచ్చి హెచ్చి సకలావసథంబులఁ దారయై దిశల్
గడచి నటించు కావ్యములు కావ్యములా హరణాఘశాంతికై
విడువక కూలిఁబెట్టి చదివించు కృతుల్ కృతులే వసుంధరన్''
—పంచతంత్రము (1-19)

కనుపర్తి అబ్బయామాత్యుడు తన గ్రంథములు సమకాలికుల అనాదరణకు పాత్రములగు నవియు, సర్వవ్యాప్తములు కావవియు కొంత సందేహమును వెలిబుచ్చెను. అతడు తన గ్రంథముల వ్యాప్తికొరకు కుకవి నిందారూపమున నెంత ప్రయత్నించెనో చూడుడు :

''చతుర కవిత్వతత్త్వ పటు సంపద యొక్కరి సొమ్ముగాదు భా
రతి దయ సౌధవార్ధి కవిరాజులమానసముల్ ఘటంబు లా
యతము కొలంది లబ్ధమగు నయ్యమృతం బటుగాఁ దలంచి య
ద్యతన కవీంద్రులార కృప దప్పక మత్కృతి నాదరింపుఁడీ.

''కాళిదాసాదులకు నైనఁ గలవు తప్పు, లనిరి పెద్దలు మాదృశులనఁగ నెంత
తప్పు గల్గిన దిద్దుఁడీ యొప్పుగాను, బాలునకు బుద్ధి నేర్పిన భంగిఁ గవులు.

"భగవదర్పిత కావ్యంబు పట్ల సెరసు, లున్న దూషింప వలదు మాయన్నలార
ఘన కిరీటంబు ధరియించుకొనిన తలకు, సుళ్లు లెక్కలు పెట్టుట చొప్పు గాదు"

— అనిరుద్ధ చరిత్ర (1-9,10,11)

"ఎవ్వరి కెంత బుద్ధి పరమేశుఁడు దాఁ గృపచేసె నట్టిదై
నివ్వటిలుం గవిత్వరుచి నేరుపు చాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమాన కవినాథులు చేకొన రయ్య మత్కృతిన్
బువ్వులు గందకుండ రసముం గొను తేటులవంటి నేర్పునన్"

— కవిరాజ మనోరంజనము (1-10).

మడికి సింగన తన సకల నీతి సమ్మతమున "తర మెఱుఁగక కృతినిచ్చు" కవులను గురించి తన కోపావేశమును చూపియున్నాడు.

"ఘన కశా ఘాత కర్కశ కిణ చేటికా
స్తనముల నలఁదిన చందనంబు
నిశిత కంటక శిలా నికట మర్కట కటిఁ
జెలువారఁ గట్టిన జేలు చేల
ప్రకటితాసవ మత్త భల్లూక మాఁదలఁ
బొలుపారఁ జెరివిన పుష్పమాల
సతత పల్వల పంక సంగి లులాయంబు
నఱుతఁ బెట్టిన తారహార పంక్తి
కరణి గాకున్నె సాహిత్య సరణి యెఱుఁగ
కజ్ఞ సంగతిఁ బొదలు దురాత్మకులకుఁ
గవులు తర మెఱుఁగక యిచ్చు కావ్యకన్య
క్లేశ సంసార భవనాశ కేళ వేళ"

— సకలనీతి సమ్మతము

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో పండితంమన్యులైన వైతండికులను నిందించినాడు. చూడుడు :

"బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూప మండూకములఁ బోలెఁ గొంచె మెఱిఁగి
పండితం మన్యులైన వైతండికులకు.

నికటముననుండి శ్రుతి పుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచి నప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైఁప రాకున్న సెందేనిఁ జనుట యొప్పు"

—భీమేశ్వరపురాణము (1-13,14)

రాజమహేంద్రవరమున రాజాశ్రయమునకై శ్రీనాథుడు ప్రయత్నించినపుడు అచటి పండితులతో వైషమ్య మేర్పడి యుండును. అపుడు అరసిక పండితుల మాత్సర్యమును నిరసించుచు పై విధముగ అవహేళన చేసియుండును. ఈ అవహేళన ముదుకగా గాక హృద్యమై శ్రీనాథునికి గల నిండుదనమును దెలుపుచున్నది. మృదువుగా మందలించినట్లున్నది. లోకజ్ఞత, నిర్మత్సరత, ప్రశాంతత, వైదుష్యదర్పము శ్రీనాథు డెంతగా భూషించెనో ఈ కుకవి నింద ధ్వనింప జేయును. బహుపదార్థ పరిజ్ఞాన పటిమ లేక కర్ణకటువుగ వదరెడు కాకిగోల పడలేక హంస నోరు మూసికొనుటే మేలు. సహింపక పోయినచో మరెక్కడికైనను పోవుటే మంచిది అని శ్రీనాథుడు తెల్పినాడు.

మాదయ్య కవి కుకవి నిందా సందర్భమున సభలోని పండితమ్మన్యులనే నిందించినాడు.

"పొంకపు గావ్యలక్షణము పోక దెలుంగక దిట్టకాళ్లై
కొంకక వంకరర్థములు గూర్చి సభాస్థలి ప్రౌఢులట్లు ని
శ్శంక జరించుచున్ సుకవి సంఘము పల్కుల మెచ్చ కూరకే
యంకము సేయ వచ్చు నల యయ్యల మున్నుగఁ బ్రస్తుతించెదన్"

—మైరావణ చరిత్ర (1-13)

ఇందు 'ప్రస్తుతించు' అను మాటను కవి వెటకారముగానే ప్రయోగించినాడు. శ్రీనాథునివలె మాదయ్య కవికూడ సభలలో వాదించు నేర్పు గలవాడని దీనివిబట్టి ఊహింపవచ్చును.

కుకవులు నిందార్హులని, సభాపూజ్యులు కారని చెంగల్వ కాళయకవి, సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు, గట్టు ప్రభువు, రత్నాకరము అప్పప్పకవి మున్నగువారు తమ గ్రంథములందలి కుకవి నిందలో తెల్పినారు.

"అందము చందము దెలుఁగక
యందదుకుల రచన సేసి యందుకె మది నా

నందముఁ జెందెదరు కుకవులు
నిందా గ్రాహ్యులుగాక వర్ణనీయులె సభలన్''
—రాజగోపాల విలాసము (అవతారిక)

''షండున కేల రంభ, కడు జారున కేల కుల ప్రచింత, పా
షండున కేల సాధుజన సంగతి, కృష్టనికృష్టలోభియౌ
చండికి కేల నిర్మల యశంబులు, వేశ్యకు నేల సిగ్గు, దు
ష్పండితుఁ డైన వానికిని సత్కవితారస గోష్ఠి యేటికిన్''
—అహల్యా సంక్రందనము (పుట 5)

''పద్యతాత్పర్య జ్ఞానంబుఁ బరిహరించి
కవులు చెప్పిన కావ్యముల్ చెవులు సారక
పొసగఁ బరిహాసకోక్తులఁ బ్రొద్దుఁ గడపి
చెలఁగుఁ గుకవుల సభలందుఁ జెప్ప నేల''
—అప్పప్పకవి శశిరేఖాపరిణయము (1-12)

వ్యతిరేక లక్షణ దుష్కవులు లేనినాడు సుకవులకు ప్రసిద్ధిలేదు. కాబట్టి వీరిచే సుకవుల కధిక విఖ్యాతి కల్గుచున్నది. దోషాత్ములయిన కుకవుల మూలమున కవి తత్త్వగరిమము సువ్యక్తమగును. పరోక్షముగా తమ అభివృద్ధికి తోడ్పడుచుండు కుకవులను ప్రబంధ కవులు కొందరు తమ చిత్తమున మెచ్చి ఆశీర్వదించినారు. మరికొందరు ప్రార్థనము కొంత నడపినారు. దీనివలన ఆ ప్రబంధ కవుల ఉదార చిత్తమును, విద్యావైదుష్యప్రదర్శనమునందు వారి ఆత్మవిశ్వాసమును వ్యక్తమగును.

''(అయ్యా వోట్లమ్మ) మా కవిత్వముల నొయ్యం గూర్చి లోకుల్ దమున్
ఛాయంచున్ హసియింప మాదృశుల శాస్త్రానంబులన్ మన్ననల్
సేయం బ్రోవలు వెట్టు నక్కుకవులన్ జిత్తంబున మెచ్చి దీ
ర్ఘా (యుష్మంతులరై చెలంగుఁ డ)ని యే నాశీర్వదింతున్ దగన్''
—బాలభాగవతము (1-8)

అని దోనూరి కోనేరు నాథుడు కుకవులను చిత్తమున మెచ్చి ఆశీర్వదించినాడు.

రామరాజభూషణుడు నరసభూపాలీయావతారికలో ''నిఖిలోపకార ధీరాత్ములైన'' కుకవులను మెచ్చినవిధము పరికింపుడు :

"ఏ మహాత్ములు గల్గ భూమీశ సభలలోఁ
గవులకు నధిక విఖ్యాతి గల్గె
నే కృతార్థులు గల్గ నెల్లపామరులకు,
గణన మీరు ప్రబంధకములు గల్గె
నే వాఙ్నిధులు గల్గ నిరవొందు రసికుల
కమిత లీలా వినోదములు గల్గె
నే ప్రవీణులు గల్గ నిల నలంకృతి కృతో
ద్యములకు దోష లక్ష్యములు గల్గె
నే దయాళులు బుధవచోహేతి చకిత
విసర దపశబ్ద భరణ లాలస ముఖాబ్జు
లట్టి నిఖిలోపకార ధీరాత్ములయిన
సకల కవి ధూర్వహులకు నంజలి యొనర్తు"

—నరస భూపాలీయము (1-9)

రామరాజ భూషణుడు వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములందలి కుకవి నిందలో కుకవులయెడ నిట్టి భావమును చూపినట్లు కానరాదు. వానియం దాతని కవితా లక్షణములు వ్యక్తమగుచున్నవి.

"భావం బెక్కడ లేక వృత్త నియమాపాయంబుఁ జింతింప కెం
దేవర్తించి పరార్థ వంచనలచే దీపించి, మూర్ఖాళి సం
భావింపం గుకవి ప్రణీత కృతి సామాన్యాకృతింబూని పై
పై వన్నెల్ పచరింప దానిఁ దిలకింపం బోరు ధీరోత్తముల్"

—వసుచరిత్ర (1-11)

"అతిమాత్ర స్ఫురితార్థ వైభవము నౌదార్యాది నానా గుణా
యతి శక్తి ప్రతిభైక ధుర్యతయు లేశాత్మైక దేశాప్తి గ
ల్గితుఁ డూహింపక తాన హీనపద ధౌరేయాంకముల్ పూనినం
బ్రతిరోధింపఁ దరంబె ధీరునకు దృగ్రాగంబు సంధించినన్"

—హరిశ్చంద్ర నలోపాఖ్యానము (1-9)

పింగళి సూరన రాఘవ పాండవీయావతారిక(1-5) లో "తప్పొప్పు మదిన్ భావించి దిద్దకుండను దేవానాం ప్రియుల మ్రొక్కి తలఁతుఁ గుకవులన్" అని కుకవు లొక నిమిత్తంబునం బ్రార్థనీయులగుటంజేసి తత్ప్రార్థనంబునుం గొంత

వదపినాడట. కళాపూర్ణోదయావతారికలో ''కుకవు లుపేక్షామాత్ర దండ్యులగుట భావించి" ఇట్లు నిందించినాడు-

"మెచ్చి రొకింత గౌరవము మెచ్చక యుండి లఘుత్వ లేశమున్
దెచ్చుటకు న్సమర్థులె కృతి క్రియకుం గుకవిత్వ గర్వితుల్?
తచ్చరితం బుపేక్ష కుచితంబగుఁ గాక నగంగ నైన వా
క్రుచ్చి యజాగళ స్తన సగోత్రుల వారల నెన్న నేటికిన్? (1-7)

''విశ్రామ విహతి గావింపక సారవ
త్సాహిత్య సౌమనస్యంబు లెఱిఁగి
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు
లైన శబ్దముల నత్యాదరాత్మఁ
జేయక సత్పరిచిత సుకుమార వా
క్సరళితాభిప్రాయఁ గానొనర్చి
పదబంధ శిథిలత వాటిల్లఁగానీక
యే చందముల యందు నేమరిలక
పరఁగు కవియు దోషాకరుఁడును యశము దు
గ్ధమును బడయునట్లు గానినాఁడు
కృతిదురాప మొదవుఁ గీర్తియుఁ బాలుఁ నీ
కుంటగాదు హాస యోగ్యుఁ జేయు.

—కళాపూర్ణోదయము (1-8)

పైని తెల్పిన రెండు కుకవి నిందలు సరిపోల్చినపుడు రాఘవ పాండవీయములోని కుకవినింద కావ్యక్రమానుగతాచారము ననుసరించుటకు మాత్రము వ్రాయబడినదని, కళాపూర్ణోదయములోనిది అట్టిదిగాక సూరన తన ప్రతిపక్షులపై సకారణముగ ప్రయోగించిన మహాస్త్రమని తోచును. ప్రభావతీ ప్రద్యుమ్నములో ఈ కుకవి ప్రశంసగాని కుకవి నిరసనముగాని కావింపబడలేదు.

తెనాలి రామకృష్ణకవి దోషాత్ములయిన దుష్కవులమూలముననే కవిరాజ కావ్యమహిమ గరిమ వహించునని ఇట్లు నుడివియున్నాడు:

"తప్పు గలిగిన చోటనే యొప్పు గలుగు
సరస కవితా వళోక్తుల సరణి యందుఁ
గప్పు గలిగిన నీహార కరుని యందు
నమృత ధారా ప్రవాహంబు లడరుఁ గాదె?

కాన దోషాత్ములయిన దుష్కవుల కతన
గరిమ వహియించుఁ గవిరాజ కావ్య మహిమ
బహుళపక్షంబు చీఁకటి బహుళమగుటఁ
జాయ వెన్నెల తరి తీపు సేయు కరణి"

—పాండురంగ మాహాత్మ్యము (1-14,15)

కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానము, పిండిప్రోలు లక్ష్మణకవి లంకా విజయము, కృష్ణకవి శకుంతలా పరియణము ఇత్యాదులందలి కుకవి నిందలో కుకవులకు కై మోడ్పు లొసంగబడినవి. ఈ గ్రంథములందు కుకవులను మృదువుగా మందలించినట్లు కలదు.

ఆంధ్రభాషయందు గల లక్షణగ్రంథముల కైక్యము కానరాదు. ఎవరి త్రోవ వారిది. ఒక రంగీకరించిన సిద్ధాంతము నింకొక లాక్షణికుడు పూర్వపక్షము గావించుచుండుటచే నానాటి కవులకు నిశ్చయ సిద్ధాంతములే తోచకుండెను. కను పర్తి అబ్బయామాత్యుడు చేసిన కుకవి నిందలో లాక్షణికులయందు దోషారోప ణముకూడ కలదు. చూడుడు :

"చెల్లునటంచు నొక్కకవి చేసిన లక్షణ మొక్క రివ్వలన్
జెల్లమిఁ జేసి తా నొకటి చెప్పఁగ ఛాందస విస్తరంబు సం
ధిల్లుటఁ గావ్య శంక లవనిం దఱుచయ్యె రసజ్ఞులార నా
యుల్లపు సౌధ వీథిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగు పల్కులివి తప్పులు సేయక చిత్తగింపుఁడీ"

—కవిరాజ మనోరంజనము 1-11

ఇట్లు కుబుద్ధులును, దోసకారులును నగు కుకవులను, పండితమ్మన్యులను, నిరసించుటను నన్నెచోడుని మొదలు నేటివరకు పెక్కుమంది కవులు నియమముగా ననుసరించి అభినివేశముతో రమణీయములగు పద్యములను రచించియున్నారని నిరూపించితిమి. ఇందుమూలమున కవుల కవితా మతములు సుస్థిరమగుచున్న వనియు తెలిసికొంటిమి, ఈ సందర్భమున భోగరాజు నారాయణమూర్తి చెప్పిన ఈ మాటలు గమనింపదగినవి. "సుకవి భూషణ కుకవి దూషణ నియమము మన యాంధ్రకవులు వహింపకుండినయెడలఁ గవితాతత్త్వముంగూర్చి వారి మతముల నీపాటియైనఁ దెలియక మన మింత కన్న నజ్ఞానముతో నుండియుందుము"[1]

1. ఆంధ్ర కవిత్వ చరిత్రము — భారతి సంపుటము 1 సంఖ్య 7. జూలై 1924.

# 7

# కావ్యోత్పత్తి ప్రశంస

ఆంధ్రకావ్యావతారికలలో కావ్యోత్పత్తిక్రమము, కావ్యరచనోద్దేశాదులుకూడ ప్రధానముగ చెప్పబడినవి. రాజాదరణము, దైవానుగ్రహము ప్రాచీనతెలుగుసాహిత్య సృష్టికి హేతుభూతములయినట్లు తెలియుచున్నది. కవిగా తాను లోకమున ప్రసిద్ధి గాంచుటయు, తనకాశ్రయమిచ్చిపోషించు ప్రభువునకో, తాను కొల్చిన ఇష్టదైవము నకో తనకావ్యమునుచెప్పి కృతార్థతనందుటయు కవికావ్యసృష్టికి ప్రధానహేతువులు. కావ్యము సప్తసంతానములలో ఉత్తమమైనదిగా ప్రాచీనులు తలంచుటచే పుణ్యమును యశమును కాంక్షించి రాజులును, రాజసంబంధికులును సత్కవులకు ధనాదికము లిచ్చి తమప్రశస్తి చిరకాలవ్యాప్తమగుటకు వారిచే కావ్యములను రచింపజేసి యున్నారు.

ఆంధ్రకవితాపోషకులయిన మహారాజులలో ప్రథముడు పూర్వచాళుక్యరాజగు రాజరాజనరేంద్రుడు (1019-1061). అతడు 'తనకులబ్రాహ్మణు' డగు నన్నయను భారతాంధ్రీకరణమునకు ప్రోత్సహించుటకు కారణము క్రిందివని భారతావతారికను బట్టి తెలియుచున్నది:

1. బ్రాహ్మణమతాభిమానము :

చాళుక్యులు మొదటినుండియు బ్రాహ్మణభక్తులుగ నుండిరి. రాజరాజనరేంద్రునితండ్రియగు విమలాదిత్యుడు 'త్రికాలయోగిసిద్ధాంతదేవర' అను జైనగురువు

నకు శిష్యుడై జైనమతాభిరతుడైనను[1] పూర్వాశ్రమమున శైవమతావలంబకుడే. రాజరాజుమాత్రము మొదటినుండియు బ్రాహ్మణమతోద్ధారకుడే. "విప్ర కులము నెల్లఁ బ్రోచుచు శరణన్నఁగాచుచు భీతుల నగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర మహాగ్రహారములిచ్చుచు దేవభోగముల మహావిభూతిఁ దనరఁజేయు చిట్లు మను మార్గుడు" (1-7) అనియు, 'విభాగమ విహితక్రముడు' (1-4) అనియు రాజ రాజును గురించి నన్నయ భారతావతారికలో పేర్కొనినాడు. రాజరాజు తనకిష్టము లయిన అయిదు విషయముల నీక్రింద పేర్కొనినాడు :

"ఇవియేనునన్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహో
త్సవమున్ సంతత దాన శీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్" (1-12)

వీనినిబట్టి రాజరాజు బ్రాహ్మణమతాభిమానము స్పష్టముగా నెరుగవచ్చును.

## 2. వర్ణాశ్రమోద్ధరణము :

బ్రాహ్మణమతాభిమానియగు రాజరాజు వర్ణాశ్రమోద్ధరణ తత్పరుడగుటకు సందియములేదు. అతడు 'సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహి నొప్పు సర్వలోకాశ్రయుడు' (1-6). వైదికధర్మనిష్ఠారతుడైన రాజరాజు వైదిక మతోద్ధరణకు, వర్ణాశ్రమధర్మ పునఃప్రతిష్ఠాపనకు పూనుకొనినాడు. అతడు తన ఆస్థానములోని కవిపండితుల సాహాయ్యమున వైదికమతౌత్కృష్ట్యమును, ఆర్ష విజ్ఞానమును సామాన్యతెలుగుప్రజానీకమునకు సన్నిహితము చేయసంకల్పించి నన్నయచే పంచమవేదమగు భారతసంహితను ఆంధ్రీకరింపజేసినాడు. స్వమతము స్వభాషలో బోధించినపుడు దానికి విపులవ్యాప్తి గల్గునుగదా !

## 3. భారతశ్రవణాసక్తి :

రాజరాజుకు భారతశ్రవణాభిలాషయు మిక్కుటము. "నాహృదయంబున ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై

1. పూషవాడసంస్థానములోనిదగు రామతీర్థక్షేత్రమునందలి 'పాండవుల పంచ'యను గుహలోని జైనగురు విరచితమగు శాసనమువలన తెలియుననిశ్రీ భోగరాజు నారాయణ మూర్తిగారు తెల్పినారు (చూ. ఆంధ్రకవిత్వచరిత్రము - భారతి, 1 సం, 11 సంచిక.)

యుండు' (1-11) నని అతడు తెల్పినాడు. తనకు మిక్కిలి ఇష్టములైయుండు అయిదు విషయములలో భారత శ్రవణాసక్తికూడ ఒకటి. రాజరాజు భారతకథా శ్రవణాభిరతిని ఈ క్రిందిపద్యము వ్యక్తముచేయును :

"అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహు వేద విప్రులకు దానము చేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము ననిశంబు భారతకథా శ్రవణ ప్రవణంబ కావునన్" (1-15)

## 4. వంశకర్తల మహిమాతిశయము :

భారతేతివృత్తము తనవంశీయుల దని రాజరాజు భావించినాడు. పాండు భూపతులు చంద్రవంశోద్భవులు. విమలాదిత్యునికాలమునుండి పూర్వచాళుక్యరాజులు తమ శాసనములందు చంద్రవంశజులమని వ్రాయించుకొనిరి. తన వంశకర్తలగు పాండుభూపతులచరిత్ర రాజరాజునకు హర్షదాయకమనుటలో నాశ్చర్యమేమున్నది? కనుకనే అతడు నన్నయతో-

"హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురు ప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెమ్మెయిన్" (1-14)

అని చెప్పియుండుట.

## 4. అన్యభాషలలో భారతానువాదము :

"బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతి బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థ మగున్" (1-17)

అనుటచే బహుభాషల, బహువిధముల, బహుజనములవలన సంస్కృత భారత పఠన మదివరకే దేశమున గలదనుట వ్యక్తమగును. కన్నడమున పంపకవి 'విక్ర మార్జునవిజయము' అను పేరుతోను, రన్నకవి 'గదాయుద్ధము' లేక 'సాహసభీమ విజయము' అనుపేరుతోను భారతమును రచించియుండిరి. పెరిందేవనా రను కవివే

దేశీయములగు 'వెంబా' పద్యములలో క్రీ. శ. 7, 8 శతాబ్దములలోనే తమిళ మున భారతరచన జరిగినది. రాజరాజునకు చోళులతో బాంధవ్యమేర్పడియుండుటచే దేశవ్యాప్తమైన భారతప్రచారమును గమనించియుండును. ఆంధ్రభాషాసాహిత్య పోషణమును అభిమానించిన రాజరాజు "మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపు"మని నన్నయను కోరినాడు. నన్నయయు రాజునసుమతిని, విద్వజ్జనముల అనుగ్రహమున తానేర్చుభంగి, రాజరాజును ప్రధానశ్రోతగా చేసి భారతమును ఆంధ్రీకరించినాడు.

నన్నయ రాజరాజనరేంద్రుల వైదికమతాభిమానమే తెలుగులో మొట్ట మొదటిగ్రంథమగు భారతకావ్యోత్పత్తికి హేతువైనదని పై పరిశీలనవలనతెలియును.

## 1. సప్తసంతానములలో కావ్యము ఉత్కృష్టమనుట :

తెలుగునాట పుణ్యమును, యశమును కాంక్షించి వన నిధి తటాక దేవాలయా దుల నిర్మించుట ప్రాచీనకాలమునుండియు కలదు. తెలుగువారి దానధర్మాదులు క్రమముగా పెరిగి సప్తసంతానములుగ వ్యవహృతములయినవి. క్రీ. శ. 1132 నాటి శాసనములలో సప్తసంతానముల ప్రశంసకలదని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తెల్పియున్నారు.[1] సప్తసంతానములేవేవియనుటలో ప్రాచీనులలో ఏకవాక్యత కాన రాదు. సప్తసంతానములలో కావ్య మొకటి యనిమాత్రము ప్రాచీనకాలమునుండి గుర్తింపబడినది. కాని కృతికంటె వన నిధి తటాక దేవాలయాదులను ప్రాచీనులు ఎక్కువగా అభిమానించి ప్రతిష్ఠించియున్నట్లు క్రీ. శ. 12 వ శతాబ్దపునాటి శాసనాధారములనుబట్టి ఊహింపవచ్చును.

ప్రథమాంధ్రకవియగు నన్నయ సప్తసంతానములను పేర్కొనలేదు. వాఙ్మయమున సప్తసంతానములను పేర్కొని కృతి ఉత్తమసంతానమని చాటిన వారిలో ప్రథముడు నన్నెచోడుడు. అతడు కుమారసంభవమున-

> "పూని, మహాగ్రహార పుర, పుత్ర సమున్నతి, దేవ తాల, యో
> ద్యాన, తటాక, సత్కృతి, నిధానము, లాశశితారకంబు సు
> స్థానములై మహిం బరఁగు జంగమ మల్లయ పేర సప్త సం
> తానము లొప్ప సల్పుదు ముదంబునఁ దత్ప్రభు నాజ్ఞ పెంపునన్"
>
> —కుమారసంభవము (1-46)

1. నన్నెచోడుని కవిత్వము - సప్తసంతానములు - వానిచరిత్ర.

"అందు నుత్కృష్టసంతానంబు కృతియకా నిశ్చయించి" కృతిపతికి 'అనురక్త యైన భాషాంగనఁ దక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా ప్రబంధము' ను విస్తరించినాడు.

తెలుగుకవులు 'కవిత' ను 'కన్య' గా భావించియున్నారు. తిక్కన నిర్వచనోత్తరరామాయణమున ఈ భావము మొదటిసారిగా వ్యక్తమయినది. 'కవిత'. 'కన్య' గా భావింపబడుటచే కావ్యము సంతానమను భావము కల్గించును. కవులు పడపిన 'కవితాకన్య' లను 'పరిణయ' మాడుట రాజుల ప్రశస్తికి హేతువయినది.

సప్తసంతానములలో కావ్యము ఉత్కృష్టమైనదని నిశ్చయించుట తెలుగు కవుల ప్రత్యేకతను చాటుచున్నది. ఈ భావము సంస్కృతప్రాకృత ద్రావిడకర్ణాటక వాఙ్మయములందు నెచ్చటను కానరాదు. తెలుగులో నన్నెచోడునికాలమునుండి ఈ భావము ఏర్పడి క్రమముగా నభివృద్ధిచెందినది.

సప్తసంతానములవలన కీర్తిసుకృతములు కలుగునని మంచనకేయూరబాహు చరిత్రావతారికలో ఇట్లుతెలిపియున్నాడు.

"నందనుఁడు, వనమ్ము, నల్లిల్లు, నిధి, సుర
గృహము, చెఱువు, మేలికృతి యనంగ
జగతి వెలయు సప్త సంతానములు, వీనఁ
బుణ్యములు యశంబుఁ బొందవచ్చు" (1-8)

కందనామాత్యుని (1350) 'నీతితారావళి' లోని పద్యమని మడికిసింగన తన సకలనీతి సమ్మతమున (23 పద్యము) ఉదహరించిన ఈ క్రింది పద్యములో సప్తసంతానముల ప్రశంస కలదు.

"అమలమగు సప్త సంతా
నములం దనిశంబు యశమునకుఁ గుదురై నా
శము లేక నెగడు సత్కా
వ్యము ధారుణి లోన నాభశామాత్యుని కందా!"

జక్కన, శ్రీనాథుడు (భీమేశ్వరపురాణములో మాత్రము) పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు గౌరన, శంకరకవి, దోనూరికోనేరునాథకవి, మాదయ్యకవి, అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రకవి, భానుకవి, అత్తనూరి పాపకవి, కృష్ణకవి-వీరు సప్త సంతానములలో కృతి మిన్నయనియు, ఆకల్పమైన కీర్తిప్రతిష్ఠాదులను కల్గించు ననియు తమకావ్యావతారికలందు తెలిపియున్నారు.

కవికి, కృతికి విచ్ఛేదములేదనియు, కృతియ 'కీర్తిసదన' మనియు పినవీరభద్రుడు తన కావ్యావతారికలందిట్లు వివరించినాడు.

"నల్లిల్లుం గుడియు న్ధనంబును నిధానంబుం దటాకంబు రం
జిల్లుం గొండొక కాలమేగ నవి విచ్ఛేదంబునం బొందు నే
పొల్లుం బోనిది కీర్తికిం గృతియ పో భూమండలిం గానికిం
జెల్లం బిప్పుడు రామ భారత కథాధీన ప్రబంధావళుల్"

—శృంగార శాకుంతలము (1-16)

"ఆదట సప్త సంతతులయందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాటిటికిఁ జెప్ప విపర్యయమే యుగంబునన్
లేదు కవిత్వ సంతతికి నిక్కము తత్కవితా విలాసమున్
జాదులు నిష్టదైవము ప్రసాదము నా పరి కీర్తనంబునన్"

—జైమిని భారతము (1-16)

మంచనకాలమునాటికి ఉత్కృష్టసంతానమగు కావ్యమును అంకితమందు ఉత్సాహము అధికముగానుండినట్లు కేయూరబాహు చరిత్రావతారికనుబట్టి తెలియును. కృతులనందునభిలాష మిక్కుటముగానుండినందువలనను వన నిధి తటాకాదుల ప్రతిష్ఠకన్న కృతిరచన సులువుగానుంటుటచేతను కృతికి ప్రాముఖ్యము హెచ్చినది. ఈ భావమును మంచనతో కేయూరబాహుచరిత్ర కృతిపతియగు నండూరిగుండ మంత్రి ఇట్లుచెప్పినాడు.

"వన నిధి తటాక దేవ భ
వనములు పుణ్యాదములైన వాని ననుష్ఠిం
చినచోన కాని యెఱుఁగరు
చనుఁ గాదే సరస కవిత సకల దిశలకున్"

—కేయూరబాహు చరిత్రము (1-9)

అని పలికి 'కావున నాకు నొక్కకృతిఁగైకొన నిష్టము'అని స్పష్టముగా అడిగినాడు. "చనుఁగాదే సరసకవిత సకలదిశలకున్" అనుటచే కావ్యము తదితరసంతానముల వలెగాక సకలదిశలకును వ్యాప్తమై కీర్తికాకరమై ఉత్కృష్టమైనదనుటను తెలుపుచున్నది. "ప్రతిష్ఠాతను వదలని పురుషసంతానమువంటిదికాదు గాన, 'కన్య' గావున, దాతను 'కన్యాదానఫలము' ను గ్రహీతకు 'ఆదానఫలము' ను ఇచ్చునట్టిది గావునను కావ్యము ఉత్కృష్టసంతానమైనది."[1]

1. నన్నెచోడునికవిత్వము - పుట 55, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

కావ్యావతారికలో కృతిభర్తవిషయముతోపాటు కృతిభర్త వంశాభివర్ణనము నుండును. సప్తసంతానములలో కృతి ఈ కారణమున ప్రశస్తమయనది.

కృతిభర్తవిషయ మా కృతి యున్నంతకాలమునుండును. కృతికర్తతోపాటు కృతిభర్తయు స్మరింపబడును. ఈ కారణముచే రాజులకు రాజసంబంధికులకు కృతుల నందు నభిలాష మిక్కుటమయనది. వారు కృతిరచనకు కవులను ప్రేరేపించి కావ్యముల నంకితము గొనుచుండిరి.

తిరుమలరాజు తనజనకుడగు రామరాజు తిమ్మభూపాలునకు పుణ్యముగా కృతిప్రతిష్ఠ సేయందలచి తనఆస్థానకవియగు దోనూరికోనేరునాథకవిని హరికథయగు బాలభాగవతమునురచించి తనతండ్రికి అంకితమిమ్మని కోరినాడు. దీనినిబట్టికొందరు తమప్రశస్తికిగాక పితృపితామహులకు పుణ్యముగా కృతిప్రతిష్ఠచేయించుచుండిరని తెలియుచున్నది.

జైమినీభారతకావ్యోత్పత్తిక్రమమును పరికించిన ఒకటిరెండు విశేషాంశములు గోచరించును. ఒకటి పినవీరభద్రుడు నరసింహరాయల ఆస్థానమందొక కవియనుట. జైమినిభారతమును తెనిగింపనుద్దేశము కృతిపతికి కృతిభర్తకు ఏక కాలమున ప్రత్యేకముగా కలుగుట. నరసింహరాయలు జైమినిభారతమునుగురించి వితర్కించుచు,

"నాగుది నిగతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్

ఆ పురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేనిఁ
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేనిఁ
గుందనము కమ్మ వలచిన చందమగును"

— జైమిభారతము (పీఠిక - 17, 18.)

అని సభాసములవంక చూడగా వారు—

"ఏ రీతి నెతిఁగెనో పిన
వీరన దేవర తలంపు విఖ్యాతముగాఁ
దేవను బెట్టిదియును దన
పేరుగ రచియింపఁ బూనెఁ బేశల ఫణితిన్" (1-20)

అని విన్నవించిరి. దీనివిబట్టి పినవీరభద్రునికి, నరసింహరాయలకు నిరువురికికూడ జైమినిభారతముపై నాసక్తి యున్నట్లు స్పష్టమగుచున్నది. ''మామకమనోరథం బెఱిఁగి కృతిచెప్ప నుద్యోగించితివి' అను కృతిపతిమాటలుకూడ ఈ విషయమును వ్యక్తము చేయును.

పినవీరభద్రుడు నరసింహరాయల ఆశ్రితుడై యుండి అతనిధనమును దిని ఋణవిముక్తుడగుటకు కృతిరూపమగు యశోధనముగా జైమినిభారతమును రచించి యిచ్చినట్లు ఈపద్యము వ్యక్తముచేయుచున్నది:

''అని విన్నపంబు చేసిన
నను఼ గను గొని యలరి నా ధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధన మిటు గా వలదె యాశ్రితత్వం బనుచున్''
—జైమినిభారతము (1-23)

ఇదియే ఆశ్రితత్వవిధానమట!

## 2. స్వప్నవృత్తాంతము:

కృతిరచనకు బీజముగా స్వప్నసాక్షాత్కారకథనుచెప్పుట పెక్కుతెలగు కావ్యములందుకలదు. ఇష్టదైవమో, పితృపితామహులో కవికి స్వప్నమున సాక్షాత్కరించి కావ్యరచనకు ప్రేరేపించి అనుగ్రహించుట ఇందలి ముఖ్యవిషయము. స్వప్నమున సాక్షాత్కరించిన ఆదైవముయొక్క అనుభావవిశేషమును తనసన్నిధానమునందు కల్పించుకొని కవి కావ్యమును రచించును. కావ్యరచనాసన్నివేశమున కొక అపూర్వమహత్వము నాపాదించుట, పవిత్రమును ప్రశాంతమును నగు వాతావరణమును ఏర్పరచుకొనుట, వివిధశోభనప్రయత్నములను తెలుపునని విశ్వాసము కల్గియుండుట, కావ్యరచనోపక్రమమున ఏర్పడినసంశయముల నివృత్తిచేసికొనుట దైవభక్తిని హృదయనైర్మల్యమును వ్యక్తముచేయుట ఇత్యాదికారణములు కావ్యావతారికలలో స్వప్నప్రకారమును ప్రవేశపెట్టుటకు హేతువులు.

స్వప్నవృత్తాంతమును చెప్పినవారిలో మొట్టమొదటివాడు తిక్కన సోమయాజి. భారతావతారికలో,

''అని రచనా కౌతుకమున
మన మలరఁగ నీ ప్రబంధమండలి కధినా

ఘునిగా నే పురుషునిం జే
ర్కొ_ను వాఁడనొ యను తలంపు గూరిన మదితోన్''
—విరాటపర్వము (1-8)

అని తిక్కన ఇంచుకనిమీలితనేత్రుండై నంతనే హరిహరనాథసాక్షాత్కారము అతనిసందేహమునెల్ల తొలగించినది. భారతము నరాంకిత మొనర్పనని చేసి కొన్ననిశ్చయమును, తత్కావ్యమునందు తానువహించిన గౌరవభావమును పరి కించుపరమేశ్వరుడు తన్ను శ్లాఘించునట్లు తిక్కన తెల్పినాడు.

''తెనుఁగు బాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్య పురుషార్థ తరు పక్వ ఫలము గాదె
దీని కడ నియ్య కొని వేడ్క నూని కృతి ప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్క శర్మ.''
—విరాటపర్వము (1-18)

అని పరమేశ్వరుడు హరిహరనాథరూపమున కృతిపతిత్వమర్థించివచ్చినట్లు తిక్కన తెల్పినాడు. భారతరచనాసన్నివేశమున కొక అపూర్వమహత్వమును ఆపాదించి నాడు తిక్కన. ''ఈదృశంబులగు పుణ్యప్రబంధములు దేవసన్నిధిని వచించుట వలన నిదియంతయు నొకఆరాధనవిశేషంబు'' గా తిక్కన భావించినాడు.

తిక్కననను సరించి తరువాత పెక్కుమంది తెలుగుకవులు స్వప్నప్రకారమును తమ కావ్యావతారికలందు ప్రవేశపెట్టినారు. అనంతుని భోజరాజీయము, బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము, తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసము, కృష్ణ దేవరాయల ఆముక్తమాల్యద, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానము, చింతల పూడి యెల్లనార్యుని రాధామాధవము,సారంగుతమ్మయ వైజయంతీవిలాసము, ప్రౌఢ కవిమల్లన రుక్మాంగద, కాకమాని మూర్తికవి పాంచాలీపరిణయము, రామరాజభూష ణుని హరిశ్చంద్రనలోపాఖ్యానము, కట్టావరదరాజు రామాయణము, రఘునాథనాయ కుని రామాయణము, వాల్మీకిచరిత్రము, కదిరీపతి శుకసప్తతి, కనుపర్తి అబ్బయా మాత్యుని అనిరుద్ధచరిత్ర,కవిరాజమనోరంజనము,గట్టుప్రభువు కుచేలోపాఖ్యానము, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము, కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగు రామా యణము ఇత్యాది కావ్యావతారికలందు స్వప్నవృత్తాంతము కలదు.

ఇష్టదైవము కలలోకనబడి కావ్యరచనకు ప్రేరేపించి కావ్యము తనకంకితము చేయమనికోరుట కొన్నికావ్యావతారికలందు కలదు. మరికొన్నిటియందు, కావ్యమును

రచించి కృతిపతిత్వసంశయమును తీర్చుకొనునిమిత్తము స్వప్నవృత్తాంతమును చెప్పినట్లున్నది. 'కావ్యం బొండుసేయఁ దలపోయుచున్న' కవిని స్వప్నమున సాక్షాత్కరించిన ఇష్టదైవము ఏదో ఒకకావ్యమును రచించి తమ కంకితమిమ్మని కోరుట నిరంకుశోపాఖ్యానము, శుకసప్తతివంటి కొన్ని కావ్యావతారికలందు కలదు.

ఆముక్తమాల్యద ఉత్పత్తి మహాద్భుతమైనది. ఈ ప్రబంధమును శ్రీకృష్ణదేవరాయలు విజయనగరములోకాక విజయవాడలో ప్రారంభించినాడు. రాయలు "కళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁగావింప నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున" ఆంధ్రవిష్ణువు స్వప్నమున సాక్షాత్కరించి.

"రచన మెప్పించి కొంటి గీర్వాణ భాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ"

—ఆముక్తమాల్యద (1-13).

అనిచెప్పినాడు. ఇన్నిసంస్కృతగ్రంథములను రచించినకవికి ఒక ఆంధ్రప్రబంధమును వినిర్మించుట కష్టముకాదని ఆంధ్రవిష్ణువు రాయలను హెచ్చరించుచు తనకొక ఆంధ్రప్రబంధమును రచించియిమ్మని కోరినాడు. తనకు ఏకథప్రియమైనదో ఆంధ్రవిష్ణువే ఇట్లు తెల్పినాడు.

"ఎన్నినుఁ గూర్తువన్న విను, మే మును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము, మున్నుఁ గొంటి నే
వన్నదదండ యొక్క మగవాఁడిడ, నేను దెలుంగు రాయఁడన్
గన్నడరాయ, యక్కొదువఁ గప్పు ప్రియా పరిభుక్త భాక్కథన్" (ఆ. 1-14)

కన్నడరాయడగు కృష్ణరాయని తెలుగువల్లభుడు తెలుగున తనకు కృతిచెప్పుమనినాడు. తాను తెలుగువల్లభుడనని ఆంధ్రమహావిష్ణువే ఇట్లు చెప్పినాడు:

"తెలుఁగ దేల యన్న, దేశంబు దెలుఁ గేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁగొ కండ
యెల్లనృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స".

— ఆముక్తమాల్యద (1-15)

దీనినిబట్టి రాయలకిది తక్కిన అన్నిటిమీదికన్నను తెనుగుపై పక్షపాతమనుట వ్యక్తమగుచున్నది. 'దేశభాషలందుఁ దెలుఁగులెస్స' యనుసూక్తి రాయలకల్పితము కాదు. అంతకుపూర్వమే ఈ సూక్తి క్రీడాభిరామావతారికలో చెప్పబడినది.

''బహుళాశ్వచరిత్ర ప్రబంధనిబంధనముసేయ నునుకట్టి' యున్న దామరల వెంగళనాయకునికి స్వప్నమున శ్రీరాముడు సాక్షాత్కరించి యిట్లానతిచ్చెనట.

"దామర వేంకట ప్రభు వతంసుని వెంగళ భూప మాపయిన్
శ్రీ మెఱయంగఁ గృష్ణ కథఁ జెప్పితి విప్పుడు నీదు తండ్రియున్
మామక భక్తుఁ డాతనికి మాకును భేదము లేదు గాన నీ
వా మహిమాఢ్యు పేర బహుళాశ్వ చరిత్రముఁ జెప్పు మొప్పగన్"
—బహుళాశ్వచరిత్ర (1-15)

కవి తాత గాని, తండ్రిగాని కలలో కనబడి కృతిని రచించి దైవాంకితము చేయుమని ప్రోత్సహించుట కొన్నికావ్యములలో కలదు. ఎఱ్ఱాప్రెగడ "కతిపయాక్షర పరిగ్రహజనితంబైన నైసర్గికచాపలంబు కతంబున-

"మించిన వేడ్కఁ వీనులను మిక్కుటమై మధు వృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు భంగిఁ బ్రా
ఘాంచితశబ్ద సారులు మహాకవు లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తి సంగ సుఖ లీలకు"
(నృసింహ పురాణము 1-13)

కాంక్షచేసి ఏదో ఒక మహా ప్రబంధ కల్పనా కుతూహలాయత్తచిత్తుడై ఒక క్షణము సమాహితచిత్తుడై కూర్చున్నాడు. వెంటనే అతని భావమున అతని తాత ఎఱపోతసూరి ఆవిర్భవించి ఎఱ్ఱన కవితాశక్తులను ప్రబంధ రచనాప్రావీణ్యమును పొగడి తన ప్రియదైవమగు అహోబల నారసింహావతారమును స్తుతి యింపుమని ఆదేశించినాడు. ఎఱ్ఱన పులకించి కనులు విచ్చి అద్భుతానంద రసమూర్తియై తాత ఆజ్ఞను ఈశ్వర శాసనముగా భావించి తన తాత తండ్రుల ప్రీతికై నరసింహావతార రచన కుపక్రమించెను. ఎఱ్ఱన తన తాత కలలో కనబడి ప్రోత్సహించుటవలననే నృసింహపురాణమును రచించినాడు. శంభుదాసుడైన ఎఱ్ఱన గోవింద కథామృతమగు నృసింహపురాణ రచనను చేపట్టుటకు అతని తాత అనుభావవిశేషమే ముఖ్యహేతువు.

పిండిప్రోలు లక్ష్మణ కవికి తన తండ్రి స్వప్నమున సాక్షాత్కరించి ఈ క్రిందివిధముగా చెప్పినట్లు లంకా విజయము అవతారికలో కలదు.

సీ. "ఆర కొట్టంబన్న యూరనుండెడు రావు
బుచ్చయ్య నరసమా పుత్రకుండు
దమ్మన్న రావన ధర్మరాయుండన
నిరుపేళ్లతోడుత నెసఁగు వెలమ
యరయ భద్రయ్య జగ్గయ్య తిమ్మయ్య భా
పయ్య లన్నలుగురి కగ్రజుండు
పుత్రాది సంపత్తి పొసగు నతఁడు మన
కుర్యేరు ప్రీతితో గుత్త సేసి
గీ. నీదులంక మాన్యము బల్మిని హరియించెఁ
గానఁ దత్ప్రాప్తికై రామకథయును మన
కథయు జత గాగ సర్థంబు ఘటన పఱచి
కృతి రచించి గోపాలున కిమ్ము తనయ"

—లంకావిజయము (1-53)

ఈ స్వప్నవృత్తాంతమును చెప్పిన కవులలో పెక్కుమంది రాజదూషణము చేసినవారే.

బమ్మెరపోతన శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనాకుతూహలుడై ఒకనాటి సోమోపరాగకాలమున గంగకు జని క్రుంకులిడి తన్నది పులిన తలంబున మహేశ్వరధ్యానాయత్తచిత్తుడై కించిదున్మీలితలోచనుడై యున్న సమయమున శ్రీరామచంద్రమూర్తి కన్గవకు కానబడి తనపేర భాగవతము తెనుగు చేయుమని ఆనతిచ్చినాడు. మహేశ్వర ధ్యానాయత్తచిత్తుడగు పోతనకు ప్రత్యక్షమైనవాడు శ్రీరామచంద్రుడు - అటుతరువాత "శ్రీమహాభాగవత పురాణ పారిజాతపాదప స-మాశ్రయంబునను, హరికరుణా విశేషంబునను కృతార్థంబు సిద్ధించె" నని తలచి మరల కొన్నిదినములకు ఏకశిలానగరంబునకు చనుదెంచి అందు "గురువృద్ధ బుధ బంధు జనాను జ్ఞాతుడై" పోతన భాగవత రచనకు పూనుకొనెను.

సాధారణముగా తెలుగు సాహిత్యమున కవులకు స్వప్నమున ఇష్టదేవతలు సాక్షాత్కరించి కృతులను రచింపుమని ప్రోత్సహించుట కలదు. కాని కృతిపతులకు కలలు వచ్చుట అరుదు. నూజవీడును పాలించిన మేకావీర నరసప్పారావుకు

కలలో హరిహరులు, సరస్వతి సాక్షాత్కరించినారట. వాణి హరిహరులకు ఒక గ్రంథమును ఇచ్చినదట. మరునాడు తన కలను సభాసదుల కెరిగించిన వారు అప్పారావును ఒక గ్రంథమును అంకితము గైకొనుమని చెప్పినారు. అతడు కుమార ధూర్జటిచేత ఇందుమతీ పరిణయమును చెప్పించి అంకితము గొన్నాడు.

భక్తి శక్తి, మోక్షసిద్ధి కారణములుగా కావ్యరచనకు పూనుకొనిన కవయిత్రులు తెలుగులో కొందరు కలరు. మొల్ల శ్రీరామచంద్రుడు పలికింపగా భక్తితో రామాయణమును రచించుచున్నానని, భక్తిశక్తి కారణముగాని చదువు కారణము కాదని ఇట్లు చెప్పినది.

"చెప్పుమని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్"

—రామాయణము (1-13)

"నేరిచి పొగడిన వారిని
నేరక కొనియాడు వారి నిజకృప మనుపం
గారణ మగుటకు భక్తియె
గారణమగుఁ గాని చదువు కారణమగునే"

—మొల్లరామాయణము (1-23)

తరిగొండ వేంకమాంబ తన వేంకటాచల మాహాత్మ్యము అవతారికలో-

"వేంకటాచల మాహాత్మ్య విభవములను
బద్యరీతిని రచియించి భక్తి మెఱయ
శ్రీనివాసుని పాద రాజీవములకుఁ
బొసఁగ నర్పింతు మోక్షంబుఁ బొందుకొఱకు"

అని తెల్పియున్నది. (1-18)

## 3 కవితా ప్రాముఖ్యము :

ఈశ్వరార్చన విధానములలో కవిత్వము కూడ ఒక విధానమనియు, ఐహికాముష్మిక సౌఖ్య సంధానమనియు ప్రాచీన తెలుగు కవులు విశ్వసించిరి. కనుకనే కవితను ఒక దేవతగా వా రారాధించియుండుట. అట్టి పవిత్రభావము

తోడనే ఆదికవి నన్నయ కావ్యకర్తయై "భారత భారతీ శుభ గభస్తి చయంబులఁ జేసి ఘోర సంసార వికార సంతమస జాల విజృంభము"ను బాపికొననెంచెను. నన్నెచోడుడు తన గురువగు జంగమ మల్లికార్జునుని "నిసర్గ కవిస్తవనీయ సూక్తులం గొనియాడ" దలచి కుమారసంభవ కావ్యమునకు పూనుకొనెను. శివకు సత్కవితయందు మాయలరేక భాషాంగన వలచి వచ్చినదనియు అట్టి మహిమను లోకమున నిలుపుకొరకు తా నీప్రబంధమును రచించినానని నన్నెచోడుడు స్పష్టముగా తెల్పియున్నాడు.

తిక్కనయు సకల బ్రహ్మ ప్రార్థనము చేసి "తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్వ నిరతిశయానుభవానంద భరితాంతఃకరణు"డై, సోమయాజియై "జనాభ్యర్చిత మైన భారతమును చెప్పి అపార కృపాపరతంత్ర వృత్తిమైఁ బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చి భక్త కోటికి వరణీయు" డయ్యెను. ఎఱ్ఱనయు తన చిత్తము వాగ్వృత్తమును ఉత్తమ శ్లోక సంకీర్తన రచనాయత్తమును నగుచుండ "అత్యుదాత్త భక్తిప్రయుక్తోల్లాసభాసితుడై విష్ణుధర్మ ప్రశంసా పవిత్రమైన ప్రబంధమును చెప్పి అఖిలేప్సిత పుణ్యఫలోదయోన్నతు"లు బడసినాడు. కవిత్రయము తరువాత కవితయెడ ఇట్టి పూజ్యభావమును వహించిన వారిలో అగ్రగణ్యుడు పోతన. "దీనిం దెనింగించి నాజననంబు‌న్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్" (భాగవతము 1-21) అని పోతన కవితా పూర్వకమైన భక్త్యావేశమున నుప్పొంగి భాగవత రచనకు గడంగినాడు. తిక్కన కవితా శిల్పమును ప్రదర్శించుటకు కావ్యమును రచింపగా పోతన భక్తిపూరిత హృదయమును వ్యక్తీకరించుటకు గ్రంథమును రచించినాడు. కాళిదాసు వలె తిక్కన కళోపాసకుడయినచో భవభూతి వలె పోతనకూడ రసోపాసకుడు.

కవిత దేవతారాధనమునకు ఉత్తమ సాధనమను తలంపు తిక్కనాదులకు వలె పింగళి సూరనకు కళాపూర్ణోదయ రచనానంతరమున ప్రభావతీ ప్రద్యుమ్న రచనాదశయందు కలిగినది. సూరన రాఘవ పాండవీయమును ఆకువీటి పెద వేంకటాద్రి ప్రేరణమున రచించి పంపావిరూపాక్షదేవునికి అర్పించినాడు. "సకల లక్షణ లక్షితంబైన మహాప్రబంధంబు కీర్తి కారణం బని" యూహించి కళాపూర్ణోదయమును నంద్యాల కృష్ణరాజు ప్రోత్సాహమున రచించి అతనికి అంకితమిచ్చినాడు. ప్రభావతీ ప్రద్యుమ్న రచనా కాలము నాటికి సూరనలో మార్పు

వచ్చినది. కవితయందు పవిత్రభావమును వహించి తన్మూలమున పితృదేవతా రాధన గావింప నిశ్చయించుకొనినట్లు ఈ క్రిందిపద్యమునుబట్టి తెలియును.

"ఏనుం బిత్రుపూజన నా
చే నైనన్ బెద్ది యైనఁ జేయఁగ వలయున్
గానఁ గృతియిచ్చి మేఁటి
పై నిలుపుదు నతని కీర్తిఁ బరమేశు కృపన్"

కాశి, గయ, ప్రయాగాది పుణ్యక్షేత్రములయందు గావించు పితృతర్పణము నకు కృతిసమర్పణము లేశమును తక్కువ కాదని సూరన భావించినాడు. కనుకనే అతడు ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించి తన తండ్రికి అంకిత మిచ్చియుండుట. దేవతా పితృదేవతారాధనములకు మహోత్కృష్టమార్గమై తన్మూలమున ఆముష్మిక సుఖోన్నతిని ప్రసాదించుటకు కూడ హేతువైన దగుటచే ప్రాచీనకవులు పెక్కుమంది కావ్యరచనోన్ముఖులైనారు.

ఆముష్మిక సుఖోన్నతిని ప్రసాదించుటేగాక ఐహిక వైభవోన్నతికి కూడ కవిత్వము ఉత్తమ సాధనమని మరికొందరు కవులు కావ్యావతారికలందు తెలిపియున్నారు. శ్రీనాథుడు తన పాండిత్యమును ప్రదర్శించుటకొఱకే ముఖ్యముగా కావ్యములను వ్రాసినాడు. శ్రీనాథుడు హరవిలాసములో తన్నుగూర్చి ప్రశంసించుకొనుటలో "కమలనాభుని పౌత్రుఁ గవితా మహారాజ్య భద్రాసనారూఢు" నని కవిత యొక మహారాజ్యముగా వచించినాడు. శ్రీనాథునివంటి జీవితమునే గడపిన అడిదము సూరకవియు "కవిత గల్గిన రాజ్యాధికారమేల" అని తన రామలింగేశ్వర శతకములో చెప్పెను. భర్తృహరి "సుకవితా యద్యస్తి రాజ్యేన కి"మ్మను వాక్యమును "Poets are the unacknowledged legislators of the world". అను ఆంగ్లకవుల అభిప్రాయమును కవిత్వము ఐహిక వైభవోన్నతికి సాధనమను భావమును సువ్యక్తము చేయును.

అనంతామాత్యుడు భోజరాజీయావతారికలో కవితాప్రాముఖ్యమును గురించి ఇట్లుగ్గడించినాడు:

"సకల విద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్టమండ్రదది నిత్యకీర్తి కొఱకు
నర్థాప్తి కొఱకు నా వ్యవహార లక్షణం
బెఱిఁగాడు కొఱకు ననేక విధము

లగు నమంగళముల హరియించు కొఱకు ను
చిత నిత్య సౌఖ్య సంసిద్ధి కొఱకు
నొనరఁ గాంతా సమ్మితోపదేశంబునఁ
బ్రీతిగా హితమాచరించు కొఱకు
నయ్యెఁ గానఁ బెద్ద లాదరించెద రంచు
నేర్పుకొలఁదిఁ గృతి యొనర్పఁ బూనితి"

వని తెల్పినాడు.

ఇట్లు కృతిపతుల ప్రోత్సాహముననే గాక కవితా ప్రాముఖ్యమును గుర్తించి పెక్కుమంది తెలుగు కవులు కావ్యరచనకు గడంగినారు.

పై పరిశీలనమువలన కావ్యోత్పత్తి హేతువులు కావ్యసౌష్ఠవము, కావ్య వ్యాప్తి మున్నగు అంశములు వ్యక్తమగుచున్నవి.

# 8

# కవితా పరామర్శ

తెలుగుకావ్యావతారికలందు కావ్యోత్పత్తితోపాటు కవితాపరామర్శకు సంబంధించిన కొన్నిపద్యములనుకూడ కవులు రచించుట ఒకసాంప్రదాయముగా కన్పించు చున్నది. కావ్యావతారికలలోని కవితాపరామర్శవలన పలువురితెలుగుకవుల స్వీయ కవిత్వాశయములుమాత్రమేగాక కవితాతత్త్వమునుగూర్చిన సార్వకాలికములగు అభి ప్రాయములుకూడ వ్యక్తమగును. కవితామార్గములు, భాషాభేదములు, కవిత్వతార తమ్యములు మొదలగునంశములతోపాటు కొన్ని లాక్షణికసంప్రదాయములు కూడ ఇందుమూలమున తెలిసికొనవచ్చును. ఈ కవితాపరామర్శను రెండువిధము లుగ వర్గీకరించి పరిశీలింపవచ్చును. 1. స్వీయకవితాపరామర్శ 2. కేవలకవితాపరా మర్శ. కవి స్వయముగాగాని లేక కృతిప్రేరేపకుని మూలమునగాని స్వీయకవితా మహత్త్వమును కంఠోక్తిగా స్పష్టపరచిన నది స్వీయకవితాపరామర్శ. కావ్యనిర్మాణ మునకు పూనుకొనిన కవి పాటింపదగు సార్వకాలిక సాహిత్యధర్మములను వివ రించుట కేవల కవితాపరామర్శయగును. నన్నెచోడుడు, శ్రీనాథుడు, సంకుసాల నృసింహకవి మొదలగువారు స్వీయకవితాప్రశస్తిని విపులముగా స్పష్టీకరించినారు. స్వీయకవితాప్రశస్తితోపాటు కేవలకవితాప్రశస్తినిగూడ వివరించినవారిలో ముఖ్యు లుగా పేర్కొనదగినవారు - తిక్కన, కొరవి గోపరాజు, మొల్ల, ప్రౌఢకవిమల్లన, రఘునాథనాయకుడు. కావ్యావతారికలలోని కవులకవితాపరామర్శ ఆ యా కవులకావ్య సమీక్షకు కొంతతోడ్పడును. ఇట్లు తెలుగుకవుల కావ్యావతారికలు సాహిత్యచరిత్ర కారునికేగాక, సాహిత్యవిమర్శకునికికూడ అవశ్యపఠనీయములు.

ప్రథమాంధ్రకవియగునన్నయ భారతావతారికతో స్వీయకవితాలక్షణములను కంఠోక్తిగా ఇట్లు చెప్పినాడు:

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్"

—ఆదిపర్వము (1-56)

పై పద్యమునుబట్టి ప్రసన్నత, అర్థయుక్తి, అక్షరరమ్యత, సూక్తినిధిత్వము అనునవి నన్నయకవితలోని ప్రధానగుణములనుట తెలియును.

## శిల్పము :

కావ్యావతారికలో స్వీయకవితాప్రశస్తిని విపులముగాచేసిన ప్రాచీనకవులలో నెన్నదగిన ప్రథముడు నన్నెచోడుడు. అతడు కుమారసంభవావతారికలో తనకావ్యమును ప్రశంసించుకొనుచు, కవితను ఉత్తమశిల్పముగా పోల్చినవిధమును ఈ పద్యమున చూడనగును.

"పరఁగ సువర్ణ బంధ మృదు భావము గల్గియు లోను చూడఁగాఁ
బొరపగు చిత్ర రూపమును బోలె నసత్కవి కావ్య మిమ్మహిన్
బరఁగు సువర్ణ బంధ మృదు భావ విశేషము లొప్ప దెల్వులన్
సరియగు రత్న పుత్త్రికయు సత్కవి కావ్యము నొక్క రూపమై"

—కుమారసంభవము (1-37) - వావిళ్లప్రతి.

'అసత్కవికావ్యము చక్కనివర్ణములు కూర్పుచేనమరిన మృదుభావముగలదయ్యును తరచి లోతుచూడగా వేరువిధముగా కనబడుచిత్రరూపమువలెనుండును. పైకి మంచిరంగులకూర్పుండినను పగులగొట్టిచూచిన మట్టిచేచేయబడినదై విరువ యోగమగును, సత్కవికావ్యము చక్కనిపదములకూర్పుచే నమరిన మృదుభావ విశేషములవలని సుగుణములచే సువర్ణముతో కూర్పబడి చక్కగా నిర్మితమైన "రత్నపుత్రికవలె మనోహరముగా నుండును" అని నన్నెచోడుని భావము. కావ్యము 'రత్నపుత్రిక' వంటిదట.

"ఆదికవీంద్రుల మాత్మసత్కవీశ్వరుల" కృపవలన "కవితావిలాసవిస్తర మహనీయుడైన" నిర్వచనోత్తరరామాయణము కర్తయగుతిక్కన"నే నుభయకావ్య ప్రౌఢిఁబాటించు శిల్పమునం బారగుఁడం గళావిదుఁడ" నని తనకవిత శిల్పమువంటి

దని ఎలుగెత్తిచాటినాడు. ప్రౌఢకావ్యనిర్మాణమునందలి కవివ్యాపారము శిల్పమని తిక్కనమాటనుబట్టి స్పష్టముగా తెలియుచున్నది. తిక్కనప్రతిభ అమలము, ఉదాత్తము. అట్టి ప్రతిభాశక్తిచే అతడు ప్రౌఢకావ్యమును నిర్మించును. రసవంతమైన కావ్యమే ప్రౌఢకావ్యము. కావ్యమున ప్రౌఢినిపాటించుట శిల్పము. ఆ శిల్పమునం దాతడు పారగుడు. 'రసాశ్రయమున ప్రౌఢకావ్యమును నిర్మించుటయందు కవి బుద్ధిపూర్వకముగాచేయుప్రయత్నము శిల్పము.'

కేయూరబాహు చరిత్రకారుడైన మంచనయు తన కృతిపతి తన్ను కోరినట్లుగ,

"కేయూరబాహు చరితము
చేయుము నీవాంధ్ర భాష శిల్పము మెఱయన్"

—కేయూరబాహు చరిత్ర (1-11)

అని తిక్కన ననుసరించియే కావ్యరచన శిల్పమువంటిదని పేర్కొనియున్నాడు.

తాము సంకల్పించిన రచనాశిల్పము ఎంతవరకు సిద్ధించినదోకాని కవులు కొందరు రచనాశిల్పమును తమ కావ్యావతారికలందుపేర్కొనినారు.

పాల్కురికిసోమనాథుడు బసవపురాణము అవతారికలో అనల్పములైనభావములను అల్పాక్షరములచే వ్యక్తపరచుటయే కవి వివేకమనినాడు.

"అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు"

అని సోమనాథుడు తన రచనాశిల్పమును వ్యక్తపరిచినాడు.

"వచనరచనాచాతుర్యంబున నల్పాక్షరంబుల నధికార్థంబు గుదియించి" రచనాక్రమమునకు గడంగినట్లు నందిమల్లయ ఘంటసింగనలు తమ వరాహపురాణావతారిక (1-8) లో తెల్పియున్నారు.

## సర్వజ్ఞత - ఉచితజ్ఞత :

విలుకానియమ్ముగతి పరహృద్భేదిమై కావ్యము తలలూపింపజేయవలెనని నన్నెచోడుని భావము. ఈ పద్యమును చూడుడు.

"ముదమున సత్కవి కావ్యము
వదరఁగ విలుకాని పట్టి నమ్మును బర హృ

ద్భిదిమై తలయూఁపింపని
యది కావ్యమె మలరి పట్టినదియుం గరమే''
—కుమారసంభవము (1-41)

ఇట్టి కృతులను రచించుటకు కవికి ప్రతిభకావలయునని నన్నెచోడుడు ఇట్లు తెల్పినాడు.

"ఓలిన కడ చన నరువది
నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై
వాలిన సుకవులకుం గా
కేల తరమె కృతులు చెప్ప నెవ్వరికైనన్''
— కుమారసంభవము (1-42)

కవి అరువదినాల్గు విద్యలందును నేర్పుకలవాడై యుండవలయునని నన్నెచోడుడు అభిప్రాయపడినాడు. ఈ నేర్పు నైసర్గికముగా నుండవలెనేగాని హఠప్రయత్నము చేత రాకూడదని అతడు చెప్పినాడు. గజశాస్త్రము, శకునశాస్త్రము, జ్యోతిశ్శాస్త్ర పరిచయము, రసవాదము, సంగీతజ్ఞానము, నాట్యశాస్త్రము, ధనుర్విద్యాకౌశలము, కామశాస్త్రము, వైద్యశాస్త్రము - ఇత్యాదులను నన్నెచోడుడు సందర్భానుగుణముగ తన కుమారసంభవమున వర్ణించి చూపియున్నాడు.

రసజ్ఞుకానివాడు సత్కవికానేరడని కొరవి గోపరాజు తనసింహాసన ద్వాత్రింశిక అవతారికలో ఇట్లుచెప్పియున్నాడు:

"ఉర్విఁగల శబ్ద జాలము
నిర్వచన స్థితుల నెఱిఁగి నేర్పుల విద్యా
నిర్వాహకుఁ డనఁ జెల్లెడు
సర్వజ్ఞుఁడు గాని వాఁడు సత్కవి యగునే''
—సింహాసన ద్వాత్రింశిక (1-21)

సర్వజ్ఞతకుకూడ ఉచితజ్ఞత ముఖ్యమని అతడు ఈ క్రిందివిధముగ తెల్పినాడు:

"ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కా విద్య మహిమ యచ్చు పడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడు నే కావ్యమంత సులభమె ధాత్రిన్'' (1-22)

దుర్వాదముగాకుండ న
పూర్వపుఁ గృతిఁ జెప్ప సుకవి పుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ వని మాటల
గర్వింపఁగ నేల తోడవు గానంబడఁగన్''

— సింహాసన ద్వాత్రింశిక (1-23)

తెలుగుకావ్యావతారికలలోని కవితాప్రశంసభాగమును పరిశీలించుటవలన కవితా తత్త్వమునకు సంబంధించిన వివిధాంశములయెడ ఆయాకవులదృక్పథమెట్టిదో బోధపడును. ఆయంశములలో ముఖ్యములైనవానిని ఈక్రిందపేర్కొని ఒక్కొక్క దానికి సంబంధించి వివిధకవులదృష్టియెట్టిదో సాముదాయకముగా పరిశీలింతము.

## కావ్య కన్యక:

నన్నెచోడుడు కవిత్వమునందును 'వరసతి' యందును సమానధర్మముల నారోపించి స్త్రీవలెనే కావ్యమును సౌభాగ్యముతో నొప్పుచుండవలెనని ఇట్లు తెల్పి యున్నాడు :

''చతురోక్తుల నుతపద బహు
గతుల నలంకార భావకాంతి రసార్ద్ర
స్థితిఁ గవి నతి రసికులు వర
సతి గతి నెతిఁగింప వలదె సౌభాగ్యమునన్''

—కుమార సంభవము (1-39)

చతురోక్తులు, నుతపదబహుగతులు, అలంకారములు, భావము, కాంతి, రసము—ఇవి నన్నెచోడుని కవిత్వగుణములు. ఇవి వరసతికిని గలవు. కవిత్వమునకును, వరసతికిని ఈ గుణములచేతనే సౌభాగ్యము తనంతటనే కల్గును.

సౌందర్య సౌకుమార్యములతో కవిత్వము కన్యకవలె హృదయంగమముగా నుండవలెనను నూహతో కృతిపతినిగూర్చి చెప్పు సందర్భమున ''ఏ విన్ను మామ యనియెడు దీనికిఁ దగ నిమ్ము భారతీ కన్యక'' అని తిక్కన నిర్వచనోత్తర రామాయణావతారికలో తెల్పినాడు. ''మామా!'' అని పిల్చు మనుమసిద్ధికి తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమును కన్యాదానము చేసెను. తిక్కన ననుసరించి తరువాతి తెలుగు కవు లనేకులు తమ కావ్యములందు కృతిపతి ప్రసంగములలో కవిత్వమునకు కన్యాత్వము నారోపించి యున్నారు. ఈ క్రింది ఉదాహరణములనుబట్టి ఈ విషయము స్పష్టమగును:

(1) "మదీయ కావ్య కన్యకకుం దగు వరుం డగుట"

—కేతన, దశకుమార చరిత్రము (1-24)

(2) "బాలరసాల పుష్ప నవ పల్లవ కోమల కావ్య కన్యకన్"

—మంచన, కేయూరబాహు చరిత్రము (1-13)

(3) "మదీయ కావ్య కన్యామనోహరుండగు......"

—వెన్నెలకంటి సూరన, విష్ణుపురాణము అవతారిక.

(4) "సజ్జన విధేయునకున్ గవితా స్త్రీలోలునకున్"

—పెద్దన, మనుచరిత్రము (పీ. 45)

(5) "ఏతత్కావ్య కన్యారత్నంబున కనుకూల వల్లభుం డేదేవుండో కో"

—బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము (1-20)

(6) "కృతి కన్యారత్నమునకు విద్యాపారంగతుండైన వరునిం బరికించి"

—ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము (1-6)

(7) "నీవు సృజింపం బూనిన కావ్య కన్యకా లలామంబున కుంకువగా నాయు రారోగ్య మహాభాగ్యంబు లొసంగెడు"

—కందుకూరి రుద్రకవి, నిరంకుశో పాఖ్యానము (1-18)

(8) "మదీయ కృతి కన్యకా హార వల్లికి సఫలంబుగా ననుగుణ నాయక రత్నంబు"

—అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయము (పీ. 14)

(9) "రంగపతి యంగజు తండ్రి మదీయ కావ్య సారంగ విలోచనామణికి"

—కాకమాని, మూర్తికవి పాంచాలీ పరిణయము

(10) "మామక భవ్య కావ్య కన్య కళ్యాణ మొనరింతు గౌరవమున"

—కాకమాని మూర్తికవి రాజవాహన విజయము (1-24)

(11) "సమ్యక్కృతి కన్యపై గలమమత్వము వర్తిలదందు......"

—అద్దంకి గంగాధరకవి, తపతీ సంవరణోపాఖ్యానము

(12) "కవితా కుముద్వతీ వల్లభుం డగుటకు"

—తెనాలి అన్నయ, సుదక్షిణా పరిణయము

(13) "......... పరిగ్రహింపుమ
య్యా రఘునాథ భూప! రసికాగ్రణి! మామక కావ్య కన్యకన్"

—చేమకూర వేంకటకవి, విజయవిలాసము (1-39)

(14) "యొల్లకవి రాజిత మల్హణ కావ్య కన్యకన్"

—ఎడపాటి ఎఱ్ఱన, శృంగార మల్హణ చరిత్ర

(15) "కృతి కన్యాపతి వేంకట పతి యఁట"

—కృష్ణకవి, శకుంతలా పరిణయము (1-92)

శృంగారరసప్రబంధము క్రొత్తవన్నెలు పచరించినట్లు కొందరి ప్రబంధకవుల కవితావిలాస ప్రశంసనుబట్టి వ్యక్తమగును. కవితాస్వరూపమునుగూర్చి చర్చించుచు ప్రబంధకవులుకొందరు కావ్యరీతులను స్త్రీతోను, స్త్రీ అంగప్రత్యంగములకుపోల్చియు చెప్పియున్నారు.

కావ్యరీతులను కచకుచాద్యుపమానములతో వర్ణించినవారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ప్రథముడు. వాగ్విలాసములను సవిశేషముగ చూపగల్గిన సమర్థుడు. తనజైమినిభారతరచనానైపుణ్యమును నరసింహరాయలముమోల సభ్యులు నుతించినట్లు పినవీరభద్రుడు ఈ పద్యమును చెప్పినాడు:

"అల్లన విచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జీబుగఁ దోఁచు భాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్"

—జైమిని భారతము (1-25)

అల్లనవిచ్చుచెంగలువలు వెదజల్లు సౌరభములవంటిభావములు నాతిగూఢముగా పయ్యెదమాటుననున్నయువతీ వక్ష స్సౌందర్యమువలె తోచునట్లుగా పినవీరభద్రుడు కవిత్వముచెప్పగలడట.

కావ్యస్వరూపమునుగూర్చి బైచరాజు వేంకటనాథుడు చెప్పిన ఈ పద్యము ప్రసిద్ధమైనది.

"ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ గూఢముగాక ద్రావిడీ
స్తన గతిఁ దేటగాక యరచాటగు నాంధ్ర వధూటి చొక్కపుం
జనుఁగవఁబోలి గూఢమును జాటు దనంబును గాక యుండఁ జె
ప్పినయది పో కవిత్వ మనిపించు వగిం చటుగాక యుండినన్"

—పంచతంత్రము (1-18)

కావ్యము ధ్వనిపూర్ణముగా నుండవలెనని తెల్పుచు మొల్ల తన అభిప్రాయమి ట్లు వ్యక్తపరచినది :

"వలిపపు సన్న పయ్యెదను వాసిగ గంధపుఁబూత తోడుతన్
గొలదిగఁ గానవచ్చు వలిగుబ్బచనుంగవ కీవి నొప్పుఁగాఁ
దెలుఁగని చెప్పుచోటఁ గడు తేటల మాటలఁ గ్రొత్త రీతులం
బొలుపు వహింపకున్న మతి పొందగునే పటహాది శబ్దముల్"

—రామాయణము (1-15)

కేవలము పటహాదిశబ్దములతో వ్రాసినచో అందు కావ్యలక్షణములు పొడసూపవని క్రొత్తరీతులలో కావ్యమును రచింపవలెనని మొల్ల పై పద్యమున తెల్పినది.

శ్రీనాథుని వచోవిలాసములు స్తనకాఠిన్యమును బూనినవని శ్రీనాథుని స్తుతించుచు రాధామాధవ కర్త ఇట్లు చెప్పినాడు:

"నానాస్త్రీ ప్రమదామదస్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్
బూనం జాలు వచో విలాసముల నేర్పుల్ జూపి కర్ణాటక
క్ష్మా నాథేంద్రు సభన్ గవిత్వ విజయోత్సాహంబుఁ గైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్"

—రాధామాధవము (1-13)

కవితాప్రౌఢికి ఆంధ్రీ స్తనముల నుపమానముగా గ్రహించిచెప్పిన మరొక తెలుగుకవి కనుపర్తి అబ్బయామాత్యుడు. అతడు కవిరాజమనోరంజనము అవతారికలో కవిత్వస్వరూపనిర్ణయమును ఇట్లు గావించినాడు:

"తనుఁ దా మెచ్చు కొనంగ నేటికిఁ గవిత్వ ప్రౌఢి యాంధ్రీ ఘన
స్తన కుంభ స్ఫురణన్ నవీన మృదు చిత్ర శ్రీ పదాచ్ఛాదనా
భినవాలంకరణార్థ సూచనల సంప్రీతిన్ మనో వీథులం
జొనుపం గల్గిన నింపుతో విని రసజ్ఞుల్ మెచ్చినం జాలదే"

—కవిరాజమనోరంజనము (1-18)

ఇది బహుశః అలచాటగు నంధ్రవధూటి చొక్కపుంజనుగవను పేర్కొను విధము కానోపు!

కవితాస్వరూపమునుగురించి తెల్పుచు ప్రౌఢకవి మల్లన కావ్యము వారస్త్రీ వలె నుండవలెనని చెప్పినాడు. చూడుడు-

"సౌరభ్యంబును బంధ చాతురి తగన్ శయ్యా చమత్కార శృం
గారంబున్ వివిధార్థముల్ సరస సాంగత్యంబు నానా కళా

పారీణత్వము మంజు వాగ్విభవమున్ బాంచాల రీతిం దగన్
వారస్త్రీయును బోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యం బిలన్"
—రుక్మాంగద (1-24)

## కవిత్వము - పోలికలు

కవిత్వము మదపుటేనుగునడకవలె నుండవలెనని నన్నెచోడుడు కుమార సంభవము అవతారికలో ఇట్లుసూచించినాడు.

"పదబంధంబుల నగ్గలించి బుధ శబ్ద భ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజ వనముల్ భంజింపుచున్ భూరి స
మ్మద లీలన్ విలసిల్లు సత్కృతి జగన్మాన్య ప్రభావంబునన్
మదనాగంబును బోలెఁ గ్రాల వలదా మాటెందులే కున్నతిన్"
—కుమారసంభవము (1-40)

ఇది వింతయైనకల్పన. కావ్యమునుగాని, కవిత్వమునుగాని మందయానము గల మదపుటేనుగునకు పోల్చిచెప్పుటలో నన్నెచోడుడు ప్రథముడు.

నన్నయకవిత ఏనుగునడకవంటిదని ఎఱ్ఱన హరివంశావతారికలో ప్రశంసించియున్నాడు.

"ఉన్నత గోత్ర సంభవము నూర్జిత సత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్య పరిభావి మదోత్కటము న్నరేంద్ర పూ
జోన్నయనోచితంబునయి యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్"
—హరివంశము (1-8)

కవిత్వమును ఏనుగునడకతో పోల్చిచెప్పిన మరొకకవి సంకుసాల నృసింహ కవి. అతడు కవికర్ణరసాయనము అవతారికలో తన కవిత్వమునుగూర్చి యిట్లు తెల్పియున్నాడు:

"హృదయ గతిం బురాతన కవీశ్వరు లేగని వీథి లేదు నేఁ
డదనుమతిన్ రచించు కృతి తాత్త్వికులం గరఁగింపకుండునే?
మద గజ రాజముల్ చనిన మార్గములం గడునింపు నింపవే
మద గజ రాజ యాన మద మంథర బంధుర యాన మానముల్"
—కవికర్ణరసాయనము (1-18)

గంభీరమును, ఉదాత్తమును నగు కావ్యశైలివి వ్యక్తముచేయుటకు ఈ కవులు కవిత్వమును ఏనుగునడకతో పోల్చిరనుట స్పష్టము.

కవిలోక బ్రహ్మయను బిరుదునొందిన పెదపాటి సోమనాథకవి చెప్పిన గుజ్జము పద్యమొకటి సంకలన గ్రంథములందు కలదు.

"పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పద భావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యమున్
సదలంకార విశేషముం గలిగి విశ్వప్రాణ సౌభాగ్య సం
పదయైఁ దేజియ పోలి గ్రాల వలదా పద్యంబు హృద్య స్థితిన్?"

సోమనాథుని ఈ పద్యము కదమునడచుచున్నట్లే హృద్యస్థితిని గ్రాలు చున్నది.

## చమత్కృతి

ప్రతిపద్యమును చక్కగావ్రాసి నిర్వహింపవలెనని నన్నెచోడుడు ఈ క్రింది పద్యమున తెల్పినాడు.

"అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కఁదమైన సత్కృతి యగుర్వగుఁ గా కిలఁ జీకు లావుకం
ద్రొక్కిన యట్లు నోరఁ గొలఁదుల్ పురి గొల్పఁగ నందు లోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ గృతియుం గృతి యంగు రె! వాని మెత్తురే!"
—కుమారసంభవము (1-38)

నన్నెచోడుని అంధలావుక న్యాయమును అనుసరించికాబోలు జక్కన విక్రమార్కచరిత్రావతారికలో ఘుణాక్షర న్యాయమును చెప్పినాడు. జక్కన పద్య మిది:

"ప్రతి పద్యముఁ జోద్యముగాఁ
గృతి జెప్పిన నొప్పుఁ గాక కృతి నొక పద్యం
బతి మూఢుఁడైన జిత్రతఁ
బ్రతి పాదింపఁడె ఘుణాక్షర న్యాయమునన్?"
—విక్రమార్కచరిత్రము (1-17)

నన్నెచోడుడు, జక్కన ఇరువురును ప్రతిపద్యము చోద్యముగాను, హృద్యముగాను నుండునట్లు చక్కగారచింపవలయుననియే అభిప్రాయపడినట్లు పైపద్యములనుబట్టి తెలిసికొనవచ్చును.

సరససాహిత్యలక్షణవిచక్షణుడగు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానావతారికలో నిట్లు తెల్పినాడు.

"కవితా చమత్కృతిఁ గాంచి హర్షించి
కవులందఱును శిరః కంపంబు సేయఁ
బచరించి వీనుల పండువు గాఁగ
రచియింతు"

కవితా చమత్కృతిని చూపుచు రసవంతమైన ప్రౌఢప్రబంధముగా హరిశ్చంద్రోపాఖ్యానమును గౌరన రచింపదలచినట్లు దీనివలన వ్యక్తమగుచున్నది.

"......ప్రతిపద్యమునఁ
జారుఫణితిఁ జెప్పఁగలరు చాటువు గాఁగన్" (1-13)

అని కృతిపతి తమ్మగూర్చి పల్కినట్లు నంది మల్లయ ఘంట సింగనలు వరాహ పురాణావతారికలో తెల్పియున్నారు.

ఈ చమత్కారరచన ప్రబంధకవులలో ప్రముఖముగా కన్పించును. శ్లేష కావ్యములు, నానార్థకావ్యములు, అచ్చతెనుగుకావ్యములు, చిత్రబంధకవితారీతులు వెలయుటకు కవులు చమత్కారనిర్వాహణమునందు ఆసక్తిచూపుటయే కారణము.

"కృతిలోఁ బ్రతిపద్యచమత్కృతి గలుగఁగఁ బలుకనేర్చు కృతి" నొనర్చి తన కంకిత మిమ్మని రాజవాహన విజయకర్తయగు కాకమానిమూర్తికవిని కోరినాడట అతనికి కలలో కనపడిన శ్రీ వేంకటేశ్వరుడు.

విజయవిలాస కర్తయగు చేమకూర వేంకటకవి కవితాచమత్కృతిని రఘునాథనాయకుడు ఇట్లు ప్రశంసించియున్నాడు:

"ప్రతి పద్యము నందుఁ జమ
త్కృతి గలుగం జెప్ప నేర్తు వెల్లెడ బేరుగా
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదు సుమీ!"

—విజయవిలాసము (1-50)

ప్రబంధయుగమున ఈ చమత్కారకవిత్వము చాలప్రాముఖ్యము వహించినది.

## అష్టాదశ వర్ణనలు :

అష్టాదశవర్ణనలను పేర్కొనిన మొట్టమొదటి తెలుగుకవి నన్నెచోడుడు. కుమారసంభవావతారికలోని పద్యమిది:

"వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర గతి తతి క్షితి పరిణాం
బునిధి మధు ఋతు పురోద్యా
హ నగ విరహ దూత్య వర్ణ నాష్టాదశమున్"

—కుమార సంభవము (1-41)

నన్నెచోడునితరువాత పాల్కురికి సోమనాథాదులు అష్టాదశవర్ణనలను తమ గ్రంథావతారికలందు పేర్కొనినారు. ప్రతాపరుద్రయశోభూషణకర్తయైనవిద్యానాథుడు (1280-1340)సంస్కృత సంప్రదాయమైన అష్టాదశవర్ణనలను దండికావ్యాదర్శము నుండి గ్రహించి పేర్కొనినాడు. కన్నడములో అష్టాదశవర్ణనలను కంఠోక్తిగా చెప్పినవారు లేరు. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణియందు "నగర ముఖ్యాష్టదశవర్ణనములచేత జరుగునదియును భవ్యప్రబంధమనఁగ" (3 ఉల్లాసము 91 వ పద్యము)అని భవ్యప్రబంధము అష్టాదశవర్ణనాపూర్ణమయియుండుటను చెప్పి అష్టాదశవర్ణనలను పేర్కొనియున్నాడు.

పాల్కురికి సోమనాథుడు కేవలము కవియే గాక స్వతంత్రలాక్షణికుడును అనుటకు పండితారాధ్య చరిత్రావతారికలో అతడు విపులముగా పేర్కొనిన కావ్య లక్షణములు ప్రబల నిదర్శనము.

"సత్కృతి యన నూత్న సంగతి దనరఁ
దొమ్మిది రసములు దులుకాడు దాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబు లలలారుదాని
ద్విగుణార్థ భావముల్ దీటు కొనంగఁ
దేట తెనుంగున ద్విపద రచింతు.

* * *

సరళత సరణి ప్రసన్నత సెన్ను
పరిణతి గణపద పద్ధతి శబ్ద
శుద్ధి ప్రయోగ ప్రసిద్ధి గళా స
మృద్ధి నానుడి వడిమితి రతి యర్థ
పుష్టి సైజము రసపుష్టి వినూత్న
సృష్టి విశేష్య విశేషణ శ్లేష

సొంపు సుకుమారత పెంపు మాధుర్య
మింపు మృదుత్వంబు నింపోజబుజావు
యమకంబు గమకంబు యతి గతి గార
కము పూరక క్రియ గాంతి విశ్రాంతి
రంగు బెడంగు మెఱుంగు సమాస
సంగతి యక్షర శయ్యా సంఘటన
నిపుణత రసికత నెఱి సమాధాన
ముపమాన మవధాన ముత్ప్రేక్షలక్ష్య
లక్షణా వ్యక్తి యలంకార యుక్తి
దక్షత సుమతి విచక్షత యనిన
జాతులు రచనా ప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతులుట్టంగ
వరకవు ల్గొనియాడ వర్ణన కెక్క
ధరఁ జెప్పఁ గృతియయు సద్యత్కృతి గాక"

—పండితారాధ్యచరిత్ర - అవతారిక, పుట 17-20.

అష్టాదశవర్ణనలను పేర్కొని వానిని ఉచితస్థలములందు చూపెదనని కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక అవతారికలో ఇట్లు తెల్పియున్నాడు.

"పురమధుజల లీలాంబుధి
పరిణయ నయ విప్రలంభ పతి గుణ సుత భా
స్కర చంద్రోదయ రణగతి
గిరి వన దూత ర్తు రతులఁ గృతి చెప్పఁదగున్" (1-37)

కావునఁ బదునెనిమిదియగు
నీ వర్ణన లచట నచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కివి
రావనఁడు లక్షణాభిరామము లగుటన్"

—సింహాసన ద్వాత్రింశిక (1-38)

దీనినిబట్టి కొరవి గోపరాజు కావ్యమునకు పదునెనిమిదివర్ణనములుండవలెనను నియమమును పాటించినట్లు స్పష్టమగుచున్నది. కృతులందు అష్టాదశవర్ణనలుండ వలెనని ప్రౌఢకవిమల్లనకూడ రుక్మాంగదఅవతారికలో ఇట్లుచెప్పియున్నాడు:

"వన జల కేళీ శశి శా
తన యోదయ పాన యాన దౌహృద్యార్థి విహా
ర నృప రతి విరహ పుత్త్ర మం
త్రి వ గాహన నగర వర్ణనలు దగుఁ గృతులన్"

—రుక్మాంగద (1-18)

అప్పకవి వేట, మౌనీంద్రపుణ్యాశ్రమము, కన్యాంగసౌందర్యకథనము, దౌహృదము అను వానినికూడ చేర్చి ఇరువదిరెండు వర్ణనలను పేర్కొని యున్నాడు. అష్టాదశవర్ణనలను కృత్యాదియందు పేర్కొనినవారిని మించి తమ కావ్యములందు వర్ణించియున్నను పెద్దనాదికవులు తమకావ్యావతారికలందు అష్టాదశవర్ణనలనుగూర్చి చెప్పకపోవుట ఒకవిశేషము.

## కవిత్వము - రసము:

నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు 'నవరసభరితము'గా తమకావ్యములను రచించెదమని తమకావ్యావతారికలందు చెప్పియున్నారు. తిక్కన భారతావతారికలో 'కావ్యరసము' ను కొనియాడినాడు. తాను తీర్చబోవు కావ్యగత రసమునుగూర్చి పినవీరభద్రుడు శృంగారశాకుంతలము అవతారిక (1-25) లో ఇట్లు చర్చించియున్నాడు.

"శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములు దలఁప నష్ట రసములున్
సాంగముగు నేనిఁ డెంకము
బంగారము తోడి యొర ప్రబంధము నొందున్"

'మృదులవచనాస్పద పదసంపదల రసము పదనిడక' చెప్పవలెనని, రసభావంబులు ముప్పిరిగొనునట్లు' తాను చెప్పినానని కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికఅవతారికలో తెల్పినాడు. మాదయగారిమల్లన రసైకపరతంత్రుడు. రసప్రాధాన్యమును పేర్కొనుచు అతడు చెప్పిన పద్యము పరికింపుడు:

"చెప్పఁదగుఁ గవిత రసము
లొప్పిల నప్పప్ప బళిబళీ యన లేదా
యొప్పుడు చేయక యుండుట
యొప్పు సుమీ సుకవి యెంత యుచితజ్ఞుఁ డొకో"

—రాజశేఖర చరిత్రము (1-8)

ఏమి ఈతని ఉచితజ్ఞత! రసము చిప్పిలునట్లు కవితచెప్ప నేరనిచో నెప్పుడు చెప్పకుండుటయే యొప్పట.

సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనము అవతారికలో నీరసపుకావ్యముల నిట్లు పరిహరించియున్నాడు:

"ఏ రసముఁ జెప్పఁ బూనిన
నారస మాలించు వారి నలరింపని యా
నీరసపుఁ గావ్య శవముల
దూరమునన పరిహరింపుదురు నీతిజ్ఞుల్"

— కవికర్ణ రసాయనము (1-12)

రసప్రాధాన్యమును వివరించుచు రఘునాథనాయకుడు తన రామాయణావతారికలో ఈ క్రిందిపద్యములను రచించినాడు :

"పలుకఁగ వలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
నలుకక యటుగాకున్నం
బలుకక యుండుటయె మేలు బహుమానముగన్ (1-16)

సందర్భము నవరస ని
ష్యంది యగుచుఁ గవుల చెవులఁ జవులుం దవు నిం
పొందినఁ దగుఁ గాకున్నను
నందదుకుల కూర్చు కవిత యందం బగునే (1-17)

మాటికి రస పరిపాటికి
మేటికవులు మెచ్చి మేలు మేలనఁ గూర్తుం
దేటగ రామాయణ కథ
మాటల పొందికలు గుమగుమఁ బిసాళింపన్"

—రఘునాథ రామాయణము (1-18)

## అలంకార, రీతి, వృత్తి, గుణ, పాక, శయ్యాదులు:

'షట్త్రింశదలంకారాలంకృతంబై' తనకావ్యము రమణీయమగునని నన్నెచోడుడు తెల్పియున్నాడు. పాల్కురికిసోమనాథుడు, విన్నకోటపెద్దన అలంకా

ములను ముప్పదియారుగానే పేర్కొనిరి. కాబట్టి అలంకారములు ముప్పదియారుగా పేర్కొనుట ఆనాటిసంప్రదాయమని చెప్పవచ్చును. క్రమక్రమముగా అలంకారముల సంఖ్య పెరిగినది.

నన్నెచోడుడు తన కుమారసంభవావతారికలో అలంకారాది లక్షణములను విపులముగా పేర్కొనినాడు.

"సరళముగాఁగ భావములు జానుఁ దెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లోత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధు మృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగాన్"

—కుమార సంభవము (2-35)

'భావము' అనగా 'నవరసభావభరితంబై' అని నన్నెచోడుడు చెప్పినట్లు విభావానుభావసాత్త్వికవ్యభిచారులని అర్థము. కవిశక్తిని కొలుచుట కుపయోగించు వానిలో భావము ముఖ్యమైనది. అర్థము శబ్దాశ్రయము. వాని సంబంధము విడదీయరానిది. నన్నెచోడుడు అర్థములు శబ్దములతో నొత్తగిల్లియుండవలెనని తెల్పియున్నాడు. అర్థావబోధనమునకు తోడ్పడి సంభాషణమునకు పుష్టిని చేకూర్చునవి సూక్తులు.

'దశప్రాణంబుల సప్రాణంబై' (కుమార. 1-45) అని నన్నెచోడుడు తెల్పినాడు. ప్రాణములసంఖ్య పది. ఇవి కావ్యగుణములు. దండి తన కావ్యాదర్శమున ఇట్లు తెల్పినాడు:

"శ్లేషః, ప్రసాద, స్సమతా, మాధుర్యం, సుకుమారతా,
అర్థవ్యక్తి, రుదారత్వ, మోజః, కాంతి, సమాధయః
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః"

—కావ్యాదర్శము, 1 పరి-41, 42 శ్లో

ఈ ప్రాణములు వైదర్భీరీతికి ప్రాణములవంటివి. రీతులు శైలికి సంబంధించినట్టివి.

వక్రోక్తి, ప్రౌఢోక్తి, సరసోక్తి - శ్రీనాథుని కవితాలక్షణములని తెలియుచున్నది. ఈ లక్షణములతో సత్కావ్యమును చెప్పిన అది దిక్కులందు రాణించునని శ్రీనాథుడు భీమేశ్వరపురాణావతారికలో ఇట్లు చెప్పియున్నాడు:

"హారచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంత స్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యము ల్దిక్కులం
జిరకాలంబు నటించు చుండుఁ గవిరాజీ గేహ రంగంబులన్"
—భీమేశ్వర పురాణము (1-11)

మాదయ్యకవి కవితాశైలినిగురించి మైరావణచరిత్ర కృతిపతియగు గోప మంత్రి చెప్పిన అభిప్రాయ మిది :

"రసములు తొమ్మిదిం గలుగు రమ్యనవార్థసుశబ్ద మాధురీ
విసరము లుల్లసిల్ల నతి విస్ఫుట లక్షణ రూఢిఁ బ్రౌఢిమన్
రసికుల నెమ్మనంబు లనురాగము నొందఁ దెనుంగు బాస నిం
పెసఁగఁగఁ జెప్ప నేర్తు పర రెవ్వరు నీకును మాడ ధీమణీ"
—మైరావణ చరిత్రము 2-22

"పదము లర్థంబులు భావముల్ గతులు
పదశయ్య లర్థ సౌభాగ్యముల్ యతులు
రసములు గుంభనల్ ప్రాస సంగతులు
నసమాన రీతుల నన్నియుఁ గలుగ"

రామాయణమును రచించినట్లు గోన బుద్ధభూపతి రంగనాథరామాయణావతారికలో తెల్పియున్నాడు. అతడు 'అసమాన లలితశబ్దార్థసంగతుల', 'పరగ నలంకారభావ నల్నిండ' అని ప్రతికాండాంతమందును మరల మరల నుద్ఘాటించియుండుటచే ఈలక్ష్యముతోడనే రామాయణమును రచించినట్లు విశదమగును.

## శ్రావ్యతా మాధుర్యములు :

కృతి రచనావిధానమును గూర్చి తిక్కన నిర్వచనోత్తర రామాయణావ తారికలో ఇట్లు చెప్పినాడు:

"భూరి వివేక చిత్తులకుఁ బోలు ననం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహు చందమునం బ్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకుల్సరి గ్రుచ్చు నట్లు గాఁ
జేరుప నేరఁగా వలయుఁ జెప్పెద నేఁ గృతి యన్న వారికిన్" (1-5)

"లలిత పద హృద్య పద్యం
బులన కథార్థంబు ఘటిత పూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁ గా
వాల సంధించిన విధంబు నమరఁగఁ జేతున్" (1-16)

పై పద్యములలో 'ఇంపారెడు పల్కులన్' అనియు, 'లలిత హృద్య పద్యములు' అనియు తరచుగ పదములందలి మాధుర్యమునుగూర్చి తిక్కన నొక్కి చెప్పెను. "సరసమధురవచో గుంఫన సుప్రసాద సంబోధన గోచర బహువిధార్థ తాత్పర్యముగా" (ని. రా. 1-10) చెప్పుట సత్కవీంద్ర మార్గమని తిక్కన తెల్పినాడు. వీనినిబట్టి సంగీతచిత్రలేఖనములు రెండును కవితయందు పొందుపడి యుండవలెనని తిక్కనభావమని ఊహింపవచ్చును. "కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావలి మోదముం బొరయు నట్లుగ" అనుటచే శ్రావ్యతా మాధుర్యగుణము సూచితమగుచున్నది.

అల్లసానిపెద్దన ఉత్పలమాలికారూపమున సంస్కృతాంధ్రపద గుంఫనముతో కవిత్వోపన్యాసమును ఆశువుగా విరచించెనట. అందు కవిత కుండవలసిన మాధుర్య రసవిజృంభణమునుగూర్చి తెలుగు చరణములలో "డాతొడనున్న మిన్నుల మిటారపుముద్దులగుమ్మ కమ్మనౌ వాతెర దొండపండువలె వాచవిగావలెఁ బంటనూఁదినన్" అనియు, సంస్కృతచరణములలో "......జిల్లునఁ జల్లవలెన్ మనోహరద్యోతక గోస్తనీఫలమధుద్రవగోఘృత పాయసంప్రసారాతిరస ప్రసార రుచిరప్రతిమంబుగ సారె సారెకున్" అనియు తెల్పినాడు. ఇట్లే శ్రావ్యతనుగూర్చి తెలుగుచరణములలో.... "పైదలికుత్తుకలోని పల్లటీ, కూఁతలనన్ వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్" "గాతలదమ్మిచూలిదొర... హరువు మొల్లముగావలె" అనియును, సంస్కృతచరణములలో "...తాళయుగ్మలయ సంగతి... మాపురఘూళఘుళీ....విలాసయుక్తమై" అనియు మిక్కిలి అతిశయోక్తిగా వర్ణించిచెప్పెను. ఇట్లు తిక్కన కవితాగుణము లన్నిటికంటె శ్రావ్యతామాధుర్యములనే పెద్దన విపులముగా వర్ణించినాడు.

రాధామాధవకవి తన కవితామాధుర్యమును గురించి-

"సరసులు చిత్తగింపుఁ డని చాటను మామక వాణి సన్మనో
హారయగు నేని వారి హృదయంబుల కింపొనరింప కున్నె? తొ

వ్వరు పిలువంగ వచ్చి యళివర్గము లాత్మలఁ జొక్కఁ దేనియల్
గురియు ప్రసూన గుచ్ఛ భర కుంచిత మల్లి మతల్లికా వనిన్''
— రాధామాధవము (1-16)

అని ఆత్మగౌరవమును ప్రదర్శించుకొనినాడు. మొల్ల, రామరాజభూషణుడు మొదలగువారు శ్రావ్యతామాధుర్యములను తమ కావ్యావతారికలందు పేర్కొని యున్నారు.

''రాతిరియుం బవల్ మఱపురానిహొయల్ చెలియారజంపు ని, ద్దాతరితీపులంబలెను దారసిలన్ వలె లోఁదలంచినన్''అని పెద్దన ఆశువుగా చెప్పిన కవిత్వోపన్యాసములోని వాక్యమునుబట్టి కవిత మరచిపోబడు నట్టిదిగాక గాఢముగ నాటుకొని రాత్రింబవళ్లు కన్నులకు గట్టినట్లుండవలయుననుట వ్యక్తమగును. కవితయుం దిట్టి అద్భుతప్రభావ ముండుటచేతనేకాబోలు కవికర్ణరసాయన కర్తయగు సంకుసాలనృసింహకవి యిట్లు శపథము చేయగలిగినాడు:

''యతి విటుఁడు గాక పోవు టె ట్లస్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున?
విటుఁడు యతిగాక పోరాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణనాకర్ణనమున''

తాళ్లపాక చిన్నన్న తన కవితా గుణములను అష్టమహిషీ కల్యాణావతారికలో ఇట్లు తెల్పినాడు :

''............ అలఘు శబ్దార్థ
సారస రీతి రస ప్రభావముగఁ
గులికి కస్తురి పిసెఁ గోసిన కరణిఁ
దెలికప్పురపుఁ గ్రోవి దెఱచిన సరణి
విరవాది పొట్లంబు విడిచిన మాడ్కిఁ
బరిమళించుచు కవుల్ బళి బళి యనఁగఁ
గవిత చెప్పిన సులక్షణునిఁ గవీంద్రుఁ
డవునందు రే నేర్చినట్లు చెప్పెదను''
—అష్టమహిషీ కల్యాణము, అవతారిక.

కవికోటి బళీ యనునట్లు కృతిని చేయుమని తనకు కలలో కనపడిన తండ్రి లంకావిజయకర్తయగు పిండిప్రోలు లక్ష్మణకవిని ఇట్లు ఆదేశించెను:

"కొందఱు శబ్దసౌష్ఠవముఁ గొందఱు భావముఁ గొంద ఱర్థముం
గొందఱు సంధి సంఘటనఁ గొంద ఱలంకృతి వృత్తిఁ గొందఱుం
గొందఱు తెన్గు సంస్కృతముఁ గొందఱు చందముఁ గొంద ఱన్వయుం
గొందఱు జాతు రెల్ల కవికోటి బళీయనఁ జేయు మీకృతిన్"

—లంకా విజయము (1-56)

## ఛందో వ్యాకరణాంశములు :

కావ్యనిర్మాణమునకు పూనుకొనిన కవి ముఖ్యముగ గమనింపవలసిన విషయములను తిక్కన నిర్వచనోత్తర రామాయణావతారికలో ఇట్లు తెల్పియున్నాడు:

"తెలుఁగు కవిత్వము చెప్పం దలచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మాటలు గాని వళులుం బ్రాసంబులు నిలుపక యొగిని బలిమి పుచ్చుట చదురే?"

అలవడ సంస్కృత శబ్దము తెలుఁగు బడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకనెడ లింగవచనంబులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్"

యతి ప్రాసల స్థానములో అర్థవంతమైన మాటలను వాడవలెనని తిక్కన తెల్పినాడు. "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప" నని తిక్కనశపథము చేసినాడు (నిర్వ. రా. 1-14) "ప్రాసము ప్రకారము వేరగు నక్షరంబులన్ శ్రుత్యనుప్రాసమంచునిడ" నని కూడ తిక్కన ఇంకొక శపథము గావించినాడు. దీనినిబట్టి వళిప్రాసల బాధ తిక్కననాడు నుండినదనుట వ్యక్తమగును. వళిప్రాసములను గురించి నన్నెచోడుడు చెప్పలేదు.

ప్రౌఢకవి మల్లన రుక్మాంగద అవతారికలో ఇట్లు తెల్పియున్నాడు:

"వడియును బ్రాసమున్ గణము వర్ణము లర్థము శబ్దమొప్పు నే
కడమయు లేదు మత్కృతికిఁ గైకొని చూడుఁడు సత్కవీంద్రు లె
య్యెడ నెది యొక్క పద్యమున నిందుల సత్త్వము పద్మలోచనల్
కడిఁడిడు కూటిలో మెదుకుఁ గైకొని పాక మెఱుంగు కైవడిన్"

—రుక్మాంగద (1-27)

## కావ్య రచనా సాధన సామగ్రి—సత్కృతి లక్షణములు:

మొల్ల తన రామాయణావతారికలో కావ్యరచనా సాధన సామగ్రి నము ల్లాన సంపదనంతయు ఒక పట్టికగా ఏకరువు పెట్టినది. చూడుడు:

> "దేశీయ పదములు దెనుఁగులు సాంస్కృతుల్
> సంధులు ప్రాఙ్గల శబ్ద వితతి
> శయ్యలు రీతులుఁ జాటు ప్రబంధంబు
> లాయా సమాసంబు లర్థములును
> భావార్థములుఁ గావ్య పరిపాకములు రస
> భావ చమత్కృతుల్ పలుకు సరవి
> బహు వర్ణములును విభక్తులు ధాతు ల
> లంకృతి చ్ఛందో విలక్షణములుఁ
> గావ్య సంపద క్రియలు నిఘంటువులును
> గ్రమము లేవియు నెఱుఁగ విఖ్యాత గోప
> వరపు శ్రీ కంఠ మల్లేశు వరము చేత
> నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చి కొంటి"

—రామాయణము (1-12)

ఇన్ని చెప్పియు తనకేమియు తెలియదని చెప్పుట మొల్ల వినయ సంపత్తిని వ్యక్తము చేయును.

> "తేనెసోఁక నోరు తీయన యగు రీతి
> తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
> గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
> మూఁగ చెవిటివారి ముచ్చటగును"

—రామాయణము (1-17)

కావ్యము ధ్వని పూర్ణముగా వ్రాసినను 'తేనె సోక నోరు తియ్యన యగు రీతిగా' నుండవలెనుగాని 'అర్థమెల్లఁ దోఁపకుండ, గూఢ శబ్ద వితతి గూర్చి' వ్రాసినచో అది మూగ చెవిటి వారి ముచ్చటగునని మొల్ల తన అభిప్రాయమును తెల్పినది.

సత్కృతి లక్షణములను ప్రౌఢకవి మల్లన తన రుక్మాంగద అవతారికలో ఇట్లు తెల్పినాడు:

"నానుడులును శృంగారము
నానావిధ వృత్త వర్ణనలు సంపూర్ణం
బై నిల్చిన కృతి సత్కృతి
గా నుతియింతురుగదా సుకవు లెయ్యెడలన్" (1-25)

జాజుల పొట్లము విప్పిన
యోజఁ గవిత్వంబు వెలయ నుండిన సభలన్
బూజింతురె యా కృతి బుధ
రాజులు రాజులును సుకవిరాజులు గరిమన్" (1-26)

రఘునాథనాయకుడు తన వాల్మీకి చరిత్రావతారికలో సత్కవి తత్త్వము నిట్లు వివరించినాడు.

"చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పై పై
గుప్పిన క్రియ విరిపొట్లము
విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్య కళా బం
ధువులై రస సింధువులై
యవురా! యనఁ గవిత లవనిఁ నలరఁగవలదా?"

భాష:

నన్నెచోడుడు తాను వాడిన భాష 'జాను తెనుగు' అని కుమార సంభవావ తారికలో తెల్పినాడు. జాను తెనుగునకు 'సరళత్వము'ను నన్నెచోడుడు తెల్పి నాడు. ఈ జానుతెనుగును నన్నెచోడునినుండి పాల్కురికి సోమనాథుడు గ్రహించినాడు. జానుతెనుగు సర్వసామాన్యమని, ప్రసన్నమయినదని పాల్కురికి సోమనాథుడు తన గ్రంథావతారికలందు పేర్కొనినాడు. కన్నడములోని 'జాణ్', 'జాణ్ణుడి' అను పదములే 'జానుతెలుఁగు' అను నన్నెచోడుని ప్రయోగమునకు మూలప్రకృతులు కాదగునని కొందరి తలంపు. ఈ జానుతెనుగును సోమనాథుని తర్వాత ఎవ్వరుగాని పేర్కొనలేదు.

శ్రీనాథుడు తన కవిత్వమును గూర్చి ప్రౌఢోక్తి నిట్లు తెల్పినాడు:

"ప్రౌఢి పరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడి కారమున నాంధ్ర భాష యందు
రెవ్వరేమండ్రు గాక నాకేల కొఱంత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష"

—భీమేశ్వర పురాణము (1-15)

సంస్కృత భాషా ప్రౌఢిమ తెలుగు పలుకు నుడికారపు తీవియు జత గూడగ కవిత చెప్పగల దిట్ట శ్రీనాథుడు.

పోతన తన కాలపు టభిరుచుల ననుసరించి నిరాడంబరముగా ఇట్లు ప్రతిజ్ఞ చేసియున్నాడు:

"కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్"

—భాగవతము (1-20)

ఎంత ధైర్యముతో ఆత్మ విశ్వాసముతో చెప్పిన మాటలో ఇవి ! పోతన రసానుగుణముగ తెనుగును సంస్కృతమును సరిసమానముగ సార్థకముగ తన భాగవతమునందు వాడియున్నాడు.

కావ్యమునం దుపయోగించిన భాషనుగూర్చి కొరవి గోపరాజు ఈ క్రింది పద్యములలో వివరించి యున్నాడు.

"తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మే
తన పస చాలదండ్రు విశదంబుగ సంస్కృత శబ్దమూఁదఁ జె
ప్పిన నవి దర్భ ముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్"

—సింహాసన ద్వాత్రింశిక (1-32)

"తెలుగునకెల్లఁ దల్లియగుఁ దెల్లము సంస్కృత భాష యందులోఁ
బలుకు తెఱుంగుచోఁ బదవిభాగము నన్వయ మర్థమంచు నీ
మలకలకంటె నందుల సమగ్రము దేటతెనుంగ యొప్పు నా
కోలఁది ప్రియంబు గాదె చెఱకు ల్దినుకంటె రసంబు గ్రోలినన్"

—సింహాసన ద్వాత్రింశిక (1-63)

## అనువాద ప్రశంస :

శృంగారనైషధ ప్రబంధోపసంహారమున శ్రీనాథుడు తన కావ్యానువాద విధానమును ఇట్లు తెల్పినాడు. "శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భావం బుపలక్షించియు రసంబు పోషించియు నలంకారము భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీ భాషా నైషధ కావ్యంబు." (8-202)

ఆంధ్రీకరణమే మహాకష్టమని ఆంధ్రీకరణములోని ప్రయాసను కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశిక అవతారిక (1-35) లో ఇట్లు వెల్లడించినాడు.

"ఈ సరసోక్తి కావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగా
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగాఁ
నేసిన నందె పాఱ మఱి యేసిన వానిద సూటిగావునన్"

ఆఖ్యాన కథానుకూలముగ కావ్యమును చెప్పుట సామాన్యము కాదని కొరవి గోపరాజు ఇట్లు తలంచినాడు:

"పూనినరీతి వాని తలఁపు ల్వడిఁ బ్రాసములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొక పద్యముఁ గూర్పఁగ వచ్చుఁ గాక యా
ఖ్యాన కథానుకూలముగఁ గావ్యము జెప్ప వశంబె సన్నమై
కానఁగ జల్లి నేయు నది కట్టెను పుట్టము నేయ నేర్చునే."
—సింహాసన ద్వాత్రింశిక (1-20)

## కవితా భేదములు :

కవిత్వముల తారతమ్యములు కూడ కావ్యావతారికల మూలమున వ్యక్తమగుచున్నవి. నందిమల్లయ ఘంటసింగనలు తమ వరాహపురాణావతారికలో మధ్యమాధమోత్తమకవిత్వముల తారతమ్యముల నిట్లు వర్ణించియున్నారు:

"తప్పును నొప్పులేని కృతి దాఁకులంబుగ వింటిఁ గొంత త
ప్పొప్పులు రెండు గల్గు కృతి యొప్పని జాతి లతాంగి తప్పులే
కొప్పులె గల్గు సత్కృతి గుణోన్నతి వంశ విలాస రేఖలం
జెప్పఁగ సాటిలేని సరసీరుహలోచన గాదె చూడఁగన్"
—వరాహ పురాణము (1-16)

కావ్యావతారికలవలన కొన్ని కవితాభేదములుకూడ తెలియుచున్నవి. మార్గ, దేశి రూప కవితా భేదములను, వస్తు కవితను నన్నెచోడుడు తన కుమారసంభవావతారికయందు తెల్పినాడు. మార్గకవిత లోకమున వెలసినట్లు, దేశి కవిత 'ఆంధ్ర విషయమునఁ బుట్టి'నట్లు నన్నెచోడుడు తెల్పినాడు (కుమా. 1-23). "దేశి మార్గమ్ములు దేశీయములుగా" చేయవలెనని నన్నెచోడుని అభిప్రాయము. మార్గదేశి కవితా లక్షణములను నన్నెచోడుడు పేర్కొనలేదు. ఇతని తరువాతి కవులెవ్వరు గాని చెప్పినట్లు కానరాదు. మార్గదేశి కవిత్వములను గూర్చిన ప్రశంస కన్నడ వాఙ్మయమున కలదు.

"వలవదే సమస్త వస్తు కవీశ్వర సూత్న రుచిర కావ్య రత్న వీథి" అని వస్తుకవీశ్వరుల కావ్య పద్ధతి 'రత్నవీథి'వలె వెలయదగునని, సంపన్నులగు బుధుల నాకర్షించునని నన్నెచోడుడు కుమారసంభవావతారికలో తెల్పినాడు. దీనినిబట్టి నన్నెచోడుని కవిత 'వస్తుకవిత' యనుట స్పష్టము. ఈ వస్తుకవిత నన్నెచోడునికి "అనూనప్రతిభార్ణవోదీర్ణ రుచిర వస్తు విస్తారిత" మయినదని చెప్పబడినది (కుమా. 1-56). తాను వస్తుకవి. తన కావ్యము వస్తుకావ్యము. తన గురువగు జంగమ మల్లికార్జునుడు వస్తు కవి స్తవనీయుడు; తన సూక్తులు వస్తు కవి స్తవనీయములు.

## కవుల కావ్యానుభూతి :

కవితా ప్రపంచానుభవమున కవి హృదయము పరిపక్వమగు కొలది కవితా తత్త్వముతో సంబంధించిన భావములయందు నూతనత్వము కలుగుచుండును.

నిర్వచనోత్తర రామాయణపీఠికయందు కవిత్వముయొక్క బహిస్స్వరూపమునుగూర్చి తిక్కన కొంత విస్తరించియున్నాడు. ఆతడు 'కవితా విలాస విస్తర మహనీయు'డట! కావ్యమునందు చమత్కారము కల్గించుటయే కవి లక్షణమైనట్లు అప్పటి తిక్కన భావనగా గోచరించుచున్నది. తన గ్రంథమును నరాంకితము చేయుటలో కూడ నతనికి ఉత్సాహమే కన్పించును. కాని భారత రచనాకాలము నాటికి తిక్కన చిత్తము పరిపక్వమయినది. తత్పరిణామదశయందు అతని కవితాతత్త్వవిచారము నూతనత్వము వహించినది. మహాభారత తిక్కన సోమయాజి యందు మనము ప్రధానముగ చూచు లక్షణములు నాలుగు: 1. వైదిక మార్గ నిష్ఠ

మగు వర్తనము 2. భేదము లేని భక్తి 3. కావ్యరసమును కొనియాడుట 4. బ్రహ్మా నంద స్థితిని బడయగోరుట.

విరాటపర్వము ప్రారంభమునందు "విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు" అని తిక్కన వ్యాసుని కవితావేశునిగా వర్ణించినాడు. కవిత ఒకవిధమైన ఆవేశమని తిక్కన భావము. అనుకొననట్టిదియు, అనిర్వచనీయమైనట్టిదియు, అకారణమైనట్టిదియునగు నొక నూతనశక్తియే ఆవేశము (inspiration). ఇట్టి నూతన శక్తి స్వరూపమైన ఆవేశము వహించిన కావ్యములే నిజమైన కావ్యము లనబడుచున్నవి.

కవితానందమునకును బ్రహ్మానందమునకును తిక్కన అభేదప్రతిపత్తిని కలిగించి నట్లు తోచును. కవితావేశ పరవశుడైన కవియు, మహాయోగ నిమగ్నుడైన పరమహంసయు నామమాత్రభేదముచే ఒకేవిధమైన ఆనందమునే అనుభవించుచున్నారట: మహాయోగ నిమగ్నుడై నిశ్చల స్వాంతముతో పరబ్రహ్మమును ధ్యానించు పరమహంసకు పరంజ్యోతి సందర్శనమువలన కలుగు నానందమువంటి మహానందమే తనకును సకల బ్రహ్మప్రార్థనమున సంప్రాప్తమైనట్లుగ సోమయాజి సూచించినాడు.

యోగమునకు వలెనే కవిత్వమునకును దీక్షవలయునట. దీక్షలేకయే చంచల స్వాంతముతో కావించు యోగముగాని కవితగాని పైని తెల్పిన ఆనందమును గలిగింపజాలవను నభిప్రాయమును తిక్కన ఈ క్రింది పద్యమున సూచించినాడు:

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షా విధినొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్"

—విరాటపర్వము (1-30)

దీనినిబట్టి చూచిన అత్యంత పరిపక్వ హృదయుడగు తిక్కన కవిత్వతత్త్వ మహత్త్వమున కెంతటి ఉన్నతస్థానమొసంగెనో తెలియగలదు. భారత రచనా కాలము నాటికి తిక్కన 'కవిత్వతత్త్వ విరతిశయానుభావానంద భరితాంతఃకరణు'డైనాడట. కవిత్వతత్త్వము బోధపడిన తరువాత ఆత్మశ్లాఘాపరములగు మాటలను మానినాడు.

పింగళి సూరన తన తొలికృతియగు రాఘవ పాండవీయమున భావనాశక్తి నుద్దీపింపజేసి కేవల పాండిత్య ప్రకర్షను వెల్లడించినాడు. కళాపూర్ణోదయము నాటికి కవితాతత్త్వమును గూర్చిన నూతన భావప్రకాశము కలిగినది. కవితను గూర్చిన అతని చమత్కార కల్పనను గమనింపుడు.

"విశ్రామ విహతిఁ గావింపక సాగవ
 త్సాహిత్య సౌమనస్యంబు లెఱిఁగి
సమయంబుఁ దప్పక శ్రవణ కఠోరంబు
 లైన శబ్దముల నత్యాదరాత్మఁ
జేయక, సత్పరిచిత సుకుమార వా
 క్సరళి తాభిప్రాయఁగా నొనర్చి
పదబంధ శిథిలత వాటిల్లఁగా నీక
 యేచందములయందు నేమరిలక
పరఁగు కవియు దోషాకరుఁడును యశము
గమును బడయు, నట్లు గాని వాఁడు
కృతి దురాప మొదవుఁగీర్తియుఁ బొలుసనీ
కంట గాదు, హాసయోగ్యుఁ జేయు"

—కళాపూర్ణోదయము ( 1-8

రాఘవ పాండవీయ రచనానంతరము కవితాతత్త్వమును గూర్చిన తన హృదయవికాసమును తనకావ్యములయందు కథా సందర్భములలో నైతము అవకాశము కలిగినప్పుడెల్ల సూరన సూచించినాడు.

కళాపూర్ణోదయమున మణికంధరుడు చేసిన దండకరూపమగు కృష్ణస్తవమునుగూర్చి ప్రశంసించుచు కలభాషిణి నారదునితో ప్రసంగించుసందర్భములో కవిత్వమును గూర్చిన సూరన భావము తెలిపికొనవచ్చును.

"పొసఁగ ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ
 దమలోన దొరయు శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్య భేదంబు
 లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు సర్వాంబుగ వైదర్భి
 మొదలైన రీతు లిమ్ముగ నమర్చి

దీపుల వర్జితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి
యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవి వరునకు
వాంఛితార్థంబు లొసఁగని వారు గలరె"

—కళాపూర్ణోదయము (1-185)

**లయ విభూతి :**

"చలువ గల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకు గోమలత
నెలకొనిన, సౌరభము, జలువ పసయుం, గో
మలతయును గలిగి జనముల మిగుల బెంపెసఁగు
మలయ పవనంపు గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి గల దనఁగ వచ్చుఁ గడు
వెలయఁ గల యీ సుకవి పలుకులకు నెంచన్"

—కళాపూర్ణోదయము (1-186)

ఇట్లే ప్రభావతీ ప్రద్యుమ్నములో ఇంద్రుడు శుచిముఖిని కొనియాడుచు చెప్పిన పద్యములోను కవిత్వమును గూర్చిన సూరన భావములు వ్యక్తమగు చున్నవి:

"శబ్దసంస్కార మెచ్చటను జారఁగనీక
పదమైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలపెల్ల నకిల్బిషతనుఁ బ్రదీపికముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమ క్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకొ నదుకుచు
నుపపత్తి యెందు పత్యూర్జితముగఁ
బొకటఁ బూర్వోత్తర విరోధ మొదవకుండ
దత్త దవయుక వాక్య వాక్యార్థ భేద

ము:లు మహా వాక్య తాత్పర్యమునకు నొనరc
బలుక నేర్చుట బహుతపః ఫలము గాదె"

—ప్రభావతీ ప్రద్యుమ్నము (2-3)

పై పద్యములలో గల భావములలో కూడ నించుక భేదముండుటచేత కళాపూర్ణోదయ రచనానంతరమున సైతము సూరన తన కవితా మతము సవరించుకొనెనని ఊహింపవచ్చును. పై పద్యములలోని భావ వ్యత్యాసమును గూర్చి కట్టమంచి రామలింగారెడ్డిగారు తన కవిత్వతత్త్వవిచారము (పుట 77) నం దిట్లు వ్రాసియున్నారు: "రెండు గ్రంథములలోని యీ రెండు పద్యములం బోల్చి చూచితిమేని నీరెండవ కృతి రచించులోపలc గవి కొంత మట్టునకు శైలిం గూర్చిన యభిప్రాయము మార్చినాcడనియుc జెప్పుట కవకాశమయ్యెడి. కళాపూర్ణోదయ పద్యములం బట్టి చూచినc గవి యలంకారశాస్త్రముల యెడ బహుభక్తిగలవాcడనియు, నర్థాలంకారములు మాత్రముగాక శబ్దాలంకారములును అపశ్యానుష్ఠేయములని భావించినట్లును గానంబడియెడి. ప్రభావతీ ప్రద్యుమ్నపద్యములో నలంకార శాస్త్రముం గూర్చిన విచార చిహ్న లెవ్వియును లేవు. శబ్దాలంకారములగూర్చి కవి యువ్విళ్లూరక పోవుటయే కాదు, అర్థాలంకారములనైన ధ్యానించినట్లు పొడకడ గానము. భావములు, అర్థములు, తాత్పర్యములు, అవయవ సంయోగము మొదలగు తలcపులతోc జేరిన లక్షణములమీcద నేకాగ్రమగు దృష్టిని నిలుపుట మేలని యెంచెనేమో....!"

ఆ యా కవుల కవితా లక్షణములు, కావ్య సమీక్షకు తెలుగు కావ్యావతారికలలోని కవుల కవితా ప్రశంస తోడ్పడుచున్నదని పైన పరిశీలించితిమి.

# 9
# కావ్య ప్రశంస

కావ్యకథా ప్రాశస్త్యమును, కథాశ్రవణమువలన కలుగు ఫలములను, కథానాయకుని గుణగణములను, కృతిఫలమును, కృతిపతి మహిమాదికమును కావ్యావతారికలో వివరించి చెప్పుటవలన పాఠకుల చిత్తవృత్తి ఆ కావ్యమునకు సన్నిహితమగును.

## 1. కావ్యకథా ప్రాశస్త్యము :

భారత కథావిర్భావమునకు కారణములను, భారత కథ విస్తరించిన విధమును నన్నయ తన భారతావతారికలో సంగ్రహముగా ప్రస్తావించినాడు. మహాభారతము శతపర్వ సమన్వితమని, శతసహస్ర శ్లోక పరిమితమని పిమ్మట పేర్కొనబడినవి. పర్వానుక్రమణిక, పర్వసంగ్రహము, భారత యుద్ధ వివరములు మున్నగునవి భారత కథ ప్రారంభమున వివరింపబడినవి.

"ఏయది హృద్య మపూర్వం బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్"
—ఆదిపర్వము (1-30)

అని ముని లడుగగా కథకుడు (రౌమహర్షణి) భారత కథను తెల్పినట్లు నన్నయ భారతావతారికలో కలదు. దీనినిబట్టి భారత కథ ఉత్తమమైన పుణ్యకథ యనుట తెలియును. ఇట్లే మరికొన్ని కావ్యావతారికలందు తద్గ్రంథమందలి కథా ప్రాశస్త్యము తెలుపబడినది.

"నూతన కథా విస్తారమైనదియు, యోగ్యమైనట్టిదియు పరమ విజ్ఞానాశ్రయమైనట్టిదియు నగు మార్కండేయపురాణము"ను తెనుఁగున రచింపుమని గన్నయ సేనాని మారనను కోరినాడు. మారనయు "అఖిలహితమ్ముగా" "తానేర్పుగతిన్" 'ఉదాత్తమతి'వి మార్కండేయపురాణమును రచించినాడు. మార్కండేయపురాణము పంచలక్షణ లక్షితమని ఈ క్రిందిపద్యమువలన తెలియుచున్నది:

"సర్గ మన్వంతర ప్రతి సర్గములును
సకల నృప వంశ వంశాను చరితములును
ననఁగ నెంతయు నొప్పు నీ యైదు లక్ష
ణములఁ బొలుపొంది సఫలతం దమరుదాని'
—మార్కండేయ పురాణము (1-21)

"నాసికేతచరితంబు సకల ధర్మ మర్మ జ్ఞాపకమును దురిత దూరీకరణ పారీణంబును నపూర్వాశ్చర్యధుర్యంబును సకల పురుషార్థసాధకంబునుగా విశ్చయించి" దగ్గుపల్లి దుగ్గన దానిని తెనుఁగు సేయ గడంగినాడు. దుగ్గన నాసికేతోపాఖ్యాన కథా ప్రాశస్త్యమును ఈ క్రిందిపద్యమున తెల్పియున్నాడు.

"ఏ కథ పురాణ సమ్మత, మే కథ వేద ప్రసిద్ధ మే కథ పుణ్య
శ్లోక స్తుత్య గుణాన్విత, మే కథ చదువంగ వినఁగ నింపైఁ యుండున్"
—నాసికేతోపాఖ్యానము (1-11)

## 2. కావ్య భేదములు :

కథా స్వరూపమునుబట్టి తెలుగు కావ్యములను మూడు విధములుగ ప్రాచీనులు విభజించిరి: 1. ప్రఖ్యాతము. 2. ఉత్పాద్యము 3. మిశ్రము. ఈ విభాగమును కొందరు తెలుగు కవులు తమ కావ్యావతారికలలో తెల్పియున్నారు.

జక్కన విక్రమార్క చరిత్రావతారికలో కావ్యభేదములను తెల్పుచు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అను కథా భేదములను కూడ సూచించి యున్నాడు. ఈ క్రిందిపద్యమును చూడుడు :

"ప్రతిభాగుణ ధురీణ పౌరాణిక వ్రాత
సకల పురాణశాస్త్రములయందుఁ
బరమార్థ చరితార్థ భారత రామాయ
ణాదిప్రబంధ కావ్యములయందుఁ

"కర్ణాంతర స్థాయి గద్య పద్య ప్రాయ
కమనీయ చిత్ర కావ్యములయందు
రసిక జనానంద రస సుధా నిష్యంద
విలసిత నాటకావలులయందు
సకల దేశభాషా విశేషములయందు
పరుసఁ బ్రఖ్యాత మనఁగ నుత్పాద్య మనఁగ
మిశ్రమన నొప్పు సత్కథా మేళనంబు
లెన్ని యన్నియు విన్నాఁడఁ బిన్ననాఁడ"

—విక్రమార్క చరిత్రము (1-27)

అని సిద్ధమంత్రి జక్కనతో పల్కినాడు.

కావ్యములు త్రివిధములని అందు మిశ్రకావ్య మొకటి అని పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలావతారికనుబట్టి తెలియుచున్నది. ఈ క్రింది పద్యములను గమనింపుడు :

"ప్రఖ్యాతం బన మిశ్రబంధ మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగు వస్తు వందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతి చెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్య మహిమన్ విశ్వంభరామండలిన్"

—శృంగార శాకుంతలము (1-24)

ఇట్టి మిశ్రకావ్యమునకు—

"శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములుఁ దలఁప నష్టరసములున్
సాంగమగు నేఁ డంకము
బంగారము తోడి యొఱ ప్రబంధము పొందున్"

—శృంగార శాకుంతలము (1-25)

అని నిర్వచించినాడు.

"భారత ప్రోక్త కథ మూల కారణముగఁ
గాళిదాసుని నాటక క్రమము కొంత
తావకోక్తికి నభినవ శ్రీ వహింపఁ
గూర్పఁ గృతి సేయు నాకు శాకుంతలంబు"

—శృంగార శాకుంతలము (1-27)

అని చిల్లర వెన్నయామాత్యుడు పినవీరభద్రుని ప్రార్థించినాడు. అతడును "మిశ్రబంధంబుగా శాకుంతలంబను ప్రబంధము బంధుర ప్రీతిం జెప్పంబూనితి" నని చెప్పినాడు. కనుక పినవీరభద్రుడు వాఙ్మయ చరిత్రయందు మొదటి మిశ్ర ప్రబంధ కర్తయని అతని కావ్యావతారికనుబట్టి చెప్పవచ్చును. పినవీరభద్రునికి పూర్వము పై త్రివిధ కావ్య విభజనము, మిశ్రబంధనమును చిరపరిచితములై యుండవచ్చును. కాని ఇదమిత్థమని నిర్ణయించుట కాధారము లేమియు కానరావు.

మహాకావ్యములోని కథా స్వరూపమునుగూర్చి రామరాజభూషణుని అభిప్రాయమిది :

"కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్
వావిరి పుట్టు రత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతి రత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్"

—వసుచరిత్ర (1-19)

సంకుసాల నృసింహ కవి కూడ మిశ్రకావ్యము మేలని ఇట్లు చెప్పియున్నాడు:

"కావ్య ముత్పాద్యమే నసత్కావ్య మింక
నుక్త కావ్యంబ యేఁ బునరుక్తిఁ దెచ్చుఁ
గానఁ గవితాభిముఖుఁ డైన కవివరునకు
మిశ్ర కావ్యంబె కావ్యమై మెఱుఁగు దెచ్చు"

—కవికర్ణ రసాయనము (1-10)

తెనాలి రామకృష్ణుడు తన కావ్య స్వభావమును ఈ క్రింది పద్యమున సూచించియున్నాడు :

"స్కంద పురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోదయము నవ్య కవిత్వ కళా కలాపమున్
బొందనమున్ ఘటించి కడుఁ గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే
వం దిలకించు నప్పురమ వైష్ణవ కోటి నలంకరింపుమా!"

—పాండురంగ మాహాత్మ్యము (1-26)

రామకృష్ణుడు కథావస్తువును స్కందపురాణము నుండి గ్రహించి దానికి నవ్యకళారూపముచే క్రొత్తరూపముకల్పించి సర్వాలంకారయుక్తమైన నూతన కావ్య

నిర్మాణమునకు గడంగెనని ఈ పద్యమువలన విశదమగుచున్నది. ఇది రామరాజ భూషణుడు పేర్కొనిన మిశ్రకావ్యమువంటిది కాదగును.

## 3. కథానాయక ప్రాశస్త్యము :

కావ్యావతారికలలో కథానాయకుని గుణాతిశయమును, ప్రాభవమును ప్రశంసించుటవలన పాఠకులు ఆయా కావ్యములందాసక్తులగుదురు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణావతారికలో "బసవని శరణన్న...." ఇత్యాదిగ బసవన ఆధిక్యమును, పండితారాధ్య చరిత్రావతారికలో "పండితారాధ్యులఁ బ్రస్తుతించినను" ఇత్యాదిగ పండితుని ఆధిక్యమును విపులముగా పెక్కు ద్విపదలలో వివరించి యున్నాడు. బసవను నందీశ్వరుని అవతారముగను పండితారాధ్యుని ప్రమథుల అవతారముగను వర్ణించినాడు. పండితారాధ్యుని శివునితో సమానమగు శక్తిగల వానినిగా సోమనాథుడు వర్ణించినాడు. ఇట్లు శివభక్తులను శివునికంటె ఘనులుగా వర్ణించి చెప్పుటవలన వీరశైవులగు వారికి సోమనాథుని గ్రంథములు అత్యంత ప్రీతి పాత్రములయినవి.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమును రచించుటకు గల హేతువును ఇట్లు తెల్పియున్నాడు:

"ఎత్తతి నైనను ధీరోదాత్తస్య పోత్తముఁడు రామ ధరణీ పతి స
ద్వృత్తము సంభావ్య మగుటనుత్తర రామాయణోక్తి యుక్తుఁడ నైతిన్"
—నిర్వచనోత్తర రామాయణము (1-11)

ఇందు కథానాయకుడగు శ్రీరాముని ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. కథానాయకునియందలి గౌరవముచే పాఠకులు కావ్యముల నెక్కువగా నాదరించుటయు తెలుగులో కలదు.

సాహసౌదార్యాది గుణములలో ప్రసిద్ధిగాంచిన విక్రమార్కుని చరిత్రమును ప్రబంధశయ్యగా తెలుగున చెప్పుమని సిద్ధమంత్రి జక్కనను కోరినాడు.

"తలఁపఁ దదీయ నాయక వితానము కంటెను సాహసక్రియా
కలిత వదాన్యతాది గుణ గౌరవ రేఖల విక్రమార్క భూ
తల పతి యెక్కుడై నెగడెఁ దచ్చరితంబుఁ బ్రబంధ శయ్యగాఁ
దెలుఁగునఁ జెప్పి యా కృతిపతిత్వము మా కొడఁగూర్పు నేర్పునన్"
—విక్రమార్క చరిత్రము (1-28)

మొల్ల తాను మరల రామాయణ రచనను చేపట్టుటకు గల కారణమును ఊహించుకొని తనలో తాను ఇట్లు సమాధానము చెప్పికొనినది.

"ఆది రఘు రాము చరితము
నాదరముగ విన్నఁ గ్రొత్తయై లక్షణ సం
పాదమ్మై పుణ్యస్థితి
వేదమ్మై తోఁచకున్న నెట్టిఁనె చెప్పన్"

—రామాయణము (1-20)

నిత్యనూతనమై ఆనంద పారవశ్యమును కల్గించు రఘురాముని చరిత్రను ఎన్నిసార్లు నుతించినను "తప్పు గల్గునే?" అని ప్రశ్నించినది.

"రాజిత కీర్తియైన రఘురాము చరిత్రము మున్ గవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పి రని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్ప నేలనన్
భూజన కల్పకం బగుచు భుక్తికి ముక్తికి మూలమైన యా
రాజును దేవమైన రఘురాము నుతించినఁ దప్పు గల్గునే"

— రామాయణము (1-21)

రామచరిత్రము ఇహపరసాధనమగు పుణ్య చరిత్రయనిమొల్ల ఇట్లు చెప్పినది:

"చెప్పుమని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్"

—రామాయణము (1-13)

## 4. కావ్య రచనా ప్రశస్తి:

భారత విషయమున నన్నయది సంహితారచనా దృష్టి. జగత్తునకు హిత మొనగూర్చుటే భారత రచనవలన నన్నయ ఆశించినది. ఆ హితమనునది బహు యాగఫలరూపమైన పరమార్థము.

'మహాభారతంబు సమస్త దురితావహంబును నభిమత శుభావహంబు' నై నదనియు, 'వేదములకు నఖిల స్మృతి వాదములకు బహుపురాణ వర్గంబుల కున్ వాదైన చోటులను', 'ధర్మార్థకామమోక్షస్థితికి' భారతము 'మూఁదల'గా

నొందుననియు తిక్కన భావించినాడు. 'అమ్మహాకావ్యంబు సర్థంబు సంగతంబు చేసెద' నని భారతార్థమున తన కెక్కువ యభినివేశ మున్నట్లు తిక్కన స్పష్టముగా తెల్పినాడు. 'బుధసంతోషంబు నిండారఁగ' పదియేను పర్వములను 'తుదిముట్ట' తెనిగింతునని పర్వప్రాశస్త్యము నిట్లు వివరించినాడు:

> "హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానా రసా
> భ్యుదయోల్లాసి విరాట పర్వమట యుద్యోగాదులుం గూడఁగాఁ
> బదియేనింటిఁ దెనుంగు బాస జన సంప్రార్థ్యంబులై పెంపునం
> దుది ముట్టన్ రచియించు టొప్పు బుధ సంతోషంబు నిండారఁగన్"
>
> —విరాటపర్వము (1-7)

తెలుగు కవిత్వము ఇతిహాస పురాణానువాదములతో ప్రారంభమైనది. ఈ అనువాదములు 'మక్కికి మక్కి' గాక స్వతంత్రానువాదము లయినవి. ఇతిహాస పురాణములందును కొన్ని కావ్యలక్షణములు గలవు. అట్లే కావ్యములును కవుల ప్రతిభచే ప్రబంధ రచనకు దారితీసినవి. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో తెలిపినట్లు "గీర్వాణ భాషల కబ్బంబులకెన్ని మంచితనముల్సంధిల్లు నా చందమై వళియుం బ్రాసము నంత కగ్గలములై పర్తిల్లు సత్కావ్యము"లుగా తెలుగు ఇతిహాస పురాణానువాదములు పరిణామము నందినవి.

ప్రాచీన తెనుగు కవులు 'ప్రబంధ' శబ్దమును 'కావ్యము' అను నర్థము నందే ప్రయోగించినట్లు తెలియుచున్నది. నన్నెచోడుడు తన కుమారసంభవమును 'దివ్యసుకృతి' (1-31) అని, 'దివ్యకథ' (1-45) అనియు, 'సద్రస బంధురమగు ప్రబంధము' (1-48) అనియు, 'ఉత్తమ కావ్యము' (1-56) అనియు, 'దివ్య కావ్యము' (1-69) అనియు పలురీతుల గ్రంథావతారికలో పేర్కొనినాడు. నన్నెచోడునికి ముందు 'ప్రబంధ' శబ్దమును ఎవ్వరుగాని ప్రయోగింపలేదు. కనుక 'ప్రబంధ' శబ్దమును పేర్కొనిన కవులలో నన్నెచోడుడు ప్రథముడు. అతని కుమారసంభవము తొలి తెలుగు ప్రబంధమని పలువురి విమర్శకుల భావము.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమును 'కావ్యము' (1-9) అనియు, 'కథ' (1-45) అనియు, 'కృతి', 'మహాకావ్యము' (ఆశ్వాసాంత్య గద్యలు) అనియు పేర్కొనినాడు. తిక్కన నిర్వచనోత్తరరామాయణమున ప్రబంధ శబ్దమును వాడలేదు. కాని మహాభారతమును మాత్రము 'ప్రబంధ మండలి' (విరాట-1-8)

అనియు, 'పుణ్య ప్రబంధములు' (విరాట 1-31) అనియు, 'మహాకావ్యము' (విరాట 1-37) అనియు పేర్కొనెను. మహాభారతములోని ఒక్కొక్క పర్వమును ఒక్కొక్క ప్రబంధముగా తిక్కన పరిగణించినాడు. కేతన దశకుమార చరిత్రమును 'కావ్యము' (1-24) అనియు, 'ప్రబంధము' (1-26)అనియు, 'కథా నికాయము' (2-1) అనియు, 'మహాకావ్యము' (ఆశ్వాసాంతగద్య) అనియు పేర్కొనినాడు. ఎఱ్ఱన హరివంశమును 'ప్రబంధ' మనియు, నృసింహపురాణమును 'ప్రబంధము' (1-23) అని, 'మహాప్రబంధము' (1-27) అని, 'కావ్యము' (1-28), అని, 'విజ్ఞాన వాఙ్మయము' (2-28) అనియు వ్యవహరించినాడు.

ఇట్లు 'ప్రబంధ' శబ్దమును మొదట 'కావ్యము' అను అర్థమునందే కవులు ప్రయోగించిరనుట స్పష్టము. సంస్కృత లాక్షణికులగు విద్యానాథుడును, వామనుడును, రాజశేఖరుడును, ఆనందవర్ధనుడును, క్షేమేంద్రుడును, తెలుగు లాక్షణికులలో విన్నకోట పెద్దనయు 'ప్రబంధ' శబ్దమును 'కావ్యము' అను నర్థమునందే వాడి యున్నారు.

జక్కన (1375) నాటికి తెలుగు 'ప్రబంధంబు గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప బడినట్లు గమనింప వచ్చును. భట్టహర్షుడు ప్రౌఢ వాక్పాటవమున రచించిన నైషధకావ్యమును శ్రీనాథుడు 'నవరస భావాను బంధ బంధురముగా నొక్క ప్రబంధము నిర్మింపఁదలఁచి' నాడు. భట్టహర్షుని కవితానుగుంభములు నారికేళపాకము లైనను చవిగలవట. సోమరిపోతులు అందలి కవితానుగుంభములను కొనియాడ నేరరట. ఈ క్రింది పద్యమును పరికింపుడు.

"పనివడి నారికేల ఫల పాకమునం జనియించె భట్టహ
ర్షని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్యలౌ
నని కొనియాడ నేర రది యట్టిద, లే జవరాలు చెక్కుఁ గీ
టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేడ్చునే"

—శృంగార నైషధము (1-17)

నాచన సోమనాథ, శ్రీనాథ, పినవీరభద్రుల కావ్యములు పెద్దనాదుల ప్రబంధ నిర్మాణమునకు మార్గదర్శకములయినవి. మను వసు చరిత్రాదులందు 'మహాప్రబంధము' లని పేర్కొనబడి యున్నది, అప్పకవీయమున 'మహాకావ్య' పదమునకు 'ప్రబంధ' శబ్దము పర్యాయముగా నుపయోగింపబడినది. "ఇరువదిరెండు వర్ణనలు

గూర్చి చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస" (అప్పకవీయము 1-28) అను అప్పకవీయములోని మాటనుబట్టి కావ్యోలు 'మహాప్రబంధము'ను, 'మహాకావ్యము'నుకూడ 'ప్రబంధ' మనియే నేడు వ్యవహరించుచున్నారు.

కవులు తమకు పూర్వము వ్యాప్తికిరాని సాహిత్య ప్రక్రియలను, కవితా సంప్రదాయములను నూతనముగా చేపట్టి కావ్య రచన చేసినపుడు కావ్యావతారికలలో వానినిగూర్చి సమర్థించుకొనుటయు, వాని ప్రాశస్త్యమును వెల్లడించుటయు జరుగును.

పాల్కురికి సోమనాథునికి ముందు తెలుగులో ద్విపద కావ్యములు లేవు. ద్విపద కావ్యకర్తలలో అతడే ప్రథముడు. సోమనాథుడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రావతారికలలో ద్విపద కావ్యరచనమును సమర్థించి తన్మాహాత్మ్యమును చాటియున్నాడు.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె - సరసమై పరగిన జాను దెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుటఁ - గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగు మాటలనంగ వలదు, వేదముల - కొలఁదియ కాఁ జూడు"

—బసవ పురాణము, అవతారిక (పు. 8)

పండితారాధ్య చరిత్ర పీఠికలో—

"......................ఒప్పదు ద్విపద గావ్యోక్తి నావలన
దా రూఢ గద్య పద్యాది ప్రబంధ - పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యంబు గామి - జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు
నట్టులుఁ గాక కావ్య ప్రౌఢి పేర్మి - నెట్టన రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్య పద్యోదాత్త కృతులు - ద్విపదయు సమమ భావింప"

—పండితారాధ్య చరిత్ర (పుట 18)

అని విమర్శక లోకమునకు ఒక 'సంజాయిషీ' చెప్పుకొని సోమనాథుడు తన రెండవ ద్విపద కావ్యమును రచించినాడు. మరియు,

"......ఐహికాముష్మిక ద్వి-పద హేతువగుట ద్విపద నాఁగ బరగు"

—పండితారాధ్య చరిత్ర పీఠిక (పు. 22)

అని పండితులు నయితము మురిసిపోవునట్లుగ ద్విపద నిర్వచనము గావించినాడు.

"ప్రాసమైనను యతి పై వడియైన - దేసిగా నిలిపి యాది ప్రాస నియతిఁ దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

—పండితారాధ్య చరిత్ర (పుట 18)

అనియు,

"అవికల వేద వేదాంతేతి హాస - వివిధాగమ పురాణ విహిత సూక్తముల నిదమిత్థ మనుచోట నివియ ప్రామాణ్య - పదములుగాఁగ ద్విపదలు సంధింతు"

—పండితారాధ్య చరిత (పుట 21)

ననియు సోమనాథుడు తెల్పినాడు. సోమనాథుని రచనా విధానము పై ఉదాహరణములనుబట్టి స్పష్టముగా నెరుగవచ్చును.

వచనము లేకుండ కావ్యమును రచించుట ప్రౌఢత్వమును సూచించునని తిక్కన నిర్వచనోత్తర రామాయణావతారికలో ఇట్లు తెల్పినాడు :

"వచనము లేకయు వర్ణన, రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా ప్రచయముఁ బద్యములన పొం, దుచితంబుగఁ జెప్పుటార్య లొప్పిద మనరే?"

—నిర్వచనోత్తర రామాయణము (1-15)

రచనా ప్రక్రియలో ఒక చమత్కారమును చూపించుటకొరకే తిక్కన నిర్వచనముగా వ్రాసియుండును. కానిచో 'గద్యము తోడుత పద్యమును చెప్పిపెట్ట'నని నిర్వచనోత్తర రామాయణావతారికలో ప్రతిజ్ఞచేసిన తిక్కన భారతావతారికయందు "మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" అని చెప్పియుండుట జరుగదు. తిక్కన నిర్వచనముగా వ్రాసిన పద్ధతి సంప్రదాయముగా విస్తృతము కాలేదు. తెలుగునందు గద్యపద్యాత్మకమగు చంపూకావ్య పద్ధతియే సర్వత్ర వ్యాప్తమయినది.

తెలుగులోని ద్వ్యర్థి కావ్యములు, అనేకార్థ కావ్యములు, అచ్చతెలుగు కావ్యములు ఇత్యాదులను రచించుట చమత్కార హేతువుగా ప్రబంధకవులు భావించెడివారు. రాఘవపాండవీయము పింగళి సూరన నవ్యప్రకారమున రచియించిన భవ్య కావ్యము. ఇందు రెండు కథల జోడింపు కలదు. అనేకార్థక శబ్దమయమైన సంస్కృతములో రెండర్థములు సంపాదించుట సుకరము. కాని తెనుగున మాత్రము అది దుర్ఘటము. అందును రెండు కథలను జోడించుట దుష్కరము. ఈ దుష్కరత్వమును సూరన ఈ క్రింది పద్యములో వివరించినాడు :

"రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే 'సోహో!' యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగు కబ్బం బద్భుతం బంద్రు ద
త్కుం దెవ్వాఁ డిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్"

—రాఘవ పాండవీయము (1-10)

కథాద్వయ సంఘటనము చేయునెడ ఈ దుష్కరకార్యమును సాధింపుటకై పింగళి సూరన ఆత్మ వ్యవస్థానార్థము ఏర్పరచుకొనిన కొన్ని నియమములను గ్రంథావతారికలో ఇట్లు వివరించినాడు :

"ఆంధ్రభాషా సంస్కృతాభిభాషా శ్లేష
యొక్కొక్కచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న
ర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేష ఘటన యొక్కొక తఱి
నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయ విభేద సంగతి యొక్కొక్క
తఱి నివి యొక్కొక్క తఱిని రెండు
మూడు గూడుట యన సముజ్జ్వలముగాఁగ
నాకుఁ దోఁచిన గతిఁ బెక్కుఁ బోక లమర
రామభారత కథలు పర్యాయదృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు"

—రాఘవ పాండవీయము (1-17)

రాఘవపాండవీయము చిత్ర విచిత్ర శ్లేషమయమని ఇందుమూలమున వ్యక్తమగును.

భారతరామాయణ కథలకు ఆద్యంతము యథాస్థితముగా పొత్తు కుదరదు. రెంటిని సంగ్రహ పరచినను కథల విస్తృతి తగ్గునేకాని వానికి సహజముగా లేవి పొత్తుమాత్రము కల్పింపబడదు. ఈ క్లేశమును అతిక్రమించుటకై సూరన ఒక కథాప్రణాళికను ఏర్పరచుకొన్నట్లు ఈ క్రింది పద్యమున దాని స్వరూపమును తెల్పినాడు.

"ఒక కథ వినియెడి తతి వే - ఱొక కథపై దృష్టియిడిన నొకయర్థముఁ దోఁ
పక పోవుఁ గాన నేకా - ర్థ కావ్య మెట్లట్ల వినఁగఁ దగు నొకటొకటిన్"
—రాఘవ పాండవీయము (1-18)

ఈ కథాప్రణాళికలో రామాయణము ప్రకృతిగా భారతముప్రతికృతిగా స్థూల దృష్టికి గోచరించును. కాని ఉభయ ప్రాధాన్యము చెడకుండ రచనా నిర్వహణము కొనసాగినది.

రాఘవపాండవీయ రచనానంతరము తెలుగులో ద్వ్యర్థి కావ్యములు, త్ర్యర్థి కావ్యములు, అనేకార్థ కావ్యము లెన్నియో వెలసినవి.

పొన్నికంటి తెలగన యయాతి చరిత్రము అచ్చతెనుగు గ్రంథములలో మొదటిది :

"మున్నెవ్వరు నొడువని యీ - తెన్నిడి కడుమీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన - నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పయినన్"
—యయాతి చరిత్ర (1-11)

అచ్చతెనుగు కావ్యములును చమత్కార రచనలే:

"అచ్చతెనుంగుఁ బద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని చూడుచుందు రది యెన్నుచు నేప్పనఁ బొత్తమెల్ల ని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నందుల చంద మెఱుంగు వారెదన్
మెచ్చరొ యబ్బురం బనరొ మేలనరో కొనియాడరో నినున్!"
—యయాతి చరిత్ర (1-12)

తెలగన తన కావ్యరచనయందు తాను పాటించిన విధానమును ఈ క్రింది పద్యమున నుగ్గడించినాడు :

"తెనుఁగునను మాఱుపేళ్లిడి - పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులఁ బేళ్లున్
మును వేల్పు బాసవెంబడి-నునిచెదఁ గాదనకుఁడయ్య యుల్లములందున్"
—యయాతి చరిత్ర (1-14)

యయాతి చరిత్రకు పిమ్మట అచ్చతెనుగు కావ్యములు పెక్కు రచింపబడినవి.

ఇట్లు కవులు తమ కావ్యరచనా నియమములను, కథా ప్రణాళికలను గ్రంథావతారికలలో వివరించి చెప్పుటవలన కావ్యపరమార్థము సులభముగా బోధపడును. కావ్యమునం దాసక్తి సహజముగా పెంపొందును.

## 5. కావ్యమాహాత్మ్యము :

నన్నయ భారతావతారికలో వ్యాసభారత ప్రశస్తిని వర్ణించినవిధ మిట్టిది:

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసుఁ డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరఁగుచుండఁ జేసె భారతంబు"

—ఆదిపర్వము (1-32)

భారత శేషమయిన హరివంశము 'కల్యాణావహమహనీయ రచన', 'జగదర్చితంబగు ప్రబంధంబు'. వ్యాసప్రోక్తమైన ఈ హరివంశమును ఎఱ్ఱన తెలుగున 'నిర్మించి'నాడు. వంశవర్ధనము, సమస్త పుణ్యఫలము, పూజ్యతమము, శ్రోతకు వక్తకు కల్గించునని హరివంశ కథా ప్రారంభమున చెప్పబడినది.

జైమిని భారత ప్రాశస్త్యమునుగూర్చి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ఈ క్రిందివిధముగ తెల్పినాడు :

"స్తుత్యముఁ గలి కల్మష రాహిత్యము నాఖ్యాయికా విహిత బీజ చతు
స్సీత్యము శ్రీహరి కథలను నిత్యంబును నైన జైమినిజ భారతమున్

"జంబూ ద్వీపములోన నెంతయుఁ బ్రశస్తంబైన దీని న్నట
ద్దంభూ ఖండల జూట కోటర కుటీ ధృత్స్వర్ధునీ వీచికా
లంబిస్విన్న నవేందు కందళ సుధాలంకార వాగ్వైఖరిన్
జంబూ కావ్యము చేసెదన్ బుధజన శ్లాఘానిరాఘాటతన్"

—జైమిని భారతము (1-9, 10)

పోతన భాగవతమును కల్పతరువుతో పోల్చినాడు:

"లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై"

—భాగవతము (1-22)

భాగవతమును నన్నయాది పూర్వకవులు అనువదింపకుండుట తన పురాకృత శుభాధిక్యమని పోతన భావించినాడు. "పునర్జన్మము లేకుండ" దానిని తెలిగింతునని ఇట్లు చెప్పినాడు:

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్"

—భాగవతము (1-21)

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు-శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత గన్నంత-దెలియ వచ్చినంత తేటపఱతు"

—భాగవతము (1-19)

అని భాగవత మాహాత్మ్యముతో పోతన తన వినయమును వెల్లడించెను.

"పలికెడిది భాగవత మఁట-పలికించు విభుండు రామభద్రుం డఁట నేఁ
బలికిన భవహరమగు నఁట-పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా?"

—భాగవతము (1-18)

అని తాను నిమిత్తమాత్రుడై యంతయు భగవదధీనము చేయును. ఈ నిరాడంబరతవలన భాగవతమును రచించు అంతస్సారము, ఆత్మనిగ్రహము, అఖిల మానవహితచింత పోతనకు దక్కినదను భావము స్ఫురింపజేయును.

అనంతామాత్యుడు తన భోజరాజీయమును "వివిధకథా నూత్న రత్నభూషణాభిరామ" మనియు 'నూతనంబయ్యుఁ బురాతన కృతులట్ల సంతత సేవ్యమై జరుగు' ననియు చెప్పికొన్నాడు. విక్రమార్కుని కథలవలెగాక అనంతుని కథలు స్వకపోల కల్పితములు. ఈ కథలలో అన్నదాన సుకృతమునుగూర్చి చెప్పబడినది. భోజరాజ ప్రాశస్త్యమునుగూర్చి అనంతామాత్యుడు భోజరాజీయావతారికలో చెప్పిన పద్యమిది :

"నూతనంబయ్యుఁ బురాతనకృతులట్ల సంతత సేవ్యమై జరుగుననియు
నాదిరాజ సమానుఁడగు భోజభూపతి చరితమీ కవితా ప్రసంగమనియు
నిందుఁ జెప్పెడి కథలిన్నియు నోలిఁ బ్రశస్త ధర్మోపదేశంబులనియు
నఖిల జగన్నాథుఁ డగు నహోబల నాథుఁ డీ పుణ్యకృతికి నధీశుఁ డనియుఁ

పృథివి నెల్ల జనులు ప్రియభక్తియుక్తిఁ బా - టింతురనియు నూఱడిల్లి యేను
బరమ సౌఖ్యమైన భవదాభిముఖ్యంబు - నెమ్మిఁబడసి యధికనిష్ఠతోడ"
—భోజరాజీయము (1-78)

ప్రబోధ చంద్రోదయ ప్రాశస్త్యము ఈ క్రింద వివరింపబడినది :

"వివరింపనిది సర్వవేదాంత సారంబు తలఁపఁగా నిది గట్టి తెలివి త్రోవ
యిది భోగ మోక్ష సంపదలకు మూలంబు మోసలేదిది ఘనంబులకు ఘనము
జ్ఞాన కర్మరహస్య సాధనంబును నిది యిది నవరసముల నీను సురభి
షడ్దర్శనంబులు సరవి నిందున్నవి సందేహములు దీఱవిందుఁ గాని
యిమ్మహారసపాకము నెఱిఁగి నట్టి-జనుఁ డెలుఁగఁడు మఱి తల్లి చన్నుపాలు
దీని సరి చెప్ప మరి లేవు త్రిభువనముల-దొరకదీకృతి నీవంటి దొరకుఁగాని"
—ప్రబోధ చంద్రోదయము (1-21)

నందిమల్లయ ఘంట సింగనలే 'భక్తజన మనోరథ నిర్వాహకమహావరాహ దేవచరణ స్మరణాయత్తచిత్తు'లై 'సాత్యవతేయ మహామునీంద్రుఁడను సుధాబ్ధికిఁ గల్పకం బనఁగవెలయు శ్రీ వరాహ పురాణంబు'ను 'కవికులోత్తములు వొగడ' చెప్పినారట.

దోనూరి కోనేరునాథకవి తన బాలభాగవత గ్రంథావతారికలో భాగవత మాహాత్మ్యమును ఇట్లు వివరించినాడు :

"ప్రతి జన్మ కృత మహా పాతక సంఘాత-పర్వత దంభోళి భాగవతము
అతివేల వితతోద్యదతి పాప సాటోప-పన్నగ ఖగరాట్టు భాగవతము
భీషణ దుస్సహాశేష కల్మష సరి-త్పతి కుంభ (సంభూతి) భాగవతము
నిరవధి నిబిడోప దురిత మేఘావళి-పరివాహపవనంబు భాగవతము
మఱియుఁ బ్రాసంగి కాఘుకం బంధతిమిర
పటల భాను విలాసంబు భాగవతము
సాత్త్వికోత్తమ మునిజనాశాస్య మోక్ష
పదసుధానాంజనంబు శ్రీభాగవతము"

— బాలభాగవతము (1-17)

'లోకోపకారంబు'గాచేయు బాల భాగవతము 'ప్రియము' కల్గించునవియే కోనేరునాథకవి విశ్వాసమును ప్రకటించినాడు :

"అట్టి భాగవతంబునం దలరుచున్న
ద్వాదశ స్కంధ కథలను వరుసఁ గూర్చి
కావ్య మొక్కటి బాల భాగవతమనఁగఁ
జెప్పి లోకోపకారంబు సేయవలయు"

—బాలభాగవతము (1-18)

"భాగవతము గలుగ బాలభాగవతంబుఁ
బ్రియము సేయఁ గలరు పెద్దలెల్ల
జగతిఁ దల్లి సరస జన్నియగు, బిడ్డఁ
బాచు వార లాత్మఁ జొక్కునట్లు"

—బాలభాగవతము (1-21)

ప్రౌఢకవి మల్లన రుక్మాంగద కావ్యప్రభావమును ఈ క్రింది విధముగ వివరించినాడు:

"శ్రీహరి వాసర వ్రత విశేషము దాఁ గృతి సంచితార్థ మా
శ్రీహరి మిత్రుఁ డీ కృతికిఁ జెన్నెలరార నధీశుఁ డుత్తముల్
శ్రీహరి భక్తులీ కృతికిఁ జిత్తమునన్ విని మెచ్చువారు నా
కీ హిత మింతకంటెఁ గలదే రచియించెద మేలుగాంచెదన్"

—రుక్మాంగద (1-15)

"...రుక్మాంగదుని చరిత్రము శుభాఢ్యమై మహాభాగవత సేవ్యమై ముకుంద సద్గుణానీక మణిగణ జలనిధానమై సమంచిత పుణ్య నివాసమగుచు"

—రుక్మాంగద (1-16)

కాకమాని మూర్తి కవి తన రాజవాహన విజయావతారికలో తద్గ్రంథ విశేషమును తెల్పుచు ప్రతి పద్యమునందును ప్రతి వాక్యమునందును ఔన్నత్యము గలదని చెప్పినాడు. చూడుడు:

"ప్రతి పద్య ప్రతి వాక్యోన్నతి కావ్యము రాజవాహన విజయమఁట యా
కృతికిం బతి శేషాచలపతియఁట నే డింతకంటె భాగ్యము గలదే"

—రాజవాహన విజయము (1-21)

ఇట్లు కథా ప్రాశస్త్యమును, కథానాయకుని గుణాతిశయము, రచనా ప్రాముఖ్యము, కావ్య మాహాత్మ్యము, కృతిఫలము, కృతిపతి ప్రభావము కావ్యావతారికలలో వివరించి చెప్పబడినది. అందువలన పాఠకుల చిత్తవృత్తి ఆ కావ్యకథకు సన్నిహితమగు ననుటలో సందియము లేదు.

10

# గ్రంథాంకితము-కృతిపతులు

కవి తన కావ్యమును కృతిపతి పేర వెలయించుట గ్రంథాంకిత మనబడును. కావ్యమును కృతియిచ్చు నాచారము సంస్కృత కవులలో లేదు. విద్యానాథుని ప్రతాపరుద్రీయమను నలంకార గ్రంథము రెండవ ప్రతాపరుద్రుని (13 వ శతాబ్ది) కంకితము చేయబడినదని శ్రీ పరవస్తు రామానుజ స్వామిగారు వ్రాసిరి.[1] ప్రతాపరుద్రీయమునందలి ఉదాహరణశ్లోకము లన్నియు ప్రతాపరుద్రుని ప్రశస్తితో రచింప బడినవే. కాని ఇందు తెలుగు కావ్యావతారికలందువలె కృతిపతిత్వము స్పష్టముగా గోచరించుట లేదు. అచ్యుత దేవరాయల ఆస్థానకవియగు రాజనాథ డిండిమభట్టు సంస్కృతములో భాగవత చంపూగ్రంథమును రచించి తన ప్రభువగు అచ్యుతదేవరాయలకు అంకితమిచ్చినట్లు తెలియుచున్నది. ఆంధ్రుడగు రాజనాథ డిండిముడు తన సంస్కృత కావ్యమును తన ప్రభువునకు అంకిత మిచ్చియుండుట ఆంధ్రకావ్యావతారికలలోని కృతిపతిత్వ ప్రభావము వలననే కావచ్చును. ప్రభువులకో, గురువులకో కృతులను అంకితము చేయు పద్ధతి ప్రాకృత కన్నడ కవులందు కలదు. రాజుల ప్రశస్తి కొరకు కావ్యములను రచించుట తమిళము నందును లేకపోలేదు. తెలుగులో కూడ ఈ సంప్రదాయము కలదు.

నన్నయ భారతమున అంకితమనుమాట లేదు. రాజరాజు తన కృతికి పతియని నన్నయ ఎక్కడను చెప్పలేదు. కృత్యారంభమున ఇష్టదేవతాస్తుతి పూర్వ

1. ఆంధ్రులు - సంస్కృత వాఙ్మయము - శ్రీపరవస్తు రామానుజస్వామి, భారతి, రజతోత్సవ సంచిక (1924-1948) ; పుట. 31.

కముగా కృతిపతికి ఆశీస్సు చెప్పు పద్యముగాని, తరువాత కృతిపతి వంశవర్ణన పద్యములు గాని, షష్ఠ్యంతములుగాని కృతిపతికి అభ్యుదయ పరంపరాభివృద్ధిగా కావ్యమును ఉపక్రమించుటగాని నన్నయ భారతావతారికలో లేవు. రాజరాజు తన పూర్వుల చరిత్రను, భారతకథను వినిపింపుమనియే నన్నయను కోరినది. రాజరాజు కోరికపై భారతకథకు అతనిని ప్రధాన శ్రోతగా చేసి నన్నయ తన భారతమును వినిపించినాడు. కనుక నన్నయ తన భారతమును రాజరాజున కంకితమిచ్చెనో లేదో చెప్పలేము. కాని ఆశ్వాసాద్యంత సంబోధనలు మాత్రము కొంతవరకు రాజ రాజు కృతిపతి అను అభిప్రాయమును కల్గించుచున్నవి.

తెలుగులో కావ్యమును కృతి యిచ్చు సంప్రదాయమును ప్రారంభించిన వారిలో ప్రథముడు నన్నెచోడుడు. అతడు 'కుమార సంభవ 'మను తన 'కృతి సంతానము'ను—

"నింగి ముట్టి యున్న జంగమ మల్లయ-వరమునందుఁ గనిన వస్తుకవిత
దగిలి వారియంద నెగడింతు రవికి దీ-పమున నర్చలిచ్చు పగిది వోలె"
—కుమార సంభవము (1-49)

అని తన గురువును, ఇష్టదైవమును, కూర్చునిజేశుడు నయిన జంగమ మల్లి కార్జుననకు అంకితమిచ్చినాడు. నన్నెచోడుడు తన గురువును కృతిపతిని జేయు టలో ఒక విశేషము కలదు. అతని భావమున కృతిపతియగు తన గురువును, కథానాయకుడగు శివుడును ఒక్కరే. నాయకుని గుణగణములను వర్ణించు నెపమున నన్నెచోడుడు కృతిపతి గుణాభి వర్ణనము చేసినాడు. కృతిపతికిని, కథానాయకుని కిని అభేదమును పాటించి రచించుట కన్నడ కావ్యములందు కలదు. కన్నడమున పంపకవి తన విక్రమార్జున విజయమునందు కథానాయకుడగు అర్జునునికిని కృతి పతియగు అరికేసరికిని అభేదమును పాటించి కథానిర్వహణము చేసినాడు. రన్న కవికూడ తన గదాయుద్ధమున కథానాయకుడగు భీమునికిని కృతిపతియగు సత్యా శ్రయ వల్లభునికిని అభేదమును కల్పించి కథను నిర్వహించినాడు. నన్నెచోడుడు ఈ పద్ధతిని కన్నడ కవులనుండి గ్రహించియుండును. నన్నెచోడునివలె కృతిపతికి కృతినాయకునికి అభేదమును పాటించి రచించినవారు తెలుగులో మరొకరు కన్పించరు. నన్నెచోడునివలె గురువునకు కృతి యిచ్చినవారును కానరారు. మతా చార్యులకు కృతి యిచ్చుటకూడ తెలుగునందు కలదు. లక్షణా పరిణయ మను

నామాంతరముగల చమత్కారమంజరిని సింహాద్రి వేంకటాచార్యుడు వైష్ణవాచార్యులలో ప్రసిద్ధుడగు వరదాచార్యులకు అంకిత మిచ్చినాడు.

పాల్కురికి సోమనాథుడు తన కృతులలో అనుభవసారమునకు గోడగి త్రిపురారిని, బసవ పురాణమునకు గొబ్బూరి సంగనామాత్యుని, పండితారాధ్య చరిత్రకు పాలకురికి సూరనామాత్యుని కథాశ్రోతలుగా కూర్చుకొనినాడు. పండితారాధ్య చరిత్రలో ఒక విశేషము కలదు. ఇది బసవేశ్వరున కంకితము. అందు అంకిత మున్నను అంకిత మొకరికి శ్రోతృత్వ మింకొకరికి. దీనికి సోమనాథుని భక్తిభావమే ముఖ్యకారణము కాఁగును.

"బసవలింగము కృతిపతియయ్యె, కృతియు
రసికతఁ బండితారాధ్య చరిత్ర
మయ్యె, పాల్కురికి సోమనార్యుఁడు సుకవి
యయ్యె, కథాశ్రోత సూరనామాత్యుఁ డయ్యె
కృతిపతి కృతి కవి కృతి కథాశ్రోత
క్షితిఁ జెప్ప నొప్పదే శివభక్త సభల"

—పండితారాధ్య చరిత్ర (పుట. 22)

అని సోమనాథుడు పండితారాధ్య చరిత్రావతారికలో తెల్పినాడు. బసవపురాణాశ్వాసాద్యంతములందును, పండితారాధ్యచరిత్ర ప్రకరణాంతములందును కథాశ్రోతలనుగూర్చిన సంబోధన లున్నవి. పాల్కురికి సోమనాథు ననుసరించి అతని తరువాత పరికొందరు తెలుగుకవులు తమ గ్రంథములందు తమ కిష్టులయిన వారిని కథా శ్రోతలుగా నిర్ణయించుకొని వారు వినుచుండగా కావ్యములను చెప్పినారు.

భాస్కర రామాయణ కాండములలో సాహిణి మారనను గూర్చిన సంబోధన లున్నను అది అంకితముగా కనబడదు. భాస్కర రామాయణావతారిక లభింపమిచే అది ఎవరి కంకితము చేయబడినదో యిదమిత్థముగ ఏమియు చెప్పలేము. పైగా అన్ని కాండములందును ఒకే విధముగ లేకపోవుటచే భాస్కర రామాయణమున అంకితమున్నదో లేదో స్పష్టముగ తెలియరాదు. అందు ప్రశంసింపబడిన ప్రభువులు కథాశ్రోతలుగానే భావింపవచ్చును.

పోతన "ఊహలోన వింత పండువు బోలెను వీరభద్ర విజయ మెన్నఁగ వినఁగడు వేడ్క" నుండు తన గురువగు ఇవ్వటూరి సోమనను కథాశ్రోతగా

నిలిపి తన వీరభద్ర విజయమును రచించినాడు. బచ్చు సిద్ధకవి (17 వ శతాబ్ది) కూడ తన మల్లిబసవ పురాణమునకు 'సంగయ' అను నతని కథాశ్రోతగా నిలిపి నాడు. కావ్యమున కథాశ్రోతలుగా నిలిపి రచించు పద్ధతి తెలుగులో సంప్రదాయ ముగా విస్తృతము కాలేదు.

"కృతిపతిపేర" కావ్యమును రచించు పద్ధతి రంగనాథ రామాయణము నందు మొట్టమొదటి సారిగా కనపడుచున్నది. ఇది కూడ గ్రంథమును అంకితము చేయు పద్ధతియే. రంగనాథ రామాయణమునకు కృతిపతియగు కోన విట్ఠల నాథుడు రామాయణమును—

"తప్పక నా పేరఁ దగ నంధ్రభాషఁ - జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు మర్థి"

అని తన కుమారుడగు బుద్ధభూపతిని కోరినట్లు అవతారికలో కలదు. బుద్ధ భూపతియు "ఆతత కృతిపేర నతిపుణ్యుపేర మాతండ్రి విట్ఠలక్ష్మానాథుపేర" రామాయణమును రచించినాడు. 'కృతిపతిపేర' రంగనాథరామాయణమును వెల యించినట్లు ప్రతికాండాంతమందును చెప్పబడినది. బుద్ధభూవిభుని అనుసరించి అతని కుమారులగు కాచవిభుడు, విట్ఠలనాథుడు అను సోదర జంటకవులు తమ ద్విపదోత్తర రామాయణమును "మాతండ్రి బుద్ధక్షమానాథు పేర నాతతఘను పేర ననఘునిపేర" అని తండ్రిపేరనే రచించినారు. గౌరన నవనాథ చరిత్రను కృతి పతి యగు మల్లికార్జునుని 'పేర' నే రచించినాడు. అవచి తిప్పయ్యసెట్టి తన బాల్య సఖుడగు శ్రీనాథుని "శైవప్రబంధ మొకటి యనఘరింపుము నా పేర నంకి తముగ" అని కోరినాడు. శ్రీనాథుడును చిన్ననాటి చెలికాని కోరికను మన్నించి హర విలాసమును రచించి అతనికి అంకితమిచ్చినాడు. కావ్యమును కృతిపతి పేర రచించుట కృతికర్త కృతిభర్తల సన్నిహిత సంబంధమును తెలియజేయును.

కృతులను అంకితముపొందు నుత్సాహము నానాటికి అధికమగుట కన్పిం చును. రాజులేగాక మంత్రులు, దండనాయకులుకూడ కవుల నాదరించి వారిచే కావ్య ములను అంకితము గొనుచుండుట తిక్కన నాటికి ఒక సంప్రదాయముగా కుదిరినది. కవులమీది ఆదరము కూడ వృద్ధియై యున్నట్లు విన్నకోట పెద్దన (1402) చెప్పిన ఈ క్రింది పద్యమువలన స్పష్టమగు చున్నది:

"వినుతయశంబునం గలుగు విశ్రుత నాక నివాస; మయ్యశో
జననము శ్రవ్య కావ్యముల సంగతి నొప్పగు; శ్రవ్యకావ్యముం

దనరుఁ గవి ప్రభావమునఁ దక్కవి సమ్మతి లేని రాజు లే
పున విహరింప; రవ్విభులు పోయిన జాడ తెలుంగఁబోలు నే!'

—కావ్యాలంకార చూడామణి (3-90)

"కవితా విలాస విస్తర మహనీయు"డైన తిక్కన 'మామా' అని పిల్చు మనుమసిద్ధికి తన నిర్వచనోత్తర రామాయణమును 'కావ్య కన్య' ను కన్యాదానము చేసెను. 'కవిత్వతత్త్వ నిరతిశయానుభావానంద భరితాంతః కరుణుం'డగు తిక్కనకు హరిహరనాథదేవుడు స్వప్నమున సాక్షాత్కరించి అతని భారతమునకు 'కృతిపతిత్వ మర్థించి' వచ్చెను. మానవమాత్రులే గాక దేవతలుకూడ కృతి పతిత్వాభిలాష కల్గియుందురని కవులు భావించిరి కాబోలు. మంచన తన కేయూర బాహు చరిత్రమును తన ఇష్ట సఖుడగు నండూరి గుండయమంత్రి కోరికపై రచించి అతనికే అంకిత మిచ్చినాడు. తిక్కన శిష్యుడగు మారన తన మార్కండేయ పురాణమును కాకతీయ ప్రతాపరుద్రుని సేనాని యగు గన్నయకు అంకిత మిచ్చెను. రాజులేగాక రాజ సంబంధికులు కూడ కవులచే కృతులను అంకిత మందుట తిక్కనకు తరువాత విపుల వ్యాప్తి నందినది.

తిక్కన తాను కృతులను రచించి ఇతరులకు అంకిత మిచ్చుటేగాక కేతనచే దశకుమార చరిత్రను చెప్పించుకొని కృతి పతిత్వమును బడసినాడు:

"కృతులు రచియింప సుకవుల
కృతులొప్పఁ గొనంగ నొరునికిం దీరునె వా
కృతి నిభుఁడు వితరణ శ్రీ
యుతుఁ డన్యను సుతుఁడు తిక్కఁడొక్కఁడు దక్కన్"

—దశకుమార చరిత్ర (1-91)

తిక్కన కవీంద్ర లోకాధారుడని, సార కవితా నిర్మాణ చాతుర్యు డని, ఆర్య భోజుడని, కవితాధన్యుడని, కవిలోక చాతకవ్రజ నవజలద స్తనిత భూషణ ప్రకరుడని పలు విధముల అభినవ దండియగు కేతన కవిబ్రహ్మయగు తిక్కనను గూర్చి తెల్పినాడు. దీనిని బట్టి ఆంధ్రకవితా పోషకులలో తిక్కన ఒకడని నిశ్చయింప వచ్చును. తాను కవియై కవుల నంతగా గౌరవించిన వారిలో తిక్కన ప్రథమ గణ్యుడు. 'కవితఁ జెప్పి యుభయ కవి మిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన" అని కేతన చెప్పుటచే తిక్కనను మెప్పించుట కొరకే కేతన దశకుమార చరిత్రను చెప్పి తిక్కనకు అంకితమిచ్చి యుండును. తిక్కనవలె శ్రీకృష్ణదేవరాయలు,

భండారు లక్ష్మీనారాయణ, రఘునాథ నాయకుడు మున్నగువారు స్వయముగా కావ్యములను రచించుటేగాక కవులను పోషించి వారిచే కావ్యములను అంకితము గొని యుండుట చెప్పుకోదగిన విశేషము.

రెడ్డిరాజులు కవులను పండితులను సత్కరించి పోషించినారు. ఎఱ్ఱన మొదట ప్రోలయ వేమారెడ్డి కనిష్ఠ సోదరుడైన మల్లా రెడ్డికి ఆశ్రితుడుగ నుండెను. వేమారెడ్డి రెడ్డిరాజ్యమును స్థాపించిన పిదప మల్లారెడ్డి ఎఱ్ఱనను వేమారెడ్డికి అప్పగించెను. అప్పటినుండియు వేమారెడ్డి యాశ్రయముననే ఎఱ్ఱన వర్ధిల్లెను. ఎఱ్ఱన హరివంశము కంటె ముందుగ రామాయణమును రచించి ప్రోలయ వేమునికే అంకితమిచ్చి యుండెనని ఈ క్రింది పద్యము వలన తెలియుచున్నది.

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు ని న్నాతత
శ్రీ తోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్"
—హరివంశము (1-39)

ఎఱ్ఱన రామాయణము అలభ్యము. ఎఱ్ఱన తన హరివంశమును కూడ ప్రోలయ వేమునికే అంకితమిచ్చి యున్నాడు. ప్రోలయ వేమారెడ్డి రామాయణ, హరివంశములకు కృతిపతి. బహుగ్రంథములను అంకితము గొన్నవారు తెలుగులో మరికొందరు కలరు. చెందలూరి గంగయమంత్రి నాసికేతోపాఖ్యానమును, ప్రబోధ చంద్రోదయమును కృతిగొన్నాడు. మనుచరిత్ర, పారిజాతాపహరణములు శ్రీ కృష్ణదేవరాయల కంకితము చేయబడినవి. ముక్కుతిమ్మన తన పారిజాతాపహరణమును కృష్ణదేవరాయలు కోరకుండగనే తానే అతనిని కృతిపతిగా నిర్ణయించి కృతియొసగినాడు. మనుచరిత్రవలె ప్రభువు తన్నుకోరుటయే తన కావ్యరచనకు కారణమైనట్లు ముక్కుతిమ్మన తెల్పలేదు. కృతిపతియే తన పేర కృతి రచింపుమని కవిని ప్రార్థించుట కన్న కృతి రచించి కవియే ఉత్తమనాయకుని వరించి అర్పించుట రసవంతముగ నుండునని భావించినాడు కాబోలు ముక్కుతిమ్మన. సాళువ నరసింహరాయలు కూడ జైమిని భారతము, సాళువాభ్యుదయములను అంకితముగొనినాడు. రఘునాథనాయకుడు కృతికర్త మాత్రమేగాక కృతిభర్తకూడ. అతని ఆస్థానమున విశిష్టస్థానమాక్రమించిన చేమకూర వేంకటకవి.

"అవని నింతటి రాజెవ్వఁ డని నుతించి
కృతులొసఁగఁ గీర్తి కలదని మతిఁ దలంచి"

—విజయ విలాసము (1-30)

తన విజయ విలాసమును రఘునాథ నాయకునికి అంకితమిచ్చెను. వేంకట కవి తన కృతులను రఘునాథ నాయకునికి తప్ప అన్యులకు అంకిత మీయనని

"కలనయిన మిమ్ముఁగాక న్యుఁ గొలువనంటి
కృతు లొకరి కీను మీకె యంకితము లంటి
పలికిన ప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు
వాఙ్నియమ రూఢి నీయంతవాఁ డిఁకేఁడి?"

—విజయ విలాసము (1-48)

అని ప్రతిజ్ఞచేసి యుండుటనుబట్టి అతడు సారంగధరచరిత్రనుకూడ రఘునాథ నాయకునికే అంకితమిచ్చి యుండునని భావింపవచ్చును. సారంగధర చరిత్రకు అవతారిక లభ్యముకాలేదు.

కృష్ణాధ్వరి తన నైషధ పారిజాతమును రఘునాథ నాయకునికి అంకిత మిచ్చినాడు. కృష్ణాధ్వరి నైషధ పారిజాతమునకు ముందు 1. రఘునాథ భూపాలీయము, 2. పారిజాతకథ, 3. కల్యాణ కందర్ప నాటకము, 4. శృంగార సంజీవని, 5. తాళ చింతామణి—అను అయిదు కావ్యములను రచించి రఘునాథునికే అంకిత మిచ్చియుండెనని శ్రీ ఆరుద్రగారు వ్రాసినారు.[1] పాండ్య దేశాధీశుడగు ముద్దళగిరి క్ష్మాపాలుడు (1670) లింగనమఖి కామేశ్వరకవిచేత సత్యభామా సాంత్వనమును, రుక్మిణీ పరిణయమును వ్రాయించి అంకితముగొన్నాడు. మధురాంధ్ర కృతులలో సత్యభామా సాంత్వనమే మొదటి కృతి. ముద్దళగిరిక్ష్మాపాలునికి పూర్వులగు మధుర నాయక రాజులు కృతిపతులుగానున్న తెలుగు కావ్యములేవియు నిప్పటికి కానరావు. గణపవరపు వేంకటకవి ముద్దళగిరి పోషణలోనుండి విద్యావతి దండకమును చెప్పినాడు. ఇట్లు బహుగ్రంథములను అంకితముగొన్న కృతిపతులు దాక్షిణాత్యాంధ్ర యుగమునందే ఎక్కువమంది యున్నట్లు తెలియుచున్నది.

శ్రీనాథుడు ఏదైన ఒక ఆస్థానములో స్థానము సంపాదింపదలచుకొన్నపుడు తత్సంబంధులతో కృతిసంబంధము నేర్పరచుకొనుచుండును. అతడు పెద

1. సమగ్రాంధ్ర సాహిత్యము, సంపుటము x; పుట. 214.

కోమటి వేమారెడ్డి ఆశ్రయము సంపాదింపకోరి మంత్రియగు మామిడి పింగనకు తన శృంగార నైషధమును అంకితమిచ్చినాడు. రాజమహేంద్రవర మేలుచుండు వేమ వీరభద్రారెడ్ల ప్రాపుకోరి వారి మంత్రియగు బెండపూడి అన్నమంత్రికి భీమేశ్వర పురాణమును కృతియిచ్చినాడు. "పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు" అనుటచే బెండపూడి అన్నమంత్రికి శ్రీనాథునికి బంధుత్వముకూడ కలదని వ్యక్తమగుచున్నది. శ్రీనాథుడు తన బాల్యసఖుడును, కొండవీటిని రాజధానిగా పరిపాలించిన కొమరగిరి భూపాలుని సుగంధ ద్రవ్య భాండాగారాధ్యక్షుడును నయిన అవచి తిప్పయసెట్టికి తన హరవిలాసమును అంకితమిచ్చెను. శ్రీనాథుడు 'ప్రాయమింతకు మిగులఁగై వ్రాలకుండ' రచించిన కాశీఖండమును వీరభద్రారెడ్డికి అంకితమిచ్చెను. శ్రీనాథుడు తన కావ్యములలో తన కృతిపతులకు పతులైన రెడ్డిరాజుల చరిత్రను ప్రసక్తాను ప్రసక్తముగ వర్ణించినాడు. తన కాశ్రయమీయదగిన ప్రభువు నాదరము బడయుటకే అతడిట్లు వర్ణించినాడు. కృత్యాదిలోనేగాక షష్ఠ్యంతములందును, ఆశ్వాసాద్యంత పద్యములందుకూడ ఈ క్రమమునే శ్రీనాథుడు పాటించి రచించినాడు.

రెడ్డి రాజులలో కవులను సత్కరించి పోషించి వారిచే కృతులను స్వీకరించిన వారిలో ముఖ్యులు దొడ్డారెడ్డి, రాఘవరెడ్డి అనువారు. వీరభద్రారెడ్డి తమ్ముడగు దొడ్డారెడ్డికి నిశ్శంక కొమ్మన తన శివలీలావిలాసమును అంకితమిచ్చినాడు. వెన్నెలకంటి సూరన తన విష్ణుపురాణమును పంటరెడ్డి వంశోద్భవుడగు రాచూరి బసవరెడ్డి కుమారుడగు రాఘవరెడ్డికి కృతియిచ్చెను.

సాళువ నరసింగరాయలకు (1485-1493) పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమిని భారతము అంకితము చేయబడినది. సాళువ వంశీయుడగు నూకరాజు కుమారుడగు తిరుమలరాజునకు చదలువాడ మల్లన తన విప్రనారాయణచరిత్రను అంకితము చేసినాడు.

మాడయ్యకవి తన మైరావణ చరిత్రను వేజెర్ల గోపమంత్రికి అంకితమిచ్చెను. ఈ గోపమంత్రి ఏ యాస్థానమున మంత్రిగా నుండెనో యిదమిత్థముగ చెప్పుటకు ఆధారము లేవియు లేవు. "కాని గ్రంథమందలి కొన్ని సందర్భములను బట్టి బహుశః కర్ణాటరాజగు వీర నృసింహరాయల రాజ్యములో నెచ్చటనో పాల

నాధికారిగా నుండవచ్చు నని యూహించుట సత్యమునకుఁ జాల చేరువగా నుండును''[1] అని శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారు తెల్పియున్నారు.

కృష్ణదేవరాయలు స్వయముగా కవియేగాక అష్టదిగ్గజములను కవీంద్రులను పోషించినవాడు. పెద్దన మనుచరిత్రము, ముక్కుతిమ్మన పారిజాతాపహరణము కృష్ణదేవరాయలకే అంకితము. అతని అంతఃపురమున నాట్య సంగీత విద్యలకు నాచార్యుడగు భండారు లక్ష్మీనారాయణ సంస్కృతమున 'సంగీత సూర్యోదయ' మను శాస్త్రగ్రంథమును రచించినాడు. అతనికి భానుకవి తన పంచతంత్రిని అంకితము చేసినాడు. ఈ భండారు లక్ష్మీనారాయణ మొదట ప్రతాపరుద్ర గజపతి ఆస్థానములో నుండువాడట. సంగీత నాట్యాచార్యులుకూడ కృతుల నంకితమంది యుండుట విజయనగర రాజుల కాలమున గమనింపదగిన విశేషము.

ఎడపాటి ఎఱ్ఱన తన శృంగార మల్హణ చరిత్రమును శ్రీ కృష్ణదేవరాయల కాలముననే రచించి యాతనికే కారణముననో అంకితము చేయక కాళన మంత్రికి కృతి నొసంగినట్లు ఈ క్రింది పద్యమున తెల్పియున్నాడు :

''ఇట్టి మహా ప్రధాన పరమేశ్వర మూర్తివిగాన నీవు చే
పట్టితి మేలు చుండి పురపాలక! కాళనమంత్రి చంద్ర! మున్
గట్టిగఁ గృష్ణరాయ జనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవి రాజిత మల్హణ కావ్యకన్యకన్''

—మల్హణ చరిత్ర, అవతారిక.

కృష్ణరాయల మంత్రియగు తిమ్మరుసు అల్లుడు, మేనల్లుడునగు నాదిండ్ల అప్పయామాత్యునికి అంకితముగా మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రమును రచించెను. నాదిండ్ల అప్పామాత్యుడు మంత్రి దండనాథుడును. విజయనగర రాజుల కాలమున మంత్రులు, సామంతులేగాక సామాన్య రాజకీయోద్యోగులుకూడ కవులచే కావ్యములను అంకితము గొనుచుండిరి. కొండవీటి దుర్గమున కధ్యక్షుడైన నాదిండ్ల గోపమంత్రికి 'రాజకార్య నిర్వాహకుడు'గా నుండిన ఊర దేచమంత్రి తెనాలి రామలింగకవిచే ఉద్భటారాధ్య చరిత్రమును చెప్పించుకొని కృతిపతిత్వమును బడసెను. రామకృష్ణకవి తన పాండురంగమాహాత్మ్యమును మంగయ గురువ

1. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము, ద్వితీయ భాగము, పుట, 18.

రాజు కుమారుడైన పెద్ద సంగభూపాలునొద్ద వ్రాయసకాడుగా నుండిన విరూరి వేదాద్రికి అంకితము చేసినాడు.

రామరాయల, తిరుమలరాయల ఆశ్రయము లభింపక పూర్వము రామరాజ భూషణుడు వారి మేనల్లుడగు ఓబళ నరసరాజు నాశ్రయించి తన కావ్యాలంకార సంగ్రహమును అతనికి కృతి యిచ్చినాడు. పిదప రామరాయల యాశ్రయమును ఆ నరసరాజు మూలముననే సంపాదించి అతని దయకు పాత్రుడయ్యెను. రామ రాజభూషణుడు తన వసుచరిత్రను ఆరవీటి తిరుమలరాయలకు అంకితమిచ్చెను.

ఆరవీటి వంశములోని రాజులేగాక, రాణులుకూడ సాహిత్యసేవ చేసినట్లు తెలియుచున్నది. రామరాజీయమును అంకితముగొన్న కోదండరామరాజు తమ్ముడు ఆర్వీటి తిరుమలరాజు. ఇతనికి తిమ్మరాజు అని నామాంతరముకలదు. ఇతడు ద్విపద రామాయణమును రచించినాడు. ఇతని భార్య కోనేటమ్మ కవులను పోషించి కృతులను అంకితము పొందినట్లు అందుగుల వెంకయ్య తన రామరాజీయమున ఇట్లు తెల్పినాడు :

"దుర్జయ రాజన్య దోశ్శక్తులు బిగించి సర్వ సర్వంసహా చక్ర భార
భరణ దక్షత మహా ప్రౌఢులౌ శ్రీ కృష్ణరాయలు నార్వీటి రామరాజ
తిరుమల రాయాది ధరణి నాయకులును వారల దేవులు వసుధఁ గీర్తి
గనరె యీ కీర్తికి జననంబు పోషిత కవిజన సన్నుతి గాదె యిట్టి

కవిజనాధార విఖ్యాతి గాంచి మిగులఁ
గవులఁ బోషించి తన్నుతి కబ్బముల ను
తింప వెలసెను నార్వీటి తిరుమల క్ష
మా నవేంద్రు కోనేటమ్మ మహిని మిగుల"

—రామరాజీయము (ప. 403.)

విజయనగర సామ్రాజ్యమును పాలించిన కృష్ణదేవరాయలు, అళియరామ రాజు, తిరుమల దేవరాయలు మొదలగు వారుమాత్రమేగాక వారి దేవేరులు కూడ కవులను పోషించి కీర్తిపొంది యుండుట ఒక విశేషము. కోనేటమ్మ పోషించిన కవులను గూర్చిగాని, వారి గ్రంథములను గూర్చిగాని వెంకయ్య ఏమియు తెలుపలేదు.

మహమ్మదీయ ప్రభువులుకూడ తెలుగు కవుల నాదరించి వారిచే కృతులను స్వీకరించి యుండుట చెప్పుకోదగిన విశేషము. మహమ్మదీయ ప్రభువులకు తెలుగు కావ్యములను అంకితమిచ్చిన వారిలో ప్రథముడు అద్దంకి గంగాధరుడు. అతడు తన తపతీ సంవరణోపాఖ్యానమును మల్కిభరామునకు కృతి యిచ్చెను. తపతీ సంవరణోపాఖ్యానమును అంకితమొందుటకు ముందు మల్కిభరాముడు మరికొన్ని కావ్యములను అంకితముగొన్నాడు. ఈ సంగతి గంగాధరకవితో మల్కిభరాముడు చెప్పిన ఈ మాటలనుబట్టి తెలియుచున్నది:

"పెక్కు కృతుల్ చమత్కృతులు పెంపుగ నందితి గాని నీదు స
మ్యక్కృతి కన్యపైఁగల మమత్వమువర్తిల దందు లెక్కకుం
బెక్కవగాఁగ గోపికలు మించి వసించిన నేమి రాధపై
మక్కువ యెక్కువై మిగుల మన్ననసేయఁడె శౌరి వేడుకన్"

—తపతీ సంవరణోపాఖ్యానము (అవతారిక)

మల్కిభరాముడు అంకితముగొన్న ఆ కృతులేవియో తెలియవు. మల్కిభరాము ప్రభుత్వములో నుద్యోగిగానున్న అమీన్‌ఖానుడను మహమ్మదీయ ప్రభువునకు పొన్నికంటి తెలగన తన 'యయాతి చరిత్ర'మను అచ్చ తెనుగు కావ్యమును మరింగంటి అప్పన్న ప్రేరణమున అంకితమిచ్చినాడు. ఈ అప్పన్న అమీనుఖాను నొద్ద యుద్యోగి. తెలగన మహమ్మదీయ ప్రభువును తన గ్రంథమునకు కృతిపతిని చేసినను తన మత విశ్వాస స్వాతంత్ర్యమును కోల్పోక సత్యమైన స్తుతినే చేసినాడు.

## నరాంకితమును నిరసించుట :

తిక్కన, రామరాజభూషణుడు మున్నగు కవులు మొదట తమ కృతులను రాజాంకితము చేసియున్నను తరువాతి కృతులను తమ ఇష్టదైవమునకే అంకితము చేసియున్నారు. ఈ కవులు రాజదూషణము చేయలేదు. రాజాదరణము లభింపమిచే కాబోలు కొందరు కవులు రాజతిరస్కారముచేయుచు తమ కృతులను దైవాంకితముచేసియున్నారు. పోతన తన తొలికృతియగు భోగినీ దండకమున రావు సింగ భూపాలుని స్తుతించియున్నను మలి కృతియగు భాగవతమున రాజులను మనుజేశ్వరాధములుగా నిరసించియున్నాడు. చూడుడు :

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట పోటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్"

—భాగవతము (1-13)

ఈ పద్యమును పోతన వ్రాసియుండడని, ఇది ప్రక్షిప్తమని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విశ్వసించిరి.[1] పోతన భాగవతమును అంకితము చేయుటను గూర్చి విచిత్రగాథలు వినబడుచున్నవి. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను పోతన నరాంకితము చేయనని నిశ్చయించుటకు రాజులను మనుజేశ్వరాధములనుగా పేర్కొనుటకు ప్రబల కారణమేదియో తెలియరాదు.

'భరమైతోఁచు కుటుంబ రక్షణకు' ప్రాలుమాలి కవులు గ్రంథ చౌర్యముచేసి రాజులకు అంకిత మిచ్చుచుండెడివారని అల్లసాని పెద్దన మనుచరిత్ర అవతారిక (1-19) లో చెప్పినాడు. గ్రంథచౌర్యము కాని రచనలను సయితము అతికుటుంబ రక్షణకొఱకు మూఢభూమిపతులకు అంకిత మీయవలెనా? అని బైచరాజు వేంకట నాథుడు ప్రశ్నించినాడు. రాజాంకితమును గురించి అతడు చెప్పిన విధమును గమనింపుడు :

"అతికుటుంబ రక్షణాపేక్షఁ బ్రాల్మాలి
కృతులు మూఢ భూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరా
ర్పణముఁ జేసి సుగతిఁ బడయరాదె"

—పంచతంత్రము (1-27)

ఆ ప్రభువులు మంచి కవిత్వము పొంతపోక ఏలలు, తందనాలు విన సాగినారట. వేంకటనాథుడు ఇట్లు చెప్పినాడు :

"ఏలల్ తందన తాన లేమయిన లేవేయించు బోధించు నే
నూలం బెట్టఁగఁ జాల మూఢ నృపుఁడోహో నా మహా సాహితీ
శీలంబుల్నెవులాడ సొమ్మసిలు నొచ్చుం జచ్చు దత్కల్మషం
బేలా యంజలి చేసి మ్రొక్కెద పదార్థేచ్ఛా నిశాచారికిన్"

—పంచతంత్రము (2-133)

1. ఆంధ్ర భాగవతోపన్యాసములు, పుట. 11.

ఆ కాలమున రాజులు విద్వాంసులకుగాక ఎటువంటివారికి కానుకలిచ్చుచుండెడి వారో వేంకటనాథుడు ఇట్లు తెల్పినాడు.

"పరిహాసకులకు నటులకుఁ
దరుణులకును లంజెదారి తమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం
బొరయింతురు రాజు లీరుపోక పగసులకున్"

—పంచతంత్రము (2-138)

ఈ కారణములచే కృతిని రాజులకిచ్చు అభిప్రాయమునందు బైచరాజు వేంకటనాథుడు విముఖుడు.

"అంగధృతాబ్జు నిశ్చల తరాతిను సర్వదు సర్వమంగళా
లింగితు భీషణాశరకులీన జయోన్ముఖ పౌరుష క్రియా
సంగతు భీషణాంబక కృశాను నిరూపిత వైరి సద్మ యో
గాంగయుతాధృతిన్ హరిహరాకృతి మత్కృతి భర్తఁ జేసెదన్"

—పంచతంత్రము (1-28)

అని నిశ్చయించి వేంకటనాథుడు తన పంచతంత్రమును హరిహరనాథునకు అంకితమిచ్చినాడు.

పోతనవలె మొల్లకూడ భక్తి పారవశ్యమున నిట్లు పల్కినది:

"సల్లలిత ప్రతాపగుణ సాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామ నరపాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్
జిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే
అల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాస సేయునే"

—రామాయణము (1-24)

సంకుసాల నృసింహకవి శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానమున ప్రవేశింప యత్నించినట్లు, ఆ ప్రయత్నము సఫలముకాకపోగా విసిగి వెడలిపోయినట్లు కొన్ని వదంతులున్నవి. వానికి చారిత్రకాధారము లేమియులేవు. అయినను నృసింహకవి తన కవికర్ణ రసాయనమును శ్రీ రంగనాయకస్వామికి కృతి యిచ్చుచు అవతారికలో చేసిన రాజద్వారదూషణము, రాజకృత తిరస్కారమునకు ప్రతిక్రియా సూచన

మేమో అనిపించును. కావ్యములను నరులకు కృతి యిచ్చుటను నృసింహకవి గర్హించిన విధమిట్టిది :

"ఆందోళికలయందు నంతరం చరులైన సవికృతాకృతుల పిశాచ జనులు
పరకరాళంబులై ప్రార్థింపఁగనుఁగోక వాయె త్తకుండు జీవచ్ఛవములు
వాలవీ జనములఁ గ్రాలుచు నీగకు నంటిని ఖరవరులాండసములు
వేత్రపరంపరావిల కంబకాకృతిఁ జేరఁ బోరాని బర్బూర తరులు

శంఖ నాగస్వర స్వర శ్రవణ సమద
విస్ఫుట చ్ఛత్ర విస్ఫారిత స్ఫటాక
విష్ట విష వైద్య వశవర్తి దుష్ట ఫణులు
ప్రభుదురాత్ముల నెవ్వండు ప్రస్తుతించు"

—కవికర్ణ రసాయనము (1-24)

"నరగుణాంకితమయ్యెనే సరస కృతియు
దూష్యమగు శునిధృతి గత దుగ్ధ మట్లు
హరి గుణాంకితమయ్యెనే నసదుకృతియు
హరి సూత్రంబు గతి హృదయంగమంబు"

—కవికర్ణ రసాయనము (పీఠిక 26)

కాకమాని మూర్తికవి రాజాశ్రయము కోరి వారికి కృతియిచ్చి ధనమును సంపాదింప దలచినట్లును, తన కోరిక సఫలము కాకపోగా ఆ రాజులమీది కోపముతో రాజదూషణము చేసినట్లును పాంచాలీ పరిణయ, రాజవాహన విజయావతారికలలోని పద్యములనుబట్టి ఊహింపవచ్చును. పాంచాలీ పరిణయమును శ్రీరంగనాథునికి కృతి యిచ్చుచు రాజులను తిరస్కరించిన విధమిట్టిది :

"అర్భకుల భాతి నవరస గర్భిత సందర్భలహరిఁ గరగని భూభృ
న్నిర్భాగ్యుల కిత్తురె వైదర్భీ నిర్భీక పాకదర్పిత కవితల్"

— పాంచాలీ పరిణయము (1-17)

రాజవాహన విజయములో మూర్తికవి రాజులను 'వ్యాళస్వాంతులు'గా వర్ణించినాడు. చూడుడు :

"వ్యాళ స్వాంతు లశాంతు లజ్ఞ సతతైశాంతుల్ మహా చేటికా
శ్రీలోపద్రవ నవ్య పత్రికలు భూరి ప్రాజ్ఞ విజ్ఞాపనా

వ్యాళాకల్పిత రక్తవక్త్రులు కళా విజ్ఞాన నిర్భాగ్యు లీ
కాలక్ష్మాతల నేతలం బొగడుటల్ కష్టంబు లర్థార్థికిన్"

—రాజవాహన విజయము (1-22)

'వ్యాళ' మనగా వ్యాఘ్రము, సర్పము అని రెండర్థములు. రాజులు వ్యాఘ్రమువంటి మనస్సుగలవారట. పైకి గోవువలెనుండి పులివలె హానిచేయువారనుట. రాజులు సర్పమువలె కుటిలవర్తన గలవారనియు చెప్పవచ్చును.

కనుపర్తి అబ్బయామాత్యుడు తన అనిరుద్ధ చరిత్రము, కవిరాజమనోరంజనము అను రెండు గ్రంథములను తన ఇష్టదైవమగు మంగళగిరి నృసింహునికే అంకితమిచ్చెను. అనిరుద్ధ చరిత్రములో—

"భగవంతుని సద్గుణములు, పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు. జగతిన్ సత్కవులు తుచ్ఛసంపదకొఱకై" 1-16

"హరినామాంకిత కావ్య మెట్టిదయిన న్నానందమై సజ్జనా
దరణీయంబగుఁ బుష్పమాలికలలో దారంబు చందంబునన్
నరనామాంకితమైన కావ్యము రసౌన్నత్యస్థమయ్యు న్నిరా
కరణంబై చను హీనజాతి పురుషుం గైకొన్న వేశ్యంబలెన్" 1-17

"కృతులు నిజాంకితంబులొనరించిన నిష్టధనంబు లిచ్చి స
న్మతిఁ బ్రభువుల్ కవీశ్వరుల మన్నన సేయుట కీర్తిఁ గోరి ని
శ్చితమతి దేవతాస్తుతియె సేయు కవీంద్రుల నాదరించి స
త్కృతి యొనరించు సత్ప్రభుని కీర్తికిఁ గీర్తి ఘటింపకుండునే!" 1-18

కవిరాజ మనోరంజనములో-

"ధాతలకు ధాత భువన, త్రాతలకున్ ద్రాత శౌరి రక్షకుఁడఁట యా
దాతల దాత న్విడిచి యి,లాతల నేతల నుతించు లాఘవ మేలా?"

—కవిరాజ మనోరంజనము (1-15)

అని రెండు కృతులందును అబ్బయామాత్యుడు నరాంకితమును నిరసించినాడు.

గట్టు ప్రభువు కూడ తన కుచేలోపాఖ్యానమునందు నరాంకితమును నిరసించినాడు. చూడుడు:

"నరులకు నంకితములుగా వరకృతులొనరింప మిగుల వాంఛలు లేమిన్
కరుణారస పూరితుఁడగు హరికి సమర్పింతు సముదితానందమునన్"

—కుచేలోపాఖ్యానము (1-18)

కొందరు కవులు రాజాంకితమును నిరసింపకున్నను తమకావ్యములను ఇష్ట దైవమునకో, లేక ఏదో ఒక దైవమునకో అంకితమిచ్చిరి. కావ్యమును ఇష్టదైవమున కంకితమిచ్చుట మహాభాగ్యమని తలచినాడు చంద్రభాను చరిత్రకర్త తరిగొప్పుల మల్లన. ఈ క్రింది పద్యమును చూడుడు :

"కావ్యము సత్కవి ప్రకర కర్ణ సుధాపరిపూరణక్రియా
భవ్యముగా నొనర్చుట తపఃఫల మర్యిఁదలంప నట్టి స
త్కావ్యము నిష్టదేవత వతంసున కిచ్చి కృతార్థుఁడైన యా
యవ్యయభాగ్యరాశిఁ గొనియాడఁ దరంబె జగత్త్రయంబునన్"

—చంద్రభాను చరిత్రము (1-9)

చంద్రభాను చరిత్రమును కవి తన ఇష్టదైవమగు దత్తాత్రేయునికి కృతి యిచ్చినాడు. హరినో, హరునో, హరిహరనాథునో కృతిపతులుగ జేసి కొందరు కవులు గ్రంథములను రచించినారు.

మఠాధిపతులు, పీఠాధిపతులుకూడ కవులను ప్రోత్సహించి వారిచే కృతులను స్వీకరించుచుండిరి. శ్రీశైలమున భిక్షావృత్తి మఠమను జంగమ మఠాధీశ్వరుడగు శాంత భిక్షావృత్తి తన భృత్యుడగు శాంతయ్యను శ్రీనాథునిచే కృతిగొనుమని బోధించినట్లు శివరాత్రి మాహాత్మ్యము అవతారికలో కలదు. శివరాత్రి మాహాత్మ్యమునకు కృతిపతి శాంతయ్య. శాంతభిక్షావృత్తి తన భృత్యునకు కృతినిప్పించుటయే గాక తానుగూడ గౌరనచే నవనాథచరిత్రను మల్లికార్జున దేవున కంకితముగా చెప్పించుకొనెను.

తనయుడు తండ్రి కోరికపై తండ్రి 'పేర' అంకితమిచ్చిన గ్రంథములలో రంగనాథ రామాయణము మొదటిది. ద్విపదోత్తర రామాయణము తండ్రిపేరనే తండ్రి కంకితముగానే రచితమయినది. దామెరల వెంగళనాయకుడు తనకు స్వప్నమున సాక్షాత్కరించిన శ్రీరామునిచే ప్రబోధితుడై బహుళాశ్వ చరిత్రను రచించి తన తండ్రియగు వేంకటాధీశున కంకితముచేసెను. పింగళి సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నమును తన తండ్రియగు అమరనామాత్యుని కంకితముగా రచిం

చెను. భోసల ఏకోజి (1738) తన తండ్రియగు తుళుజ భూపాలునకు తన ద్విపద రామాయణమును అంకితము చేసియున్నాడు. సవరము చిననారాయణ, జాతివార్తా చమత్కారమయమైన తన కువలయాశ్వ చరిత్రమును తన పెంపుడు తండ్రియగు పెదనారాయణకు అంకితమిచ్చినాడు. ఆరవీటి ప్రభువగు తిరుమలరాజు తన తండ్రియగు రామరాజ తిమ్మరాజున కంకితముగా దోనూరి కోనేరునాథకవిచే బాలభాగవతమును చెప్పించెను.

ఎఱ్ఱన స్వప్నమున సాక్షాత్కరించిన తన తాత ఎఱపోతసూరి ప్రేరణముచే నృసింహపురాణమును రచించి అహోబల నరసింహుని కంకితముచేసెను. పిండిప్రోలు లక్ష్మణకవి స్వప్నమున తన తండ్రి ప్రేరేపణచే లంకావిజయమును రచించి కుయ్యేటి గోపాలున కంకితము చేసినాడు. ఇట్లు పితృపితామహులచే ప్రేరేపింపబడి కొందరు కవులు తమ కావ్యములను దైవాంకితముచేసియుండుట తెలుగు కావ్యావతారికలందు కాననగును.

కృతిపతులతోపాటు కృతిప్రేరేపకులుకూడ తెలుగుకావ్యములందు ప్రాముఖ్యము వహించినారు. పోశెట్టి లింగన నవచోళచరిత్రను చకిలాల లింగప్ప ప్రేరణమున రచించి మృత్యుంజయస్వామి కంకితమిచ్చెను. కవి కృతి ప్రేరేపకుడగు లింగప్పను సంబోధించియే కథలను చెప్పినాడు. గ్రంథమధ్యమున కృతిపతిని సంబోధించు నాచారమేగాని కృతి ప్రేరేపకుని సంబోధించు నాచారము తెలుగు కావ్యములందు అంతగాలేదు.

అచ్యుత దేవరాయలమంత్రి వర్యులలో నొకడగు సంజయ తిమ్మరుసు కోరికపై చింతలపూడి యెల్లనార్యుడు తన తారకబ్రహ్మ రాజీయమును శ్రీరామునికి కృతిగా సమర్పించెను. అకువీటి పెదవేంకటాద్రి ప్రేరణమువలన పింగళి సూరన తన రాఘవ పాండవీయమును విరూపాక్ష దేవునకు అర్పించినాడు. ఇట్లు కృతి ప్రేరేపకుల మూలమునకూడ కొందరు కవులు తమ కావ్యములను దైవాంకితము చేసియుండుట గమనింపవచ్చును.

ఇట్లు కావ్యావతారికలలోని అంకితముచేయు సంప్రదాయమువలన పలువురి సాహిత్యపోషకుల చరిత్ర వ్యక్తమగుచున్నది. కృతిపతులనుగూర్చిన వివిధాంశములు ముందు ప్రకరణములలో వివరింపబడినవి. కృతిపతి వంశాదికములను తెలిసికొనుటకు ముందు కృతికర్తనుగూర్చి కావ్యావతారికలందు పేర్కొనిన విధమును పరిశీలింతము.

# 11

# కృతికర్తృ వంశాదివర్ణనము

తెలుగు కవుల జీవితవృత్తాంతములు తెలుపు చారిత్రక గ్రంథములు మనకు లేక పోవుటచే వారి జీవిత విశేషములను, ఇతర విషయములను తెలిసికొనుటకు మనము కావ్యాదులయందలి కృత్యవతరణికలనే ఆశ్రయింపవలసియున్నది.

సంస్కృత కావ్యములందు కృతికర్తృవంశాదిక వర్ణనము కానరాదు. సంస్కృత నాటకములలోని ప్రస్తావనలో కవిగోత్రనామాది కథనమగు సంగ ముండును. దీనివలన నాటక రచయితనుగూర్చి కొంత తెలిసికొనవచ్చును. కన్నడ కావ్యములందు కృతికర్తృక విషయాదికము కావ్యారంభమున గాక కావ్యాంతమ నందుండును. తెలుగులో ఒక్క ముక్కుతిమ్మన మాత్రము కన్నడ కవుల సంప్ర దాయమును పాటించి తన వంశాను క్రమణికను గ్రంథాంతమునందు తెల్పి యున్నాడు. చూడుడు :

"కౌశిక గోత్ర విఖ్యాతుఁడాప స్తంబసూత్రుఁడార్వేల పవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకును దిమ్మాంబకుఁదనయుండు సకల విద్యావివేక
చతురుఁడు మలయమారుత కవీంద్రునకు మేనల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణా సమాలబ్ధ ఘన చతురంతయానమహాగ్రహార సన్మాన యుతుఁడు

తిమ్మనార్యుండు శివ పరాధీన మతి య
ఘోర శివగురు శిష్యుండు పారిజాత

హారణమను కావ్య మొనరించె సంధ్ర భాష
నాదివాకర తారా సుధాకరముగ"

—పారిజాతాపహరణము (5-108)

కాని తెలుగు కావ్యములందంతటను కావ్యావతారికలోనే కృతికర్తృవంశాదికమును వర్ణించుట సహజ సిద్ధము. తెలుగు కవులు కృత్యాదిని తమ వంశానుక్రమణికను తెలుపుచు పెక్కు పద్యములను వ్రాయువాడుక కలదు. ఇందు కవి కుల గోత్ర సూత్రాదికమును, స్వగుణాతిశయమును, తన వంశవృక్షమును, పాండిత్యోత్కర్షనుకూడ వర్ణించుకొనుట సహజము.

మారన, మంచన, కందుకూరి రుద్రకవి, ధూర్జటి, అయ్యలరాజు రామభద్రుడు, సంకుసాల నృసింహకవి మొదలగువారు తమ కావ్యావతారికలలో తమ వంశమునుగూర్చియు, తమ్ముగూర్చియు ఏమియు చెప్పుకొనలేదు. ఆయా కవుల తలిదండ్రులనుగూర్చియు, కులగోత్ర సూత్రాదికములనుగూర్చియు తెలిసికొనుటకు వారి ఆశ్వాసాంతగద్యలే మనకు శరణ్యమగుచున్నవి. కాని ఆశ్వాసాంతగద్యవలన కవి స్వగుణాతిశయమంతయు నెరుగుటకు వీలుపడదుకదా! కవి వృత్తాంతమును సమగ్రముగా తెలిసికొనుటకు ఆశ్వాసాంత గద్యకంటెకూడ కృత్యాదియందలి కవి వంశాదికము ఎక్కువగా తోడ్పడును.

కొందరు కవులు తమ వృత్తాంతమును తామే కృత్యవతరణికలో స్వల్పముగనో అధికముగనో తెల్పుదురు. మరికొందరు ఆత్మస్తోత్రము గావించుకొనుట కిష్టములేక కాబోలు స్వప్నమున సాక్షాత్కరించిన ఇష్టదైవము పల్కినట్లుగా స్వప్న వృత్తాంతమును వర్ణించుకొందురు. కొందరు కృతిపతి తన్నుగూర్చి చెప్పినట్లుగా స్వీయపాండిత్యాదికమును చెప్పికొనుటకలదు. ఈ మూడు విధములుగ కవి స్వవృత్తాంతమును తెల్పుట పెక్కు తెలుగు కావ్యములందు కాననగును. కవి మిత్రులు కవివంశాదికమును వర్ణించుటకూడ కొన్ని గ్రంథములలో లేకపోలేదు. అహల్యా సంక్రందనమును రచించిన కవి సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు. అతడు తారాశశాంక విజయ కర్తయగు శేషము వేంకటపతి కవియు, ఋణిగె కృష్ణకవియు తన కాప్తమిత్రులనియు, వారే తన వంశావతార క్రమమును నిందున్నట్లు వర్ణించిరనియు తన అహల్యా సంక్రందనావతారికలో(షటలు 8.9) ఇట్లు చెప్పియున్నాడు:
"...ఉభయ భాషా కవితా విశేషులైన శేషము వేంకటపతి, ఋణిగె కృష్ణ కవీంద్రుఁడు నాయాప్త సఖులు గావున వారిం బిలిపించి యీ శుభ స్వప్నము వినిపించు

టయు...భవదీయ వంశావతార క్రమంబు వర్ణించెద మాకర్ణింపుమని యిట్లనిరి." నముఖము వేంకటకృష్ణమ నాయకుడు తన వంశక్రమమును తానే వర్ణించుకొనుట కిష్టములేక తన యాప్తమిత్రులచే స్వవృత్తాంతమును మాత్రముచెప్పించియుండును. నముఖము వేంకటకృష్ణమ నాయకుడు చతుర్థ కులజుడు. ఇతని తలిదండ్రులు అల మేలమ్మా మీనాక్షినాయకులు. పరంపరగా వీరి వంశమువారు మధురనాయక రాజులయొద్ద ప్రధానులుగా నుండెడివారు. ఈ కవి ప్రఖ్యాతుడగు విజయరంగ చొక్కనాథనాయకునికి (1704-1731) 'ఆంతరంగిక సామాజికుఁడు' గనుండినట్లును. అతనివలన 'గజతురంగ మాందోళికా ఛత్రచామర విజయ కాహళ భూరి భేరీ బిరుద ధ్వజక్రము' ఖాదులను బడసినట్లును అహల్యా సంక్రందనావతారికవలన తెలియును.

కదిరీపతి తన వంశావతారమును విద్వజ్జనంబులు అభివర్ణించినట్లు తన శుక సప్తతి అవతారికలో తెల్పియున్నాడు. కదిరీపతి యింటిపేరు పాలవేకరివారు. వీరు చంద్రవంశ క్షత్రియులు. అచ్యుతగోత్రులు. వారి రాజధాని తాడిగోళ్లపురము. వీరి వంశములోని ప్రసిద్ధ పురుషులు వారి ఘనకార్యములు విపులముగా వర్ణింపబడినవి. కదిరీపతికి విద్వజ్జనంబు లిట్లని యానతిచ్చిరట:

"కావ్య నైపుణి శబ్దగౌరవ ప్రాగల్భ్యము ధ్వనానసక్త యతిశయోక్తి
నాటకాలంకార నయమార్గ సాంగత్యసాహిత్య సౌహిత్య సరసముద్ర
సకల ప్రబంధ వాసన సువాక్ప్రౌఢిమాన్విత చతుర్విధ సత్కవిత్వధాటి
లక్ష్య లక్షణ గుణశ్లాఘ్యతా పటిమంబు నైఘంటిక పదానునయ నిరూఢి

గనిన నీకు నసాధ్యంబె గణుతిసేయ
ధాత్రి శుకసప్తతి యొనర్పఁ దాడిగోళ్ల
ఘనపులకలాప కదురేంద్రుకదుర భూప
చెలఁగి వాక్ప్రౌఢిచేఁ గృతిసేయు మవని"

—శుకసప్తతి (1—77)

విద్వజ్జనముల ముఖమున కదిరీపతి స్వవృత్తాంతమును విపులముగా కృత్యవతరణికలో తెల్పియున్నాడు.

క్రీడాభిరామములోని కృత్యవతరణిక రూపకములందలి ప్రస్తావనను బోలి యున్నది. "ఏ కవీంద్రుఁడు రచియించె నీ ప్రబంధ మనుచు మీరానతిచ్చెద రైన వినుడు" అని కృతికర్త వంశవర్ణనను సూత్రధారుడు చేసినట్లుగ విపులముగ గలదు. క్రీడాభిరామ కృత్యాద్యవతరణికలో వల్లభామాత్యుని వాగ్వైభవములును,

చాటుధారా ఫణితులును, వాగ్డంబరములును ఇత్యాది కవితా స్వారస్యములే ముఖ్యముగ చెప్పబడినవి. కృతికర్త స్తవమగు ఎనిమిది పద్యములలో ఆరు పద్యములాతని కవితాశక్తిని గురించి ప్రశంసించుచున్నవి. తక్కిన రెండు అతని వితరణ గుణముల గురించియైయున్నవి. ఈ కృతికర్త స్తవము నాటక ప్రస్తావనయందు సూత్రధారుడు చెప్పినట్లుగా యూహింపవలసియున్నది. క్రీడాభిరామమునందు కృతికర్తృ వంశవర్ణన, కృతికర్తృప్రశంసకూడ విపులముగా కలవు.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో కృష్ణదేవరాయల వంశావళిని గూర్చియు, నాతని శౌర్య ప్రతాప విజయాదికములను గూర్చియు వ్రాసిన పద్యములనే, కృష్ణరాయలు తన ఆముక్తమాల్యదలో స్వవృత్తాంతమును తెలుపునపుడు కొద్దిమార్పులతో స్వీకరించియున్నాడు. ఉభయ గ్రంథములలో ఈ పద్యములు సమముగా నుండుటచేత కొందరు ఈ గ్రంథముల రెండింటిని పెద్దనయే రచించియుండునని ఊహించిరి. మరికొందరు కృష్ణదేవరాయలకు పెద్దనమీదనుండు గౌరవాతిశయ సూచకముగా ఈ పద్యముల తన గ్రంథమున నుపయోగించెనని అభిప్రాయపడిరి. కృష్ణదేవరాయలు ఆత్మస్తుతిచేసికొనుట కిష్టములేక తన ఆస్థానకవియగు పెద్దన పద్యములను తన గ్రంథములో చేర్చుకొనెనని వేరొక కొందరు తలంచిరి. ఆత్మస్తుతి కిష్టములేకపోయిన ఆశ్వాసాంత పద్యములను తానే స్వయముగా వ్రాసియుండడు కదా ! కనుక పెద్దనయందలి గౌరవాతిశయముచే మనుచరిత్రలోని పద్యముల తన గ్రంథమందు తన వంశాదికమును తెల్పు సందర్భమున చొప్పించియుండును.

నన్నయ భారతావతారికలో "తన కుల బ్రాహ్మణు ననురక్తు..." (1-9) అను పద్యమునందు తన కులగోత్ర సూత్రాదికమును, విద్యావిజ్ఞాన విశేషములను, ఆచార స్వభావములను సూచించియున్నాడు. నన్నయ రాజరాజు కులబ్రాహ్మణుడు. 'సంహితాభ్యాసు'డనునది అతని వైదిక విద్యానిష్ణాతత్వమునకును, 'అవిరళ జప హోమ తత్పరు'డనునది నైష్ఠికతకును సూచకములుగానున్నవి. నన్నయ వైదికుడైనను 'లోకజ్ఞుడు', 'మత్యమరాధిపాచార్యుడు', విపుల శబ్దశాసనుడు. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు. పాత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ముద్గల గోత్రుడు, ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు. సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్యసత్య వచనుడు. వేదోక్తములైన గుణములనే నన్నయ తన భారతావతారికలో విశదీకరించియున్నాడు. నన్నయ భారతావతారికలో తన వంశానుక్రమణికనుగూర్చి ఏమియు తెలుపలేదు.

కృతికర్తృ వంశాభివర్ణన సంప్రదాయమునకు నన్నెచోడుడే మార్గదర్శకుడు. అతడు కుమార సంభవావతారికలో తన వంశమును గూర్చియు తన్నుగూర్చియు తన గురువును గూర్చియు సంగ్రహముగా వివరించియున్నాడు. నన్నెచోడుడు తన వంశాదికమును సగరసుతులతో ప్రారంభించి, భగీరథుని పేర్కొని, రాఘవుని స్మరించి, కరికాలచోడునివరకు తెచ్చి నిలిపి తనది సూర్యవంశమనియు, కరికాల చోడుని వంశమందు తాను జన్మించినాననియు తనపేరు నన్నెచోడ జనవిభుండనియు తెలిపినాడు. కరికాలచోడునినుండి తనవరకు వంశవృక్షమును మాత్రము తెలుప లేదు. సూర్యవంశములోని ప్రసిద్ధ పురుషులను మాత్రమే స్మరించినాడు. నన్నెచోడుని తండ్రి పాకనాడిరువదియొక్కవేయిటి కధీశుడైన చోడబల్లి. తల్లి హైహ యాన్వయాంబర శశిరేఖయగు శ్రీపతి. వీరిది కాశ్యప గోత్రము. నన్నెచోడుడు ఒరయూరి కధిపతి, అలఘుపరాక్రముడు, పాత్రుడు, వివిధ యజ్ఞములచే పవిత్రీ కృత దేహుడు. కవిరాజ శిఖామణి, టెంకణాదిత్యుడు అనునవి అతని బిరుదములు. ఈతని గురువు విప్రముని పుంగవుడగు జంగమ మల్లికార్జునుడు. నన్నెచోడునికి తరువాతి కవులు కొందరు తమవంశాదికమును సంగ్రహ రచనతో తృప్తిపడక విపులముగా వర్ణించినారు.

కృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదావతారికలో తన వంశావతారమును వర్ణించుచు తుళువ వంశావిర్భావమునుగూర్చి వివరించినాడు. చంద్రుని ఒక్క సీసపద్యములో వర్ణించి చంద్రసంతతిని వివరించినాడు. తుర్వసునివంశము తుళువా న్వయ మయ్యెనని వర్ణించినాడు.

కవి తనవంశ మూలపురుషుని పేర్కొని వంశాదికమును వర్ణించుటేగాక గోత్రకర్తను పేర్కొని వర్ణించుటకూడ కలదు. వినుకొండ వల్లభామాత్యుడు క్రీడాభిరామ కృత్యవతరణికలో విశ్వామిత్రుని గోత్రకర్తగా పేర్కొనినాడు. విశ్వామిత్ర గోత్రమున జన్మించిన తన పూర్వుల వంశవృక్షమును తెల్పినాడు. పింగళి సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నమున గౌతమమునిని గోత్రకర్తగా వర్ణించినాడు. గౌతమ గోత్రమున గోకనామాత్యుని తన వంశ మూలపురుషునిగా పేర్కొనినాడు. గోకనామాత్యుడు 'పింగళి'యను గ్రామమున నివసించుటచే ఆ వంశము వారి కంద రికిని 'పింగళి'వారని వంశనామము వచ్చినదట. 'పింగళివారి పేకి' కథ యొకటి తెలుగు దేశములో వినబడుచున్నది. ఈ కథనుగూర్చి పింగళి సూరనయే ప్రభావతీ ప్రద్యుమ్నమునందు ''పేర్వెలయంగ నా ఘనుడు పింగళి గోక బుధోత్తముండు

గంధర్వి నొకర్తుఁ 'బేకి' యను దానిని దాపిగనేలె. యోగితా గుర్వనుభావుఁడై -నెరపె గోప కుమారుని ఖడ్గవర్ణనన్ బర్వపు నిండు వెన్నెలలపై నెఱిఁజూపెడు కీర్తిసంప దన్'' (1-14) అని వర్ణించినాడు. దీనివలన గోకనామాత్యుడు యోగమహత్త్వము కలవాడేగాక మహాకవి యనియు తెలియుచున్నది. పింగళి సూరనయం దీ కవితా శక్తి వంశక్రమానుగతమైనదని పైదానివలనను సూరనచేసిన వంశ చరిత్రవర్ణన వలనను నిరూఢమగుచున్నది.

అప్పకవి తన గోత్రకర్తయగు భరద్వాజ మునిని గురించి ఒక సీసపద్యము చెప్పినాడు. అప్పకవిచెప్పిన కర్తృవంశావతార పద్యములనుబట్టి (పీ. 70-83) అతడు పండిత వంశమునందు జన్మించినాడని స్పష్టమగును. 'కాకునూరు' అని తన ఇంటిపేరువచ్చుటకు కారణము అప్పకవి చెప్పినాడు (పీ. 72) అప్పకవి తాతకు తాతయైన సోమయ మధురాపురమునకుపోయి ''వేదశాస్త్ర పురాణాది వాదములను 'కాకునూరింటఁజేసిన కారణమున' కాకునూరింటి వాఁడన ఘనతగాంచె'' నని చెప్ప బడినది. కాని దాని తర్వాతి పద్యమందు అతడు 'చరికొండ సీమలో కాకునూరు అను సర్వాగ్రహారము సంపాదించినాడని' చెప్పబడినది. ఆ సోమయ 'కాకునూరి తిమ్మన సుతుండు' అని చెప్పుటచేత అతని తండ్రి నాటికే ఈ ఇంటి పేరున్న ట్లూహింపవచ్చును.

బైచరాజు వేంకటనాథుని తాతపేరు బైచ భూపాలుడు. అతని పేరునుబట్టి కవి యింటిపేరు వెలసినది. వేంకటనాథుడు తన్నుగూర్చియు, తన పాండిత్య గరిమంబును గూర్చియు ఇట్లు చెప్పినాడు:

"అసహాయ సరస కవితా రసికుఁడ వేంకట ధరావర ప్రభుఁడ గుణ
ప్రసవ ప్రకాండ మదవద్భసలాయిత విద్వదఖిల బంధువ్రజుఁడన్''

—పంచతంత్రము (1-35)

''వాణీ వరప్రసాదలబ్ధ వాగ్వైభవుండనై కృతియొనర్ప నుద్యోగించి తత్కృతి లక్ష్మికి ముఖమండనంబుగా నస్మదీయ వంశ ప్రశంస యొనర్చెద''నని అనంతా మాత్యుడు తన భోజరాజీయావతారికలో తెల్పినాడు. అనంతామాత్యుడు తన వంశ ములోని అయిదు తరములవారిని పేర్కొనెను. అతడు కౌండిన్య గోత్రుడు, ఆఱు వేల నియోగి. అనంతామాత్యుని ముత్తాత బయ్యన భారతకర్తయగు తిక్కన సోమయాజిచే 'భవ్యభారతి' అనిపించుకొన్న మేటి కవిరత్నము (చూ. భో. రా. 1-24). అతని తాత ముమ్మడన్న 'పరమ భాగవత విభాసితుడైయొప్పె'నట; అతని

తండ్రి తిక్కన కృష్ణాతీరమునందు శ్రీకాకుళమున వెలసిన ఆంధ్రమహా విష్ణువును సేవించుచు కాలము గడపిన భక్తుడు. అతనికి 'విద్వజ్జనానందమైన జీవన స్థితి', 'పెరుమగూరు' అను పురమునందుండెనట. ఆయూరు 'కృష్ణవేణి, మలాపహారిణి, భీమరథి నా ధరిత్రియందుఁ దనరు నదీ త్రయాంతర్వేది యగు పావన క్షేత్ర' మట. (భోజరాజీయము 1-40) అనంతామాత్యుడు తన తమ్ముడగు చిట్టనను 'సత్కవి'యని పేర్కొనెను.

కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశిక అవతారికలో తన కేడు తరములవారినిగూర్చి వర్ణించినాడు. గోపరాజున కేడవ పురుషుడగు వెన్నామాత్యుడు వెలనాటి పృథ్వీశ్వరుని రాజ్యభార ధురంధరుడనియు, అవక్రవిక్రమశాలియనియు, సనదవోలు (చందవోలు) నెలవుగా కలవాడనియు సింహాసన ద్వాత్రింశిక అవతారిక (1-41)లో వర్ణింపబడినది. పృథ్వీశ్వరుడు 1185 నాటికే రాజ్యమునకువచ్చినట్లు తోచుచున్నదని కొమర్రాజు వేంకట లక్ష్మణరావు శివతత్త్వసార పీఠికయందు వ్రాసినారు. క్రీ. శ. 1240 లోని వెన్నామాత్యుని కేడవ తరమువాడగు గోపరాజు 1480 ప్రాంతముదాకనుండెనని వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు సింహాసన ద్వాత్రింశిక పీఠికలో తెల్పినారు.

గోపరాజు పూర్వులు రాచకొండ రాజ్యాధిపతుల యాశ్రయ పోషణముల వర్ధిల్లినవారు. గోపరాజు పినతాత సత్తెనారన రామాయణ కృతికర్తయట. ఈ తెలుగు కృతిని రచియించిన కారణముననేమో ఈ సత్తెనారనకు ఆంధ్ర కవిపితామహుడను బిరుదము గల్గెను.

"రామాయణకృతికృతియై తా మెఱయుచు నంధ్ర కవి పితామహుఁడనఁగా
భూమిని మించిన భీమన నామంబునఁబరఁగె సత్యనారన ఘనుఁడై"
సింహాసన ద్వాత్రింశిక (1-49)

ఆంధ్ర కవి పితామహ బిరుదము పెద్దనకు పూర్వమే కొరవి సత్యనారనకు కలదని పై పద్యమునుబట్టి తెలియుచున్నది.

గోపరాజు తండ్రియగు కనుపరాజు 'రాజామల్ల నరేంద్రునకు పరమగురులై శైవాచార ప్రథమ సింహాసనాసీనులైన బ్రహ్మదేవ యొడయల కూతు కామాంబికను పరిగ్రహించి వేముగల్లు నివాసియై' యుండెననియు నిందు చెప్పబడినది.

"మదీయ వచో విశేషంబుల రఘువంశ వల్లభునిఁ బొగడ దలంచినవాఁడనై తదీయ దాస్య విహిత ప్రచారంబగు మదీయవంశ ప్రకారం బభివర్ణించెద" నని

సారంగు తమ్మయ తన పై జయంతీ విలాసావతారికలో తెల్పినాడు. సారంగు తమ్మయ భారద్వాజ సగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు. కందాల అప్పలాచార్యుల శిష్యుడు. ఈతడు మహమ్మదు శాహి గోలకొండ నేలు కాలమున గొప్ప యైశ్వర్యము ననుభవించుచు గోలకొండలో కరణీకము చేయుచుండినట్లు గ్రంథావతారిక వలన తెలియుచున్నది (1-30). మహమ్మదు శాహియను గోలకొండ నవాబు 1581—1611 నడుమ రాజ్యముచేసెను.

కొందరు కవులు తమ వంశమునుగూర్చి ప్రత్యేకముగ తెలుపకున్నను తమ తండ్రి తాతల ప్రాభవమును, వారి పాండిత్యమును, తమ కవితా సామర్థ్యాదులను తమ గ్రంథావతారికలలో విపులముగా పేర్కొనినారు. కవిపండిత వంశపు కవులు తెలుగులో ఎందరో యున్నారు.

జక్కన తాతయగు పెద్దయామాత్య సుకవి "నెల్లూరి తిరుకాళ మనుజ విభుని సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసె" (పీ. 1-20) నని చెప్పబడినది. జక్కన తండ్రియగు నన్నయకూడ కవియైనట్లు తెలియుచున్నది (పీ. 1-21). జక్కన మహత్త్వమును కవిరాజులు "జనవినుత రస ప్రసంగత కవితాఘన తేజులు" అని రాజకుంజర సభలందు కొనియాడుదురట. కనుక జక్కన పండిత వంశములో జన్మించిన వాడని తెలియుచున్నది. జక్కన తన తాత భాషా ప్రపంచమున చేయగలిగిన నానావిధ కవితావధానములును, చిత్రకవిత్వ బంధ కవిత్వాది నైపుణ్య సరణియు విశేషముగా వర్ణించినాడు (విక్రమార్కచరిత్రము, 1-20).

విద్యారాజీవభవుండు మారయ శ్రీనాథుని తండ్రి. పద్మపురాణ సంగ్రహ కళా కావ్యప్రబంధాధిపుడును, కవితా విద్యాధరుడునునగు కమల నాభామాత్యుడు శ్రీనాథుని తాత. శ్రీనాథుని ప్రతిభా పాండిత్యములు నైషధ కృత్యాదిలో మామిడి సింగనచే ననిపించిన ఈ క్రింది పద్యమున వ్యక్తమగుచున్నవి.

"బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురు ప్రజ్ఞా విశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణ చయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళా నిధానమవు నీ భాగ్యంబు సామాన్యమే?"

—శృంగార నైషధము (1-13)

కాశీ ఖండములో శ్రీనాథుడు 'కర్ణాటదేశ కటక పద్మవనహేళి'నని చెప్పికొనినాడు. శ్రీనాథుడు కర్ణాటుడను వాదమును లేవదీసి కొందరు వ్యాఖ్యానించ

జొచ్చిరి. ఇట్లే మరికొన్ని: 'కన్నడ రాజ్యలక్ష్మి' అను సంబోధనము, 'నా కవిత్వంబు నిజము కర్ణాటభాష' అనుట. కాని దీనికి ప్రతివాదములున్నవి: 1. భీమేశ్వర పురాణమును కృతినందుకొన్న బెండపూడిఅన్న మంత్రి శ్రీనాథునిగూర్చి 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు' అని చెప్పిన చట్టరికము, 2. ఈ పాకనాడు తెలుగు దేశములో 'ఏకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై ధరణిన్ బేర్చిన పాకనాడు' అనుట, 3. శ్రీనాథుని పితామహుండగు కమల నాభామాత్యుడు ఆంధ్ర పద్మపురాణ కర్తయై, ఆంధ్ర సార్వభౌముడగు ప్రతాపరుద్రుని ఆస్థానమున మన్ననలందిన వాడుగ చెప్పబడుట, 4. నాసికేతోపాఖ్యాన కర్తయు, ఆంధ్ర దేశవాసియు నగు దగ్గుపల్లి దుగ్గన కవి తన్నుగూర్చి 'కవిసార్వభౌముఁడై కర్ణాట విభుచేతఁ గనక రత్నాభిషేకములు గనిన శ్రీనాథ సుకవి' కూరిమిచేయు 'మఱఁదిని' అని చెప్పికొన్న బాంధవ్యము—వీనిచే శ్రీనాథు డాంధ్రుడనియు ఆంధ్రభాషా మహాకవి అనియు నిరూపింపవచ్చును.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని వంశముకూడ పండిత వంశమే. పినవీరభద్రునికి పూర్వమే అతని వంశము ప్రసిద్ధినొందియుండెనని జైమిని భారతావతారికలోని ఈ క్రింది పద్యములనుబట్టి తెలియును.

"తాతయుఁ దండ్రియు నగ్ర-భ్రాతయునుం దాను భువన భాసుర కృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి-ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్" 1-21

"అమృతాంశు మండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగ
జిగిరించె విలయ సింధు గత కైతవ డింభ
శయనీయ వర పలాశములతోడఁ
బితృదేవతలకు వంచిత సత్త్రిశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్ర సీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియ కళా
కోటీశునకు భోగి కుండలునకు
మఱ్ఱి మాత్రంబె పిల్లల మఱ్ఱి పేరు
పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారి లోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణ రసాయనంబు"

జైమిని భారతము (1-22)

మైరావణచరిత్ర కర్తయగు మాదయ్యకవి తండ్రి సర్వయ్య. తల్లి రాచమాంబ. అన్న మల్లన. మల్లన 'దక్షిణరాయ నృపప్రవిమలాబ్ధి రమణీయు' (1-20) డట. 'రామాయణ పఠనవ్రత నిత్యాయత ఘనయశు'డట. మాదయ్యకవి శైవ మతావలంబి. 'సర్వజ్ఞ పాదసేవక' అని కృతిపతి ఇతనిని సంబోధించినాడు. కృతిపతియగు వేజెర్ల గోపమంత్రి కృతినిర్మాణ సందర్భమున మాదయ్యకవిని గురించి చేసిన ప్రశస్తి చారిత్రాత్మకములైన కథాంశములతో కూడియుండి మాదయ్య కవియొక్క కవిత్వ విజయములను తెలుపుచున్నది :

"మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట నరనాయకుని వీర నారసింహు
దట్టించినాఁడవు తస్కర కవిరాజుఁ గోట సింగన మంత్రి కొలువులోనఁ
గాంచినాఁడవు కనకాంచనాభరణంబు లేపార నందాపురీశు చేత
నందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును కిమిడె భూమండల రమణుచేత
నవమతి స్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల
కావ్య లక్షణ లక్ష్య సాగరము నెరయ
నిన్ను వేర్వేఱ నింక వర్ణింప నేల
ప్రౌఢ వన్నింట సర్వయ మాడ సుకవి"

—మైరావణ చరిత్ర (1-18)

నందాపుర రాజ్యము ప్రస్తుతపు జయపురసంస్థానము. కమిడెరాజ్యము ప్రస్తుతము పర్లాకిమిడి సంస్థానము. ఇట్లు మాదయ్య విజయశీలముగ ఆంధ్రదేశ మంతటను శ్రీనాథునివలె సంచారము చేసినట్లు తెలియుచున్నది.

రాజగోపాల విలాసమును రచించిన చెంగల్వకాళయకవి తన తండ్రియగు వేంకటయ్య 'రణరంగ గంధవారణ'బిరుదాంకుడగు శ్రీకంఠునకు మంత్రియనియు, పార్వతీ పరిణయమను ప్రబంధమును రచించెననియు రాజగోపాల విలాసావతారికలో (1-29) తెల్పినాడు. కాళయకవి తండ్రి రచించిన పార్వతీపరిణయము అలభ్యము. కాని అతడు కవివంశములోని వాడనుట స్పష్టము. ఈతడు విజయరాఘవ నాయకుని తండ్రియగు రఘునాథనాయకుని కాలమునుండి యున్నట్లుగ గ్రంథావతారికలోని పద్యములనుబట్టి తెలియుచున్నది. కాళయకవి తన సామర్థ్యమును ఈ క్రింది పద్యమున వ్యక్తపరచినాడు :

"ఘటికాశత గ్రంథ ఘటనోత్కట నవీన పాండిత్య గరిమలు భళియనంగ
నోష్ఠ్య నిరోష్ఠ్యాదికోద్దామ రసగర్భ సందర్భ మానని సన్నుతింప

మాకంద మంజరీ మధు ఝురీ మాధుర్య రచనా విశేష మారా యనంగ
పరిహృతేతర యుక్తి భాగనూతన కథాచాతుర్య ధుర్యత సంస్తుతింప
అయ్యా దినముల రామభద్రామవారు
నేడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి
వినికి సేయుట లెల్ల మీ ఘనతఁ గాదె
కవి వినుత చర్య! చెంగల్వ కాళనార్య!"
—రాజగోపాల విలాసము (1-30)

కాళయకవి తాను చతుర్విధ కవితా విశారదుడ నని ఈ పద్యమున తెల్పి వాడు.

స్వీయవృత్తాంతమును తెల్పుటలో కొందరు కవులు ఆత్మస్తవానురక్తి కన్పరతురు. మరికొందరు వినయమును ప్రదర్శింతురు. శ్రీనాథుడు, పినవీరభద్రుడు పాండిత్యముతోపాటు ఔద్ధత్యమును ప్రకటించినారు. శ్రీనాథుడు ముదిమియందైనను వినమ్రభావమును కనుపరపగలిగెను. పినవీరభద్రుడు మాత్ర మట్టిభావ పరిణతి నెన్నడును నొందినట్లగపడదు. జైమిని భారత గ్రంథాంతమున 'కుకవి మల్లకషోల్ల నత్కులిశ హస్తపల్లవుఁడు' అని తన్నుగూర్చి చెప్పికొనెను. దీనినిబట్టి పినవీర భద్రునికి పాండిత్యముకంటె అహంభావము, నౌద్ధత్యము హెచ్చని తెలిసికొన వచ్చును.

ఆత్మస్తవానురక్తి ఆంధ్రకవులలో అనేకులకు సహజమే. తెనాలి రామ కృష్ణకవి తన్నుగూర్చి—

"నను రామకృష్ణకవిఁ గవి జన సమాశాగావళీ వసంతోత్సవసూక్తి నిధి"

నని వర్ణించుకొనెను.

విరూరి వేదాద్రి రామకృష్ణకవిని పిలిపించి అర్ఘ్యాసనమున కూర్చుండబనిచి ఇట్లు పలికినాడు :

"తగ సంస్కృతము దెనుఁగుగఁ జేయఁ దెనుఁగు సం
స్కృతముగఁ జేయంగఁ జతురమతివి
నలు దెఱంగుల నెన్నగల కావ్యధారల
ఘనుఁడ, వాశువునందుఁ గరము మేటి
వఖిల భూమీపాల కాస్థాన కమలాక
రోదయ తరుణ సూర్యోదయుఁడవు

శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ
ములు నీకుఁ గరతలామలక నిభము
లంధ్ర భూమీశచామ్రగ హారార్థమైన
శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత వగ్ర
శాఖికా కోకిలమ వీవు సరస కవిని
రమ్యగుణ కృష్ణ! రామయ రామకృష్ణ"
—పాండురంగ మాహాత్మ్యము (1-23)

"ఉదయం బస్తనగంబు సేతువు హిమ వ్యూహంబునున్ జుట్టి రా
విదితంబైన మహిన్ మహాంధ్ర కవితావిద్యాబలప్రౌఢి నీ
కెదురేరీ; సరసార్థ బోధఘటనాహేలాపరిష్కార శా
రద నీ రూపము, రామకృష్ణకవిచంద్రా! సాంద్ర కీర్తీశ్వరా!"
—పాండురంగ మాహాత్మ్యము (1-28)

రామకృష్ణకవి పాండిత్యము విరివియైనది. బహుముఖమైనది. ఈమాట అతడే పైని పేర్కొనిన పద్యములో చెప్పికొనినాడు. 'శారద నీ రూపము' అని 'మహిన్ మహాంధ్రకవితా విద్యాబల ప్రౌఢి నీ కెదురేరీ' అని వేద్రాది మాటలలో రామకృష్ణుడు తెల్పినాడు.

భాగవతమును పూర్వకవు లనువదింపక విడిచియుండుట తన పురాకృత పుణ్యముగా పోతన భావించినాడు. భాగవతమహత్త్వమునుగ్గడించుచు —

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత గన్నంత దెలియ వచ్చినంత తేటపఱతు"
—భాగవతము (1-19)

అని భాగవత మహత్త్వముతోపాటు తన వినయమును వెల్లడించెను. భాగవతమును రచించు నంతస్సారము, ఆత్మనిగ్రహము, అఖిలమానవ హితచింత పోతనకే దక్కినవనుట అతిశయోక్తి కానేరదు. మొల్ల, తరిగొండ వేంకమాంబ మున్నగువారు తమ వినయమును ప్రకటించి కావ్యరచనను చేసినారు.

వయసుమీరిన కొలది ప్రపంచమున మానవజీవితమందు మార్పులు కన బడుచున్నట్లే కవితాప్రపంచమున సైతము రచనానుభవమునుబట్టి కవికి అభిరుచులు మారుటకలదు. తొలికావ్యములో తమ్ముగూర్చి స్పష్టముగా చెప్పుకొన్న కొందరు

కవులు మరి కావ్యములలో దానిని స్వల్పముగనే చెప్పుకొన్నారు. తిక్కన తన తొలి, కృతియగు నిర్వచనోత్తర రామాయణమున తాను మహేశ్వర భక్తుఁడననియు, ఉభయ కావ్యప్రౌఢి పాటించు శిల్పమునందు పారగుఁడననియు, కళావిదుఁడననియు తెల్పినాడు. నిర్వచనోత్తర రామాయణావతారికనుబట్టి తిక్కన ఆత్మాభిమానము, రాజసగుణము వ్యక్తమగును. భారతావతారికలో తిక్కన వినయ సంపత్తి సువ్యక్తమగుచుండును. తిక్కన మహనీయతను హరిహరనాథుడు ప్రశంసించిన విధము, తిక్కన ఆత్మీయత, భేదములేని భక్తి, వినయ సౌశీల్యాదులతో కూడిన హృదయ పరిపాకము, జన్మాంతర దుఃఖములనుబాసి బ్రహ్మానందస్థితిని బొందవలయునను లాలస, వైదిక సంపత్తి-ఇత్యాది అసాధారణ గుణము లనేకములు భారతావతారికలో వ్యక్తమగుచున్నవి. 'నా నేర్చిన భంగిఁ జెప్ప వరణీయుఁడనయ్యెద భక్తకోటికిన్' అనెడి బుద్ధి పరిపక్వత కలిగిన కాలమందే తిక్కన భారతరచన కుపక్రమించినట్లు తెలియగలదు. 'నసుబోటి బాలస్వభావునకు' అని తిక్కన తెల్పినాడు.

"ఇంతకు నేర్చు నీవు నొక యింతటిలోన మదీయ వాణి న
త్యంత విభూతిఁ బెంపెసఁగునట్టి నినుం గొనియాడఁ జేత దా
నెంతటి పెద్ద నీ కరుణ యిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతర దుఃఖముల్ వొలఁగు నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే."

— విరాటపర్వము (1-21)

అని తిక్కన హరిహరనాథుని వేడెను.

నిర్వచనోత్తర రామాయణమున తిక్కన యజ్ఞప్రశంస చేయలేదు. మంత్రిత్వప్రశంస మాత్రము కలదు. భారతమున తిక్కన యజ్ఞప్రశంసను చేసినాడు కాని మంత్రిత్వప్రశంస గావింపలేదు.

నరస భూపాలీయములో తన్నుగూర్చి స్పష్టముగా చెప్పుకొన్న రామరాజభూషణుడు వసుచరిత్రలో స్వల్పముగనే చెప్పికొనెను. హరిశ్చంద్ర నలోపాఖ్యానము నాటి కా యాస్థకూడ తగ్గినది. మనస్సంతయు శ్రీరామచంద్ర చరణారవింద వందన తత్పరమైనది. రామరాజభూషణుడు తన తలిదండ్రులనుగూర్చి హరిశ్చంద్ర నలోపాఖ్యానమున "శ్రీకర మహాప్రబంధాంక తిమ్మరాయ ప్రియతనూజ ధీరసూర పాత్మజుఁడ రామనృప భూషణాఖ్యసుకవి నంకిత మొనర్తు నీ కావ్య మధికభక్తి" (హ. న. 1-48). నరస భూపాలీయములో 'ప్రబంధాంక సింగరాజసుత తిమ్మ

రాజపుత్ర ప్రసిద్ధ నరస వేంకటరాయ భూషణసుపుత్రు నను బుధ విధేయు శుభ మూర్తి నామధేయు'' (న. భూ. 1-18) అని కలదు.

రామరాజభూషణుడు చతుర్విధ కవితలు చెప్ప నేర్చినవాడు :

''శత లేఖినీ పద్య సంధాన ధౌరేయు, ఘటికాశత గ్రంథ కరణ ధుర్యు
వాశు ప్రబంధ బంధాభిజ్ఞు నోష్ఠ్య నిరోష్ఠ్యజ్ఞు నచల జిహ్వోక్తి నిపుణుఁ
దత్సమ భాషావితానజ్ఞు బహుపద్య సాధిత వ్యస్తాక్షరీ ధురీణు
నేక సంఖ్యోదిత శ్లోక భాషాకృత్య చతురు నోష్ఠ్య నిరోష్ఠ్య సంకరజ్ఞు
నమిత యమకాశుధీ ప్రబంధాంక...''

—నరసభూపాలీయము (1-13)

సంస్కృతాంధ్ర భాషలయం దసమాన పాండిత్యమేగాక ఆశుకవితాశక్తి, పద్యశస్ఫూర్తి, ధారణాశక్తి మొదలగునవన్నియు నున్ననేగాని పైనచెప్పినప్రజ్ఞలు సాధించుట సాధ్యముకాదు. రామరాజభూషణుడు సంగీతకళయం దభివివేశము కల వాడు. అందువలన ప్రబంధపఠన రచనా ధురంధరుడు. 'సంగీత రహస్య కళానిధి' అను బిరుదమును రామరాజభూషణుడు నరస భూపాలీయావతారికయందు చెప్పికొనలేదు. వసుచరిత్రములోనే చెప్పికొన్నాడు.

నరసభూపాలీయములో రామరాజభూషణునిగూర్చి కృతిపతి యిట్లు పేర్కొనినాడు :

''బాణు వేగంబును, భవభూతి సుకుమార
తయు, మాఘు శైత్యంబు దండి సమత,
యల మయూరు సువర్ణ కలన, చోరుని యర్థ
సంగ్రహమ్ము, మురారి శయ్య నేర్పు,
సోము ప్రసాదంబు, సోమయాజుల నియ
మంబు, భాస్కరుని సన్మార్గ ఘటన,
శ్రీనాథుని పద ప్రసిద్ధ ధారాశుద్ధి,
యమరేశ్వరుని సహస్ర ముఖదృష్టి,
నీక కలదటు గాన న నేక వదన
సదన సంచార భేదంబు సడలుపరచి
భారతీదేవి నీ జిహ్వఁ బాదుకొనియె
మూర్తి కవిచంద్ర ! విఖ్యాత కీర్తి సాంద్ర !''

— నరస భూపాలీయము (1-15)

అళియరామరాయలను 'బహు సంస్కృతాంధ్ర కృతులన్ బల్మాఱు మెప్పించి తత్కారుణ్యంబున రత్నహార హయ వేదండాగ్రహారాది సత్కారంబంది' (వసు. 1-17) నట్లు వసుచరిత్రవలన తెలియుచున్నది. ఈ గ్రంథములు మనకు లభించుట లేదు. 'సంజనితైకైకదిన ప్రబంధ ఘటనాసద్యశ్శ్రుత గ్రంథకల్పను' అని రామరాజ భూషణుడు తన్నుగూర్చి తెల్పినాడు (వసు. 1-16).

ఇట్లు కవిగోత్ర సూత్ర వంశాదికమును గూర్చిన విశేషాంశములు కావ్యావతారికనుబట్టి తెలిసికొనవచ్చును. కవి జీవితచరిత్ర, కవివ్యక్తిత్వము తెలిసికొనుటకు మనకు కావ్యావతారికలు శరణ్యములని నిరూపించితిమి.

# 12

# కృతిపతి వంశ గుణాదివర్ణన

కృతిపతి వంశగుణాదివర్ణనమును కన్నడ కవులు వారి కావ్యముల తుది భాగమున రచించినారు. తెలుగు కవులుమాత్రము కావ్యాదిని వర్ణించియున్నారు. సాధారణముగా కృతిపతి వంశావతారము కావ్యావతారికలందు కథా ప్రారంభమునకు ముందు చెప్పబడును. అటుతరువాత కృతిపతిని గూర్చిన షష్ఠ్యంత పద్యరచన యుండును. ప్రబోధ చంద్రోదయమువంటి ఒకటి రెండు కావ్యములందు తప్ప ఈ పద్ధతి తెలుగు కావ్యావతారిక లందంతటను పాటింపబడినది. ప్రబోధ చంద్రోదయములో కావ్యాదిని ఆశీర్వచనమయిన పిమ్మట కృతిపతి వంశవర్ణన కలదు. కావ్యావతారికలోని సుకవిస్తుతి, కుకవి నింద ఇత్యాది అంశములు అటుపిమ్మటనే చెప్పబడినవి. నిర్వచనోత్తర రామాయణము, హరివంశము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, వరాహపురాణము, బాలభాగవతము, సౌగంధిక ప్రసవాపహరణము మున్నగు కావ్యావతారికలందు కృతిపతిని వర్ణించిన సందర్భమున చారిత్రక విశేషము లెన్నియో వ్యక్తమగుచున్నవి. ఈ కావ్యావతారికలలోని చారిత్రకాంశములు ప్రత్యేకముగ ముందు వివరింపబడును.

"కథా ప్రారంభమునకు మంగళాచారముగా కృతినాయకుని వంశావతారమును వర్ణింతు''నని, "ప్రబంధమునకు ముఖాకల్పంబుగా కృతిపతి వంశమును ప్రశంసింతు''నని, "అభ్యుదయంబునకుం గల్యాణాచారంబుగా కృతిపతి వంశావతారమును వర్ణింతు''నని పెక్కు విధముల కృత్యాదిని పేర్కొని కవులు కృతిపతి

వంశగుణాది వర్ణనచేయుట పరిపాటియైనది. దీనినిబట్టి కృతిపతి వంశాదికమున కెంతటి ప్రాధాన్యమిచ్చి కవులు రచించెడివారో వ్యక్తమగును. సామాన్యముగా కృతిపతులు రాజులో రాజసంబంధికులో కాబట్టి ఈ కృతిపతి వంశగుణాది వర్ణన వారి ప్రశస్తికి హేతువుగా భావించెడివారు. ఆయా కవులు తమ ప్రభువులను తృప్తి పరచి వారి మెప్పును బడయగోరి కృత్యాదిని కృతిపతి వంశవర్ణనాభినివేశముతో మనోహరములగు పద్యములను రచించినారు.

## కృతిపతి గుణవర్ణన :

కొందరు కవులు తమ కావ్యావతారికలందు కృతిపతి వంశవర్ణనను చేయక అతని గుణగణములను మాత్రము అతిశయోక్తులతో వర్ణించుట కలదు. మరి కొందరు కవులు తమ కావ్యములను తమ ప్రభువులకు కృతి యీయకున్నను వారి గుణగణములను కావ్యావతారికలందు తెలిపియున్నారు.

నన్నయ తన భారతమును రాజరాజ నరేంద్రున కంకితము చేయలేదని పూర్వ ప్రకరణములో గ్రహించియుంటిమి. అయినను నన్నయ తన భారతావతారికలో మంగళశ్లోకము తరువాత రాజరాజు పరాక్రమమును, కీర్తిని, కాంతిని, రూపమును, అభిజాత్యమును, ధర్మమార్గ తత్పరతను, దాన దయా విలాసములను, వర్ణాశ్రమధర్మ బ్రాహ్మణ జనరక్షణ పరాయణతను, విద్యాపోషకత్వమును, వైశద్యమును, భారత శ్రవణాసక్తిని వివిధరీతుల వర్ణించినాడు. రాజరాజు ఉత్తమ చాళుక్యుడని, విమలాదిత్య తనూజుడని, చంద్రవంశోద్భవుడని నన్నయ భారతావతారికలో తెల్పియున్నాడు. నన్నెచోడుడు కుమారసంభవావతారికలో కృతిపతియగు అమృతాంశుభూషణావతారంబైన విలసిల్లు జంగమ మల్లికార్జున దేవుని భక్తితో పలు విధముల కీర్తించినాడు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు జైమిని భారత కృతిపతియగు సాళువ నృసింహరాయల వంశావతారమును తెల్పుచు కృతిపతిని "భారతవంశమండనుడు పాండవ గాండీవ ముక్తబాణ సంభారతత ప్రభావ నుతిపారగుడు" (జై. భా. 1-13 అని నుతించినాడు. ఇట్లు కావ్యాదిని నరసింగరాయలను అర్జునునితో పోల్చి చివరకు శ్రీ కృష్ణావతార పురుషునిగా వర్ణించి యున్నాడు. చూడుడు:

> "ఆ సమయంబున ధర్మజ నే సోమ కులంబునను జనించి కుటిలులన్
> శాసించి ధరణి పాలనఁజేసెదఁ దగ సాళ్వ నారసింహుండ నగుచున్"
>
> — జైమిని భారతము (8-214)

దూబగుంట నారాయణకవి తన పంచతంత్ర అవతారికలో కృతిపతియగు బసవరాజును గూర్చి వర్ణించు సందర్భమున అతిశయోక్తులతో వర్ణించియున్నాడు. చారిత్ర విశేషము లేవియు అందు కానరావు. విజయవిలాసావతారికలో చేమకూర వేంకటకవి ఇష్టదేవతా ప్రార్థన పూర్వకముగా కృతిపతికి ఆశీస్సు లొసంగిన తరువాత వంశావతారమును తెల్పినాడు. కృతిపతియగు రఘునాథయకుని అనంతశోభన గుణముల కొన్నిటిని కవి అభివర్ణించి యున్నాడు. రఘునాథనాయకుని అభినవ భోజరాజని, చతుష్షష్టి విద్యాప్రవీణుడని, సభాపసుకవితాభోజుడని, భరతశాస్త్ర ప్రౌఢమార్గైక లాస్యరసాస్వాదన కోవిదుడని, అతులాగమశాస్త్ర నిరస్త సురేజ్యుడని చేమకూర వేంకటకవి కొనియాడినాడు. "సమర నిశ్శంక రఘునాథ సాహసాంక" అను మకుటముతో ఏడు సీసపద్యములను కవి అవతారికలో వ్రాసినాడు. దీనినిబట్టి కవికి కృతిపతియెడగల భక్తి ప్రపత్తులు వెల్లడి యగుచున్నవి.

తమ ఇష్టదైవమునకు కృతులను అంకితమిచ్చిన కవులును ఇట్లే కృతిపతిని భక్తితో పెక్కు పద్యములలో స్మరించుట కలదు. సంకుసాల నృసింహకవి తన కవికర్ణ రసాయనావతారికలో కృతిపతియగు శ్రీ రంగనాథుని దివ్యావతార క్రమమును కృతి ముఖాలంకారముగా 74 గద్య పద్యములలో వర్ణించినాడు. రాజవాహన విజయావతారికలో కాకమానిమూర్తికవి కృతిపతియగు శ్రీ వేంకటేశ్వరుని సుమారు పదునారు పద్యములలో భక్తితో స్తుతించినాడు. తరిగొండ వేంకమాంబ తన వేంకటాచల మాహాత్మ్యావతారికలో కృతిపతియగు వేంకటేశ్వరుని పురమును ఏడు పద్యములలో తనివితీర వర్ణించినది.

## కృతిపతి వంశాభివర్ణన :

కృతిపతి వంశాభివర్ణనమును కొందరు కవులు కడు సంగ్రహముగా ఆ వంశములోని ప్రసిద్ధ పురుషులను మాత్రమే పేర్కొని చెప్పినారు. మరికొందరు సంగ్రహముగాగాక విపులముగా తనివితీర వర్ణించినారు. విష్ణువో, సూర్యుడో, చంద్రుడో మూలవంశ పురుషులుగా పేర్కొని వారినుండి ప్రారంభించి కృతిపతి వరకు విపులముగా మరికొందరు కవులు తమ కావ్యావతారికలందు అభివర్ణించినారు.

తిక్కన కృతిపతియగు మనుమసిద్ధి వంశవర్ణనాదికమును నిర్వచనోత్తర రామాయణావతారికలో,

"ఈ కృతికిఁ దొడ్డవుగా నమ_రాకృతి యగు మనుమ నరివరా గ్రేసరు స
త్యాకృతి వంశము గాథ_స్వీకృతి దగఁ గీర్తనంబు సేయుదు నలమిన్"
—నిర్వచనోత్తర రామాయణము (1-17)

అని తెల్పినాడు. మనుమసిద్ధి వంశవృక్షమును తిక్కన విష్ణువునుండి వర్ణించినాడు. విష్ణువువలన బ్రహ్మ, అతనికి మరీచి, అతనికి కశ్యపుడు, అతనికి సూర్యుడు, అతనికి మనువు, అతనికి ఇక్ష్వాకుడు, అతనికి రఘువు, అతని కులమున శ్రీరామనృపతి, అతని వంశమున కలికాల చోడుడు, అతని వంశమున బిజ్జన—ఇత్యాదిగ మనుమసిద్ధి వంశవృక్షమును తిక్కన అభివర్ణించినాడు. మనుమసిద్ధి సూర్యవంశ క్షత్రియుడని, కావేరినదికి ఆనకట్టకట్టించిన ప్రఖ్యాతుడగు కలికాల చోడుని వంశమునకు చెందినవాడని, తిక్కన తెల్పినాడు. మనుమసిద్ధి తండ్రియగు తిక్కనృపతి చోళ స్థాపనాచార్యుడు కర్ణాట సోమేశుని గర్వమణచినవాడు. ఇక మనుమసిద్ధి విద్వజ్జనుల పోషించెనని, అతడు ధర్మాద్వైత మూర్తియని, పరయోషిద్వర్గ స్మరుడని తిక్కన తన నిర్వచనోత్తర రామాయణావతారికలో తెల్పినాడు.

'రామరాజీయములో' అందుగుల వెంకయ్య రామరాజు వంశావళిని విష్ణువు నుండి ప్రారంభించి విపులముగా సుమారు 430 పద్యములలో వర్ణించియున్నాడు. వెంకయ్య రామరాజు ఆస్థానకవి. 'మదీయ వంశకర్తల చర్యల్ భూవలయంబున వ్యాసవచో విరచిత లీల సర్వశుభకరమగుచున్' (1-21) "పూర్వకవీంద్రుల్, మా వంశజులగు రాజుల నే విధమునఁ జెప్పినారో యితర కృతులలోన్" ఆవిధమును తెలిసి సంక్షేపముగా కృతిరూపముగా వినవలెనని రామరాజు వెంకయ్యను కోరినాడు. వెంకయ్యయు రామరాజు వంశమును విష్ణువునుండి ప్రారంభించియున్నాడు. విష్ణువువలన బ్రహ్మ, అతనినుండి అత్రి, అతనినుండి చంద్రుడు ఇత్యాదిగ భరతునివరకు చెప్పి, అతనికి 83 తరముల వాడగు అర్జున కుమారుడగు నందుని, అతనికి తొమ్మితి తరములవాడగు చాళుక్యుని వర్ణించినాడు. అతనినుండి కళ్యాణ బిజ్జలుడు, అతని పౌత్రుడు వీరహేమ్మళిరాయుడు, అతనికి తాత పిన్న, అతని తరువాత సోమదేవుడు, రాఘవదేవుడు, పిన్నశౌరి, బుక్కరాజులను వర్ణించినాడు. ఈ బుక్కరాజునుండి రామరాజువరకు వంశవృక్షమును వివరించినాడు.

కాళయకవి తన రాజగోపాల విలాసావతారికలో శ్రీహరి పాదపద్మమున నాల్గవజాతి ప్రభవించెనని ఆ జాతిలో కొందరు రాజచంద్రు లుదయించిరని వారిలో

ప్రఖ్యాత పురుషులను కొందరిని పేర్కొని కృతిపతియగు విజయరాఘవనాయకుని వంశావతారమును వర్ణించినాడు. విజయరాఘవ నాయకుని పూర్వులసంగతి సంగ్రహముగను తక్కిన కృతిభర్త సంగతి సవిస్తరముగను కాళయకవి సుమారు ఏబది పద్యములలో వివరించియున్నాడు. ఈ విభాగము 'విజయరాఘవ వంశావళి' అని పేరుచేసి ప్రకటింపబడినది. విజయరాఘవ నాయకుడు 'విజయరాఘవ విలాసం బున' విద్యాగోష్ఠి నున్నపుడు అతని కాలికి "సాహిత్యరాయ పెండేరము" అను బిరుదందెను ధరించెడివాడు. ఈ పెండేరమున అతడు జయించిన రాజులు బొమ్మలై వ్రేలుచుండిరి. అతని మ్రోల 'శారదాధ్వజము' నొప్పుచుండును. అతని కవితాచాతుర్యమును ఈ శారదా ధ్వజము చాటుచుండును. అతని సాహిత్యగోష్ఠిలో 'పాండ్య మండల విభాళా'యంచు కైవారములు సలుపు పడతులుండెడివారు (1-20). అతని సభలో నాట్యకత్తెలు, పాటకత్తెలు తమ నాట్య కళా నైపుణ్యమును, గానాభిరతిని ప్రపంచించెడివారు (1-24). విజయరాఘవ నాయకుని సభలో పెక్కురు కవులు వెలసినట్లు కవి చెప్పినను మహా ప్రసిద్ధిగాంచిన రంగాజమ్మ ఈ గ్రంథమున పేర్కొనబడలేదు. ఇందు విజయరాఘవుని సాహిత్య విద్యావైభవము వర్ణితమైనను అసంఖ్యాకములైన యాతని గ్రంథము లేవియు ఉదాహృతములు కాలేదు.

కృతిపతి వంశవర్ణనా సందర్భమున చంద్రునో, సూర్యునో వంశమూల పురుషులుగ పేర్కొని వర్ణించిన కవులు కొందరు కలరు.

అల్లసాని పెద్దన మనుచరిత్రావతారికలో కృతిపతియగు కృష్ణదేవరాయల వంశావతారమును వర్ణించుచు వంశమూల పురుషుడగు చంద్రుని ఒక సీసపద్యములో వర్ణించి చంద్రసంతతిని వివరించినాడు. తుర్వసునివంశము తుళువాన్వయ మయ్యెనని తుళువ వంశావిర్భావమునుగూర్చి తెల్పినాడు. ముక్కుతిమ్మన తన పారిజాతాపహరణావతారికలో కూడ కృష్ణదేవరాయల వంశవృక్షమును చంద్రునినుండి వర్ణించినాడు. కృతిపతి వంశానుక్రమణికను, కృతినాయకుని వర్ణనమును పెద్దన, తిమ్మన లిర్వురును తమ కావ్యావతారికలందు కడు సంగ్రహముగను, హృద్యముగను చేసియున్నారు. కృతిపతి వంశమున ప్రసిద్ధులగు ఈశ్వర నృపతిని, నరస భూవిభుని వారు చూపిన బలపరాక్రమములను కడు సమంజసముగ వర్ణించినారు. కృష్ణదేవరాయలు కవితాప్రజ్ఞ కలవాడని పెద్దనగాని రాయలు స్వయముగాగాని చెప్పి యుండలేదు. ఈ విషయము తిమ్మన పారిజాతాపహరణము మూలముననే మనకు తెలియుచున్నది. "కవితా ప్రావీణ్యఫణీశా" అని కృష్ణరాయని వర్ణించుటచే ఈవిష

యము వ్యక్తమగుచున్నది. కృష్ణదేవరాయల విద్వత్సభలనుగురించి కవి సంభావనోత్సవములను గురించికూడ తిమ్మన కవి స్పష్టపరిచినాడు :

"ప్రతి వర్ష వసంతోత్సవ కుతుకాగత సుకవి నికర గుంభిత కావ్య
స్మృతి గోమాంచ విశంకిత చతురాంతఃపుర వధూ ప్రసాదన రసికా"

— పారిజాతాపహరణము (1-139)

అని వర్ణించుటచే రాయలకు గల అపారకావ్యగోష్ఠీ కౌతూహలము, విద్వజ్జన పరితోషణోత్సాహము తెలియుచున్నది. కృతిపతి వర్ణనములలో ననేకచోట్ల శ్రీకృష్ణదేవరాయలను శ్రీకృష్ణునితో సరిపోల్చి యాకృష్ణుడే ఈకృష్ణుడుగా అవతరించినాడని తిమ్మన కవి కల్పించినాడు (పా. 1-17), ఇట్టి భావనా సమాధానము ఆంధ్ర కవులలోనేగాక తత్కాలమందలి కన్నడ కవులలోకూడ కాననగును.

రామరాజభూషణుడు వసుచరిత్రావతారికలో కృతిపతియగు తిరుమలరాయల వంశమునకు మూలపురుషుడు చంద్రుడని వర్ణించినాడు. చంద్రునినుండి తిరుమలరాయల వంశవృక్షమును నిర్మించినాడు. ఈ సందర్భమున పెక్కుపద్యములలో విపులముగా చంద్రసంతతిని కవి వర్ణించినాడు. పింగళి సూరనకూడ తన కళాపూర్ణోదయ కృతిపతియగు నంద్యాల కృష్ణమరాజు వంశవృక్షమును చంద్రునినుండి వర్ణించినాడు. ఇందు పురాణపురుషులను నామమాత్రముగనే పేర్కొని ఆరవీటి బుక్కరాజునుండి వంశవృక్షమును సమగ్రముగా వివరించినాడు.

భట్టుమూర్తి నరసభూపాలీయావతారికలో కృతిపతియగు నరసరాజు వంశావతారమును వర్ణించు సందర్భమున సూర్యునినుండి సుమారు 55 తరముల వారిని వర్ణించినాడు. ఇంతమంది పురాణపురుషులను వంశ మూలపురుషులుగ స్మరించిన కవులు తెలుగులో భట్టుమూర్తితప్ప మరొకరు కానరారు. పురాణపురుషులను వంశ మూలపురుషులుగా చెప్పి రచించుట ప్రబంధ యుగమునందు వెలసిన కావ్యములలో మిక్కుటముగా గోచరించును. నరస భూపాలీయావతారికలో కృతిపతి వంశావతారము మాత్రమేగాక కృతిపతి తల్లివంశావతారమునుగూడ విపులముగా కవి వర్ణించినాడు. అయ్యలరాజు రామభద్రకవికూడ తన రామాభ్యుదయావతారికలో కృతిపతియగు గొబ్బూరి నృసింహరాజు సూర్యవంశ క్షత్రియుడని తెల్పుచు సూర్యుడు, ఇక్ష్వాకుడు, దశరథుడు, శ్రీరాముడు, కరికాలచోడుడు మున్నగు సూర్యవంశ క్షత్రియులను స్మరించి కృతిపతి వంశమును వివరముగా తెల్పినాడు. ఇందు కృతిపతి వంశముతోపాటు కృతిపతి తల్లి వంశవృక్షముగూడ వివరింపబడినది.

భరద్వాజునో, కాశ్యపునో, శాండిల్యునో, కౌశికునో, కౌండిన్యునో, అత్రినో గోత్రకర్తలుగా పేర్కొని కృతిపతి వంశావతారమును వర్ణించుట కొన్ని కావ్యావతారికలందు కలదు.

నైషధ కావ్య ప్రారంభమునకు మంగళాచారంబుగా కృతిపతి వంశావతారమును వర్ణించుచు శ్రీనాథుడు కృతిపతి గోత్రకర్తయగు భరద్వాజమునిని వర్ణించినాడు. భారద్వాజమునినుండి కృతిపతివరకు వంశవృక్షమును పేర్కొనెను. సింగన విభవము రాజవిభవముగా శ్రీనాథుడు వర్ణించినాడు. అతడు పెదకోమటి వేమ భూపాలుని కరుణాపాత్రుడు. 'వినయ వివేక సాహిత్య' అని శ్రీనాథు డతని నంబోధించినాడు.

నాసికేతోపాఖ్యానమును కృతిగొన్న చెందలూరి గంగయమంత్రి కాశ్యప గోత్రుడు. కాశ్యపగోత్రమును, కాశ్యప గోత్రములవారిని దగ్గుపల్లి దుగ్గన పెక్కురీతుల వర్ణించినాడు. గంగనామాత్యుడు నాసికేతోపాఖ్యానమునేగాక ప్రబోధచంద్రోదయమును గూడ కృతిగాకొన్నాడు. రెండు గ్రంథములందును ఒకేవిధముగ అతని వంశావతారము వర్ణింపబడినది. గంగనామాత్యుడు మాధవవర్మ వంశజుడైన బసవ రాజునొద్ద నమాత్యపదవి నలంకరించి యుండెను. ఈ బసవరాజు ఉదయగిరి రాజ్యము నేలుచు కళింగాధీశ్వరులైన గజపతులకు సామంతుడై యుండి వారి గడి దుర్గములకు రక్షకుడుగా నుండెను (నాసికేతోపాఖ్యానము 1-72). గంగనమంత్రి వంశస్థులు శివభక్తులు. గంగనమంత్రి శైవారాధన తత్పరత యిట్లు వర్ణింపబడినది :

"శివచింతా మయ మంతరంగము, శివ శ్రీపాద పద్మార్చనా
ప్రవణంబుల్ కరపంకజంబులు, శివాపాది ప్రసిద్ధాగమ
శ్రవణోదీర్ణము కర్ణ యుగ్మము, శివ ప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞ రసజ్ఞ-యిమ్మహి ననంతామాత్యు గంగయ్యకున్"

—నాసికేతోపాఖ్యానము (1-74)

శంకరకవి తన హరిశ్చంద్రోపాఖ్యాన కృతిపతియగు ఈదూరి ఎల్లయామాత్యుని గోత్రకర్తగా శాండిల్యమునిని పేర్కొనెను. "చతురవచోరచనాతిప్రతిభాసుర కవిత్వ తత్వ పారీణు"డగు ఈదూరి ఎల్లనామాత్యునికి కుతుబ్‌షా వంశమును స్థాపించిన సుల్తాన్‌కులీ "కోర్కొలను" గ్రామముపై అధికారము నిచ్చినాడు.

సుల్తాన్‌కులీకి, ఈడూరి ఎల్లనకు గల సంబంధమును ఈ క్రింది పద్యమున శంకరకవి తెల్పియున్నాడు :

"అలఘు ప్రతాప కుతుబను మల కేంద్రకృపా సమగ్ర మహిమాన్విత కో
న్కొలని గ్రామ నికేతన జలసీమారత్ను నైక చాతుర్యనిధీ"
—హరిశ్చంద్రోపాఖ్యానము (5-242)

మాదయగారి మల్లన తన రాజశేఖరచరిత్ర కృతిపతియగు నాదిండ్ల అప్పామాత్యుడు కౌశిక వంశమున ప్రభవించెనని వర్ణించినాడు. నాదిండ్ల అప్పామాత్యుడు మంత్రియు, దండనాథుడును. అతడు తిమ్మరుసు మంత్రికూతురు తిరుమలాంబను వివాహమాడిన ట్లీ క్రింది పద్యమున తెలుపబడినది :

"అమ్మహామంత్రి కతని యర్ధాంగలక్ష్మి సకల పుణ్యాంగనా జన శ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి లలిని మెఱయు తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె"
—రాజశేఖర చరిత్రము (1-34)

ఉద్భటారాధ్య చరిత్రము ఊచదేచ మంత్రికి అంకితము. ఈ దేచమంత్రి కొండవీడు దుర్గాధ్యక్షుడగు నాదిండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగి. దేచమంత్రి గోత్రకర్త కౌండిన్యుడని కవి తెల్పినాడు. కౌండిన్య గోత్రమున ప్రభవించిన కృతిపతి వంశము వివరింపబడినది.

సుదక్షిణా పరిణయావతారికలో తెనాలి అన్నయ కృతపతియగు పులిజాల సోమామాత్యుని వంశావతార వర్ణనా సందర్భమున గోత్రకర్తయగు కశ్యపుని స్తుతించియున్నాడు.

శశాంక విజయమునకు కృతిపతియగు సీనయామాత్యుని గోత్రకర్తయగు అత్రిముని స్తుతింపబడినాడు.

ఇట్లు గోత్రకర్తలను స్తుతించి కృతిపతి వంశావతారమును వర్ణించుట తెలుగు కావ్యావతారికలందు పెక్కింట కలదని పై పరిశీలనమువలన తెలియుచున్నది.

వంశకర్తను పేర్కొని కృతిపతి వంశములోని ప్రఖ్యాత పురుషులను గురించి వివరించుట కొన్ని కావ్యావతారికలందు కలదు. కొందరు కవులు కృతిపతి వంశ మేర్పడుటకుగల కారణములనుగూడ వివరించుటకలదు.

శ్రీనాథుడు భీమేశ్వర పురాణావతారికలో కృతిపతియైన బెండపూడి అన్నమంత్రి వంశములోని వారి కార్యఖడ్గ నిపుణతను, సాహసౌదార్యములను, ధర్మనిరతిని పేర్కొనినాడు. ఈ వంశములో ప్రోలయ అన్నమంత్రి కొలను ప్రతాపరుద్రునిచేత 'అరేడు' అను గ్రామము నగ్రహారముగా బడసినాడు. కనుకనే ఈ వంశమున ప్రోలయ అన్నమంత్రి తరువాత అరేటివారను పేరేర్పడెను.

"కొలను ప్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేఁడు సారణీ
సలిల వివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకర గ్రహణవేళఁ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్న విభుతో సరి యెట్లు ప్రధానులెవ్వరున్"

—భీమేశ్వరపురాణము (1-50)

అన్నమంత్రి అన్నయైన లింగనమంత్రి అల్లాడరెడ్డికి చేదోడువాదోడుగ నుండీ యాతని సాంగ్రామిక కార్యములను సరిదిద్దు చుండెడివాడట!

"ఝూడేశవన సప్తమాడె బారుహదొంతి సంతునాది క్షితీశ్వరులఁ గెలిచి
యొడ్డాది మత్స్య వంశోదయార్జును చేతఁ బల్లవాధిపుచేతఁ బలచముంది
దండకారణ్య మధ్య పుళింద రాజ రింభాహివంశజులకు నభయ మొసఁగి
భానుమత్కుల వీరభద్రాన్నదేవేంద్ర గర్వ సంరంభంబు గట్టిపెట్టి
యావన కర్ణాట కటక భూధవులతోడ
బలిమి వాదించి యేలించెఁ దెలుఁగు భూమిఁ
దన నిజ స్వామి నల్లాడ ధరణినాథు
ఘళిగె యరియేటి లింగన ప్రభువరుండు"

—భీమేశ్వర పురాణము (1-63)

ఈ లింగనమంత్రిని నవీన రుక్మాంగదునిగా శ్రీనాథుడు వర్ణించినాడు.

అన్నమంత్రి శక్తి యుక్తులను దాతృత్వమును శ్రీనాథుడు వర్ణించినాడు. అన్నమంత్రి వివిధ భాషలను చదువ వ్రాయ నేర్చినవాడు. వేమ వీరభద్రారెడ్లకు మహామాత్యుడై కార్యఖడ్గధురీణుడై నెగడినవాడు. అన్నమంత్రి శివభక్తి తత్పరతను, ధార్మిక కృత్యములను శ్రీనాథుడు వివరించినాడు (భీమే. 1-75). రాజమహేంద్రవర దుర్గములో నుండిన వీరభద్రేశ్వరునకు ప్రాకారము గట్టించెను. మార్కండేయ శివుని కెదురుగ తమతల్లిపేర రామేశుని నిలిపెనట! సంగమేశ్వర దివ్య శంభులింగమునకు కల్యాణమండపము గట్టించెనట. దక్షారామ భీమేశ్వరాలయ

మున భీమేశ్వరున కెదురుగ తిరుచుట్టు మాలెకు మీదు భాగమున విశాలమయిన మండపమును నిర్మింపజేసినాడట. దక్షారామ భీమేశ్వరాలయమునందలి తూర్పు దిక్కున నిర్మింపబడిన ప్రాకార గోపురమునకు సప్త గోదావరము మెట్లకు నడుమ నొక పంద్రెండు స్తంభములుగల మండపమును నిర్మించినాడు. వీనినిబట్టి అన్న మంత్రి ఈశ్వరభక్తి తత్పరత వ్యక్తమగుచున్నది. కృతిపతి మనస్తత్త్వమును గుర్తించి శ్రీనాథుడు అతనికి అభిమతమైన విషయములను గ్రంథస్థము చేసినాడు.

శ్రీనాథుడు అన్నమంత్రిని 'లావణ్యరూప సంపదఁ బూవిలుకానినిఁ జేసి. పంచారామవధూటీ పంచాస్త్ర విహారకేళి పాంచాలుని' గావించియున్నాడు. తన్మూలముగ దక్షారామ వేశ్యావిభవమును విశేషముగ వర్ణించి, వారిచే అన్నమంత్రి గట్టించిన మొగసాలవాకిట మహోత్సవ మండపమున నాట్య భంగిమలు ప్రదర్శింప జేసినాడు.

నందిమల్లయ ఘంట సింగనలు తమ వరాహ పురాణావతారికలో కృతిపతి యగు తుళువ నరసరాయల వంశావతారమును వర్ణించినారు. తుళువదేశ పరిపాలకులగుటచే ఈ వంశమువారు తుళువ వంశస్థులని పేర్కొనబడిరి.

"మిన్నుల మోచి భాగ్యముల మీఱిన కోటల రమ్యహర్మ్య సం
పన్నత సత్యవాట గరిమంబులఁ దోఁటల వాహ వారణా
భ్యున్నతిఁ గేలి దీర్ఘికల నుగ్రభటావలి వన్నె కెక్కి వా
రాన్నిధి కాంచిపైఁ దుళువరాజ్యము సంతత వీర భోజ్యమై"

—వరాహ పురాణము (1-25)

"ఆ తుళువరాజ్యమున విఖ్యాతి వహించిరి దిగంత కరికట తట సం
భూత మదక్షాళన విద్యా తత్పర కీర్తిఁ బెండ్లియాడిన రాజుల్" 1-26

అను పద్యములనుబట్టి ఈ విషయము స్పష్టమగుచున్నది.

దశకుమార చరిత్రలో కేతన కృతిపతియగు తిక్కన వంశావతారమును వర్ణించుచు ఆ వంశములోని ప్రఖ్యాత పురుషుల చరిత్రను వర్ణించినాడు. కొట్టరువు మాచెనమంత్రి తిక్కన వంశమునకు మూలపురుషుడు. ఇతడు త్యాగవ్రతశీలుడు. అమలినాచారుడు. ఆగమకోవిదుడు. తిక్కన పూర్వులగు వారి గుణగణములు, దాతృతా సౌందర్యములు, విద్యా వివేకములు, పండితానురక్తి మొదలగు గుణములను కేతన విపులముగా వర్ణించినాడు. దశకుమార చరిత్ర కృత్యాదివలన తిక్కన సోమయాజి ప్రతిభ, రాజనీతి, త్యాగగుణము, కార్యదక్షత, వివిధ విద్యానైపుణ్యము స్పష్టముగా తెలియుచున్నవి.

మంచన కేయూరబాహు చరిత్రలో కృతిపతియగు నందూరి గుండమంత్రిని గూర్చియు అతని పూర్వులను గూర్చియు అనేక విషయములను తెలిపినాడు. నందూరి వంశమువారు ధనదపుర నివాసులై పేరుగాంచిరి. గుండమంత్రి వంశమున వర్ణింపబడిన పూర్వులు వెలనాటి చోడులకడ మంత్రులుగ నుండిరి. గుండయామాత్యుని పూర్వుల సాచివ్యము వెలనాటి రాజులలో పృథ్వీశ్వరుని తోడనే అంతరించినట్లు కేయూరబాహు చరిత్రమువలన తెలియుచున్నది. గుండయ సోదరులలో రెండవవాడగు కేతనమంత్రి 'విఖ్యాత కవిత్వసంపదల బొగడ్తకు నెక్కె' అని ప్రశంసింప బడినాడు. అతడు రచించిన గ్రంథము లేవియో మంచన తెలుపలేదు.

విన్నకోటపెద్దన కావ్యాలంకార చూడామణిలో కృతిపతియైన విశ్వేశ్వర భూపతి వంశవృక్షమును 'శ్రీ కంఠచూడాగ్ర....' అను సీసపద్యమున వర్ణించినాడు. విష్ణువర్ధనుడు, చాళుక్యభీముడు, రాజనరేంద్రుడు, ఉపేంద్రుడు అని వంశములోని ప్రధానపురుషులను మాత్రమే పేర్కొనుటచే విశ్వేశ్వరభూపతి పూర్తి వంశవృక్షము తెలియుటలేదు. విన్నకోట పెద్దన తన ప్రభువునకు తన కావ్యాలంకార చూడామణిని అంకితమిచ్చుచు ప్రతాపరుద్రీయమువలెనే అన్నిటికిని ప్రభువునే విషయముగా చేసి లక్ష్యములను వ్రాసి "విద్యావిధిగా వినిపించినాడు". పెద్దన తన శాస్త్రగ్రంథమును 'పూర్వకల్పిత శాస్త్రానుగతియైన' స్వతంత్ర రచనయైనట్లు వ్యవహరించినాడు. ప్రతాపరుద్రయశోభూషణమునందు ప్రతాపరుద్రుడు లక్ష్యమైనట్లే నరసభూపాలీయమునందు కొలగంటి నరసరాజు లక్ష్యముగా భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహమును రచించినాడు.

సత్యభామా సాంత్వనమునకు కృతిపతి పాండ్య దేశాధీశ్వరుడగు ముద్దళగిరి క్ష్మాపాలుడు. సత్యభామా సాంత్వనమున కవి తొమ్మిది తరములనుండి కృతిపతి వంశమును చక్కగా వర్ణించినాడు. కృష్ణదేవరాయల కాలమున పాండ్య రాజ్యమునకు విశ్వనాథనాయకుడు రాజప్రతినిధిగా పంపబడెను. అచ్యుత దేవరాయలు అతనిని పాండ్య రాజ్యాధీశ్వరునిగా చేసెను. ముద్దళగిరి చొక్కనాథనాయకుని సవతితల్లియగు లింగాంబ కుమారుడని సత్యభామా సాంత్వనమున కలదు.

## కృతిపతి వంశవర్ణన :

కృతిపతికి పతియైన వాని వంశవర్ణనను కూడ కొందరు కవులు తమ కావ్యావతారికలో వర్ణించినారు.

కేతన దశకుమార చరిత్రలో విక్రమసింహ నగరాధీశ్వరుడగు మనుమసిద్ధి మహీవల్లభుని వంశావళి వర్ణనను కూడ తిక్కన వంశవర్ణనకు ముందు చేసినాడు. మనుమసిద్ధి వంశవర్ణన నిర్వచనోత్తర రామాయణావతారికలోను కలదు.

శ్రీనాథుడు శృంగార నైషధములో కృతిపతియైన మామిడి సింగనను ప్రశంసించుటకు ముందుగ నాతని యేలికయైన వేమభూపాలుని మహత్త్వమును ప్రసక్తానుప్రసక్తముగ వర్ణించినాడు. భీమేశ్వర పురాణములో కృతిపతియగు బెండపూడి అన్నమంత్రి ఏలికయైన వేమారెడ్డి మహత్త్వమును శ్రీనాథుడు విశేషముగ వర్ణించినాడు. వీరభద్రారెడ్డి విద్వాంసుడు కాగోరి "అమ్మహా ప్రారంభమునకు మంగళాలంకారంబుగా నమ్మహామంత్రీశ్వరు నేలిన వీరభద్రేశ్వర వేమ భూపాలుర వంశావతారం బభివర్ణించెద" నని యుపక్రమించి మంత్రి వంశావతారముకంటె ప్రభువంశమును ముందవతరింప జేసెను. వేమ వీరభద్రారెడ్ల వంశవర్ణనకు కారణము వారి ప్రాపును బడయగోరుట. ఆ వంశవర్ణన ప్రస్తావ మిట్లుకలదు. ప్రోలయ వేమన మొదలు కుమారగిరివరకు చెప్పి అటుపిమ్మట 'ఆదు'లనుటకు కారణము. కోమటి వేమయ రాచవేమనలు విరోధులగుటచేత తత్ప్రస్తావము వేమ వీరభద్రారెడ్లకు సహ్యముగాదని తలంచి వారిని స్మరింపలేదు. శ్రీనాథుడు వారి రాజ్యప్రాప్తికి ప్రధాన సాధనమును స్పష్టముగా చెప్పలేదు. 'అనితల్లి మూలమున రాజ్యము ప్రాప్తించినదనుట అంత ప్రతిష్ఠావహము కాదని తలంచి 'అల్లాడ భూవల్లభుండు... పాలించె తదనంతరంబు" అని శ్రీనాథుడు చెప్పినాడు.

వరాహ పురాణములో కృతిపతికి పతియైన సాళువ నరసింగరాజు వంశావతారము వర్ణింపబడినది. సాళువ నరసింహరాజు చంద్ర వంశోద్భవుడు. గుండ్రాజు, అతని కుమారుడగు సాళ్వరాజు, అతనికొడుకగు గౌతరాజు, అతనికొడుకగు గుండరాజు, అతని కొడుకగు నరసింగరాయల ప్రతాపాదులు వరాహపురాణావతారికలో వర్ణింపబడినవి. సాళ్వ నరసింగరాయల పరాక్రమము మూడు పద్యములలో వర్ణింపబడినది.

సుదక్షిణాపరిణయకర్త తెనాలి అన్నయ కృతిపతియగు పులిజాల సోమనామాత్యుని ఆదరించిన ప్రభువగు కోనేటి రామరాజు వంశావతారమునుగూడ తన గ్రంథావతారికలో తెల్పినాడు. కోనేటి రామరాజు కృత్యారంభ పద్యమునగూడ పేర్కొన బడినాడు.

## కృతి ప్రేరేపకుని వంశవర్ణన :

కృతిపతి వంశవర్ణనకంటె కూడ కృతి ప్రేరేపకుని వంశావతారమును కొందరు కవులు తమ కావ్యావతారికలందు విశేషముగా వర్ణించినారు.

సివనాథచరిత్రమున గౌరన కృతి ప్రేరేపకుడగు ముక్తి కాంత భిక్షా వృత్తి రాయని నాతని వైభవమును విశేషముగా వర్ణించినాడు.

బాలభాగవతకర్తయగు దోనూరి కోనేరునాథకవి కృతి ప్రేరేపకుడగు ఆర వీటి తిరుమలరాజునుగూర్చి విశేషముగా తెలిపినాడు. తిరుమలరాజు ప్రేరణమున అతని తండ్రియగు రామరాజు తిమ్మరాజునకు పద్య బాలభాగవతమును అంకిత మిచ్చెను. ఈ తిరుమలరాజు సోదరుడగు చినతిమ్మరాజు పేరనే దోనూరి కోనేరు నాథకవి తన ద్విపద బాలభాగవతమును రచించినాడు.

పింగళి సూరన తన రాఘవపాండవీయమును పంపా విరూపాక్ష దేవునికి కృతియిచ్చి యున్నను కృతి ప్రేరేపకుడగు ఆకువీటి పెదవేంకటాద్రి వంశావతార మును అవతారికలో వర్ణించినాడు.

కృష్ణకవి తన శకుంతలాపరిణయావతారికలో కృతి ప్రేరేపకుడు, తన ప్రభువును అగు చిలుమామిళ్ల పాపయ్య వంశావతారమును విపులముగా 80 పద్యములలో వర్ణించినాడు.

ఇట్లు కృతిపతి, కృతిపతి పతి, కృతి ప్రేరేపకుల వంశాదికమును గూర్చిన విశేషాంశములు కావ్యావతారికలను బట్టి తెలియుచున్నవి.

# 13

# షష్ఠ్యంతములు

షష్ఠ్యంత సంప్రదాయము సంస్కృతములో లేనే లేదు. ప్రాకృత కన్నడము లందుగాని తమిళమునందుగాని కానరాదు. కావ్యకథారంభమున కుపక్రమించుటకు ముందు షష్ఠ్యంతము లుండుట తెలుగు కావ్యములకున్న ఒక ప్రత్యేక విశిష్టత. షష్ఠ్యంతములనగా కృతిపతిని లేక కృతిప్రేరేపకుని గూర్చి షష్ఠీ విభక్త్యంతములుగా పద్యములను రచించుట. కృతిపతిని సంబోధించుచు స్తోత్రనామావళీ పఠనమువలె చేయబడిన పద్యముల రచన షష్ఠ్యంతములని కొందరు చెప్పుదురు. కృతిపతికి అభ్యుదయముకోరి షష్ఠ్యంతములు చెప్పిన తరువాత అట్టి కృతిపతికి చెప్పబూనిన కథ అని వచనముండి ఆటుపిమ్మట కథాప్రారంభము జరుగుట తెలుగుకావ్యము లందు కలదు. షష్ఠ్యంత పద్యరచన కావ్యావతారికలోని చరమభాగము.

నన్నయ షష్ఠ్యంత పద్యములను రచింపలేదు. అతడు తన భారతమును రాజరాజుకు అంకితము చేయలేదు. తన వంశపు రాజుల చరిత్రమును వర్ణించు గ్రంథమగుటచే దానిని వినవలయునను కోరిక మాత్రమే రాజరాజుకు కలదు. కనుకనే నన్నయకు షష్ఠ్యంతముల అవసరము కలుగలేదనుకొనవచ్చును. షష్ఠ్యంత రచనను చేసిన మొట్టమొదటి కవి నన్నెచోడుడు. అతడు తన కవిత అమృతాంశు భాషణావతారంబయిన తన గురువగు జంగమ మల్లికార్జునుని కరుణచే లభించిన దని భావించి అతనిని స్తుతింపనెంచి కృతిని రచించినాడు. కృతిపతికి పరమేశ్వరునితో నభేదము కల్పించి నన్నెచోడుడు 'జంగమ మల్లికార్జున దేవునకు'

అను వచనము చెప్పి అటుపిమ్మట ఎనిమిది షష్ఠ్యంత కందములను రచించినాడు. పాల్కురికి సోమనాథుని గ్రంథములలో కృత్యాదిని ఆశ్వాసాంతమువనుకూడ కృతిపతిని గురించిన సంబోధనలున్నను షష్ఠ్యంతములు మాత్రము లేవు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున కావ్య కన్యకను తగిన వరున కిచ్చు సంప్రదాయము గానవచ్చుచున్నదే కాని షష్ఠ్యంత రచనము లేదు. కాని భారతమునందు మాత్రము తిక్కన షష్ఠ్యంతములను రచించినాడు. ఎఱ్ఱన హరివంశములో షష్ఠ్యంత పద్యరచన చేయలేదు గాని నృసింహపురాణములో పదునొకండు షష్ఠ్యంత కందములు గలవు. భాస్కర రామాయణము, సింహాసన ద్వాత్రింశిక, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగు కొన్ని కావ్యములందుతప్ప తక్కిన వాని యందు షష్ఠ్యంత సంప్రదాయము నియతముగా పాటింప బడినది. కృతిపతికి అభ్యుదయాభివృద్ధులను గోరి షష్ఠ్యంతములను రచించుట తెలుగు కవులకు విడువ రాని కవి సమయముగా పరిణమించినది.

శాసన రచనలలోకూడ షష్ఠ్యంతములు కనబడుచున్నవి. క్రీ. శ. 1139 నాటి యొక నాదెళ్ల శాసనము[1] లో షష్ఠ్యంతమున్నదని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు గుర్తించి యున్నారు:

"వర శక వత్సరంబు లుడు వల్లభి తర్క వఖేందు సంఖ్యగా...
...నాదిండ్ల అందు ప్రసిద్ధిగ శూలపాణికిన్

క. "వ్యాళేభ చర్మ ధారికి మూలస్థానంబు నాదిమూర్తి శ్రీ శా
పాలికి మృడునకు హరునకు నీలగ్రీవునకు నీశునకు నుమపతికిన్

క. "సిరమతి గడియమదేవులు
థిరమైయుండ (ం) గ నఖండ దీపము నిలిపెన్"

క్రీ. శ. 1140 నాటి మరియొక నాదెళ్ల శాసనము[2] నందును షష్ఠ్యంత రచన కలదు. చూడుడు:

క. "మేలగు నాదిండ్లం ద న్మూలస్థానమున పుణ్యమూర్తికి భాస్వ
త్ఫాలాక్షి వహ్నిదగ్ధ వ్యాలాంగ భవాంగునకు మహా దేవునకున్

శా. ఇంద్రారాధ్యున కాది దేవునకు బాలేందు...
చంద్రార్కంబుగ దీపిక న్నిలిపె నుత్సాహంబులో.. "

1. S. I. I. vol. IV, 672, శాసన పద్యమంజరి 15.
2. S. I. I. vol. IV, 675, శాసన పద్యమంజరి 16.

ఇట్టివి అచ్చటచ్చట కలవు. దీనినిబట్టి నన్నెచోడునికి సమకాలపు శాసనము లందు షష్ఠ్యంత రచన కలదనియు తెలియుచున్నది.

షష్ఠ్యంత సంప్రదాయావిర్భావమునుగూర్చి విమర్శకులు కొన్ని అభిప్రాయములను తెల్పినారు. వానిని ఈక్రింద పరిశీలింతము.

"దేవతా కృతిపతి స్తోత్రాదులయందు సందర్భమునుబట్టి ప్రథమా ద్వితీయా తృతీయా షష్ఠీ ప్రభృతి విభక్త్యంతము లుండును. ఇవి దేవతాస్తోత్ర నామావళి వంటివి ........ ఇవి సాధారణముగా నారాధనలయందుపయోగించు స్తోత్ర నామావళివలె భక్త్యతిశయానుసార ముపయోగించుట యొక యాచారమయి యుండును." అని శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు తన కుమార సంభవ విమర్శనమునందు వ్రాసినారు. అధోజ్ఞాపికలో "ఇట్టి విశేషణములను నామావళి యనియే యొక శాసనమున వాడినారు" అని క్రీ. శ. 1161 నాటి శరణయ శాసనమునుండి—

"వ. ఇట్టి శ్రీగొంక రాజుల కిష్ట భృత్యుణ్డైన శరణయ నామావళి యెట్టి దనిన" అను వాక్యమునుదాహరించి తరువాత తృతీయాంతములు గల "శ్రీ విల సద్విలాస" అను పద్యము నుదాహరించినారు. ఈ విభక్త్యంతములకును నామావళులకును ఎట్టి సంబంధమును కానరాదని శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు సప్రమాణముగా నిరూపించినారు. వేదమువారు చెప్పిన వాక్యములివి:

"శాసనములలోని విభక్త్యంతములు కాదాచిత్కములు, కవుల కల్పనలు. అంకితాది కృతి సమర్పణ కార్యము అందు లేదు. ఇది 'ఉదాహరణ' కవిత్వము కాదు. ఎదో తోచినది. కవులు వ్రాసి ఆనందించిరి. కవితా కల్పన. అంతమాత్రమే"[1]

షష్ఠ్యంతములు మొదట భగవత్పరముగనే రచింపబడి యుండెనను భావమును శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు వ్యక్తపరచినారు. "నిర్వచనోత్తర రామాయణమున.... షష్ఠ్యంతము లనబడునవి లేవు. ఆరీతిని స్తుతించుచోట నుపయోగించుట తిక్కనకు సమ్మతము కాదని తోచెడిని".[2] వఙ్గమూడి గోపాలకృష్ణయ్యగారు కూడ షష్ఠ్యంతములు మొదట భగవత్పరముగనే రచింపబడి యుండెనను భావమును తెల్పియున్నారు. షష్ఠ్యంత సంప్రదాయావిర్భావమును గూర్చి వఙ్గమూడి గోపాలకృష్ణయ్యగారి అభిప్రాయమిది:

---

1. నన్నెచోడుని కవిత్వము — పుట, 27.
2. చూ కుమారసంభవ విమర్శనము.

"కేశవాయ నమః నారాయణాయ నమః మాధవాయ నమః ఇత్యాదిగా నున్న కేశవనామాలను ఆధారముగా చేసికొనే తెలుగులో షష్ఠ్యంతాలు వెలశాయి. ఈ షష్ఠ్యంతాలు కేశవ నామాల వలెనే మొదట దైవపరంగా అంటే కావ్యాన్ని దేవునికే అంకిత మిచ్చినపుడే ఉపయోగింపబడేవి అనిపిస్తుంది. దైవపరంగా నుపయోగింపబడే యీ షష్ఠ్యంతాలను మానవపరంగా చేసిన మొదటి కవి నన్నెచోడుడే."[1] నన్నెచోడుడు తన గురువగు జంగమ మల్లికార్జునుని పరముగ షష్ఠ్యంతములను చెప్పినాడు. అతని భావమున గురువగు మల్లికార్జునుడు, శివుడు నొక్కరే. కనుక నన్నెచోడుడు మానవపరముగ గాక దైవపరముగానే షష్ఠ్యంతముల నుపయోగించి యుండునని చెప్పవచ్చును. భగవదంకితములగు కావ్యములం దన్నింటను ఒక్క సింహాసన ద్వాత్రింశికతప్ప షష్ఠ్యంతము లున్నవి. కనుక షష్ఠ్యంతములు మొదట భగవత్పరముగనే రచింపబడి యుండెడివని చెప్పవచ్చును. అంతమాత్రమున "దేవతలకు మాత్రమే షష్ఠ్యంతములు మానవులకు పనికిరావు" అనుటయు సరికాదు. కేతన తన దశకుమార చరిత్రావతారికలో కృతిపతియగు తిక్కనకు షష్ఠ్యంతములను చెప్పినాడు. దీనినిబట్టి దైవపరముగనే గాక మానవ పరముగను కూడ షష్ఠ్యంతములను కవులు రచించుచుండిరనుట విదితమగును.

నన్నెచోడుని షష్ఠ్యంత సంప్రదాయావిర్భావమును గూర్చి తెల్పుచు కోరాడ రామకృష్ణయ్యగారు ఈక్రిందివిధముగ ఊహించినారు.

"...ఇదియు దేశిపద్ధతులలోఁ జేరినదేయని చెప్పవచ్చును. దేశీయములగు నుదాహరణాది గ్రంథములలో దేశీయములగు కళికోత్కళికలను సంస్కృత చ్ఛందోద్ధములగు పద్యములను సప్త విభక్తులలోను రచించి తుదకొక పద్యమును సార్వ విభక్తికముగ రచించు పద్ధతి యొకటి కలదు. ఆ ఛాయనే సందర్భాను సారముగా ననుసరించి ఆ దేవునకు పరమభక్తి యుక్తి నావర్జితుండై కృతి యిచ్చు టలో నీకవి యెనిమిది విభక్తులకు సూచకముగా నెనిమిది కందపద్యములను షష్ఠ్యంతములనుగాఁ జేసి రచించినాడు."

కాని నన్నెచోడుడు ఈసంప్రదాయమును దేశీయోదాహరణ గ్రంథములందలి విభక్త్యంత రచన నుండి గ్రహించియుండు ననుట అంత యుక్తియుక్తముగా తోచదు. పైగా ఉదాహరణ కావ్యపద్ధతి నన్నెచోడుని కాలమున అంత ప్రసిద్ధి

1. షష్ఠ్యంతాల పుట్టుపూర్వోత్తరాలు — ఆంధ్రప్రభ, 3-7-1960 ఆదివారం సంచిక.

కూడ పొందలేదు. నన్నెచోడుని షష్ఠ్యంతవచన స్వతంత్రమేకాని ఉదాహరణ కావ్యము ననుసరించినది కాదు. నన్నెచోడుని షష్ఠ్యంతములు కృతి స్వీకర్త పరములేగాక అభేదాధ్యవసాయమున శివుని పరముగా నన్వయించును.

నన్నెచోడుని షష్ఠ్యంతములు ఇతరానుకరణములు కావని చెప్పుచు షష్ఠ్యంత పద్య సంఖ్యయందును నొక ప్రత్యేకతను పాటించి యున్నాడని అమరేశం రాజేశ్వరశర్మగారు సోదాహరణముగా తెల్పియున్నారు.[1] కుమార సంభవమున కృతినాయకుడగు శివు డష్టమూర్తి. కనుకనే తదభిన్నుడగు కృతిపతిని గూర్చిన షష్ఠ్యంతములను ఎనిమిదింటిని నన్నెచోడుడు రచించినాడు. షష్ఠ్యంత పద్యములను తదితర కృతిపతి వర్ణనాపద్యముల వలెనే అష్టమూర్తియగు శివునకు సహిత మన్వయించును. నన్నెచోడుడు ఈషష్ఠ్యంతములను కృతిపతి అష్టమూర్తులను సూచించుటకే యుద్దేశించెనని చెప్పుట కాధారము ఆ పద్యములందే కలదు. శివుని అష్టమూర్తులను వర్ణించుక్రమమిది: 1. పృథివి, 2. జలము, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశము, 6. సూర్యుడు, 7. చంద్రుడు, 8. యజమానుడు. వీనియందు మొదటిది పృథివి. నన్నెచోడుని షష్ఠ్యంతములందు మొదటిపద్యము నందు కృతిపతికి "అచలాత్మనకున్'' అను విశేషణము వాడబడినది. 'అచల' అనగా పృథివి కదా! కావున ఇందు శివుని పృథివీ మూర్తిత్వము వర్ణింప బడిన దనుట స్పష్టము. అష్టమూర్తులలో మూడవది అగ్ని. కనుకనే షష్ఠ్యంత ములలోని మూడవ పద్యమున "అంగజహరమూర్తికి ''అను విశేషణము వేయబడి యుండుట. మన్మథుని హరించిన దగ్నియేకదా! శివుని అష్టమూర్తులలో చివరిమూర్తి యజ్ఞకర్త. ఈతడు మానవులలోని శివస్వరూపము. కావుననే షష్ఠ్యంతములలోని చివరి పద్యమున "మనుజాకార మహేశునకు'' అను విశేషణము వాడబడియుండుట. ఇట్లే మిగత షష్ఠ్యంతపద్యములందు ఇంత స్పష్టముగా కాకున్నను ఆయా శివమూర్తులను సూచించు విశేషణములు వాడబడి యున్నవని అమరేశం రాజేశ్వరశర్మగారు నుడివినారు. దీనినిబట్టి శివుని అష్టమూర్తులను సూచించుటకే నన్నెచోడుడు ఎనిమిది షష్ఠ్యంతపద్యములను రచించియుండును.

కాళిదాసును చూచి నన్నెచోడుడు షష్ఠ్యంత రచనను ప్రారంభించినాడని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు 'కవిరాజ శిఖామణి' లో వ్రాసినారు. కాళి దాసు తన రఘువంశ ప్రారంభమున రఘువంశ్యుల గుణగణముల నుగ్గడించుచు షష్ఠ్యంత విశేషణములతో ఉదాత్త కవితా ఫణితిలో అయిదు శ్లోకములను రచించి నాడు. ఆ శ్లోకములివి:

---

1. 'నన్నెచోడుని కవిత్వము' — పుట 26

"సోహమాజన్మ శుద్ధానాం ఆఫలోదయ కర్మణామ్
ఆ సముద్రక్షితీశానాం ఆనాక రథవర్త్మనామ్
యథావిధి హుతాగ్నీనాం యథా కామార్చితార్థినాం
యథాపరాధ దండానాం యథాకాలప్రబోధినాం
త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మిత భాషిణామ్
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధనామ్
శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్
వార్ధకే ముని వృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్
రఘూణాం అన్వయం వక్ష్యే తను వాగ్విభవోఽపి సన్
తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రబోధితః"

— రఘువంశము, 1 వ సర్గ, శ్లో 5-9.

'కాళిదాసు కవితయం దపారమైన భక్తి ప్రపత్తులు గలిగిన నన్నిచోడు డీశ్లోకములలోని కవితకు ముగ్ధుడై యట్లే తన కృతిపతియగు జంగమ మల్లికార్జునుని గూడ షష్ఠ్యంత విశేషణములతో స్తుతింప నుద్బోధము గొని యుండుననుట యసంభావ్యము కాఁ జాలదు"[1] అని కోదండరామయ్యగారు వ్రాసినారు. ఇది కూడ సమంజసముగనే తోచును.

"దానాదులందు 'తుభ్యమహం సంప్రదదే' యనుటలోని చతుర్థియే తెలుఁగున భాషానుగుణముగా షష్ఠియై కృతిపతికిఁ గృతి కన్యాదాన విషయమునఁ గూడ నట్లే షష్ఠ్యంత రచనకు దారి తీసి యుండునని కూడ మన మూహింపఁ దగు"[2] నని కూడ కోదండరామయ్యగారు తెల్పినారు.

ఈ షష్ఠ్యంతములలోని మరొక విశేషము ఈ పద్యములు కందపద్యములుగా నుండుట. మొట్టమొదట షష్ఠ్యంత రచన చేసిన నన్నెచోడుడు కందపద్యములనే వ్రాసినాడు. తరువాతి కవులు పెక్కుమంది ఆ సంప్రదాయమునే పాటించి రచించినారు. షష్ఠ్యంతములు కంద పద్యములుగా రచించు సంప్రదాయమే సర్వత్ర వ్యాపించినది. కాని కేతన దశకుమార చరిత్రలో షష్ఠ్యంత రచనము కంద పద్యములలోనే గాక మరిరెండు వృత్తములలో కూడ చేసియున్నాడు. ఎనిమిది కందపద్యములు ఒక శార్దూలము, మరల ఒక కందము, అటు తరువాత ఒక

1. కవిరాజ శిఖామణి, పుట. 100
2. ,, ,, ,,

మాలినీ వృత్తము మొత్తము పదునొకండు పద్యములలో షష్ఠ్యంతములను కేతన రచించినాడు. దీనిని బట్టి కందపద్యములతో పాటు వృత్తములను కూడ షష్ఠ్యంత పద్యములుగా వాడిన వారిలో మొదటివాడు కేతనయే యని చెప్పవచ్చును. అంతే గాక షష్ఠ్యంతములతో ఆశ్వాసము ముగిసినది. కేతనకు తరువాతి కవులెవ్వరును షష్ఠ్యంతములతో ప్రథమాశ్వాసమును ముగింపలేదు. కేతన దశకుమార చరిత్రలో ద్వితీయాశ్వాసాదిగాను, పండ్రెండవదిగాను ఒక షష్ఠ్యంత కందము కథాకథనమున కుపక్రమణమునకు ముందు రచింప బడినది. కేతన పండ్రెండు పద్యములను షష్ఠ్యంతములుగా రచించినట్లు తోచును. కాని కేతన షష్ఠ్యంతములుగా ఎనిమిది కంద పద్యములనే రచించినాడనియు తరువాతి శార్దూల వృత్త, కంద, మాలినీ పద్యములు ఆశ్వాసాంత పద్యములు కాని షష్ఠ్యంత పద్యములు కావనియు కొందరు తలచిరి. కేతన దశకుమార చరిత్ర పండ్రెండాశ్వాసము లందును ఆశ్వాసాంత పద్యము లిట్లే వృత్త, కంద, మాలినీ పద్యములతో నియతముగా నుండుటనుబట్టి వీ రిట్లూహించుటకు హేతువు కావచ్చును. తిక్కన గ్రంథము లందును ఆశ్వాసాంతమందు ఈ నియమము కలదు. షష్ఠ్యంత రచనను తిక్కన కంటె ముందు చేసినవాడు కేతన అని తెల్పుచు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు కేతన షష్ఠ్యంత రచనలో భిన్నమార్గమును త్రొక్కుటకు గల హేతువు నిట్లూహించినారు: "కేతన ఏ ప్రయోజనము కోరియో తిక్కన సదభిప్రాయమునకై ఆయనను స్తుతించు నావేశములో పదునొకండు షష్ఠ్యంతములు వ్రాసియుండునని తోచుచున్నది." కేతన షష్ఠ్యంత మార్గమును తిక్కన సంస్కరించి తన భారతమున వాడినాడని తెలియు చున్నది. తిక్కన షష్ఠ్యంతములతో ఆశ్వాసమును ముగింపక వానికి ప్రథమాశ్వాస మధ్యముననే స్థానము కల్పించి వెంటనే కథ ప్రారంభించి కొంత కథ నడచిన తరువాతనే ప్రథమాశ్వాసమును ముగించినాడు. షష్ఠ్యంతములను పూర్తిగా కందపద్యములుగానే రచించినాడు. నడుమ వృత్త ములను చేర్పలేదు. షష్ఠ్యంత కందములను ఐదింటిని మాత్రమే రచించినాడు. తరువాతి కవులు ఆశ్వాసాంతములలోను, ప్రథమేతరాశ్వాసాదులలోను సంబో ధనలు గాను, షష్ఠీతర విభక్తులలోను పద్యములను రచించినారు. వానిలో ఎక్కువగా సంబోధనలకే ప్రాముఖ్యము.

కేతన తరువాతి జక్కన కూడ తన విక్రమార్క చరిత్రములో షష్ఠ్యంత ములుగా ఐదు కందములను వ్రాసి అటుపిమ్మట ఒక ఉత్పలమాలను వ్రాసినాడు.

"వెన్నెలగంటి సూర్యుఁడు వివేక గుణాఢ్యుఁడు వేదశాస్త్ర సం
పన్నుఁడు రెడ్డి వేమ నరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠిత తేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిగన్న సిద్ధనకు సంతత దాన కళా వినోదికిన్"

— విక్రమార్క చరిత్రము(1-62)

ఇది షష్ఠ్యంత పద్యము. ఈ పద్యము ప్రక్షిప్తమై యుండునని శ్రీచాగంటి శేషయ్యగారు శంకించినారు. ఈ ఉత్పలమాల తరువాత మరొక షష్ఠ్యంత కందమును జక్కన రచింపలేదు. అందువలన షష్ఠ్యంత కందముల అందము చెడలేదు. షష్ఠ్యంతములు కూడ ప్రథమాశ్వాసము మధ్యముననే యున్నవి.

పోతన భాగవతములో షష్ఠ్యంత పద్యములుగా నాల్గు ఉత్పలమాలలను రచించినాడు. 'నా చిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని' అని వ్రాసి వెంటనే షష్ఠ్యంతముల కుపక్రమించి 'హారికి నందగోకుల విహారికి....' అని నాలుగు ఉత్పలమాల పద్యములు చెప్పినాడు. పోతన ఈ షష్ఠ్యంతము లందలి ప్రతిపాద్య వస్తువు శ్రీకృష్ణుడు. శ్రీరాముడు నా నామాంకితముగా తెనిగింపుమని యాజ్ఞాపింప శ్రీకృష్ణ నామమున పోతన షష్ఠ్యంతములు రచించినాడు. స్కంధాంత మందును, స్కంధాది యందును 'రాఘవరామా' యని నుడివినాడు. దీనికి కారణము రామకృష్ణాది నామములు గల పరతత్త్వ మొక్కడే యని పోతన భావించి యుండుట. పోతన కృత్యాది ఇష్టదేవతాస్తుతి పద్యములను కూడ షష్ఠ్యంతములు గానే చెప్పినాడు. కృత్యాదిని ఒక శార్దూలము, నాల్గు ఉత్పలమాల పద్యములు షష్ఠ్యంతములు గానే రచింప బడినవి. పోతన వీరభద్ర విజయములో మాత్రము మూడు షష్ఠ్యంత కందములను రచించినాడు.

చరికొండ ధర్మన్న తన చిత్ర భారతమున తేటగీతలో షష్ఠ్యంత రచనను చేసియున్నాడు. చూడుడు:

"తమ్ము లెల్లను దను నిధానమ్ము గాఁగ
దైవమును దేశికుండుఁ గాఁ దాత గాఁగ
నాత్మఁ దలపోసి సేవఁ జేయంగ మెఱయు
నీదృశ గుణాఢ్యుఁడైన మంత్రీంద్రునకును"

— చిత్ర భారతము (1-75)

ఈ శేటగీత తరువాత 5 షష్ఠ్యంత కందములు కలవు. ఆధునిక కావ్యమగు దేవవ్రత చరిత్రములో శార్దూలము షష్ఠ్యంత పద్యముగా రచింప బడినది. ఇట్లు షష్ఠ్యంతములుగా వృత్తములను రచించు కావ్యములు అల్ప సంఖ్యాకములే. షష్ఠ్యంతములను చాలవరకు కందపద్యములలోనే రచించినారనుట స్పష్టము.

తెలుగు కావ్యావతారిక లందలి షష్ఠ్యంత పద్య సంఖ్యలో ఏక వాక్యత కానరాదు. క్రమ పరిణామము కూడ గోచరించదు. నన్నెచోడుడు ఎనిమిది షష్ఠ్యంత కందములను చెప్పినాడు పాండురంగ మాహాత్మ్యము, రాఘవ పాండవీయము మొదలగు వాని యందును ఎనిమిది షష్ఠ్యంత కందములు కలవు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున షష్ఠ్యంతములు లేకున్నను భారతమున అయిదు కంద పద్యములను రచించినాడు షష్ఠ్యంతములుగా అయిదు కంద పద్యములను రచించుట తరువాతి తెలుగు కవులు చెక్కుమంది అనుసరించినారు. శృంగార నైషధము, హర విలాసము, భీమేశ్వర పురాణము, శృంగార శాకుంతల జైమినీ భారతము లందును, ప్రబోధ చంద్రోదయము వరాహ పురాణము లందును, భోజ రాజీయము, ఉద్భటారాధ్య చరిత్రము, కాళహస్తి మాహాత్మ్యము, పాంచాలీ పరిణయము, రాజవాహన విజయము, పంచతంత్రము (వెంకటనాథునిది), మనుచరిత్ర, యయాతి చరిత్రము, విజయవిలాసము, అప్పకవీయము, అనిరుద్ధచరిత్ర మొదలగువానియందును అయిదు షష్ఠ్యంత కందములే రచింపబడినవి. అయిదు షష్ఠ్యంత కందములను రచించు పద్ధతియే తెలుగు కావ్యములందు హెచ్చు. తిక్కన సమకాలికుడగు మంచన ఒక్క షష్ఠ్యంత కందమునే రచించినాడు. ఈ విధముగ ఒకే ఒక షష్ఠ్యంత పద్యమును చెప్పిన కవి తెలుగులో మరొకడు కానరాడు. ఇది మంచన మిత భాషిత్వమును సూచించును. తిక్కన శిష్యుడగు మారన మూడు కందములను షష్ఠ్యంతములుగా వ్రాసినాడు. దీనినిబట్టి షష్ఠ్యంత రచనములో క్రమ పరిణామమున్నట్లు గోచరింపదు. కావ్యాలంకార చూడామణి, రామాభ్యుదయము మొదలగువానియందు మూడు షష్ఠ్యంత కందములే రచింపబడినవి. ఎఱ్ఱన హరివంశములో షష్ఠ్యంత రచనను చేయకున్నను నృసింహపురాణములో పదునొకండు షష్ఠ్యంత కందములను రచించినాడు. నరసభూపాలీయములో కూడ పదునొకండు షష్ఠ్యంత కందములు కలవు. శ్రీనాథుడు కాశీఖండములో మాత్రము తొమ్మిది షష్ఠ్యంత కందములను రచించినాడు. పద్య బాలభాగవతము, షట్చక్రవర్తి చరిత్ర, పారిజాతాపహరణము, రాధామాధవము, కవికర్ణరసాయనము, కళాపూర్ణోదయము,

సాంబోపాఖ్యానము, రుక్మాంగద, బహుళాశ్వచరిత్ర, కవిరాజమనోరంజనము ఇత్యాది కావ్యములలో షష్ఠ్యంతములుగా తొమ్మిది కందపద్యములు రచింపబడినవి. నాసికేతోపాఖ్యానము (దగ్గుపల్లి దుగ్గనది), ఆముక్తమాల్యద మొదలగు వానియందు నాల్గు షష్ఠ్యంత కందములే కలవు. దూబగుంట నారాయణకవి పంచతంత్రము, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము, మాదయ్యకవి మైరావణచరిత్ర, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానము, తెనాలి అన్నయ సుదక్షిణా పరిణయము, చదలువాడ మల్లన విప్రనారాయణచరిత్ర, అత్తనూరి పాపకవి చెన్న బసవపురాణము, కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము మొదలగు వానియందు షష్ఠ్యంత పద్యములుగా ఆరు కందములు రచింపబడినవి. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందును, రామరాజభూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందును కూచిమంచి తిమ్మకవి రుక్మిణీ పరిణయము నందును ఏడు కందపద్యములు షష్ఠ్యంతములుగా చెప్పబడినవి. తెలుగులో షష్ఠ్యంత రచనమునందు ఏక వాక్యతగాని క్రమపరిణామముకాని లేదనుట పైన పేర్కొనిన దానినిబట్టి స్పష్ట మగుచున్నది.

కృతిపతికి మాత్రమేగాక కృతి ప్రేరేపకునికికూడ షష్ఠ్యంతములను చెప్పుట కలదు. గౌరన నవనాథ చరిత్రమున షష్ఠ్యంతములతో 'సర్వజ్ఞునకు ముక్తి శాంతరాయనికి' అనవరతాభ్యుదయాభివృద్ధినిగోరి 'శ్రీ మల్లికార్జున శ్రీ మహాదేవుపేర' రచించినాడు. గౌరన తనకు ముందుండు ద్విపద కావ్యములలో షష్ఠ్యంత రచన లేకున్నను పూర్వకవుల ప్రబంధ ఫక్కి నెరింగిన వాడగుటచే కాబోలు షష్ఠ్యంతములను గ్రంథ రచనకుప్రోత్సహించిన శాంతరాయనియెడ ప్రయోగించి, అతనికభ్యుదయాభివృద్ధుల నొసగు శ్రీగిరి భర్తపేర గ్రంథమును రచింతునని వాక్యాన్వయమును కుదుర్చుకొనినాడు. హరిశ్చంద్రోపాఖ్యానమున కృతిపతిగాని కృతి ప్రేరేపకుడుగాని లేకపోవుటచే కాబోలు గౌరన షష్ఠ్యంతములను చెప్పలేదు. పద్య బాలభాగవతములో కోనేరునాథకవి కృతి ప్రేరేపకుడగు తిరుమలరాజును గూర్చి పేర్కొనుచు తొమ్మిది షష్ఠ్యంత కందములను చెప్పినాడు. కృతి ప్రేరేపకునియెడ షష్ఠ్యంత రచన చేసినవారు తెలుగులో మరికొందరు కలరు. కుమార ధూర్జటి అను పేరుతో ప్రఖ్యాతి గాంచిన వేంకటార్యుడు ఆర్వీటి చినవేంకటావనీంద్రు నాస్థానములో నుండినవాడు. అతడు తన కృష్ణరాయ విజయమును శ్రీరామచంద్రున కంకితమిచ్చినను రాజానందు కృతజ్ఞతాపూర్వకముగా ఆర్వీటి చినవేంకటాద్రి అనతిని గ్రంథమును రచించినట్లు చెప్పి అతని పేరును షష్ఠ్యంతములలోనను గూర్చియున్నాడు:

గౌరనను అనుసరించి తరువాతి ద్విపదకవులు కొందరు షష్ఠ్యంత సంప్రదాయమును పాటించినారు. తాళ్లపాక చిన్నన్న అష్టమహిషీకల్యాణములో నాల్గు ద్విపదలలోను, పరమయోగి విలాసములో మూడు ద్విపదలలోను, ఉషాకల్యాణములో ఎనిమిది ద్విపదలలోను షష్ఠ్యంతములు రచించినాడు. సౌగంధిక ప్రసవాపహరణములో ఎనిమిది ద్విపదలలో షష్ఠ్యంతములు చెప్పబడినవి. ద్విపద కావ్యములలో షష్ఠ్యంత రచన ఆ కావ్యముల ప్రాబంధికతను వ్యక్తము చేయుచున్నది.

కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయము (యక్షగానము)లో కృతిపతియగు కందుకూరి జనార్దనుని 'త్రిపుట'లో స్తుతించి "అద్దేవతా సార్వభౌమునకు షష్ఠ్యంతంబులు సెప్పిన విధంబెటువలెను'' అని ఈ క్రింది అర్ధచంద్రికలలో దశావతారములను పదునొకండు ద్విపద పంక్తులలో షష్ఠ్యంతములతో పేర్కొనినాడు. చూడుడు :

అర్ధచంద్రికలు :

"చదువులు దెచ్చిన జలచరపతికిన్ – కుధరము మోచిన కూర్మంబునకున్
మేదిని దాల్చిన యాదిమ కిటికిన్ – కనకకశిపుఁ దునిమిన నరహరికిన్
బలి నణంచిన మాయల వడుగునకున్ – మనుజేశులఁ గొట్టిన రామునకున్
రావణుఁ జంపిన రఘునందనకున్ – భౌముజుఁ గూల్చిన బలభద్రునకున్
దనుజసతులఁ బగిలిన బుద్ధునకున్ – ఖలనిరసనగల కల్క్యాకృతికిన్
సర్వము దానగు జన్నప్పనికిన్''

ఈ షష్ఠ్యంతముల తరువాత—

"వ. అంకితముగా నా యొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంబునకుం గథాక్రమం బెట్టిదనిన''

అను వచనము కలదు.

రాజులయు, మంత్రులయు తదితరులయు ప్రశస్తికొరకు స్తుతిరూపముగ విరచితములైన షష్ఠ్యంతాది పద్యములందు చారిత్రకాంశములుకూడ కొన్నిటియందు గోచరించుచుండును. ఈ చారిత్రకాంశములు ముందు వివరింపబడును.

ఈ షష్ఠ్యంతములలో కొన్నింట కృతిపతిని సంబోధించుచు అతనికి అభ్యుదయాభివృద్ధులనుకోరి చెప్పిన పద్యములున్నవి. మరికొన్నిట కృతిపతినిగూర్చి స్తోత్రరూపముగ భక్తితో విన్నవించిన షష్ఠ్యంత పద్యములు కలవు.

కొన్ని కావ్యావతారికలందు ఈ షష్ఠ్యంత పద్యములు విశిష్ట కవితా సంప్రదాయముతో విలక్షణ శిల్ప విన్యాసములతో రచింపబడినవి. వసుచరిత్రాది గ్రంథముల లోని షష్ఠ్యంతములలో ప్రతి పద్యమునను అంత్యప్రాసము కడవరకు చెప్పబడినది.

షష్ఠ్యంత పద్యములవలన కృతిపతి గుణగణములు తెలిసికొనవచ్చును. నాసికేతోపాఖ్యానమును కృతిగొన్న గంగనామాత్యుడు సంగీతమభ్యసించి సరస సాహిత్యకళా సంగతమతియై యుండెనని షష్ఠ్యంతపద్యమువలన తెలియుచున్నది.

"శృంగార చారుమూర్తికి సంగీతజ్ఞునకు సరస సాహిత్య కళా
సంగత మతికి వసంతయ గంగామాత్యునకు రూప కందర్పునకున్"

—నాసికేతోపాఖ్యానము (1-80)

ఇట్లు కృతిపతి గుణగణాదికములనుగూర్చి తెలుపు షష్ఠ్యంత రచన తెలుగు కావ్యావతారికలలో మాత్రము స్వతంత్రముగ ఏర్పడిన ఒక విశిష్ట సంప్రదాయము.

# 14

# కథాసూత్ర ప్రశంస

తెలుగు కావ్యావతారికలందు కథారంభమునకు ముందు షష్ఠ్యంతములకు పిమ్మట కథావతారిక ఒక వచనములోగాని పద్యములోగాని యుండుట సంప్రదాయము. ప్రాచీన సంస్కృత కావ్యములన్నియు వస్తు నిర్దేశముతో ప్రారంభింపబడినవి. పంపాది కన్నడ కవులు తమ కావ్యాంతములందు కథాసూత్ర ప్రణాళికను తెల్పినారు. తెలుగు కవులు మాత్రము కావ్యాదిని కథావతారికను తెల్పినారు. పాఠకుల చిత్తవృత్తి కావ్యకథకు సన్నిహితమగునట్లు చేయుటకు కావ్యావతారికలో కవి కథాసూత్రమును విరచించుట యుక్తముగదా!

నన్నయ భారతావతారికయందు కథావతారిక పెక్కు పద్యములలో వివరింపబడినది. "తత్కథా ప్రారంభం బెట్టిదనిన-" అని నన్నయ భారతకథా ప్రస్తావనను ప్రారంభించినాడు :

> "ఏ యది హృద్య మపూర్వం బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
> బై యుండు నఘనిబర్హణ మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్"
>
> —ఆది పర్వము (1-30)

అని శౌనకాదిమునులు కథకుడగు రౌమహర్షణి నడుగగా నాతడు భారత కథను తెల్పినట్లు భారత కథాప్రస్తావనలో కలదు. హృద్యముగా, అపూర్వముగా, అఘనిబర్హణము చేయునదిగానుండి సమగ్రమైన జ్ఞానమును ప్రసాదించునది ఉత్తమ కావ్యమని పై పద్యమున చెప్పబడినది. భారతము ఒక విజ్ఞాన సర్వస్వము కనుకనే

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మవిదులు వేదాంతమని, నీతి విచక్షణులు నీతిశాస్త్రమని, కవివృషభులు మహాకావ్యమని ఇత్యాదిగా కొనియాడియున్నారు. భారతకథ 'పుణ్యకథ' అని, 'ఉత్తమకథ' అని తెల్పబడినది. కథకుడగు రోమహర్షణి "పుణ్య కథాకథన దక్షుండు". పాఠకులకు భారతకథపై కుతూహలమును గల్గించుటకు భారతావతారికలో భారత మహత్త్వము ఇంతగ ప్రశంసింపబడినది. భారత కథావిర్భావమునకు కారణములను, భారతకథ విస్తరించిన విధమును సంగ్రహముగా ప్రస్తావింపబడినది. తరువాత మహాభారతము శతపర్వ సమన్వితమని, శతసహస్ర శ్లోక పరిమితమని పేర్కొనబడినది. పర్వానుక్రమణిక, పర్వ సంగ్రహము, భారతయుద్ధ వివరములు మున్నగునవి కథారంభమున వివరింపబడినవి. నన్నయకు తరువాతి తెలుగు కవులు కథావతారికను ఇంత విపులముగా చెప్పలేదు. వారు కథావతారికను సంగ్రహముగ సూచించినారు.

నన్నెచోడుడు కుమార సంభవావతారికలో కథాసూత్ర ప్రణాళికను రచించి నాడు. కథాసూత్ర ప్రణాళికను తెలిపిన మొట్టమొదటి కవి నన్నెచోడుడే. ఆఖరి వాడును నితడే; కుమార సంభవావతారికలోని విషయాంగములను మార్గదర్శకముగా నన్నెచోడునికి తరువాతి కవులు గ్రహించి యున్నను ఏ కారణముననో కథా సూత్ర ప్రణాళికనుమాత్రము అనుసరింపలేదు. నన్నెచోడుడు "నా చెప్పంబూనిన దివ్యకథాసూత్రంబెట్టిదనిన" అని విషయసూచికను ఈ క్రింది పద్యములలో తెల్పినాడు.

"సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతుధ్వంసనముం బా
ర్వతి జన్మంబున్ భవోగ్రవ్రత చరితయు దేవ ద్విషత్ క్షోభమున్ శ్రీ
సుత సంహారమ్ము భూభృత్సుత తపము మహాసుందరోద్వాహమున్ స
ద్రతి భోగంబుం గుమారోదయమును ఘన తారకుం బోర [illegible]",

—కుమార సంభవము (1-68)

1, సతిజన్మము, 2. గజపతిజననము, 3, దక్షాధ్వరధ్వంసము, 4. పార్వతి జననము, 5. శివుని ఉగ్రతపస్సు, 6. దేవతల కల్లోలము, 7. మన్మథదహనము, 8. పార్వతితపస్సు, 9. శివపార్వతుల కల్యాణము, 10. శివపార్వతుల రతిభోగములు, 11. కుమారజననము, 12. తారకసంహారము—ఈ పండ్రెండు విషయములను చెప్పినట్లు నన్నెచోడుడు కుమారసంభవ కావ్యప్రారంభమున తెల్పినాడు. కుమారసంభవములో పండ్రెండు ఆశ్వాసములున్నను ఒక్కొక్క ఆశ్వాసములో పైని పేర్కొనిన ఒక్కొక్క విషయమును నన్నెచోడుడు చెప్పలేదు. కొన్ని విషయ

ములు సంగ్రహముగను మరికొన్ని విషయములు విస్తరముగను వర్ణింపబడినవి. ఈ కథాసూత్ర విరచనమునుబట్టి నన్నెచోడుడు ఒక ప్రణాళికను విరచించుకొని దాని ప్రకారము కుమారసంభవ కావ్యమును రచించియున్నట్లు స్పష్టమగుచున్నది. నన్నెచోడుడు తన కృతి "సకలావయవములం బరిపూర్ణంబైన దివ్య కావ్యాంగన" అని తెల్పినాడు. పరిపూర్ణమైన కావ్యమును రచించిన వారిలో ప్రథముడు నన్నెచోడుడు.

నిర్వచనోత్తర రామాయణావతారికలో తిక్కన—

"అమ్మనుజపతి కథ్యుదయమ్ముగ నేఁ జెప్పఁ బూనినట్టి కథకు నా
ద్యమ్ముగ నయోధ్య యను నామమ్మున నెగడిన పురోత్తమము వర్ణింతున్"
—నిర్వచనోత్తర రామాయణము (1-45)

అని అయోధ్యావర్ణనమును విపులముగా పదునెనిమిది పద్యములలో చేసినాడు. ఇది తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకమయినది. అయోధ్యానగరవర్ణన తరువాత ఉత్తర రామాయణకథ సంగతమగుటకై పూర్వ రామాయణ వృత్తాంతము సంగ్రహముగా చెప్పబడినది. తిక్కన భారతములో ఈవిధానమును పాటింపలేదు. భారతకథ ప్రసిద్ధమైనది కాబట్టి పూర్వపర్వములలోని వృత్తాంతమును చెప్పకయే "వలసినట్లు చెప్పవలసి యుండు" నని తిక్కన విరాటపర్వావతారికలో తెల్పియున్నాడు.

"కథ యెల్లఁ బ్రసిద్ధము గావునఁ బూర్వ పర్వార్థయుక్తి చేయునట్టి యెడల
యథార్థ సంక్షేపమున ననుగుణముగ వలసినట్లు చెప్ప వలసియుండు"
—విరాట పర్వము (1-48)

యుక్తియుక్తముగా రంజకముగా నుండునట్లు సందర్భానుకూలముగా తగినట్లు నడుపుకొనుచు పోయెదనని తిక్కన తెల్పినాడు. కథాభాగములో మార్పులు చేయడు కాని ఆ కథను నడుపుటలో కథా పాత్రలను ప్రదర్శించుటలో మాత్రము తన ప్రతిభను చూపుచు చెప్పవలసిన రీతిని చెప్పెదనని తిక్కన చెప్పినాడు. 'కవిత్వ విశారదుడు'ను, 'విద్యాదయితుండు'ను నగు నన్నయభట్టు భారతములోని మూడు పర్వములను రచించెనని మిగత పర్వములను 'తుదముట్టన్, బుధ సంతోషంబు నిండారఁగన్' ఆంధ్రీకరింతునని తిక్కన విరాట పర్వావతారికలో తెల్పియున్నాడు.

తిక్కన ననుసరించి అతనికి తరువాతి కవులు కొందరు కథానాయకుని పుర వర్ణనతో కావ్యకథను ప్రారంభించినారు. జక్కన విక్రమార్క చరిత్రావతారికలో షష్ఠ్యంతముల తరువాత "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచియింపం బూనిన నవ్యకావ్యకథా లక్ష్మికి సుధాసాగరంబయిన మధురా నగరంబెట్టిదనిన" అను వచనమును చెప్పి కథారంభమును చేసినాడు. విక్రమార్క చరిత్రను, 'నవ్యకావ్య'మని, 'అపూర్వ కథాబంధుర ప్రపంధ'మని జక్కన పేర్కొనినాడు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు "అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభీష్ట ఫలసిద్ధియుంగా నాశీర్వదించి నా యొనర్పంబూనిన శాకుంతల కావ్యకథా లతాలవాలంబగు పురీలలామంబు" అని శృంగార శాకుంతలమును పురవర్ణనతో ప్రారంభించినాడు. పినవీరభద్రుడు జైమిని భారతములో మాత్రము "అభ్యుదయం బాకల్పంబుగా నా కల్పింపంబూనిన జైమిని భారతంబునకుం గథావతారిక యెట్టిదనిన" అని కథారంభము చేసినాడు. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రావతారికలో "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిమ్మహా ప్రబంధంబునకుఁ బ్రధాన కారణంబగు నావంతిక పురంబెట్టిదనిన" అనియు, సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనావతారికలో "సమర్పితంబుగా నా యొనర్పంబూనిన మాంధాతృ చరిత్రంబను కావ్య కథాకల్పవల్లికి నాలవాలంబైన పురవరంబెట్టిదనిన" అనియు, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యావతారికలో "సమర్పితంబుగా నా యొనర్పంబూనిన శ్రీ మత్కాళహస్తి మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందుఁ దదీయ కథా సంవిధానంబునకుఁ బ్రధాన స్థానంబైన మహాపురం బెట్టిదనిన" అనియు పురవర్ణనతో కావ్య కథను ప్రారంభించి యున్నారు. ఇట్లు పురవర్ణనతో కావ్యమును ప్రారంభించిన కవులు ప్రబంధ యుగమునందు ఎక్కువగా కన్పించుచున్నారు. కావ్య ప్రారంభమునందు పురవర్ణన ప్రవేశ పెట్టుటచే ఆయా కవుల వర్ణనాభిలాష వ్యక్తమగును.

కావ్యమా ? ప్రబంధమా ? అను విషయము కథారంభమునకుముందు చెప్పబడిన ఈ వచనమునందు కవి సూచించియుండుట కాననగును. కవి కర్ణరసాయనమును కవి 'కావ్యమ'నియే పేర్కొనియున్నాడు. "అపూర్వ విరచనా చాతుర్యంబు నెఱయ మెఱయ నన్వర్థ నామంబుగా గవికర్ణ రసాయనంబను నొక్క కావ్యంబు రచియింప నున్ముఖుండనై" అని నృసింహకవి పేర్కొనెను. ప్రబంధయుగమునందు వెలసిన ఈ ప్రౌఢ ప్రబంధమును కవి 'కావ్యము'గానే పరిగణించి యున్నట్లు కథారంభ ప్రశంసవలన తెలియుచున్నది.

శ్రీనాథుని భీమేశ్వరపురాణ రచనా క్రమములో రెండుపక్రమములు కలవు. షష్ఠ్యంతముల తుదిని 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిమ్మహా ప్రబంధమున...దక్షారామపురం బెట్టిదనిన'' అని ఉపక్రమించి దక్షారామ పురవర్ణన మున్నగు విషయములను కృతిభర్త అభిరుచి కనుగుణముగ ఒక ఆశ్వాసమున శ్రీనాథుడు వర్ణించినాడు. ఈ ఆశ్వాసాంతమున భీమేశ్వరపురాణకథా ప్రారంభము చేయుచు—

''ఏతాదృశ ప్రభావో పేతుండగు దక్షవాటి భీమేశ్వరు వి
ఖ్యాత కథ చెప్పెదను శుక తాత కృత పురాణ సరణి తప్పక యుండన్''
—భీమేశ్వర పురాణము (1-19)

'ఇమ్మహాపురాణంబునకుఁ గథా క్రమంబెట్టిదనిన' అని రెండవ ఉపక్రమము. ఇచటనుండియే సంస్కృత మూలానుసరణముగ ప్రబంధ రచన గావింపబడినది. భీమేశ్వరపురాణమునకు మూలము స్కాందపురాణాంతర్గతమగు శ్రీ గోదావరీ ఖండమని అవతారికలో చెప్పబడినది. అందు దక్షారామ భీమేశ్వరుని మాహాత్మ్యము వర్ణింపబడినది. 32 అధ్యాయములు గల 'భీమఖండ' మను సంస్కృత గ్రంథమును ఎక్కువగా శ్రీనాథుని రచన యనుసరించిన ట్లగపడుచున్నది.

"అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిమ్మహా ప్రబంధము'' అని శృంగార నైషధములోను. ''అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన కాశీఖండము'' అని కాశీఖండములోను కథానుక్రమణికలు కలవు. శ్రీనాథుడు హరవిలాసములో ''అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన హరవిలాసంబను ప్రబంధంబునకు ప్రథమ విలాసంబైన కృతి నాయకుని వాణిజ్య వంశంబునకుఁ గూటస్థుండైన కిరాటకుల శ్రేష్ఠుండగు చిరుతొండ నంబి చరిత్రంబు చెప్పెద నదియెట్టి దనిన'' అని ప్రారంభించినాడు. కృతిపతి అభిరుచి కనుగుణముగా కథాప్రారంభము చేయుట శ్రీనాథుని గ్రంథములలో సర్వ సామాన్యముగ కన్పించుననుట కిదియొక నిదర్శనము. భీమేశ్వరపురాణములో కృతిపతియగు అన్నమంత్రి కులదైవమగు భీమేశ్వరుని ప్రథమాశ్వాసములో వర్ణించుట మరియొక ఉదాహరణము.

శ్రీనాథుడు ''స్కాందంబున నీశానసంహితం జెప్పబడ్డ యురు లింగోద్భవంబును శివరాత్రి మాహాత్మ్యంబును...'' చెప్పినాడు. శివరాత్రి మాహాత్మ్యము అవతారికలో శ్రీనాథుడు కథావిధానమును వివరించినాడు. ''అభ్యుదయ పరంపరాభి

వృద్ధియు నభిమతార్థ సిద్ధియు సత్యధర్మ క్రియావృద్ధియునగున ట్లష్టాదశ వర్ణనా గర్భంబుగా నత్యాశ్చర్యకరంబై యుండ నా రచియింపంబూనిన కథావిధానంబు సకల పాప నిర్ముక్తంబై సర్వవస్తు సంధానంబై సర్వలక్షణ సంపన్నంబై సర్వాగమానూన సంభావితసంస్తుత్యంబై పరమ ధర్మోత్కృష్టంబై పరమేశ్వర ప్రియంబై పార్వతీ మనోహరంబై శ్రీనాథసేవితంబై బ్రహ్మరుద్ర దేవతాది సంస్తూయమానంబై శోభిల్లు నిప్పుణ్య చారిత్రంబు దశదోష వివర్జితంబై ...నా నేర్చిన విధంబున రచియించెద నది యెట్టి దనిన..." —శివరాత్రి మాహాత్మ్యము (1-34)

క్రీడాభిరామ మొక నాటక ప్రబంధము. క్రీడాభిరామ కృత్యవతరణికలో కృతికర్త వంశవర్ణన, కృతికర్తృప్రశంస, ప్రేమాభిరామ ప్రశంస అయిన తరువాత కథా ప్రస్తావన ఇట్లు కలదు.

"వ. నేపథ్యమున....'

"గతి రసికుండ! షట్పద! గానకళా కమనీయ! యోమధు
వ్రత! వికచారవింద వనవాటిక నేమిటికిం బరిత్యజిం
చితి వట విప్రదేశమునఁ జెట్టులఁ జేమల నేమి గల్గునన్
రతి నిటు సంచరించెదవు ప్రాఁబడి పోయెనె నీ వివేకమున్ (పీ. 39)

"చేరవచ్చి వచ్చి మూలంబుగాఁ బోను డాయవత్తు పద్మ పోయిపోయి
మాటలింక నేల మా వాటికికి నీవు మాయలేడివైతి మంచిరాజ! (పీ. 40)

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు హా! యీ నెఱింగితి నేకశిలానగరంబునం దాశ్వవాటంబునం గామమంజరి యను పునర్భువునందు బద్ధానురాగుండై కార్యాంతర వ్యాసంగంబునం దేశాంతర గంతుండైన కాసల్నాటి గోవిందమంచనశర్మ నుద్దేశించి యమ్ముద్దియ పుత్తెంచిన యసంబంధీభూత ప్రేమసంభుక్షణాగర్భంబైన మదన లేఖ సందేశ పద్ధతి యది పఠియించుచున్నవాఁడతని కట్టనుంగుఁ జెలికాఁడు టిట్టిభసెట్టి గావలయు నయ్యిరువురు నా బాల్య మిత్రంబులు వీరి యోగక్షేమంబులను సంధించెదంగాక యని నిష్క్రమింతుఁడయ్యె నిది ప్రస్తావన." —క్రీడాభిరామము (పీ. 41)

నాసికేతోపాఖ్యానమున దగ్గుపల్లి దుగ్గన "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచియింపం బూనిన నాసికేతోపాఖ్యానంబునకుం గథావతారిక యెట్టిదనిన" అని కథావతారికను తెల్పియున్నాడు.

దశకుమారచరిత్ర ద్వితీయాశ్వాస ప్రారంభమున కేతన 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన కథా నికాయం బను (సుర) లతాజాలం బెట్టిదనిన...' అని తెల్పినాడు. నేడు సర్వ సాధారణముగా కన్పించు 'అభ్యుదయ పరంపరాభివృద్ధి' పదముల క్రమము మొట్టమొదటిసారిగా కేతన దశకుమారచరిత్రయందు కన్పించును. తిక్కన నిర్వచనోత్తర రామాయణములో ఈ వచనమునకు ఆస్కారము లేకపోయినను మనుమసిద్ధికి 'అభ్యుదయమ్ము'గ అని వాడినాడు. షష్ఠ్యంతముల తరువాత ఈ వచనమును మొట్టమొదట వాడినది కేతనయే. ఇతనికి తర్వాత ప్రాచీన కవులందరు "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన...." అను మాటను వాడినారు.

మాదిగుంట నారాయణకవి సంస్కృతభాషలో సంకలితమైన పంచతంత్రమనెడి కథాసందోహమును ఆంధ్రీకరించినాడు. "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన పంచతంత్రియను మహాప్రబంధంబునందుం గల కథలకు" (1-47) అని అతడు పంచతంత్ర కథలను చెప్పినాడు

సాందోపాఖ్యానమున షష్ఠ్యంత రచన తరువాత రామరాజు రంగప్ప తన కవితా నైపుణ్యమును ఒక సీసపద్యమున తెల్పి "అని సాందోపాఖ్యాన చంపూకావ్యంబు శ్రీరంగపతికి నంకితంబు గావించితిఁ దత్కథా నిగమ వివాసంబునకు నోంకారంబుగాఁ బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుడు నిట్లనియె" (1-58) అని కథను ప్రారంభించినాడు.

కొందరు కవులు షష్ఠ్యంత రచన తరువాత వచనములో 'కథా ప్రారంభ మెట్టిదనిన' అని కథను ప్రారంభించియున్నారు. కృతిపతియగు నరసింహరాయలకు 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా రచియింపబూనిన వరాహపురాణంబునకుం గథా ప్రారంభం బెట్టిదనిన' అని నంది మల్లయ, ఘంట సింగనలు వరాహపురాణ కథను ప్రారంభించినారు. 'అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభిమత సిద్ధియుంగా నా యొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుం బ్రారంభంబు' అని దోనూరు కోనేరునాథకవి పద్య బాలభాగవత కథను ప్రారంభించినాడు. పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయావతారికలో "సమర్పణంబుగా నా యొనర్పంబూనిన లంకావిజయంబను వ్యర్థిప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన' అని కథను ప్రారంభించినాడు.

గ్రంథావతారికలో షష్ఠ్యంత రచన తరువాత కొందరు కవులు 'కథాసూత్రము'ను విరచించినారు. ప్రబోధ చంద్రోదయములో నంది మల్లయ ఘంట

పింగనలు "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా రచియింపంబూనిన ప్రబోధ చంద్రోదయంబను మహాకావ్యంబునకుం గథాసూత్రం బెట్టిదనిన" అని కథాసూత్రమును తెల్పినారు. "అనవరతాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచింపంబూనిన కృతికిం గథాసూత్రంబెట్టిదనిన" అని మైరావణ చరిత్రకర్తయగు మాడయ్య కవి కథాసూత్రమును విరచించినాడు. రఘునాథనాయకుడుకూడ వాల్మీకి చరిత్రమున "సమర్పితంబుగా నా యొనర్పంబూనిన వాల్మీకి చరిత్రంబను ప్రబంధ రత్నంబునకుం గథాసూత్రంబెట్టిదనిన" అని చెప్పినాడు.

అనంతామాత్యుడు భోజరాజీయమున షష్ఠ్యంతముల తరువాత "అఖిల జగద్ధితావతారుండ వగు నీకు విన్నపంబు సేయు విధంబుగా నేనొనర్పంబూనిన కథాప్రసంగం బవధరింపుము" అని కథను ప్రసంగించినాడు.

కొందరు కవులు షష్ఠ్యంతముల తరువాత కథాక్రమమును వివరించినారు. 'పరమకళ్యాణ పరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన యిమ్మహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన....' అని మారన మార్కండేయ పురాణమున తెల్పినాడు. మంచన కేయూరబాహు చరిత్రములో కృతిపతికి 'ఇష్టార్థసిద్ధియు నైశ్వర్య సమృద్ధియుఁ బుత్రపౌత్రాభివృద్ధియుఁగా నారచింపబూనిన కథాక్రమంబెట్టిదనిన' అని చెప్పినాడు. "త్రైలోక్య విజయంబుగా నా యొనర్పంబూనిన రాధామాధవంబను శృంగార ప్రబంధంబునకుం గథాక్రమంబెట్టిదనిన" అని చింతలపూడి ఎల్లనార్యుడు రాధామాధవమున కథాక్రమమును వివరించినాడు.

ఎఱ్ఱన నృసింహపురాణమునకు మూలము బ్రహ్మాండాది పురాణములు. "బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీనరసింహావతారంబను పురాణంబుఁ దెనుంగు బాసఁ బ్రకటింపవలయు" (1-27) నని ఎఱ్ఱనను అతని తాత కోరినాడు. బ్రహ్మాండ పురాణములో నృసింహ పురాణకథ అల్పాల్పము.

"ఏనును బెద్దలచే మును
వీనులలరఁ దరతరంబ విన్న విధంబున్
మానసమున నున్న తెఱంగుఁ
గాను పునంగన్న క్రమముఁ గథన మొనర్తున్" (1-24)

అని కథారంభమున చెప్పుటవలన నృసింహపురాణ కథలో కొంత కల్పితమని యూహింపవచ్చును. 'ఏను విన్నపంబు సేయంగల లక్ష్మీ నరసింహావతారంబను పురాణకథకుఁ బ్రారంభంబెట్టిదనిన' అని కథాప్రారంభము కలదు. కథా

ప్రారంభమునందు ప్రసిద్ధములగు క్షేత్ర తీర్థమాహాత్మ్యమును గాలవాది మునుల కోరికపై దేవశ్రవుడు అహోబల క్షేత్ర మాహాత్మ్యాదికమును వర్ణించుటయు తెల్పబడినది.

పింగళి సూరన రాఘవ పాండవీయమున "సభక్తికి సమర్పితంబుగా నా యొనర్పం బూనిన రాఘవ పాండవీయంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన" అని కథను ప్రారంభించినాడు. కళాపూర్ణోదయమున "అభ్యుదయపరంపరాభివృద్ధియు నాయురారోగ్యసమృద్ధియు నగునట్లుగా నా యొనర్పంబూనిన కళాపూర్ణోదయంబను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన" అని కథాక్రమమును వివరించినాడు. ప్రభావతీప్రద్యుమ్నములో కూడ "అక్షయకీర్తి వైభవాభివృద్ధియగునట్లుగా నేను సమర్పింపంబూనిన ప్రభావతీ ప్రద్యుమ్నంబునకుం గథాక్రమంబెట్టిదనిన" అనియే కథాక్రమమును తెల్పినాడు.

సాధారణముగా కవులు షష్ఠ్యంతముల తరువాత కృతిపతికి అభ్యుదయ పరంపరాభివృద్ధిగా కావ్యమును చెప్పుట పరిపాటి. విన్నకోట పెద్దన మాత్రము తన కావ్యాలంకార చూడామణిలో "అభ్యుదయ పరంపరల కకంపిత స్థితి యావహిల్లునట్లుగా మద్విరచనీయంబగు కావ్యాలంకార చూడామణి యను నలంకార లక్షణంబునకుఁ బ్రథమావతరణం బెట్టి దనిన" (1-16) అని తెల్పినాడు.

యయాతి చరిత్రలో షష్ఠ్యంతములకు పిమ్మట "సిరులుం గడు నమరు కొమరులుం గలిగి మనునట్లుగా నా యొనర్పంబూనిన యబ్బురంబగు నిబ్బలు కబ్బంబునకుం బ్రాపయగుత్రోవ యెట్టిదనిన" అను వచనము గలదు.

షష్ఠ్యంతముల తరువాత ఒక వచనములో కథావతారికను సూచించుట తెలుగు కావ్యములలో సంప్రదాయముగా నియతమైనది. అప్పకవీయము, నీలా సుందరీ పరిణయము మున్నగు వానిలో వచనమునకు బదులు పద్యములున్నవి. అప్పకవీయములో షష్ఠ్యంతములకు పిమ్మట ఈ పద్యమున్నది :

"అంకితము గాఁగ నేఁ జేయునట్టి యాంధ్ర
శబ్ద చింతామణి గ్రంథ సార పాద
పంబునకు నాలవాలంబు పగిది నొప్పు
నట్టి భాషా పరిచ్ఛేద మెట్టిదనిన"

—అప్పకవీయము, పీ. 104

నీలాసుందరీ పరిణయములో కూచిమంచి తిమ్మకవి కృతిపతియగు శివునకు అయిదు షష్ఠ్యంత కందములను అర్పించిన తరువాత ఈ క్రింది పద్యమును చెప్పెను.

"అప్పనంబుగ నెలమితో నచ్చు తెనుఁగు
బాగచే నిప్పుడే నొసఁగఁ గోడఁగిన
నీలయను పేరఁ దేజున నిప్పటిల్లు
నింతి పెండిలికత తెలుఁగొల్పునిక"
—నీలాసుందరీ పరిణయము (1-23)

సింహాసన ద్వాత్రింశికలో కొరవి గోపరాజు షష్ఠ్యంతములను చెప్పలేదు. గోపరాజు తన్నుగూర్చి కొంత తెల్పుకొని—

"చిత్రఖ్యాతి విశీర్ణ విక్రమ నిధిశ్రీ విక్రమాదిత్య చా
రిత్ర ఖ్యాపన శాసనంబులకు భూరి స్తంభ సంభారమై
ధాత్రీ పాలురుఁ గావ్య వేదులును మోదంబంద సింహాసన
ద్వాత్రింశత్కథల గుణంబులలరఁ గావ్యంబుగాఁ జెప్పెదన్"
—సింహాసన ద్వాత్రింశిక (1-59)

వ. "అది యెట్టిదనిన...."

అని కథను ప్రారంభించినాడు.

కొందరు కవులు ప్రతి ఆశ్వాసాంత గద్యలోను ఆ ఆశ్వాసమునందలి కథానుక్రమణికను సంగ్రహముగా చెప్పినారు. ఆశ్వాసాంతగద్యలనుబట్టి కావ్యములోని విషయసూచిక నెరుంగవచ్చును. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము, అప్పకవీయము, తరిగొండ వేంకమాంబ వేంకటాచల మాహాత్మ్యము, కృష్ణకవి శకుంతలాపరిణయము మున్నగువాని ఆశ్వాసాంతగద్యలందు గ్రంథవిషయసూచిక కలదు. కావ్యములోని కథావస్తువును సంగ్రహముగా తెలిసికొనుట కిది యెంతయు తోడ్పడగలదు. అప్పకవీయములోని ఆశ్వాసాంత గద్యలోని కథానుక్రమణికను చూచిన ఈ విషయము స్పష్టమగును....

"ఇది శ్రీమదాపస్తంబసూత్ర....కాకునూరప్పకవి వర్య విరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యను సంధ్ర వ్యాకరణ శాస్త్రంబునందు గోవింద, కౌస్తుభ, వైజయంతీ, శ్రీవత్స, మురళీ, పంచాయుధ, పీతాంబర, బర్హి, బర్హా, లక్ష్మీ, క్షమా, నంత, గరుడ, విష్వక్సేన, మారుతి, పరమభాగవత, విధాతృ, శారదా, శివ, భవానీ, గణేశ, గుహ, లోకపాల, గ్రహ, పురాతన వర్తమాన భావి కవిగురు

నమస్కారంబును, స్వప్నప్రకారంబును, భగవద్వాక్యంబును, గ్రంథప్రభావంబును, గర్త్రుపంశావతారంబును, గవి విచారంబును, షష్ఠ్యంతములును, మూలసూత్రంబులును, బూర్వగ్రంథనామసంగ్రహమును, ప్రబంధమహిమయుఁ, గావ్యభేదంబులును, శబ్దార్థలక్షణాలంకారదోషంబులును, వాక్యలక్షణంబును, రసవివేకంబును, పంచవిధభాషంబులును, శృంగార రసస్వరూపంబును, అష్టరసప్రపంచంబును, నాయకనిర్ణయంబును, సుకవిమాహాత్మ్యంబును, పల్లక్షణంబును, సప్తవిధకవులును, గుకవి నిరసనంబును, గవితాప్రశంసయు, దేశభాషా విశేషంబులును, భాషాష్టకోత్పత్తి వివరణంబులును, ప్రకృతి వికృతి భేదంబులును, దద్భవంబులును, అంధ్రభాషాభేద చతుష్టయంబును, బూర్వకవి సమయ సిద్ధపదంబులును, గ్రామ్యాగ్రామ్యంబులునుగల భాషాపరిచ్ఛేదంబను ప్రథమాశ్వాసము'' (పుట 43).

ఇది ప్రథమాశ్వాసములోని కథానుక్రమణిక. ఇట్లే అప్పకవీయములోని తక్కిన ఆశ్వాసాంత గద్యలందు తదాశ్వాసవస్తు వివరణము కలదు. అప్పకవివలె నింత వివరముగా ఆశ్వాసాంతములందు వస్తువివరణమును చేసిన కవి తెలుగులో మరొకరు లేరు.

కృష్ణకవి శకుంతలాపరిణయములోని ఆశ్వాసాంతగద్యలోని కథాసూత్ర వివరణమును గమనింపుడు :

''ఇది శ్రీమత్కౌసల్యానందన ప్రసాద సమాసాదిత కవితా విచిత్ర మైత్రేయ సగోత్ర నృసింహ గురుపుత్ర కృష్ణకవి ప్రణీతంబైన శకుంతలా పరిణయంబను మహాప్రబంధంబునందు శకుంతలా దుష్యంత సంసారంబును శ్రీవిష్ణు సాక్షాత్కారంబును శ్రీవిష్ణు సంకీర్తనంబును భరత యౌవరాజ్య పట్టాభిషేకంబును శకుంతలాదుష్యంత పునస్సంభోగోపాఖ్యానంబును నను కథలంగల సర్వంబును దృతీయాశ్వాసము''

వేంకమాంబ వేంకటాచల మాహాత్మ్యము, వాసిష్ఠరామాయణము, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము మున్నగు గ్రంథములందలి ఆశ్వాసాంతగద్యలందును కథావివరణము కలదు. సంగ్రహముగా కథాస్వరూపము నెరుంగగోరువారికి ఈ గ్రంథములలోని ఆశ్వాసాంత గద్యలు మిగుల నుపకరించును.

షష్ఠ్యంతముల తరువాత చెప్పబడిన కథావతారిక వాక్యమునుబట్టి ఆ గ్రంథము కవిదృష్టిలో పురాణమా ? కావ్యమా ? ప్రబంధమా ? ద్వ్యర్థి రచనయా అను నటువంటి విశేషములను మనము తెలిసికొనవచ్చును. కథాప్రారంభమున కవి అవలంబించు వస్తుగుణను కొంతవరకు ఊహించుటకు కూడ నిది తోడ్పడుచున్నది.

# 15

# అవతారికా నిర్మాణము- కొన్ని విశేషాంశములు

తెలుగు కావ్యావతారికా నిర్మాణములోని మరికొన్ని విశేషాంశములను, పూర్వప్రకరణములలో చెప్పనివానిని ఈ క్రింద పేర్కొని పరిశీలింతము.

## 1. అవతారికను ప్రథమ పురుషలో వ్రాయుట :

సాధారణముగా తెలుగు కావ్యావతారిక లన్నియు ఉత్తమపురుషలో రచింపబడినవే. నన్నయ ఉత్తమపురుషలో గాక 'తెనుంగునన్ మహాభారత సంహితా రచనబంధురు డయ్యె' నని ప్రథమపురుషలో చెప్పికొన్నాడు. నన్నయ భారతావతారిక ప్రథమపురుషమున రచితమగుటచే నది నన్నయ కృతము కాదనియు నారాయణభట్టో మరొకరో భారతావతారికను రచించి ఇందు చేర్చియుందురని కొందరు భావింతురు. ఈ ఊహకు ఆధారములు ఏమియు లేవు. వాల్మీకి రామాయణమునకూడ ప్రారంభమున రామాయణ కథావతారికలో వాల్మీకి నారదుని అడిగినట్లు ప్రథమపురుషలో చెప్పబడినది. వాల్మీకి రామాయణమున నున్నట్లు నన్నయ భారతావతారిక ప్రథమపురుషలో నున్నది.

"అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే"

—ఆదిపర్వము (1-19)

అను పద్యమునుబట్టి నన్నయ వినయసంపదను తెలిసికొనవచ్చును. భారతావతారికలో నన్నయ స్వవృత్తాంతమును కొంత చెప్పుకొనవలసియున్నది. స్వవృత్తాంతమును ఉత్తమపురుషలో వివరించిన నది అహంకారమునో ఆత్మ శ్లాఘాపరాయణత్వమునో సూచించునని కాబోలు వినయసంపన్నుడగు నన్నయ ప్రథమపురుషలో అవతారికను నిర్మించియుండును. నన్నయ భారతావతారికను మరొకరు రచించిరనుట యుక్తియుక్తము కాదు.

బమ్మెరపోతన కూడ తన భాగవతావతారికలో 'సమ్మతి శ్రీహరికిచ్చిచెప్పె పీ బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్' (1-13) అని ప్రథమ పురుషము నుపయోగించి యున్నాడు. ఇదికూడ నన్నయవలెనే వినయసంవత్ప్రేరితమైనట్టి చర్యయే. భాగవతములోని ఈ పద్యమును పోతన వ్రాసియుండడని అది ప్రక్షిప్తమని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విశ్వసించిరి.[1]

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమునందలి అవతారికలో కవి ప్రతిజ్ఞా వాక్యములందు ప్రథమపురుష ప్రయోగింపబడినది. సకలవిధ దోషాకరంబైన శివరాత్రి మాహాత్మ్యావతారికను శ్రీనాథుడు రచింపలేదని కొందరు తలంతురు. పోతనతో పోల్చి చూచిన శ్రీనాథుడు వినయసంపన్నుడని చెప్పుటకు వీలులేదు. కనుక శివరాత్రి మాహాత్మ్యములోని అవతారికలో ప్రథమపురుషను శ్రీనాథుడు వాడియుండడు. మరొకకవిచే శివరాత్రి మాహాత్మ్యావతారిక పూరింపబడియుండును. తెలుగు కావ్యములలోని ఆశ్వాసాంతగద్యలన్నియు ప్రథమపురుషలో రచింపబడినవే.

## 2 అన్యకవులచే అవతారికలు :

ఒక కవి రచించిన పద్యము మరొక కవి గ్రంథములో కన్పించుట, ఒక కవి వ్రాసిన గ్రంథము మరొక కవి పేరుమీదుగా ప్రచారము నొందుట అనునది తెలుగు సాహిత్యచరిత్రలో క్రొత్తకాదు. ఎఱ్ఱన భారతములోని 'అంబ నవాంబుజోజ్జ్వల' అను పద్యము పోతన రచనగా ప్రచారము నందినది. ప్రతులకు ప్రతికలను వ్రాసికొను లేఖకులు చేసిన పొరపాట్లమూలముగనే తెలుగుచరిత్రలో ఈవిధమయిన చిక్కులేర్పడినవి. కొన్ని గ్రంథములకు (విష్ణుమాయానాటకము మొదలగువానికి) గ్రంథకర్త ఎవరయనది తెలిసికొను సమస్య ఒకటితెలుగుసాహిత్య

1. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు—పుట 11.

చరిత్రలో తలెత్తినది. కొన్ని కావ్యములందు కథాభాగమును ఒకరు రచింపగా అందలి అవతారికను మరొకరు రచించినట్లు తెలియుచున్నది. అన్యకవులచే రచింపబడిన గ్రంథావతారికలు గల కావ్యములను ఈ క్రింద పేర్కొందము.

శివరాత్రిమాహాత్మ్యము శ్రీనాథరచితమని గ్రంథాధారములనుబట్టి తెలియుచున్నది. 'సత్కవి సార్వభౌముండగు శ్రీనాథకవి వరేణ్యుని గృహాభిశేఖరంబు.... గాంచి' (శివ 1-13) 'అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్య పౌత్రుండును మారయామాత్యపుత్రుండును నగు శ్రీనాథకవి వరేణ్యుండ సంతుష్టమానసుండై ...' (1-37) అను మాటలనుబట్టియు, ఆశ్వాసాంత గద్యలనుబట్టియు శ్రీనాథుడు కవిసార్వభౌమ బిరుదమందిన తర్వాత శివరాత్రిమాహాత్మ్యమును రచించియున్నట్లు తెలియుచున్నది. ఈ గ్రంథమునందు దోషము లధికముగా నుండుటచే నది శ్రీనాథుని బాల్యకృతియని నాగపూడి కుప్పుస్వామయ్యగారు తలంచిరి. కాని ఈ దోషములు, అప్రౌఢకవిత అవతారికాభాగమునందే కన్పించును. కనుక శివరాత్రిమాహాత్మ్యావతారికను మరొకకవి రచించి యిందు చేర్చి యుండునని కొందరు తలంచిరి. "శ్రీనాథుడు గ్రంథము పూర్తిచేసి యవతరణిక రచింపక మునుపే కైలాసమున కేగెను. పిదప శ్రీశైలవాసియగు శాంతయ యెట్లో యాయేక లిఖిత ప్రతిని సంపాదించి కొంతధనము వెచ్చించియో లేక స్వయముగనో లేక తన యాశ్రితుడగు నొక యప్రౌఢకవిచేతనో యుపోద్ఘాతము నుద్భవింపజేసి జనకవియుక్తమై నిరాలంబమైన యాకృతికన్యను తన కంటగట్టుకొనియెనని యూహించుట సాహసము కానేరదు. గ్రంథారంభమునందలి యిష్టదేవతాస్తుతియు, గవిస్తుతియు, గృతిపతి కృతికర్త నుద్దేశించి పలికిన వాక్యములును గల ప్రతిజ్ఞావాక్యములందలి ప్రథమపురుష ప్రయోగములును వేయేల సకలవిధదోషాకరంబైన యవతారిక యెల్లను శ్రీనాథుని యితర సర్వవిధ గ్రంథములకు భిన్నమార్గము గలదై పై సిద్ధాంతమును బోషించుచున్నది. కావున నిందలి యవతారిక శ్రీనాథవిరచితము కాదనియు, గథాభాగము నాలుగాశ్వాసములు మాత్రము కాశీఖండానంతరము 1440 ప్రాంతమున శ్రీనాథుని చరమదశయందు రచింపబడెననియు నీ గ్రంథమందలి కథానాయకుని తోడనే శ్రీనాథుడును బ్రహ్మపదవినందెననియు నీ కృతియే శ్రీనాథుని యంత్యకృతియనియు - దీనికంటె నర్వాచీనకృతి కనబడువఱకు నూహింపవచ్చును" అని కట్టి సాంబమూర్తిగారు శివరాత్రిమాహాత్మ్య పీఠికలో తెల్పియున్నారు. శివరాత్రిమాహాత్మ్య గ్రంథావతారిక

గ్రంథపాతములతో నున్నది. కావున తెలియదగిన విశేషములు కొన్ని మరుగుపడి యున్నవి. అవతారికారచనలోని అప్రౌఢతను బట్టియు, శ్రీనాథుని ఇతర గ్రంథావతారికలకంటె భిన్నమార్గము కల్గియుండుటను బట్టియు శివరాత్రి మాహాత్మ్యావతారిక శ్రీనాథ విరచితము కాదని చెప్పవచ్చును.

హరిభట్టు నరసింహపురాణములోని అవతారిక అతని కుమారుడగు రాఘవ మనీషిచే రచింపబడి ప్రోలుగంటి వంగమంత్రి (1540) కి అంకితము చేయబడినట్లు తెలియుచున్నది.

ఘటికాచలమాహాత్మ్యములోని అవతారికాభాగమును పూర్తిచేయకయే తెనాలి రామకృష్ణుడు పరమపదించినాడు. తెనాలిరామకృష్ణుని మనుమడు ఘటికాచల మాహాత్మ్యమును ఖండోజీ యను మహారాష్ట్రరాజునకు వెంకటగిరికవిచే అవతారికను వ్రాయించి కృతి యిచ్చినాడు. కృత్యాదిపద్యములను రామకృష్ణకవి వ్రాయలేదనియు వెంకటగిరి కవియే వ్రాసినాడనియు అవతారికనుబట్టి తెలియుచున్నది.

సింగరాచార్య కృతమగు బిల్హణీయము పండిపెద్ది కృష్ణస్వామి పేరుమీదుగా ప్రచారము నందియున్నది. బిల్హణీయము చిత్రకవి సింగరాచార్య విరచిత మని బిల్హణీయమున ప్రథమాశ్వాసాంతపద్యమగు చక్రబంధమున 'సింగరాచార్య కృతి' అనుమాట సూచించుచున్నది. సింగరాచార్య రచితమగు రాఘవవాసుదేవీయమునందలి ఈ క్రింది పద్యమువలన గూడ సింగరాచార్యుడు బిల్హణీయమును రచించినట్లు సువ్యక్తమగుచున్నది :

"అనెడు నన్ను బుధుల్ గొనియాడి బిలహ
ణంబు మొదలైన కృతులు విన్నాణము తెలుఁగు
నిపుడు భగవత్కథాప్తి నూహించునట్టి
కావ్యము రచించు శ్లేషోక్తి కవులు మెచ్చ"

సింగరాచార్యుడు వైష్ణవుడు. ఇతని ఇంటిపేరు క్రొత్తపల్లివారు. ఈ సింగరాచార్యునికి 'చిత్రకవి' యను బిరుదనామము వచ్చినది. అదిమొదలు వీరి సంతతి వారి కందరికిని 'చిత్రకవివారు' అను ఇంటిపేరు ప్రసిద్ధికెక్కినది. రాఘవవాసుదేవీయము ఆశ్వాసాంత గద్యమున 'ఇది శ్రీమదళహసింగరి స్వరూప శ్రీమన్నారాయణముని గురుచరణసేవా సంప్రాప్త కవితా సామ్రాజ్యధౌరేయాత్రేయగోత్ర పవిత్ర క్రొత్తపల్లి రంగాచార్య పుత్త్ర చిత్రకవి సింగరాచార్య ప్రణీతంబైన వాసుదేవీయం బను....' అని యున్నది.

బిల్హణీయము అవతారికలో పండిపెద్ది కృష్ణస్వామి రచించినట్లు కలదు. పండిపెద్ది కృష్ణస్వామి 'హృద్యవిద్యానవద్యులగు విద్వదాద్యులు గొలువం గొలువు కూటంబున' నుండు సమయమున—

"చిత్రకవి వంశ దుగ్ధాబ్ధి శీతభానుఁ
డనుపమానోక్తి శ్రీ సింగరార్యసూనుఁ
డమిత కవితా విశేషజ్ఞుఁ డనఁగ వెలయు
నారసింహార్య కవి వచ్చి నన్ను మెచ్చి" 1-6

వినుతించినట్లు కలదు. నారసింహార్యుడు కృష్ణస్వామితో 'భవదీయంబులగు చతుర్దశ విద్యా ప్రభావంబులు సకలభాషా విశేషంబులు సమస్త చమత్క్రియా వినోదంబులు నెన్న నిన్నరులకుఁ దరంబుగాదు నిఖిలలోకంబులఁ గీర్తినిత్యంబగు నట్టి కృతులయందు నాంధ్రం బతిరమణీయంబు గావున నొక్క పురాతన కథ నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాంకితంబు చేసి యాచంద్రతారకంబగు సత్కీర్తిం గాంచు' మన్నాడట.

పండిపెద్ది కృష్ణస్వామి నారసింహార్యుల సహాయమును ఇట్లు కొని యాడినాడు.

"మున్నింద్ర తనూభవునకు వెన్నుండు సహాయుఁడైన విధమున నేనా
సన్నుత సద్గుణ గణ సం పన్నుండగు కవివరాధిప సహాయమునన్" 1-10

ఆశ్వాసాంత గద్యలోకూడ పండిపెద్ది కృష్ణస్వామి రచించినట్లుగానే యున్నది. 'ఇది శ్రీ సీతారామ చరణసేవాప్రభావ సంపాదిత కవితా విచిత్ర కాశ్యప గోత్ర పవిత్ర శ్రీమత్పండిపెద్ది కృష్ణస్వామి ప్రణీతంబయిన బిల్హణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.' కాని వాస్తవముగా బిల్హణీయమును రచించినది సింగరాచార్యుడని తెలియుచున్నది. ఈ బిల్హణీయమును కృతికర్త అనంతరము అతని పుత్రుడైన నరసింహాచార్యుడు పండిపెద్ది కృష్ణ స్వామికి ధావుకాదులు శ్రీహర్షాదులకుపలె నొసంగినాడు. సింగరాచార్యుని బిల్హ ణీయములో అవతారిక మార్పుచెందినది. కృష్ణస్వామి విరచితమని అందుండుటకు హేతువు అవతారిక మార్పు ముఖ్యకారణము.

## 3. అవతారికలలో పేర్కొనబడిన పూర్వకవుల కావ్యరచనలు :

లక్షణగ్రంథముల, సంకలన గ్రంథముల మూలముననే గాక కావ్యావతారి కలవలనకూడ కవుల పూర్వ కావ్యరచనల నెరుంగవచ్చును. పలువురు కవులు తమ

పూర్వరచనలను గ్రంథావతారికలో పేర్కొనియున్నారు. వానిలో పెక్కు గ్రంథములు అలభ్యములై యుండుటవలనను, లభ్యములగు వానిలో కొన్ని అముద్రితములై యుండుటను బట్టియు సాహిత్య ప్రపంచమున అవి విపులప్రచారము నొందలేదు. కావ్యావతారికలవలన అలభ్యములైన కొన్ని గ్రంథములు మనకు తెలియుచున్నవి.

ఎఱ్ఱన తన రచనలను నృసింహపురాణావతారికలోని ఈ క్రింది పద్యమున తెల్పియున్నాడు :

"ఉన్నతసంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"

—నృసింహపురాణము. (1-17)

ఎఱ్ఱన మొదట ఒక కావ్యమును ఆపిమ్మట అరణ్యపర్వశేషోన్నయమును, ఆటుతర్వాత నృసింహపురాణమును రచించినట్లు ఈపద్యమునుబట్టి తెలిసికొనవచ్చును. హరివంశములో రామాయణ మొకటి తప్ప నృసింహపురాణమును పేర్కొనలేదు. నృసింహపురాణములో హరివంశ ప్రశంస కానరాదు. ఎఱ్ఱన రామాయణము అలభ్యము. ఎఱ్ఱన చిన్నిమనుమడగు చదలువాడ మల్లన తన విప్రనారాయణ చరిత్రావతారికలో ఎఱ్ఱన రచనల నీ క్రింది పద్యమున పేర్కొనినాడు :

"ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు గాఁగ
వల్మీకభవు వచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణ మొనర్చె హరి మెచ్చ
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశ... భాగముల్
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న
దురితహరుఁ బ్రబంధ పరమేశ్వరుని జెద
ల్వాడనిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ
డను నుతింప బ్రహ్మకును దరంబె!"

—విప్రనారాయణ చరిత్రము (1-13)

పై పద్యమువలన ఎట్టిన రచనలు మాత్రమేగాక వాని రచనాక్రమముకూడ కొంత తెలియుచున్నది.

శ్రీనాథుడు బహుగ్రంథకర్త. అతడు శృంగారనైషధమునకు ముందు ఆరాధ్యచరిత్రము రచించి మామిడి సింగనమంత్రికి అన్న యగు పెగడయ్యకు కృతి యిచ్చినట్లు శృంగారనైషధావతారికలోని ఈక్రింది పద్యమునుబట్టి తెలియు చున్నది.

"జగము నుతింపగఁ జెప్పితి పెగడయ్యకు నా యనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసార సంగ్రహ మగు నాయారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్"

—శృంగార నైషధము (1-14)

'ఆరాధ్యచరితదిమాగఁ బెక్కుల్' అనుటచే ఆరాధ్యచరిత్రకాక మరికొన్ని కృతులనుకూడ శ్రీనాథుడు రచించినట్లు తెలియుచున్నది. భీమేశ్వర పురాణావతారికలో శ్రీనాథుడు తన గ్రంథముల నిట్లు పేర్కొనెను:

"నవమరుత్తచరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్య చరిత మనఁగ
గావ్యములు పెక్కు సెప్పియుఁ గాంక్ష సనక
వెండియును గావ్యమొకటి గావింపఁదలఁచి"

—భీమేశ్వర పురాణము. (1-7)

అని భీమేశ్వరపురాణమును చెప్పినాడు. కాశీఖండ కావ్యావతారికలో శ్రీనా థుని గ్రంథ రచనాక్రమము ఈక్రింది విధముగ వర్ణింపబడినది.

"చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబునయందు హర్షనైషధ కావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయః పరిపాకమునఁ గొనియాడితి భీమనాయకుని మహిమ
బ్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశ కటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి"

—కాశీఖండము. (1-7)

పైన పేర్కొనిన కావ్యములలో మరుత్తరాట్చరిత్రము, శాలివాహన సప్తశతి, పండితారాధ్యచరిత్ర-ఈ మూడును లభ్యము కాలేదు. హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యములు శ్రీనాథుని గ్రంథములనుట నిర్వివాదము. ఈ రెండు గ్రంథములను కాశీఖండాదులలో పేర్కొనబడలేదు. హరవిలాసములో ఒక్క నైషధ కావ్యము మాత్రమే పేర్కొనబడినది. 'కల్పించినాడవు గాఢపాకంబైనహర్షనైషధ కావ్య మాంధ్రభాష' భీ. పు. (1-23) అనుటచే శృంగారనైషధము ప్రౌఢకావ్యముగా చెప్పబడినది. కవిసార్వభౌముడు తనకు గల కవితావిభవమును తెలియ జేయదలచినపుడెల్ల నైషధరచనమును స్మరించుచునే వచ్చినాడు.

పల్నాటి వీరచరిత్రలోని కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధములను శ్రీనాథుడు రచించినట్లు ఆద్యంతములందును కలదు. కాటమరాజు కథను శ్రీనాథుడు ద్విపదలో రచించినట్లు గుఱ్ఱముకొండ భక్తవత్సల కవి తన పద్య కాటమరాజు కథావతారికలో 'శ్రీనాథుఁడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా రచియించెఁ గాటమరాజు చరిత' అని తెల్పినాడు. శ్రీనాథుని కాటమరాజు కథ నేడు కానరాదు. దంతులూరి బాపిరాజు తన మూర్తిత్రయోపాఖ్యానావతారికలో తన తాతయగు గన్న నరపతి 'శ్రీనాథసుకవీంద్రునిచే ధనంజయ విజయంబను సత్కావ్య మందికొనియె'నని తెల్పినాడు. దీనినిబట్టి శ్రీనాథుడు ధనంజయ విజయమును రచించినట్లు తెలియు చున్నది. కామశాస్త్రమున నేదో ఒక గ్రంథమును శ్రీనాథుడు రచించినట్లు నెల్లూరి శివరామకవి తన 'కామకళానిధి' యను గ్రంథమున ప్రస్తావించియున్నాడు. శ్రీనాథుని నందనందనచరిత్ర లోనివని రెండుపద్యములు రంగరాట్ఛందమునను, ప్రయోగరత్నాకరమునందును ఉదాహరింపబడినవి. కాని ఈ గ్రంథము లేవియు లభ్యము కాలేదు. శ్రీనాథుడు తన గ్రంథములలో పేర్కొనిన కావ్యముల జాబితాలో కూడ నివి లేవు. క్రీడాభిరామముకూడ శ్రీనాథకృతమే అని కొందరి భావము. వల్లభామాత్యునికి శ్రీనాథుడు క్రీడాభిరామరచనమున తోడ్పడి యుండునని యూహింప వచ్చును. బండారు తమ్మయ్యగారు క్రీడాభిరామ పీఠికలో ఇట్లు తెల్పినారు: క్రీడాభిరామమునకు "దొరికిన తాళపత్రప్రతి యేకైకమాత్రము. అదియు శిథిలాతిశిథిలము, అవతారికాభాగము మరింత శిథిలము, ఈ నష్టమయిన యవతారికలో శ్రీనాథుని సాహాయ్య ముదాహృతమై యుండుననియు దానినిబట్టియే యందలి పద్యములను పూర్వ లాక్షణికులు కొందఱు వల్లభరాయకృతములుగాను మఱి కొందఱు శ్రీనాథ కృతములుగాను బేర్కొని యుందురు."

దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానమునకు మునుపు కాంచీపురమాహాత్మ్యము రచించి గంగయమంత్రి పినతండ్రి కొడుకగు దేవయమంత్రి కంకితము చేసినట్లు నాసికేతోపాఖ్యానావతారికలోని ఈక్రింది పద్యమునుబట్టి తెలియును.

"మా పినతండ్రి గంగయ యమాత్యశిఖామణి తత్తనూభవుం
డై పెనుపొందు దేవసచివాగ్రణి కిచ్చితి చంద్రభూషణు గాం
చీపురనాథు దివ్యకథఁ జిత్రతరంబుగ విస్తరించి నీ
వోపుదు వార్యహృద్యమధురోక్తుల సత్కృతు లొప్పఁజెప్పఁగన్"

—నాసికేతోపాఖ్యానము (1-20)

కాంచీపురమాహాత్మ్య మిప్పటికిని ఉపలబ్ధము కాలేదు.

పిల్లలమర్రి పినవీరభద్రుని శృంగారశాకుంతలము, జైమిని భారతము అను రెండు గ్రంథములును లభ్యమై విపులప్రచారము నందియున్నవి. వీనికంటె ముందుగ పినవీరభద్రుడు పెక్కు గ్రంథములను రచించినట్లు శృంగారశాకుంతలము అవతారికనుబట్టి తెలియుచున్నది. ఈక్రింది పద్యమును చూడుడు :

"రచియించినాఁడవు రమణీయవాగ్రీతి నవతార దర్పణం బభినవముగఁ
బల్కినాఁడవు తేటపడఁ జేసి నారదీయంబు సత్కవి శ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసిత శయ్య
భారతీ తీర్థయతి సార్వభౌమ గురు కృ
పాతిశయలబ్ధ కవితావిభూతి గలిగి
గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత
విపుల చాటూక్తి నిర్నిద్ర వీరభద్ర"

—శృంగార శాకుంతలము (1-22)

పై పద్యమున పేర్కొనబడిన అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాసము—ఈ నాల్గు గ్రంథములును నామమాత్రావశిష్టములయినవి. ఇవిగాక 'పురుషార్థ సుధానిధి' అనుగ్రంథమునుగూడ పినవీరభద్రుడు రచించెనట. అదియును లభ్యముకాలేదు.

పోశెట్టి లింగన తన ద్విపద నవచోళచరిత్రావతారికలో మలహణచరిత్రము, శంకరదాసమయ్య చరిత్రము, వీరసంగయ్యదేవ చరిత్రము, శిష్యప్రబోధము

అను ద్విపద కావ్యములనుకూడ రచించినట్లు తెల్పియున్నాడు. ఈ ద్విపద గ్రంథము లేవియు లభ్యముకాలేదు.

తాళ్లపాక చిన్నన్న తన అష్టమహిషీకల్యాణావతారికలో తిరుమలాచార్యుని రచనలని పేర్కొనిన వానిలో ఆంధ్రవేదాంతము, హరివంశము అను ద్విపద గ్రంథములు రెండును అలభ్యములయినవి. తిరుమలాచార్యుని చక్రవాళమంజరి, రేఫ అకార నిర్ణయము మాత్రము ముద్రితములైనవి.

ఆముక్తమాల్యద అవతారికలోని ఈక్రింది పద్యమువలన శ్రీకృష్ణదేవ రాయలు పెక్కు సంస్కృతగ్రంథములను రచించినట్లు తెలియుచున్నది.

"పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకల కథాసార సంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుఁగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞాన చింతామణి కృతి
మఱియు రసమంజరీ ముఖ్యమధుర కావ్య
రచన మెప్పించి కొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ."

—ఆముక్తమాల్యద, (1-13)

పైన పేర్కొనబడిన మదాలసచరిత్రము, సత్యావధూప్రీణనము, సకలకథా సారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మున్నగు సంస్కృతగ్రంథము లేవియు ప్రస్తుతము లభ్యము కాలేదు.

అప్పకవి తన లక్షణగ్రంథమును రచింపక పూర్వమే శ్రీశైలములో 'భోగి విభూషణుని పట్టపు కవీంద్రు'డై యుండెనట (అప్పకవీయము, పీ. 84). 'మహిత సాధ్వీ జనౌఘధర్మ ద్విపదము నంబికావాదమను యక్షగానకృతియు' అని పీఠిక (ప. 85) లో చెప్పుటచే అప్పకవి సాధ్వీజనధర్మ ద్విపదను, అంబికావాద మను యక్షగానమును రచించినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథములు అలభ్యములయినవి.

ఇట్లు సుప్రసిద్ధులగు కవుల కావ్యములు కొన్ని అలభ్యములైనను వాని నామస్మరణము అవతారికలలో నుండుటచే వాఙ్మయచరిత్రరచనకు కొంత ఆధార మగుచున్నది. కావ్యరచనలు మాత్రమేగాక వాని రచనాక్రమముకూడ నెరుంగుటకు కృత్యాద్యవతారికలు చాల నుపకరించుచున్నవని ఇందు మూలమున స్పష్టమగు చున్నది.

## 4. విశేషవృత్త రచన :

ప్రాచీన సంస్కృతకావ్యములందు ఏకవిధవృత్తముతో సర్గమంతయు వ్రాసి సర్గాంతమున మాత్రము విశేషవృత్తమును గూర్చుట నియతముగా కలదు. తెలుగులో ద్విపదకావ్యములు, శతకములందు ఏకవిధపద్యరచన కలదు. తక్కిన పద్యకావ్యములందు వివిధచ్ఛందస్సు లుపయోగింపబడినవి. తెలుగుకావ్యములందు ఆశ్వాసాంతమున మాలిని, సుగంధి, ఉత్సాహము, కవిరాజవిరాజితము, లయ గ్రాహి, స్రగ్ధర, పంచచామరము మొదలగు విశేషవృత్తములు వాడుట సంప్ర దాయము. ఈ విశేషవృత్తములు ఆశ్వాసాంతమునందుమాత్రమేగాక కథా సంద ర్భములందును, గ్రంథావతారికలందును గూడ తరచుగ వాడబడినవి. గ్రంథావతారి కలలోని విశేషవృత్తములను పరికింతము.

అర్థమో, భావమో విలక్షణముగా నుండవలెనని కవి భావించుటవలన విశేష వృత్తరచన ఏర్పడినది. తెలుగులో కొందరు కవులు కేవల పాండిత్యప్రకర్షకుగాక ప్రత్యేక ప్రయోజనమును కాంక్షించికూడ విశేషవృత్తరచనను చేసినారు. మరి కొందరు విశేషవృత్తములను వాడుటలో ఔచిత్యమును పాటించినారు. మొత్తము మీద గ్రంథావతారికలందు కవులు వాడిన విశేషవృత్తము లన్నియు దేశీయము లయిన ఛందస్సులకు దగ్గరగా నున్నవే అని చెప్పవచ్చును.

దేవతాస్తుతివి విశేషవృత్తములో చేయుట నన్నయ, నన్నెచోడులందు కలదు. నన్నయ భారతావతారికలో దేవతాస్తుత్యాదికమునకు 'తరలము'ను వాడి నాడు. విప్రనారాయణ చరిత్రము, యయాతి చరిత్రము మొదలగు కావ్యావతారిక లందును తరల ముపయోగింపబడినది. ఈ తరలము దేశీయచ్ఛందస్సునకు సన్ని హితముగా నున్నది. మత్తకోకిలయొక్క మొదటి గురువును రెండు లఘువులుగా మార్చినచో తరలమగును. కనుక మత్తకోకిలకు తరలమునకు మాత్రాసంఖ్యలో భేదము కానరాదు. మత్తకోకిలకు రెండు మాత్రలు తగ్గించినచో హరిణగతిరగడ

యగుచున్నది. హరిణగతిరగడకు ప్రతిపాదమున ఏడుమాత్రల గణములు నాలు గుండును. ఈ తరల మిశ్రజాతిని నడుచునట్టి వృత్తము.

నన్నెచోడుడు వృత్తౌచిత్యమును పాటించినాడు. ఆతడు స్రగ్ధరుడగు శివుని స్రగ్ధరావృత్తములో స్తుతించినాడు. కుమారసంభవ కృత్యవతారికలోని స్కంద స్తుతిని కందపద్యములో చేసియున్నాడు. కథా సూత్ర వివరణమునకు మహాస్రగ్ధ రను వాడినాడు. ఈ స్రగ్ధరా, మహాస్రగ్ధరలకు సంస్కృతమున విశేషప్రాచుర్యము కలదు. కన్నడమునందును ఇది విపులవ్యాప్తి నందినది. స్రగ్ధర సావేగపవనాదు లందుపయోగింప వలెనని క్షేమేంద్రకృత సువృత్తతిలకమున చెప్పబడినది. మహా స్రగ్ధర ఉద్ధృతిని సూచించును. ఈ స్రగ్ధరా మహాస్రగ్ధరలు చాల కష్టమైన వృత్త ములు. నాల్గు గురువు లాదియందుగలది స్రగ్ధర. లఘుద్వయ గురుత్రయ మాది యందు గలది మహాస్రగ్ధర. స్రగ్ధర మహాస్రగ్ధరలలో ప్రథమగురు లఘుద్వయ పరస్పర పరిణామమువలన ఒక వృత్తము మరొక వృత్తమగును.

నన్నెచోడునికి తరువాతి కవులు కొందరు తమ కావ్యావతారికలందు స్రగ్ధరా మహాస్రగ్ధరలను వాడినారు. భానుకవి తమ పంచతంత్రిలో కృతిపతియగు భండారు లక్ష్మీనారాయణుని ప్రశంసించు సందర్భమున రెండు స్రగ్ధరలను వాడినాడు. పింగళి సూరన తన కళాపూర్ణోదయమున కృతిపతి వంశావతారమును తెల్పుచు నరసింగుడు లక్ష్మీదేవియందు ముగ్గురు పుత్రులను బడసె నని చెప్పు సందర్భమునను, తెనాలి అన్నయ సుదక్షిణాపరిణయమున దుగ్ధయామాత్యుని కీర్తివైభవములను వర్ణించు సందర్భమునను, చెంగల్వకాళకవి తన రాజగోపాల విలాసావతారికలో రఘునాథ నాయకుని వీరవిక్రమములను వర్ణించు సందర్భమునను, లింగనమఖి కామేశ్వరకవి తన సత్యభామా విజయమునందు కుకవినిందా సందర్భమునను విశేషవృత్తమగు స్రగ్ధరను వాడియున్నారు.

అల్లసాని పెద్దన మనుచరిత్రావతారికలో రెండుచోట్ల మహాస్రగ్ధరను వాడి నాడు. మనుచరిత్రావతారికలోని ఒక మహాస్రగ్ధర ఆముక్తమాల్యదావతారికలోను నున్నది. పెద్దన తుళువ వంశమూలపురుషుడగు తిమ్మభూపతి ప్రతాపమును వర్ణించు సందర్భమునను, కృష్ణదేవరాయల అభ్యున్నత్యాధిక్యమును వర్ణించుచోటను మహా స్రగ్ధరలను వాడినాడు. చదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రావతారికలో తిరుమలరాజు భద్రపీఠిని విభవప్రౌఢి కొల్వుండెనని చెప్పు సందర్భమునను, రఘు నాథ రామాయణావతారికలో కుకవినిందా సందర్భమునను మహాస్రగ్ధర ప్రయుక్త

మయినది. రాజుల కీర్తి ప్రతాపాదులను వర్ణించు సందర్భమునను, కుకవినిందా సందర్భమునను, ఉద్ధృతిని సూచించు సందర్భములందును ఎక్కువగా స్రగ్ధరా మహాస్రగ్ధర లుపయోగింపబడినట్లు తెలియుచున్నది.

తిక్కన స్త్రీ పర్వములో అరుదైన బహువిధవృత్తములను వెంటవెంట నుపయోగించి తన వృత్తవిశేషజ్ఞతను వెల్లడించినాడు. సంస్కృత వృత్తరత్నాకర ములోని వృత్తములను తెలుగునకు దెచ్చుటలో తిక్కన మార్గదర్శకుడైనాడు. స్త్రీ పర్వములో చంపకోత్పల మత్తేభశార్దూలములుగాని, స్రగ్ధరా మహాస్రగ్ధరలు గాని కానరావు. స్త్రీ పర్వమున ఇన్ని విశేషవృత్తములను వాడిన తిక్కన గ్రంథా వతారికలలో ఒక విశేషవృత్తమైనను వాడలేదు. నిర్వచనోత్తరరామాయణ ప్రారంభమునందును, భారతావతారికలోను సంస్కృత శ్లోకము లుపయుక్త మయినవి.

రామాభ్యుదయావతారికలో ఉత్సాహవృత్తము వాడబడినవి. చూడుడు :

ఉత్సాహ: 'రామరా జనూన భోగరమ్య మానఘాతి సు
త్రామ రాజరాజు భీకర ప్రతీప భూప సు
గ్రామ రాజమౌళి నమ్ర రాజరాజిమిత్ర గో
త్రామరాజహృత్కృపా సమగ్ర చిత్తుఁ డెత్తఁడీన్.''

—రామాభ్యుదయము (1-54)

ఉత్సాహ వృత్తము త్ర్యస్రగతిలో నడచునట్టిది. ప్రతి పాదమునను ఏడు సూర్యగణములు (హ. న.) ఒక గురువు ఉత్సాహలో హ గణ న గణ మేళన ముండవలెను. అన్నియు హ గణములైనచో సుగంధి వృత్తమగును. అట్లుగాక అన్నియు న గణములైనచో తరలమగును.

రామాభ్యుదయములో షష్ఠ్యంతములకు ముందు కృతిపతి శౌర్యమును ప్రశంసించుచు కవి పంచచామరమును చెప్పినాడు (రా. 1-114). రాజగోపాల విలాసములో కృతిపతియగు విజయరాఘవుని తల్లియగు కళావతి భాగ్యసంపదను వర్ణించు సందర్భమునను కాళకవి పంచచామరమును వాడియున్నాడు (1-58).

సుదక్షిణాపరిణయావతారికలో సుగంధి, తోదకము మొదలగు విశేషవృత్త ములు వాడబడినవి.

సుగంధి: ''నాగరాజు దుగ్గమంత్రి నాగహారిరుఁ డబ్బమా
నాగయానఁ బెండ్లియై జనప్రసిద్ధ విక్రమో

దోర్గి రామసైన్యనాథుఁ డున్నత ప్రభావనా
భాగు వీరశౌరిఁ గాంచె భానుచంద్ర తేజులన్."

—సుదక్షిణా పరిణయము. (1-36)

తోదకము : "నాగయ పోచ జనప్రభుఁ డోలిన్
నాగమయన్ లలనామణి యందున్
రాగముతోఁ బినరామనఁ గాంచెన్
రాగవతీ రతిరాజ సమానున్."

—సుదక్షిణా పరిణయము. (1-33)

దోధక తోదకములలో ప్రథమ గురు లఘుద్వయ పరస్పర పరిణామమువలన ఒకవృత్తము మరొక వృత్తమగును.

పాంచాలీ పరిణయపు అవతారికలో శ్రీరంగపుర వర్ణనా సందర్భమున లయగ్రాహి వాడబడినది (1-20). లయగ్రాహి ఖండగతిలో నడచునట్టిది. ఇందు ప్రతిపాదమునందును 39 మాత్రలు, 30 అక్షరములుండును. భ జ స న భ జ స న భ య అను పది గణములుండును. ఇందు యతులకు మారు సర్వత్ర ప్రాసయతులు గలవు. లయగ్రాహి ఒక మాత్ర తక్కువగా విజయభద్ర రగడకు సరిపోవును. విజయభద్రరగడయందు ప్రతిపాదమున అయిదు మాత్రల గణము లెనిమిది యుండును. అనగా పాదమునకు నలుబది మాత్రలుండును.

ఇట్లు దేశీయచ్ఛందస్సులకు సన్నిహితములయిన విశేషవృత్తములను కవులు తమ కావ్యావతారికలలో ప్రత్యేక ప్రయోజనమును కాంక్షించి వాడినారని చెప్ప వచ్చును.

అందుగుల వెంకయ్య తన రామరాజీయములో కొన్ని అపూర్వవృత్తములను వాడినాడు. ప్రహరణ కలిత వృత్తము, ఫలసదన వృత్తము, కుసుమితలతా వేల్లిత వృత్తము మొదలగు వృత్తములను వెంకయ్య ప్రయోగించినాడు. ప్రహరణకలిత వృత్తము 14 వ ఛందములోని 8128 వ వృత్తము. ఫలసదన వృత్తమును పాలాశదల వృత్తమనికూడ అందురు. దీనిని త్వరితగతి అని కూడ చెప్పుదురు. త్వరితగతి 17 వ ఛందములోని 32768 వ వృత్తము. రామరాజీయములోని ఫలసదన వృత్తమిది :

"నిటలతటమున బొమలునిచి కలనియం దా
ర్వీటి తిరుమల నృప శశివితతకర హేతి
స్ఫుటతఁ బఱపఁ నరితతి పొలతు రెడలంతం
తట వనములకుఁ జనిరి దడఁబడచు భీతిన్"

—రామరాజీయము, 368 పద్యము.

ఇందు పాదమునకు 17 అక్షరములున్నవి. కనుక 17 వ ఛందమని చెప్ప వచ్చును. కుసుమితలతావేల్లిత వృత్తము 18 వ ఛందములోనిది.

అవతారికను ప్రథమ పురుషలో వ్రాయుట, అన్యకవులచే అవతారికలు వ్రాయబడుట, అవతారికలలో పూర్వకవుల కావ్యరచనలు పేర్కొనబడుట, విశేషవృత్త రచన చేయుట—ఇట్టి విశేషాంశములుకూడ ఆంధ్ర కావ్యావతారికా నిర్మాణములో ఎన్నదగిన కొన్ని లక్షణములు.

# 16

# చారిత్రకాంశములు

ప్రస్తవానికి భారతీయ పురాణము లన్నియు అత్యంత ప్రాచీనకాలమున దేశ చరిత్రలుగా ప్రారంభమైనవే. ప్రతి పురాణమునందును వంశము, మన్వంతరము, వంశానుచరిత ముండుటచే తొలి పురాణములను చరిత్రలుగా పరిగణింపవచ్చును. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు 'రామాయణమందలి సూర్యవంశ రాజక్రమ వర్ణనమును, రాజవంశక్రమ వర్ణనమును చరిత్రలగును' [1]అని నుడివిరి. సంస్కృత పురాణములవలన కొంత ఇతిహాసము తెలియవచ్చుచున్నను అది అంతయు చరిత్ర కాకరములు దొరకని చరిత్ర పూర్వయుగమునకు సంబంధించినది. కాని కాలక్రమమున సత్యమున కంటెను మహిమలకే ప్రాధాన్యమిచ్చినారు మన పూర్వులు. భారతీయుల దృక్పథము ఆముష్మిక వ్యగ్రమైన దగుటచే యథార్థగాథలకు అభూతకల్పనలు జోడింపబడినవి. భారతీయుల చరిత్ర రచనలో విజ్ఞానము, విక్రమము, యశస్సు అనునవి ప్రధానాంశములు. కాని పాశ్చాత్యులకు చరిత్ర రచనా విషయమున వ్యక్తుల జనన మరణాదికములకు జీవిత విధానములకు, యుద్ధములు దండయాత్రలు మున్నగు లోకసంబంధములు ప్రధానాంశములు. భారతీయులకు చారిత్రక దృక్పథములేదనియు, అవి వెట్టిమొట్టి వేదాంతములతో నిండియుండుననియు పాశ్చాత్య విమర్శకులు భారతీయ చరిత్రల నీసడించియున్నారు.

దేశచరిత్రకు వాఙ్మయ చరిత్రకు అవినాభావసంబంధము కలదు, దేశచరిత్రలోని ప్రధానాంశములగు ఆర్థిక, రాజకీయ, మత సాంఘికాదులు వాఙ్మయము

1. చూ. సంస్కృత వాఙ్మయ చరిత్ర. పుట. 288.

నందును చోటుచేసికొనుచున్నవి. కనుక దేశచరిత్రవలన వాఙ్మయ చరిత్రను, అట్లే వాఙ్మయ చరిత్రవలన దేశ చరిత్రను పరస్పరము తెలిసికొనుట కవకాశము గలదు.

సంస్కృత వాఙ్మయమున కల్హణుని (1148) రాజ తరంగిణి తప్ప చెప్పు కోదగిన చారిత్రక గ్రంథములు కనబడవు. అదికూడ సంపూర్ణదేశ చరిత్రకాదు. ఒక్క కాశ్మీరు దేశమునకే పరిమితమైనది.[1]

సంస్కృత వాఙ్మయము ననుసరించిన ఆంధ్ర వాఙ్మయమునకూడ సిసలైన చారిత్రక గ్రంథములు ప్రాచీన కాలమున తలెత్తలేదు. తెలుగువారికి చరిత్రపై అంత ఆసక్తియున్నట్లు కన్పించదు. మహమ్మదీయుల రాకతో భారతీయులకు కొంత చారిత్రక జ్ఞానము అలవడినది. కాని లక్ష్మీనారాయణ, చంద్రభాను మొదలైన హిందూ చరిత్రకారులు మహమ్మదీయ భాషలలో వ్రాసిన గ్రంథములలో మహమ్మదీయ రాజ్యముల చరిత్రలేగాని హిందూ సంస్థానముల చరిత్ర ఎక్కడను కనబడదని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాసినారు.[2] ఖాసిం ఫెరిస్తా అను నతడు 'తారీఖ్—ఉల్—హింద్' అను గ్రంథములో హిందూదేశములోని మహమ్మదీయ రాజ్యముల చరిత్రను వ్రాసియున్నాడు.

తెలుగులో మొట్టమొదటి చారిత్రక గ్రంథమని చెప్పదగినది ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర. ఇది కాకతీయుల వైభవమును తెల్పునట్టి చారిత్రక వచనగ్రంథము. చారిత్రక లోపములు కొన్నియున్నను ప్రతాప చరిత్రకు తెలుగు సాహిత్యమున ఒక ప్రత్యేక స్థానమున్నది. చారిత్రక గ్రంథములను వ్రాయువారికి ఏకామ్రనాథుని ప్రతాప చరిత్ర మార్గదర్శకమయినది. ఏకామ్రనాథుని ప్రతాప చరిత్ర నాధారముగా చేసికొని కాసె సర్వప్ప 'సిద్ధేశ్వర చరిత్ర' అను పేరుతో కాకతీయుల చరిత్రను ద్విపదలో రచించినాడు. సిద్ధేశ్వర చరిత్రవలన చరిత్రకారులకు పెక్కు చారిత్రక సాంఘిక విషయములు తెలియుచున్నవి. సిద్ధేశ్వర చరిత్రను ఆధారముగ చేసికొని 'సోమదేవ రాజీయము'ను పేరుతో చంపూ కావ్యమును రచించినవాడు కూచిమంచి జగ్గకవి (1720).

---

1. చూ. లౌకిక సారస్వతము - చరిత్ర కావ్యములు - విశ్వసాహితి. ఆరవ సంపుటము. పుటలు. 221-222.

2. చూ. చరిత్ర రచన - ప్రథమ భాగము. పుట. 2.

స్థానాపతి 'రాయవాచకము' కృష్ణదేవరాయల చరిత్రను వివరించునట్టి చారిత్రక వచన గ్రంథము. దీనిని ఆధారముగ చేసికొని తరువాత కుమార ధూర్జటి 'కృష్ణరాయ విజయము' అను పేరుతో పద్యకావ్యము రచించినాడు. కృష్ణరాయ విజయము ప్రబంధ దృష్టితో రచితమయినది. ఈ గ్రంథము చరిత్రకారుల కంతగా ఉపయోగపడదని శ్రీ చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[1] దిట్టకవి నారాయణ కవి విరచితమగు రంగరాయ చరిత్రమునందు క్రీ. శ. 1757 న విజయరామరాజునకును రంగారాయనికిని జరిగిన బొబ్బిలి యుద్ధ మభివర్ణితమైనది.

చారిత్రక పురుషుల జీవిత విశేషములను పొందుపరచుచు అభ్యుదయ కావ్యములను కొందరు కవులు రచించినారు. రాజనాథ డిండిముడు సంస్కృతమున సాళ్వాభ్యుదయము, అచ్యుత రాయాభ్యుదయము అను రెండు అభ్యుదయ కావ్యములను రచించియున్నాడు. రఘునాథనాయకుని అచ్యుతాభ్యుదయము (ఇది అలభ్యము). విజయరాఘవనాయకుని రఘునాథ నాయకాభ్యుదయము ద్విపదలో రచింపబడినవి. బిల్హణుని 'విక్రమాంకదేవ చరిత్ర', గంగాదేవి రచించిన 'కంపరాయ చరిత్ర', రామభద్రాంబ రచించిన 'రఘునాథాభ్యుదయము' మున్నగునవి ఈ తరగతిలోని ముఖ్యగ్రంథములు. ఇవికూడ చరిత్రాధారములుగా ఉపయుక్తములగు గ్రంథములే! ఇవిగాక చరిత్రకు ఉపయుక్తములగు విషయములను తెల్పు గ్రంథములు మరికొన్ని కలవు. ఇవి చరిత్రాత్మక వ్యక్తులకుగాని వంశములకుగాని సంబంధించినవి కావు. రాజకీయ విశేషములుగాని, పరాక్రమ ప్రశంసలుగాని వానియందు కన్పట్టవు. వానియందు పట్టణ చరిత్ర విశేషములు, సాంఘిక జీవనవిశేషములు వర్ణింపబడినవి. అట్టి వానిలో ముఖ్యమైనవి క్రీడాభిరామము, వామన భట్ట బాణకృతమగు 'శృంగార మంజరీ భాణము', డిండిమ కృతమగు 'సోమవల్లీ యోగానంద ప్రహసనము'ను. తొలి దానిలో కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున ఓరుగంటి పట్టణముయొక్క వైభవము, తదితర గ్రంథములందు 13 వ, 14 వ శతాబ్దములనాటి విజయనగర పట్టణ చరిత్ర విశేషములు తెల్పబడినవి.

మహమ్మదీయ ప్రభువులు తమ పూర్వుల చరిత్రలను తమ చరిత్రలను వ్రాయించుకొనుటచే వారిని చూచి హిందూరాజులుకూడ చారిత్రక కావ్యములను వ్రాయమని తమ ఆస్థానకవులను ప్రోత్సహించిరి. ఆరవీటి బుక్కరాయలవంశములోని వాడగు కోదండరామరాజు (1630) అందుగుల వెంకయ్యచే 'రామరాజీ

1. ఆంధ్రకవి తరంగిణి - 12 వ సంపుటము, పుట. 86.

యము' లేక 'నరపతి విజయము' అను పేర ఒక చారిత్రక గ్రంథమును వ్రాయించినాడు. ఇందు చంద్రుని దగ్గరనుండి రామరాజు కొడుకులవరకు ఆరవీటి రాజుల వంశక్రమ మున్నది, ఈ రామరాజు ప్రసిద్ధుడైన అళియరామరాయల మనుమని మనుమడు. రామరాజీయములోని ఆరవీటి వంశరాజుల వంశావళి చరిత్రకారులకు మిగుల తోడ్పడుచున్నది. రామరాజీయమును చెప్పించిన రామరాజు కుమారుడగు చిన వెంకటరాజుకూడ కుమార ధూర్జటిచే కృష్ణరాయ విజయమును చెప్పించినాడు. దోనూరు కోనేరునాథకవి ద్విపద బాలభాగవతమున కనుబంధముగ తత్కృతిపతియైన అవుకు తిమ్మరాజు పూర్వీకుల చరిత్రను వర్ణించినాడు. అవుకు వంశము ఆరవీటి వంశశాఖలలో నొకటి. వెలుగోటివారి వంశావళి వంశావళులలో సుప్రసిద్ధమైనది. "ఇట్టి వంశావళి గ్రంథములు కన్నడమునను కలవు. 'చిక్కదేవరాయ వంశావళి', 'కెళది నృపవిజయము'లు వీనిలో ప్రధానమైనవి. రెంటియందును విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్రాంశము లనేకము వర్ణింపబడి యున్నవి".[1]

కావ్యావతారికలు చరిత్ర దృష్టితోకూడ మిక్కిలి విలువగలిగినవి. కృతిపతి కృతికర్తల వంశాభివర్ణనములు, షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంత పద్యములు మొదలగు వాని వలన పెక్కు చారిత్రకాంశములు వెల్లడియగుచున్నవి. తెలుగు కావ్యావతారికలన్నియు చారిత్రకుల కుపయోగపడునని చెప్పలేము. నన్నయ రాజరాజ నరేంద్రుని స్తుతించెనేగాని అతని చరిత్రను భారతమున అవతారికగా వ్రాయలేదు. దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానమున చెందులూరి మంత్రులవంశమును 53 గద్య పద్యములలో వర్ణించి యున్నను ఒక్క చారిత్రక విషయమునుకూడ తెలుపలేదు. దూబగుంట నారాయణకవి తన పంచతంత్రావతారికలో కృతిపతియగు బసవరాజు గుణగణములను అతిశయోక్తులతో వర్ణించినాడు, కాని అందు చారిత్రక విశేషము లేమియులేవు. కొన్ని గ్రంథములలో అవతారికలలో పొందుపరుపబడిన చారిత్రకాంశములకు ప్రాముఖ్యము హెచ్చు. వరాహపురాణ ప్రాముఖ్యమును శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారు ఇట్లు వివరించియున్నారు: "ఈ గ్రంథముయొక్క ప్రాముఖ్యము దీనియందలి కథా స్వారస్యముకంటె నిందుఁ బొందుపఱుపఁబడిన విజయనగరరాజ్య చరిత్ర వృత్తాంతములపై నాధారపడియున్నదని నా అభిప్రాయము. ఈ కవులు తమ యధిపతియైన తుళువ నరసరాయలయొక్కయు నతని ప్రభువైన

1. తెలుగు సంస్కృతి - 3 వ సంపుటము, పుట. 62.

సాళువ నృసింహరాయలయొక్కయు వంశచారిత్రములను సావధానముగ వ్రాసియుఁ బెక్కు లపూర్వవిషయములు చేర్చియు నాంధ్ర చరిత్ర పరిశోధకులకు నిక్కమైన సాయమొనరించిన వారైరి".[1] ఎఱ్ఱన, శ్రీనాథుడు, నిశ్శంక కొమ్మన, వెన్నెలకంటి సూరన - వీరి కావ్యావతారికలనుబట్టి రెడ్డి రాజుల చరిత్ర కొంత తెలిసికొన వచ్చును. శ్రీనాథుడు కవి మాత్రమేగాక ఉత్తమ చరిత్రకారుడుకూడ. కృతిపతి వంశచరిత్ర వ్రాయుచున్నపుడు శ్రీనాథుడెన్నియో చారిత్రక విశేషములను చెప్పును. రెడ్డి రాజుల చరిత్రను సమన్వయము చేయుటకు, వారి ధార్మిక చరిత్రను, నాటి సంస్కృతిని తెలిసికొనుటకు శ్రీనాథుని రచనలు ఎక్కువగా తోడ్పడుచున్నవి. రెడ్డి రాజుల చరిత్రమునకు శ్రీనాథుని కవిత ఒక దర్పణము వంటిది. బాలభాగవతము, సౌగంధిక ప్రసవాపహరణము ఇత్యాది కావ్యములందలి అవతారికలు ఆంధ్ర చరిత్ర పరిశోధకులకు అపూర్వ విషయములను సమకూర్చినవి.

## కవుల కావ్య రచనా కాలము :

తెలుగు కవులు కొందరు తమ గ్రంథములలో తమ కావ్యరచనాకాలమును స్పష్టముగా పొందుపరచినారు. అందువలన ఆ కవుల కాలనిర్ణయము చాల సులభమగుచున్నది. యథావాక్కుల అన్నమయ్య తన్నుగూర్చిన సంగతులను వివరముగా తెల్పకున్నను శాలివాహన శకము 1164 (అనగా క్రీ. శ. 1242)లో సర్వేశ్వర శతకమును రచించినట్లు విశదముగా చెప్పినాడు. 'శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యం బ్రవర్తింప' (ప. 127) అని ఆ శతకము వ్రాసిన కాలము చెప్పబడినది.

పద్మపురాణోత్తర ఖండములో గ్రంథాంతమున మడికి సింగన తన కాలమును ఇట్లు తెల్పినాడు:

మంగళ మహాశ్రీ

"ఆ కరయుగానలమృగాంక శకవత్సరములై పరగు శార్వరిని బుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు నుడుపాలసుత వాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన దెనుంగున రచించెఁ దగఁ బద్మసుపురాణం
బాకమలమిత్ర శశిరాంశువుగఁ గందసచివాగ్రణికి మంగళమహాశ్రీ."

1. చూ. విజయనగర రాజ్య చరిత్ర - పదునొకండవ అధ్యాయము - పుటలు. 244 - 245.

పై పద్యమున నిచ్చిన శకవత్సరము: కర = 2, యుగ = 4, అనల = 3, మృగాంక = 1: 'అంకానాం వామతో గతి:' అను సూత్రము ననుసరించి అంకెలు కుడినుండి ఎడమకు లెక్కించవలెను కనుక 1342 శాలివాహన శక వత్సరములు. దీనికి78 కలిపిన క్రీ. శ. 1420 (1342+78), వచ్చును. మడికి సింగన క్రీ. శ. 1420 లో పద్మపురాణమును రచించినట్లు దీనివలన స్పష్టమగుచున్నది.

అనంతామాత్యుడు తన రసార్ణవ రచనాకాలమును ఈ క్రింది పద్యమున సూచించియున్నాడు.

"జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్యాలేందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమున కృష్ణైకాదశీ భౌమ యు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీ నిండన్ ధ్రువ పట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్."

ఈ పద్యమునుబట్టి గ్రంథ రచన శా. శ. 1356 అనగా క్రీ. శ. 1435 జనవరి 6 వ తేదియగును.

అప్పకవి తన లక్షణ గ్రంథావతారికతో తనకు కలవచ్చిన దినమును ఈ క్రింది పద్యమున పేర్కొనినాడు.

"ధాత రెండవ పరార్థమున నాదిదినంబు పగటివరాహ కల్పంబునందు
మహితవైవస్వత మనువేళ దేశంబు లర్థింపనైన మహాయుగమునఁ
గలి సమయంబునఁ దొలిచరణంబున మానితంబగు చాంద్రమానమునను
శాలివాహననామ శకమున గజశైలశరసుధాకిరణుల సంఖ్యనడవ
నంగ జాబ్దంబునను దక్షిణాయనమున, జలధర ర్తువు మొదటి మాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి, నట్టి యష్టమి సనుదేర నధికభక్తి'
—అప్పకవీయము. (1-33)

దీనినిబట్టి శా, శకవత్సరము—1578. మన్మథనామ సంవత్సర శ్రావణ బహుళ 8 నాడు (అనగా క్రీ. శ. 1656 ఆగస్టు 3 వ తేది) అప్పకవికి కలవచ్చినట్లు స్పష్టమగుచున్నది. అప్పకవి కలగన్న మరునాడే లక్షణ గ్రంథ రచనను ప్రారంభించినట్లు తెలియుచుండుటచే అప్పకవీయ రచనా కాలము స్పష్టముగా తెలియుచున్నది.

పిండిప్రోలు లక్ష్మణకవి తన లంకా విజయమును రచించిన కాలమును అవతారికలో ఇట్లు తెల్పియున్నాడు:

వ. "అని యిష్టదేవతా వందనంబును ... ... ... ... యేనొక్క ప్రబంధంబు నవరసభావార్థ లక్షణానుబంధంబుగా నూహించి కల్యబ్దములు ౪౮౯౮ శాలివాహన శకాబ్దములు ౧౭౧౯ ఇంగ్లీషు సంవత్సరములు ౧౭౯౭. ఫసలీ ౧౨౦౭ నగు పింగళ సంవత్సర శ్రావణమాసములో రచియింప నుద్యోగించి యున్న సమయంబున"

—లంకా విజయము, (1-50)

దీనినిబట్టి లంకా విజయము లేక రావణ దమ్మీయము క్రీ. శ. 1797 లో రచింపబడినట్లు స్పష్టమగుచున్నది.

కృతిపతులనుబట్టియు, కృతిపతి వంశావళిని వర్ణించు సందర్భమున కవి తెలిపిన చారిత్రక విషయములనుబట్టియు, పూర్వకవి స్తుత్యాదులనుబట్టియు, శాసనాది ప్రమాణములనుబట్టియు, కావ్యములోని భాషాశైలులనుబట్టియు కవికాలమును నిర్ణయింపవచ్చును. కవుల గ్రంథములలో ఆ యా కవులపేర్లు, వారి పోషకుల చరిత్రములు లభ్యమగును. కవులను పోషించిన రాజులు, మంత్రులు చారిత్రక పురుషులైనచో వారి కాలమునుబట్టి కవుల కాలమును స్పష్టముగా తెలిసికొనవచ్చును. రాజరాజనరేంద్రుడు, మనుమసిద్ధి, కృష్ణదేవరాయలు, రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు, మొదలగు చారిత్రక పురుషుల కాలమునుబట్టి వారు పోషించిన కవుల కాలమును తెలిసికొనుట సులభము. మారన తన మార్కండేయ పురాణమును గన్నయ నాయకునికి అంకిత మిచ్చినాడు. ఈ గన్నయ ప్రతాపరుద్రుని సేనాని. అతడు ప్రతాపరుద్ర చక్రవర్తిచేత విలసిత రాజ్య చిహ్నములను, విశ్రుత లక్ష్మిని, నాయకత్వమును పొందినట్లు మార్కండేయ పురాణములోని అవతారికనుబట్టి తెలియుచున్నది. ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1295 నుండి 1326 వరకు పాలించినాడు. కనుక మార్కండేయ పురాణమును కృతిగొన్న గన్నయసేనాని, కృతియిచ్చిన మారన ఆ కాలమువారే అనుటకు సందియములేదు. ఇట్లు కృతిపతులనుబట్టియు, కృతిపతికి పతియైన వానినిబట్టియు కొందరి కవుల కాలమును చిక్కులులేకుండ సులభముగా చరిత్రనుబట్టి గ్రహింపవచ్చును.

కృతిపతి వంశవర్ణనా సందర్భమున కవితెల్పిన చారిత్రక పురుషులనుబట్టియు కవికాలమును నిర్ణయింపవచ్చును. బహుళాశ్వ చరిత్రకర్తయగు దామెరల వెంగళనాయకుడు తన తండ్రిని 'కుతుపనశాహి సమాగత హాటక ఘోటక ఘూటకరివ్రవరా' అని సంబోధించినాడు. కుతుప్‌శాహి గోలకొండ నవాబు. ఇతడు క్రీ.శ.

1512 నుండి 1543 వరకు రాజ్యముచేసినట్లు చరిత్రవలన తెలియును. అతనిని తన గ్రంథమున పేర్కొనుటచే వెంగళనాయకుడు కుతుబ్‌శాహికి తరువాతివాడనుట స్పష్టము. చంద్రగిరి రాజైన వేంకటపతి రాయలకు యుద్ధములందు కుడిభుజమై వెంకటగిరి నార్జించిన వెలుగోటి కస్తూరి రంగనాయకుని కుమారుడు బంగారు యాచమనాయడీ కవికి మేనత్త కొడుకని బహుళాశ్వ చరిత్ర పీఠికలో చెప్పబడినది. ఈ బంగారు యాచమనాయడు ఇభరామశౌరి యను ఇబ్రహీనుమల్కుకు సామంత రాజు. ఈ ఇభరామశౌరి అద్దంకి గంగాధర కవిచే తపతీ సంవరణోపాఖ్యానమును కృతినందినవాడు. కనుక దామరల వెంగళనాయకుడు 1550—1600 నడుమ నున్న వాడని చెప్పవచ్చును.

ఇట్లు కావ్యావతారికలనుబట్టి కవుల కాలాదులు కొంత నిర్ణయింపవచ్చును. కావ్యావతారికలలో వ్యక్తమగు ఇతర చారిత్రకాంశములను ఈ క్రిందపేర్కొందము:

1. నన్నయ భారతావతారికలో రాజరాజు గుణగణవర్ణనమున్నది, రాజ రాజు ఉత్తమ చాళుక్యుడు. విమలాదిత్యుని కుమారుడు. అతడు 'నిజమహీమండల ప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ బరమండలంబుల ధరణీపతుల నదిమి కప్పంబుల ముద ముతోఁ గొనుచును బలిమిసీయని భూమివలయపతుల నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ వెలిగించు' (ఆది 1-7) చుండువాడు. 'అఖిల జలధి వేలావలయ వల యిత వసుమతీ వనితా విభూషణంబైన వేఁగీదేశంబునకు నాయకరత్నమునుంబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీరాజ్య సుఖంబు లనుభవించు'చుండెను (ఆది 1-8). రాజరాజును మంత్రి, పురోహిత, సేనాపతి, దండనాయక, దౌవారిక, మహాప్రధాని సామంతులు, విలాసినులు కొల్చుచుండెడివారు.

2. తిక్కన నిర్వచనోత్తర రామాయణావతారికలో కృతిపతియైన మనుమ సిద్ధికి పూర్వులైన నెల్లూరుశాఖ తెలుగు చోళరాజులవంశ చరిత్రను కీర్తించినాడు. మనుమసిద్ధి తండ్రియగు తిక్కనృపతి చోళస్థాపనాచార్యుడు. ఇతడు కర్ణాట సోమే శుని గర్వ మణచినవాడు. కురుములూరి (ఇప్పటి సిద్ధవటము తాలూకాలోని కుడుము లూరు) మీదికి లకుమయ దండెత్తిరాగా అతని గుఱ్ఱములను లాగుకొనినాడు. 'లకు మయ గురుములూరికి నెత్తివచ్చినఁ గొనఁడె యాహవమున ఘోటకముల' (నిర్వ 1-33) అని కలదు. తిక్కసిద్ధి పృథ్వీశ్వరుని చంపినట్లు ఇందు కలదు. ఈ విషయ ములు కాంచీ పురాదిశాసనములందును కప్పించును. ఈ లకుమయ తెలుగుచోళ

లలో నొకడో వారి పంపున దండెత్తిన సేనానాయకుడో అయియుండును. తిక్కనసిద్ధి సారంగపాణి తండ్రియగు సింఘణదేవుని కప్పమునకు ఒప్పించినట్లు - 'చేదిమండలము గాసిగఁజేసి కాళవపతి నియ్యకొలుపఁడే పలచమునకు' (నిర్వ 1-33) అనుటనుబట్టి తెలియును. సింఘణ లేక సింగళదేవు డీ వ్యవహారములోని కొప్పెరుంజింగడు. అతని చేదిమండలము దక్షిణార్కాడు. ఇతడు కాళవపతి. ఈ కాళవపతి కొడుకే సారంగుడు. ఈ సారంగుని గంగయ సాహిణిని మనుమసిద్ధి యుద్ధమున పారద్రోలినట్లు నిర్వచనోత్తరరామాయణ అవతారికలో కలదు (నిర్వ 1-41). సారంగుడే సారంగపాణి. ఇతడు మనుమసిద్ధికి సామంతుడు. మనుమసిద్ధి గణపతికి సామంతుడు. గంగయ సాహిణికి గంగరుసు, గంగదేవుడు, ఘోడియరాయ గంగదేవుడనియు నామాంతరములు. ఈ గంగయ సాహిణి గణపతికి సామంతుడు. మనుమసిద్ధి మంత్రి తిక్కన. తిక్కనను, అతని వంశమును కేతన దశకుమార చరిత్రలో వర్ణించినాడు. తిక్కన 'సామాద్యుపాయ విదుడు, నీతి దాణుక్యుడు. విశేషించి నీతి నిపుణమతి జితపురుహూతామాత్యుడు, రాజనయ విధాప్రయోజన విశారదుడు.' తిక్కన తన ప్రభువగు మనుమసిద్ధి దాయాదులచే రాజ్యమును గోలుపోయినపుడు మనుమసిద్ధి పక్షమువహించి గణపతిదేవ చక్రవర్తి సమక్షమునకు బోయి సకలము నివేదించి 'నయవచస్సమగ్రతా చతురాస్యుఁ' డనిపించుకొనెను. మనుమసిద్ధి రాజ్యమును తిరిగి సంపాదింపజేసెను. కనుకనే తిక్కనను 'మన్మక్ష్మాపతి ప్రాజ్య రాజ్యాంబునిధి శశి' అని కేతన సంబోధించియుండుట.

3. ఎఱ్ఱన ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి. ఎఱ్ఱన హరివంశమును ప్రోలయ వేమునికి అంకితమిచ్చినాడు. ప్రోలయ వేమభూపతి అద్దంకి రాజధానిగా నేలినవాడు. అతడు రెడ్డి రాజ్యమును మహోన్నతికి తెచ్చిన ప్రఖ్యాత పురుషుడు. పల్లవ త్రినేత్రాదు లితని బిరుదులు. మధ్యాంధ్ర దేశక్షేమదకరవాలుడని హరివంశమున ప్రోలయవేముడు పొగడ్తగాంచినాడు. అతనికి చిట్టయ (మేనమామ కుమారుడు) కుడిభుజమై యుద్ధాదులందు మిగుల సాహాయ్యముచేయు చుండెడివాడు. దొడ్డయ అతని మాతామహుడు, సైన్యనాయకుడును. పోతయ, చిట్టయ, నాగయ అనువారలు ప్రోలయ వేముని మాతులులు. ప్రోలయ వేమారెడ్డి శౌర్యము, దానపరత, పౌశీల్యము పరమేశ్వరభక్తి, సౌభ్రాత్రము మున్నగు సద్గుణములు హరివంశావతారికలో వివరింపబడినవి (హరి 1-19). ప్రోలయ వేమారెడ్డి శ్రీశైలమునకు సోపాన

ములు కట్టించినట్లు 'శ్రీ పర్వత సోపాన స్థాపకుఁడగు రెడ్డి వేమజగతీపతికిన్' (హర 1-18) అని శ్రీనాథుడు హరవిలాసమున తెల్పినాడు.

ప్రోలయ వేముని కడగొట్టు తమ్ముడు మల్లారెడ్డి కురుమలూరు పురనాయకుడుగా నుండెనట. ఇతడు మహాపరాక్రమ శాలియై శత్రువులను పారద్రోలి మోటుపల్లి యోడలరేవును స్వాధీనమునకుఁగొనివచ్చి ద్వీపాంతరములనుండి సద్వస్తు సంచయమును ఓడలమీదుగా వచ్చునట్లు చేసినాడు. మల్లారెడ్డి విశిష్టమైన భ్రాతృభక్తికలవాడని తెలియుచున్నది. ఈ మల్లారెడ్డియే ఎఱ్ఱనకు వేమభూపాలుని యాశ్రయము కలిగించినవాడు. తన్మూలముననే రామాయణ హరివంశ రచనల కవకాశమేర్పడి ప్రోలయ వేముని కీర్తిప్రతిష్ఠలు సారస్వత ప్రసిద్ధము లయినవి. ప్రోలయ వేముడు పంటరెడ్డి. హరివంశ రచనము నాటి కీ ప్రోలయవేముని పెద్ద కుమారుడు అనవోత రెడ్డి యువరాజు పదమును బడసియున్నట్లు తెలియుచున్నది.

ఎఱ్ఱన హరివంశమువలన అద్దంకి రెడ్డిరాజులచరిత్ర కొంత తెలిసికొన్నాము. కొండవీటి, రాజమహేంద్రవర రెడ్డి రాజుల చరిత్ర తెలిసికొనుటకు శ్రీనాథుని రచనలు తోడ్పడుచున్నవి. శ్రీనాథుడు తన కృతులలో ప్రోలయ వేమారెడ్డి మొదలు అల్లాడ వేమారెడ్డివరకు నుండెడి రెడ్డి ప్రభువుల చరిత్రను చిత్రించినాడు. శ్రీనాథుడు శృంగార నైషధమున అన్నవేమ (1264—1386) పెదకోమటి వేములను (1403—1420). హరవిలాసమున కుమారగిరి (1386—1403), ప్రోలయ వేములను (1325—1358), భీమేశ్వర పురాణమున వీరి నందరను, అల్లాడ వేమ వీరభద్రారెడ్లను (1415—1434). కాశీ ఖండమున కాటయ వేమారెడ్డిని (1403—1415) స్మరించినాడు.

రెడ్డి రాజులకు పెన్నానదీతీరమునందలి సింహవిక్రమ నగరము నెల్లూరు దువ్వూరు, గండవరము మొదలగు పట్టణములు తొలుతటి నివాసములని శ్రీనాథుడు భీమేశ్వర పురాణావతారికలో తెల్పినాడు. ప్రోలయ వేమారెడ్డి, అనవోతా రెడ్డి, అన్న వేమారెడ్డి, కుమారగిరిరెడ్డి ఆంధ్రదేశమును సుభిక్షముగా పాలించిన పాకనాటి ప్రభువులు. రాజమహేంద్రవర రాజ్యము కుమారగిరిరెడ్డి వలన కాటయ వేమునికిని, తదనంతరమున నాతని అల్లుడగుటచే వీరభద్రారెడ్డికిని సంక్రమించినది. ఈ వీరభద్రారెడ్డి అల్లాడరెడ్డి కుమారులలో రెండవవాడు, పెద్దవాడు వేమారెడ్డి. భీమేశ్వర పురాణావతారికలో కుమారగిరి తరువాత కొండవీటి నేలిన పెదకోమటి వేమారెడ్డిని, రాజమహేంద్రవర పాలకుడయిన కాటయవేముని శ్రీనాథుడు

పేర్కొనలేదు. పెదకోమటి వేమునకు కాటయ వేమునకు ప్రబలమైన వైరము. శ్రీనాథుడు కొండవీటి నేలిన పెదకోమటి వేముని ఆస్థానమున విద్యాధికారిగా నుండినవాడు. తానిపు డాశ్రయింపవలచిన వేమ వీరభద్రారెడ్లు కాటయ వేముని పక్షమువారు. కనుక 'తత్సంబంధ బాంధవంబున వసుంధరా భారధౌరంధర్యంబు వహించిన' అని అల్లాడరెడ్డిని వర్ణించినాడు. అల్లాడరెడ్డి రాజమహేంద్రవరము రాజధానిగా సింహాద్రి పర్యంతము ఉత్కళ కళింగ యవన కర్ణాటాంతర్దీపంబైన ప్రతాపంబున విశ్వవిశ్వంభరాభువన మండలంబు పరిపాలించె నని శ్రీనాథుడు తెల్పినాడు. వేమ వీరభద్రారెడ్లకు రాజ్య ప్రాప్తికి మూలకారణమునుకూడ శ్రీనాథుడు స్పష్టముగా చెప్పలేదు. అనితల్లి మూలమున వీరభద్రారెడ్డికి రాజ్యముప్రాప్తించిన దని చెప్పుట బాగుండదని కాబోలు శ్రీనాథుడు 'అల్లాడభూవల్లభుండు....పాలించె తదనంతరము' అని చెప్పినాడు.

వీరభద్రారెడ్డి పేరుకు రాజయినను రాజకీయ వ్యవహారములన్నియు వీరభద్రారెడ్డి అన్నయగు వేమారెడ్డియే నిర్వహించుచుండెను. శ్రీనాథుడు భీమేశ్వర పురాణావతారికలో ఈ విషయమును ఈ క్రింది పద్యమున సూచించి యున్నాడు :

"తమ్ముని వీరభద్ర వసుధాధిపు విక్రమ వీరభద్రుని
న్నెమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టము గట్టి బాహు ద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసె జగద్విజయ ప్రశస్తి వ
ర్ణమ్ములు దిగ్ధురంధర సురద్విపకుంభ విషాణమండలిన్."

—భీమేశ్వర పురాణము (1-34)

పరాక్రమ పురస్కృతములయిన యశః ప్రశస్తులు వేమునికే యేర్పడి యుండెనని కాశీఖండములో కూడ చెప్పబడినది. వేముని అంకమాశ్రయించి వీరభద్రారెడ్డి కొలువుండెనని చెప్పుటచే రాజకీయ నిర్వహణమునందు వేమునకే ప్రాధాన్యమనుట వ్యక్తమగును.

"నిజభుజావిక్రమంబున నిఖిల దిశలు గెలిచి తను రాజ్యపీఠ మెక్కించి నట్టి
యన్న భీమేశ్వరు నిజాంకమాశ్రయించి నిండు కొలువుండెఁ గన్నుల పండువగుచు"

—కాశీ ఖండము (1-18)

వేమారెడ్డి వశవర్తులై యుండెడి రాజులను భీమేశ్వర పురాణావతారికలో శ్రీనాథుడు పేర్కొనినాడు (భీమే. 1-38). పాండువాసులతాను, ఒడ్డెరాజు, కర్ణాట భూపతి, యవనాధిపతులు వేమభూపాలునకు కానుకలిచ్చుచుందురట. పారువ,

దొంతి, మన్నెము, సప్తమాడెములు పాలించు రాజులు వేమారెడ్డికి మ్రొక్కుచు సేవలు నెరపుచుందురట.

వేమవీరభద్రారెడ్లు కాశీఖండ రచనము నాటికి రాజమహేంద్రవరమున కుత్తరముగా చీకటి, కళింగపట్టణము, చిల్కానముద్రము పర్యంతముగా గల దేశమును జయించి యేలుచుండిరి (కాశీ 1-60). జీడికోట, మాకవరము, సప్తమాడెములు, యూడెజంతర్నాడు, బారహ బారువ, కలువపల్లి, ఒడ్డాది, కసిమికోట కప్పకొండ మొదలగు స్థలములను వేమ వీరభద్రారెడ్లు జయించినట్లు కాశీ ఖండమున చెప్పబడినది (కాశీ 1-34).

వీరభద్రారెడ్డి తమ్ముడు దొడ్డారెడ్డి రాజమహేంద్రపుర పార్శ్వమున ఇరువదియారుమూళ్ల మేర 'రాజకుంజర సింహ'మను నశ్వమునెక్కి దుమికించెనట. ఈ విషయమును శ్రీనాథుడు 'హరి దాఁటించెఁ బురోపకంఠమున.......నుద్దండించి బ్రహ్మాండముల్' (కాశీ. 1-53) అను పద్యమున ప్రస్తావించినాడు. నిశ్శంకకొమ్మన శివలీలా విలాసములోకూడ ఈ విషయమును తెల్పియున్నాడు. దొడ్డారెడ్డి శృంగారుకోట, లోతుగడ్డలను జయించెనట.

వేమ వీరభద్రారెడ్ల పాలనకాలమునందు రాజమహేంద్రవరమునందు వసంతోత్సవములు జరుగుచుండెడి వని నాటి రెడ్డి ప్రభువుల విభవమును వర్ణించుచు శ్రీనాథుడు వ్యక్తపరచినాడు (కాశీ 1-60); సుగంధద్రవ్య వినియోగమునందు కొండవీటి విభవమును రాజమహేంద్రవర రెడ్డి రాజులకును కన్పింపజేసినాడు.

కొమరగిరి కర్పూర వసంతరాయుడు, ప్రతిదిన సమారాధిత పరమేశ్వరుడు, మాణిక్య సింహాసనాధీశ్వరుడు, కిష్కింధాచల క్రీడావినోదుడు. కొమరగిరి రెడ్డి వలన అవచితిప్పయ్యసెట్టి ఆంధోళిక, ఛత్రచామరతురంగాది రాజ్యచిహ్నములు పడసినాడు. రాజునకు ప్రతి సంవత్సరోత్సవమునకు కస్తూరి, కుంకుమ, ఘనసారము, సంకుమదము, హిమాంబు, కాలాగురు, గంధసారము మున్నగు సుగంధ ద్రవ్యములను సమకూర్చెడివాడు. తిప్పయసెట్టి కొమరగిరి భూపాలుని సుగంధ ద్రవ్యభాండాగారాధ్యక్షుడు. తిప్పయసెట్టికి పాండ్యరాజులతో, తురుష్కప్రభువులతో ఇంక నధిక ప్రభువులతో సంబంధము కలదని శ్రీనాథుడు హరవిలాసావతారికలో తెల్పినాడు.

రాజమహేంద్రవరమునం దానాటి రెడ్డిప్రభువుల రాజసౌధమునకు త్రైలోక్య విజయ సౌధ మను పేరుండినట్లు తెలియుచున్నది (కాశీ 1-65).

శ్రీనాథుడు రాజమహేంద్రవర మహత్త్వమును, కాటయ వేముడు ఆపుర మునకుగూర్చిన విభవమును, నాటి పురపాలకుల ప్రాభవమును ఈ క్రింది పద్య మున వర్ణించినాడు :

"ఉండు నే వీట మార్కండేయ మునినాథ సజ్జలింగమనంగశాసనుండు
ప్రవహించు నే వీధి పశ్చిమ ప్రాకార మొరసి గంగమ్మసాగరము కొమ్మ
యావిర్భవించినాఁ డే వీటి కోటలో బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నేవీటి ప్రాగుదక్కోణంబు నుమబోటి శ్రీ ముల్లగూరి శక్తి
ప్రబలధారా సురత్రాణ భద్రజాతి
కరి ఘటాసైన్యదుస్సాధ కనకలోహ
గోపురద్వాః కవాట ప్రదీపిత మది
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము"

—కాశీ ఖండము (1-58)

రెడ్డిరాజులకాలములో సముద్రయానము విదేశ వ్యాపారము, సుగంధద్రవ్య ముల దిగుమతి అధికముగానున్నట్లు హరవిలాస, పీఠికనుబట్టి తెలిసికొనవచ్చును. రెడ్డి రాజ్యమునకు ముఖ్యమైన రేవుపట్టణము మోటుపల్లి. అవచితిప్పయ్యసెట్టి తాత ముత్తాతలు లోకప్రసిద్ధమగు వాణిజ్యమును నెరపుచుండెడివారు. ప్రోలయ వేమా రెడ్డి అవచిదేవయసెట్టికి ప్రాపైయుండినాడట (హర 1-18). అనవేమారెడ్డికాలము నాడు అవచి దేవయసెట్టి కొడుకు తిప్పయసెట్టి ద్వీపాంతర వ్యాపారమును స్వయ ముగా చూచుకొనుచుండెడివాడట. తిప్పయసెట్టి పెద్ద తమ్ముడు తిరుమలనాథసెట్టి కుమారగిరి వసంతవైభవము సర్వము నొక్కఁడే నిర్వహించువాడట. పండువా, ఢిల్లీ రాఢాది పట్టణముల అధిపతులు తిప్పయ్యసెట్టి తెప్పించు రత్నములను కిరీటములందు దాల్చుచుండెడివారట. అతని వ్యాపారమెట్టిదో శ్రీనాథుడు హరవిలాస పీఠికలో తెల్పినాడు (హర 1-26). తిప్పయసెట్టి రెండవ తమ్ముడగు చామిసెట్టి పంజాబు నుండి కర్పూరపుఁజెట్లు, జలనోగినుండి బంగారు మొలకలు, సింహళమునుండి మదపుటేనుగులు, హురుముంజినుండి గుఱ్ఱములు, గోవనుండి జవ్వాజి, ఆపనుండి యాణిముత్తెములు, బోటనుండి కస్తూరి, చీవినుండి చీనాంబరములను తెచ్చు చుండెడివాడట. వీరికి ద్వీపాంతరములతో ఓడలమీద వ్యాపారము జరుగుచుండెడిది.

వెన్నెలకంటి సూరన విష్ణు పురాణము రావూరి బసవరెడ్డి కుమారుడగు రాఘవరెడ్డికి కృతియిచ్చెను. రాఘవరెడ్డి గుడ్లూరికి ప్రభువు. అతని తండ్రి బసవ

రెడ్డి ఉదయగిరి రాజ్యమును పరిపాలించుచు కటక ప్రభువులైన గణపతులవలనను. విజయనగర ప్రభువులవలనను గౌరవ చిహ్నములు బడసెను. రాఘవరెడ్డి పంట రెడ్డి వంశోద్భవుడు. రాఘవరెడ్డి శాసనములు క్రీ. శ. 1526-1569 ప్రాంతము లలో నెల్లూరుమండలమున కానబడుచున్నవి. కనుక వెన్నెలకంటి సూరన క్రీ. శ. 16 వ శతాబ్దిలో నున్నట్లు నిశ్చయింపవచ్చును. విష్ణుపురాణమునుగూర్చి శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారు ఇట్లు వ్రాసిరి: 'దీనియందున్న పూర్వహిందూరాజ వంశావళులు ప్రస్తుతము తామ్రశిలాశాసనాదికముల సహాయమునఁ జరిత్రపరిశోధ కులచే నిర్ణయింపబడిన వంశావళులకుఁ జక్కఁగ సరిపోవుచున్నవి. కావున విష్ణు పురాణము మతవిషయమునందును దేశచరిత్రవిషయమందును నగ్రస్థాన మలంక రింపఁదగినది.' (చూ. ఆంధ్రవాఙ్మయచరిత్రము, పుట. 358)

4. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినిభారతమున కృతిపతియగు సాళువ నరసింగరాయల వంశచరిత్ర మున్నది. సాళువ నృసింహరాయలు విజయనగర రాజ్యము నేలిన సంగమవంశస్థులలో కట్టకడపటి వాడైన రాజశేఖరరాయలు, విరూపాక్షరాయలు మున్నగువారికి ముఖ్యదండనాథుడు. ఇతడు అనేకదేశములను జయించి సామ్రాజ్యమును విస్తరింపజేసినాడు. తుదకు తనప్రభువులు దుర్బలు లగుటచే తానే చక్రవర్తి యయ్యెను. ఈతని వంశచరిత్రమును సంస్కృతమున 'సాళువాభ్యుదయ' మను పేర రాజనాథ డిండిముడు రచించినాడు. ఈతని వంశము లోని గుండరాజు కొడుకు లార్గురిలోను సాళువ మంగరాజు గొప్ప పేరుప్రతిష్ఠలు పొందినాడు. అతడు బుక్కరాయలపుత్రుడైన సంపరాయలకు సైన్యాధిపతిగానుండి దక్షిణదేశమును జయించి పరపక్ష సాళ్వుడగుటచే సాళువబిరుదమును బొందెను. మంగరాజు దక్షిణసురతాను నెదిరించి సంపరాయనికి రాజ్యము నిల్పినాడు. శ్రీరంగనాయకులకు అరువదివేలమాడ లుమ్మడి యొసగినాడు. మధుర సురతాను నోడించి సాళువ బిరుదమునంది ప్రసిద్ధిగాంచినాడు. ఈ విషయము జైమిని భారతమునందలి అవతారికలో తెలుపబడినది. (జై. భా. 1-32)

సాళువనృసింహరాజు చంద్రగిరినేలుచు భుజపరాక్రమమున కళింగగజ పతులవశమై యుండిన ఉదయగిరి రాజ్యభాగము నాక్రమించినాడు. చోళరాజులను జయించినాడు. పెనుగొండనుండి తురుష్కులను పారద్రోలి యారాజ్యమును తన వశము చేసికొనెను.

మీసరగండ, బర్బరబాహా, రాయచౌహత్తమల్ల, ధరణీవరాహ, మోహన మురారి, కఠారిరాయ, కఠారిసాళువ—ఇత్యాది బిరుదములను సాళువ నృసింహరాయలు ధరించినట్లు పినవీరభద్రుడు జైమినిభారతమున తెల్పినాడు. ఇవి సాళువ వంశ బిరుదములు. ఈ సాళువవంశీయుల బిరుదములను చదలువాడ మల్లనకూడ తన విప్రనారాయణచరిత్ర అవతారికలో తెల్పినాడు. విప్రనారాయణచరిత్రకు కృతిపతి సాళువ మాకరాజు కుమారుడగు తిరుమలరాజు. 'సోమకులదీపుఁడు (1-56), కఠారి సాళువ బిరుదాంకుడు (1-57), సాళ్వమాకధరణీశ్వరు తిమ్మనృపాలుఁడు (1-42), మోహనమురారి (1-88), త్రిభువనీ గండరగూళీ (3-1), మేదినీ మీసరగండ (అవతారిక గద్యము)—బిరుదములను సాళువ తిరుమలరాజు ధరించినట్లు మల్లన కవి తెల్పినాడు.

నందిమల్లయ ఘంటసింగనలు తమ వరాహపురాణములో కృతిపతియగు తుళువ నరసరాయలకు పతియైన సాళువ నరసింగరాజు వంశవర్ణనను చేసినారు. సాళువ నరసింగరాజువంశము చంద్రవంశము. గుండ్రాజు, అతని కుమారుడగు సాళ్వరాజు, అతని కొడుకగు గౌతరాజు, అతని కొడుకగు గుండరాజు, అతని కొడుకగు నరసింగరాయల ప్రతాపాదులు వరాహపురాణములో వివరింపబడినవి. సాళ్వ నరసింగరాయల పరాక్రమము మూడు పద్యములలో వర్ణింపబడినది.

5. తుళువ నరసరాయల తండ్రియగు ఈశ్వరరాజు సాళువ నృసింహరాయలయొద్ద దండనాయకుడుగా నుండి అనేకదుర్గములను తనప్రభువుకొరకు జయించినటు వరాహపురాణావతారికనుబట్టి తెలియుచున్నది (వరాహ. 1-30). ఉదయగిరి, హుత్తూరు (పుత్తూరు), గండికోట, పెనుగొండ బెంగుళూరు, నెల్లూరు, కుందాణి, గొడుగుచింత, బాగూరు, నరుగొండ, నామూరు, సీరుగపట్నము మొదలగు కడిందిదుర్గములను జయించి తుళువ నరసరాయలు సాళువ నృసింహరాయలకు కుడిభుజముగా నుండెను. ఇంతేగాక బెదందకోట (బీదరు) యవనసైన్యములతో యుద్ధముచేసి కందుకూరు కడ్డీవారిని ధ్వంసమొనర్చి విజయమును సాధించినట్లు ఈ క్రిందిపద్యమువలన తెలియుచున్నది:

"నరసింగక్షితిపాలు పంపునుడుగాఁ జేసి దండెత్తి యీ
శ్వరభూభర్త బెడందకోట యవనాశ్వవ్రాతమున్ భీమ సం
గరరంగంబునఁ గొల్లవట్టుకొని వీఁకం గందుకూరీ పురాం
తరసీమంబునఁ జక్కఁగా నలికె దుర్దాంతారి సంతానమున్"

—వరాహపురాణము, అవతారిక

ఈ విషయము పారిజాతాపహరణములో కూడ చెప్పబడినది. (1-10)

తుళువ నరసదండనాయకుని విజయమునుగూర్చి వరాహపురాణమున ని ట్లభివర్ణితమైనది:

ఉత్సాహ :

"మండువా బెడందకోట మాహురాది మేదినీ
మండలేశ్వర స్తుతాసమాన మానుషోదయా
ఖండనాజితప్రచండ పటహా నిస్వనార్భటీ
హిండితాష్టదిక్కుడుంగ యీశ్వరాత్మసంభవా"

—వరాహపురాణము (1-154)

మండువా, బెడందకోట, మాహురీ (నిజాం రాజ్యములోనిది) మొదలగు కోటలను నరసరాయలు జయించినట్లు చెప్పబడినది. ఈ నరసరాయలనుగూర్చి పారిజాతాపహరణము అవతారికలోకూడ వర్ణింపబడినది.

అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన తమ గ్రంథములలో కృతిపతియగు కృష్ణదేవరాయల వంశమున ప్రసిద్ధులగు ఈశ్వరనృపతిని, నరసభూవిభుని వారు చూపిన బలపరాక్రమములను సంగ్రహముగా, హృద్యముగా సమంజసముగా వర్ణించియున్నారు. కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు, శివసముద్రములను జయించుటయు, ఉదయగిరి, బెల్లముకొండ, కొండవీడు, కొండపల్లి మున్నగు దుర్గములను సాధించుటయు ఇత్యాది చారిత్రకాంశములను తిమ్మనకూడ మనుచరిత్రాదులలో వలెనేసూచించియున్నాడు. 'చిన్నమదేవీ జీవితనాయక', 'తిరుమలదేవీవల్లభ' అని కృష్ణరాయలను సంబోధించియుండుటవలన పెద్దనవలెనే తిమ్మనయు కృష్ణరాయల ఇరువురు భార్యలను పేర్కొనినాడు.

కృష్ణరాయలు కవితాప్రజ్ఞకలవాడని పెద్దన తెల్పలేదు. రాయలు స్వయముగా గాని తన కవితాప్రజ్ఞను తెలుపుకొనలేదు. ఈ విషయము తిమ్మన పారిజాతాపహరణము మూలముననే మనకు తెలియుచున్నది. 'కవితా ప్రావీణ్య ఫణీశా' అని కృష్ణరాయని తిమ్మన వర్ణించుటచే ఈ విషయము సువ్యక్తమగుచున్నది. కృష్ణదేవరాయల విద్వత్సభలను గురించియు, కవి సంభావనోత్సవములను గురించియు కూడ తిమ్మనకవి మనకు స్పష్టపరచినాడు.

"ప్రతివర్ష వసంతోత్సవ కుతుకాగత సుకవినికర గుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత చతురాంతఃపురవధూ ప్రసాదన రసికా"
—పారిజాతాపహరణము (1-139)

అని వర్ణించుటచే రాయలకు గల కావ్యగోష్ఠికౌతూహలము, విద్వజ్జన పరితోషణోత్సాహము తెలియుచున్నవి. 'భువనవిజయాఖ్య సంపన్నవరత్నవిభా ప్రభాత నలినాప్త' (పారి. 5-110) అని రాయల పేరోలగమందిరమును వర్ణించి ఆతని సభాస్థానము భువనవిజయమని తెలిపెను.

మాదయగారి మల్లన తన రాజశేఖర చరిత్రావతారికలో నాదెండ్ల గోపన మంత్రిని గుత్తిదుర్గ పరిపాలకునిగా వర్ణించినాడు. ఈ క్రింది పద్యమును చూడుడు:

"ప్రాపిత రాజ్యవైభవ నిరాకృతపాక విరోధియైన యా
గోపనమంత్రి దర్శ్వధనగోపన సమ్మతి గుత్తిదుర్గల
క్ష్మీపరిపాలన క్రమసమిద్ధభుజాబలశాలి రూపరే
ఖాపరిమత్స్యలాంఛనుఁడు యాహవకార్యధురంధరుం డిలన్"
—రాజశేఖర చరిత్ర (1-27)

కాని శాసనములలో మాత్రము గోపనమంత్రి కొండవీటి పాలకుడని యున్నది. ఉద్భటారాధ్యచరిత్రావతారికలో తెనాలిరామలింగకవి కృతిపతియగు ఊరదేచమంత్రికి పతియైన గోపమంత్రిని వర్ణించుచు కొండవీటి దుర్గాధ్యక్షునిగా చెప్పినాడు. ఈ విభేదమునకు కారణము తెలియదు. మల్లన తన రాజశేఖరచరిత్రకు కృతిపతియగు నాదెండ్ల అప్పామాత్యుడు ఏ దుర్గపాలకుడో కూడ వివరించి యుండలేదు. ఈ అప్పామాత్యుడు కృష్ణదేవరాయల మంత్రియగు తిమ్మరుసు అల్లుడు, మేనల్లుడును.

6. ఆరవీటి రాజుల వంశచరిత్రము రామరాజీయము, బాలభాగవతము, వసుచరిత్ర, కళాపూర్ణోదయము ఇత్యాది కావ్యావతారికలనుబట్టి తెలియుచున్నది. బాలభాగవతమున పెక్కుచారిత్రకాంశములు వివరింపబడినవి. బాలభాగవతమును పద్యములోను, ద్విపదలోను కూడ వ్రాసిన కవి దోనూరి కోనేరునాథకవి. ఇతడు ఆరవీటి వంశరాజగు తిరుమలరాజు ఆస్థానకవి. ఈ తిరుమలరాజు రామరాజు తిమ్మరాజను ప్రసిద్ధిగల తిమ్మరాజునకు పుత్రుడు. పద్యబాలభాగవతము రామరాజు తిమ్మరాజున కంకిత మొనర్పబడినది.

'సాళువ నరసింగరాయ రాజ్యస్థాపకుండయ్యెఁ బ్రౌఢి నారెవీటి బుక్కనరేంద్రు డుద్ఘాటితారి' (బాల. భా. 1-30) అని చెప్పబడుటచే అరవీటి బుక్కరాజు సాళువ నరసింగరాయలకు సమకాలికుడని నిస్సంశయముగా నిర్ధారింపవచ్చును. బుక్కరాజపుత్రుడగు రామరాజుకూడ 'శ్రీవీరనరసింహునిచేఁ బ్రతిద్రోహరగండపెండేర మేఘనుఁడుగాంచె' (1-19) అని పద్య బాలభాగవతమున పేర్కొనబడుటచే వీరనరసింహరాయలకు సమకాలికుడై యుండవచ్చును.

బుక్కరాజపుత్రుడగు రామరాజ ప్రశంస ఇట్లున్నది:

"గబ్బుల్ డెబ్బది వేవు రార్వకులు వేడ్కం గొల్వగాఁ గిన్కఁబెన్
మబ్బుల్ గప్పఁగఁ గందనోలు గనుక్రేమన్ జుట్టుముట్టన్ సవా
బిబ్బీనుబ్బణఁగించి తోలె నరిరాడ్భీముండు లంకాసర
ణ్యబ్బంధ్యాభుఁడు బుక్కభూవిభుని రామాధీశుఁ డాహా యనన్"

—బాలభాగవతము (1-33)

రామరాజు కందనోలు ముట్టడినిగూర్చి ద్విపద బాలభాగవతమునందును కలదు. రామరాజు ఆదవేనికోటను పట్టుకొన్న వృత్తాంతమును కోనేరునాథకవి పద్య బాలభాగవతావతారికలో తెల్పియున్నాడు (1-34). ఈవిషయము రామరాజీయము నందును సూచింపబడినది. ఆదవేని పతియగు కాచాధీశుడెవ్వరో అతనిపై రామరాజెందుకు దండు వెడలవలసి వచ్చినదో తెలియరాదు. 'ఈ కాచాధీశుడు సంగమవంశపక్షమువాడై యుండి తద్వంశజుల కడనుండి విజయనగర సింహాసనము నొడిచికొన్న సాళువ నరసింగరాయలను గికురింపగా అతని యధికారమును స్థాపించుటకై అరవీటి రామరాజు ఆదివేనిపై దండువెడలియుండును.'[1] అని డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగా రూహించిరి.

రామరాజు పుత్రుడగు తిరుమలరాజు అవుకు వంశమునకు మూలపురుషుడు. అతడు ఉద్దండరాయడను నతని జయించె ననియు, పట్టివాడప్రభువు నోడించె ననియు పద్యబాలభాగవతములో తెల్పబడినది (1-2; 4-382). ఇతడు కంపిలి రాజును జయించి అతని సప్తాంగములను హరించి గండరగూళి యను బిరుదమును కొనినట్లు 'సంగరాంగణచర్య కంపిలిరాయ సప్తాంగ గండరగూళి సద్బిరుదాది సంగ్రహణోజ్వలాః' అను వాక్యమునుబట్టి తెలియుచున్నది. ఇతనికాలమున

1. అరవీటి వంశచరిత్ర-భారతి-సంపుటము 6. సంఖ్య 6. పుటలు 845-897.

కంపిలి రాజ్యము లేదనియు, బిరుదు వంశపారంపర్యముగా వచ్చియుండుననియు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు అభిప్రాయపడిరి.

ఈ తిరుమలరాజు మాళవరాజును తదితరులను జయించినట్లును, మహ మదమలకకు ప్రాణదాన మొసంగినట్లును 'చాళుక్యచక్రవర్తికి మాళవమదభంజనునకు' (పుట 18. ప. 6) అనుటనుబట్టి తెలియుచున్నది. ఈ తిరుమలరాజు తమ్ముడగు చినతిమ్మరాజుపేరనే కోనేరునాథకవి తన ద్విపద బాలభాగవతమును రచించినాడు. సకలము తిరుమలరాజు ఎట్లు మరణించెనను విషయమై చారిత్రకులలో భిన్నాభిప్రాయములు కలవు. యుద్ధమున రామరాజే ఆతనిని సంహరించినట్లు ద్విపద బాలభాగవతములో 'ఏప్యుద్రోహిభావము వహించిన సల్కాయ తిమ్మరాజు' ఇత్యాదిగా చెప్పబడినది. రామరాజభూషణుడును ఈతడు యుద్ధమున రామరాజుచే నిహతుడైనట్లుగనే చెప్పినాడు. ఇట్లు ద్విపద బాలభాగవతములోని అవతారిక చారిత్రక విషయములలో సంశయమేర్పడినపుడు ప్రామాణికముగ నుపయుక్తమగుచున్నది. ఇందు నవమస్కంధరాజవంశచరిత్ర కనుబంధముగా పరీక్షిత్తునుండి చినతిమ్మరాజువరకు గల వంశవర్ణన గ్రంథాంతమున గలదు.

7. రత్నాకరము గోపాలరాజు సౌగంధిక ప్రసవాపహరణములో కృతిపతి యగు రావిళ్ల లింగభూపాలుని వంశానువర్ణన సందర్భమున పెక్కు చారిత్రకాంశములు తెలుపబడినవి. ఇందలి చారిత్రక విషయములను శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు ప్రకటించి యున్నారు (చూ. ఆంధ్రపరిషత్పత్రిక. 1937). రావిళ్ల లింగభూపాలుడు కమ్మ కులజుడు. ఇతనితండ్రి తాతలును విజయనగర సామ్రాజ్యము నేలిన సాళువ, తుళువ, ఆర్వీటి వంశ నరపతుల సామంతులుగ నుండి గజపతులతోడను, అశ్వపతులతోడను వారొనర్చిన సంగ్రామములయందు సహాయులై విజయముల చేకూర్చుచుండిరి. లింగభూపాలుని మూలపురుషుడగు మల్లభూపతి గుడిపాటి సమీపమున కుతుబుషాహి బలముల నెదుర్కొని యోడించి రాయలచే బిరుదు లందెనని సౌగంధికప్రసవాపహరణ అవతారికలో తెల్పబడినది. లింగభూపాలుని ముత్తాతయగు తిప్పనృపతి కందనవోలు ఆదవని కోటలను ముట్టడించి గెలుపొందెనట. లింగభూపాలుని తండ్రియగు కొండభూపాలుడు మానవపురిచెంత నేదులఖానుని జయించినట్లును, పినతండ్రి యగు అయ్యపనాయకుడు రామరాజదత్తకిరీట రమ్యభూషణుడైనట్లును రత్నాకర కవి వర్ణించినాడు లింగభూపాలుడు సుల్తాని అబ్దుల్ పాదుశాహాను జయించి

అతనిని పెనుగొండవరకు తరిమివేసెననియు, దాబాలు పైబడి దాగులుచేసెననియు, దళవాయి వేంకటధరణీశుచే మెప్పులువడసెననియు సౌగంధికప్రసవాపహరణము అవతారికలో రత్నాకరము గోపాలరాజు తెల్పినాడు. ఇతడు పెనుగొండనేలిన పెదవేంకటపతిరాయలు (1630-42) సింహాసనస్థాపకుడనియు, అతనిచే నానారత్నభూష కరితురగ శతాంగ ఘనభాగ్యములను బడసెననియు వర్ణింపబడినది.

8. దాక్షిణాత్యాంధ్రయుగమునందు వెలసిన కావ్యములందును అవతారికలలో ఆయారాజుల చరిత్ర వివరింపబడినవి. రాజగోపాలవిలాస కృత్యవతరణికలో సుమారు ఏబది పద్యములలో కృతిపతియగు విజయరాఘవనాయకుని చరిత్రము వివరింపబడినది. అతని పూర్వుల సంగతి సంగ్రహముగను, తక్కిన కృతిపతి సంగతి సవిస్తరముగను నందు వర్ణితమైనది. ఈ విభాగమునే 'విజయరాఘవ వంశావళి' అని పేరుచేసి ప్రకటించి యున్నారు. ఈ యుగమున వెలసిన గ్రంథములలో చారిత్రకాంశములకంటె సాంఘికాది విశేషములు మిక్కుటముగా నున్నవి.

9. మంచన కేయూరబాహుచరిత్రలో నండూరి గుండనమంత్రి వైభవోపేత జీవితమును చర్చించినాడు. అగ్రహారములిచ్చి, ఎందరెందరికో వడుగులు పెళ్లిళ్లు చేయించి, ఏటేట జరుగు కాకుశేశ్వరుని తిరునాలలో రెండుచేతులతో డబ్బు వెదజల్లువాడు గుండనమంత్రి. అతడుండిన ధనదుపురము (ఇది ఇప్పటి చందవోలు) కుబేరుని పట్టణమువంటిదని చెప్పుచు మంచన కవి అందు నివసించు జనజీవితమును ఇట్లు వర్ణించినాడు :

"మంటికడవ నులకమంచంబు పూరిలు నూలిచీర రత్నకీలితంబు
గాని తొడవు పుడమి గల్గు టెఱుంగరు ధనదుపురములోని జనము లెల్ల"
—కేయూరబాహు చరిత్ర (1-19)

ఇట్లు కావ్యావతారికలలోని కృతికర్త, కృతిభర్తల వంశావళిని, షష్ఠ్యంతములు, ఇత్యాదులను ఆధారము చేసికొని పలువురు కవులు తెల్పిన చారిత్రకాంశములను ఈ ప్రకరణమున పరిశీలించితిమి, కవుల కావ్యరచనాకాలమునుకూడ కొంతవరకు నిరూపింప యత్నించితిమి. దేశచరిత్రకు, సాంఘికచరిత్రకు తోడ్పడు విధమును చర్చించితిమి. ఇక కావ్యస్వరూపమునకు సంబంధించిన కొన్ని విశేషములను తరువాతి ప్రకరణమున పరిశీలింతము.

# 17

# కావ్యస్వరూపము-ఇతర విశేషములు

తెలుగు కావ్యావతారికలలోని విశేషాంశములను చారిత్రకాంశములను పూర్వ ప్రకరణములలో చర్చించితిమి. ప్రథమేతరాశ్వాసాదివి, ఆశ్వాసాంతములందును గల విశేషములను కొంత తెలిసికొనుట ఇట అప్రస్తుతము కాదు.

## 1. ఆశ్వాస విభాగము :

సాధారణముగా కావ్యములలోని విభాగములను సంస్కృతములో సర్గ లందురు. కొన్ని సంస్కృతాలంకారిక గ్రంథములందు ఆననములని, మయూఖములని విభాగింపబడినవి. అమరకోశములో వర్గులుగ విభాగము కలదు. దృశ్య కావ్యములలో అంకము లుండును. తెలుగుకావ్యములందు సర్గలుగా గాక ఆశ్వాసములుగా విభాగముండును. ఈ ఆశ్వాసవిభాగము ప్రాకృతభాషాసాహిత్య సంప్రదాయము ననుసరించి తెలుగులోనికి వచ్చినదని చెప్పుదురు. కావ్యము ప్రాకృత భాషానిర్మితమగుచో సర్గలకు ఆశ్వాసములని పేరుండునని విశ్వనాథుడు సాహిత్య దర్పణమున చెప్పియున్నాడు.[1] కన్నడకావ్యములందును ఆశ్వాస విభజనము కలదు. విన్నకోట పెద్దన చెప్పిన ఈ పద్యమును గమనింపుడు;

---

1. సాహిత్యదర్పణము - 6-561.

"సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమునఁ బ్రాకృతంబున నాశ్వాసభాసురంబు
నాటకము లెల్ల నంక సనామకములు గద్య ముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు"
—కావ్యాలంకార చూడామణి.

పై పద్యమును బట్టి గద్యకావ్యములలో ఉచ్ఛ్వాసము, లంబకము అను విభాగముండు నని తెలియును. తెలుగు కావ్యములలోని విభాగములకు ఆశ్వాసము లని పేర్లుండునని చెప్పిన విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణియందు ఆశ్వాసములకు బదులు ఉల్లాసములని పేరుపెట్టినాడు. గణపవరపు వేంకటకవి సర్వలక్షణశిరోమణి అను లక్షణగ్రంథముకూడ ఉల్లాసములుగానే విభజింప బడినది. అందు పది ఉల్లాసము లున్నవి, వానిలో కొన్ని అలభ్యములు, మరికొన్ని అసమగ్రములు, వేరొక కొన్ని అముద్రితములు. ఉల్లాసనామౌచిత్యమును గురించి శ్రీ ఆరుద్రగా రిట్లు తెల్పియున్నారు: 'ఉల్లాసమంటే ప్రకాశమని అర్థం వుంది. పుస్తకంపేరు కావ్యాలంకారచూడామణి. మణి ప్రకాశిస్తుంది. కనుక ఉల్లాస మనే పేరుపెట్టుట సముచితమే. అయితే ఇందులో ఒక సొగసుకూడ వుంది. అర్థాలంకారాలలో ఒక అలంకారంపేరు ఉల్లాసం. దీనిలో ఒకరి గుణదోషాలను ఇంకొకరి గుణదోషాలను యెత్తి చెప్పడంతో సూచిస్తారు.'

కావ్యాలంకారచూడామణికంటె ప్రాచీనగ్రంథమగు కవిజనాశ్రయమున సంజ్ఞాధికారము, వృత్తాధికారము, జాత్యధికారము - ఇత్యాదిగా అధికారములను విభాగము కలదు. శిలప్పదిగారము అను తమిళగ్రంథమున ఇరులదిగారమ్, పొరులది గారమ్ అను విభాగము లున్నవి. ఈ అధికారము అను విభాగము తమిళమునుండి గ్రహింపబడినదని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు అభిప్రాయపడిరి.[2] మను మంచి భట్టు రచించిన హయలక్షణవిలాసము, వెల్లంకి తాతంభట్టు రచితమగు కవిచింతామణి- వీనియందు ఆశ్వాసములకు బదులు 'అధికారము'లను విభాగము కలదని వేంకట రావుగారు తెల్పినారు. ఈ రెండు గ్రంథములును అముద్రితములు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రయందు మాత్రము ప్రకరణము లని విభాగించి నాడు. ఇట్లు అధికారములుగా, ప్రకరణములుగా, ఉల్లాసములుగా కొందరు కవులు తమ కావ్యములను విభజించి యున్నను వానికి వ్యాప్తి యున్నట్లు

1. సమగ్రాంధ్ర సాహిత్యం. IV పుట. 102, 103.

2. తెలుగు - తమిళము (ద్రావిడభాష) - నిడుదవోలు వేంకటరావు, భారతి 1967 నవంబరు.

కన్పించదు. తెలుగు కావ్యములందు పెక్కింట ఆశ్వాసము లను విభాగముండుట నియతముగా నిల్చిన సంప్రదాయము.

తెలుగు కావ్యములందలి ఆశ్వాసముల సంఖ్య నియతముకాదు. ఈ ఆశ్వాసములసంఖ్య సంస్కృతనాటకములందలి అంకములనుండి పరిగ్రహింపబడి యుండునని కొందరి తలంపు. కావ్యమునందు ఆశ్వాసవిభాగము కవి ఇష్టప్రకారము జరుగును. దానికి ఒక క్రమపరిణామముగాని ఏకవాక్యతగాని కానరాదు. భాస్కర రామాయణమునందలి అరణ్యకాండ మాత్రము మిగత కాండలకంటె విలక్షణముగా నున్నది. భాస్కర రామాయణములోని మిగత కాండలు పరిమాణమున చాల పెద్దవైనను ఆశ్వాసములక్రింద విభజింపబడలేదు. కా నిఒక్క అరణ్యకాండ మాత్రము రెండాశ్వాసములుగా విభజింపబడినది. రంగనాథరామాయణము, కట్టా వరదరాజరామాయణము మున్నగు వానియందలి కాండలు ఆశ్వాసములుగా విభక్తము కాలేదు.

తెలుగు కావ్యములలో లంకావిజయమునందు రెండాశ్వాసములు మాత్రమే కలవు. మైరావణచరిత్ర, ఉద్భటారాధ్య చరిత్ర, విజయవిలాసము, మల్హణచరిత్ర, వాల్మీకిచరిత్ర, అహల్యాసంక్రందనము, బిల్హణీయము, కవిజనరంజనము, కుచేలోపాఖ్యానము మున్నగువానియందు మూడాశ్వాసము లున్నవి. కేయూరబాహుచరిత్ర, శృంగారశాకుంతలము, ఛందోదర్పణము, శివరాత్రి మాహాత్మ్యము, వైజయంతీ విలాసము, కాళహస్తిమాహాత్మ్యము, రాఘవపాండవీయము, నిరంకుశోపాఖ్యానము, రాధికాసాంత్వనము, సత్యభామాసాంత్వనము మొదలగువానియందు నాలుగాశ్వాసములు కలవు. ఇక అయిదాశ్వాసములుగా విభాగమున్న కావ్యములు తెలుగులో హెచ్చుగా నున్నవి. పంచమాశ్వాస కావ్యములలో ముఖ్యమైనవి — నృసింహపురాణము, ప్రబోధచంద్రోదయము, పంచతంత్రము, బాలభాగవతము, పారిజాతాపహరణము, రాధామాధవము, పాంచాలీపరిణయము, ప్రభావతీప్రద్యుమ్నము, సుదక్షిణాపరిణయము, విప్రనారాయణచరిత్ర, రుక్మాంగద. ఆరు, ఏడు ఆశ్వాసములున్న కావ్యములు తెలుగులో అల్పసంఖ్యాకములే. భీమేశ్వరపురాణము, మనుచరిత్ర, వసుచరిత్ర, కవికర్ణరసాయనము మొదలగువానియందు ఆటాశ్వాసములు ప్రయుక్తమయినవి. ఏడాశ్వాసములున్న కావ్యములు—భోజరాజీయము, హరవిలాసము, కాశీఖండము మొదలగునవి. ఎనిమిదాశ్వాసములుగల కావ్యములు తెలుగులో అధికముగానున్నవి. మార్కండేయపురాణము, శృంగారనైషధము, విక్రమార్క

చరిత్ర, జైమినీభారతము, పరమయోగి విలాసము, షట్చక్రవర్తి చరిత్ర, రామాభ్యుదయము, కళాపూర్ణోదయము మొదలగువానియందు ఎనిమిదాశ్వాసములున్నవి. కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసముల గ్రంథము. ఎఱ్ఱన హరివంశ పూర్వ భాగముకూడ తొమ్మిది ఆశ్వాసములుగానే విభక్తమయినది. నిర్వచనోత్తర రామాయణము, హరివంశ ఉత్తరభాగము, కట్టావరదరాజు శ్రీరంగమాహాత్మ్యములందు పది ఆశ్వాసములున్నవి. మడికి సింగన పద్మపురాణము పదునొకండాశ్వాసములు గలది. నన్నెచోడుని కుమారసంభవము, కేతన దశకుమారచరిత్ర, నంది మల్లయ ఘంటసింగనల వరాహపురాణము—వీనియందు పండ్రెండాశ్వాసము లున్నవి.

ఇట్లు తెలుగుకావ్యములందు ఆశ్వాసవిభాగము వివిధముగా నున్నదని పై పరిశీలనమువలన వ్యక్తమగుచున్నది. కుమారసంభవము, పద్మపురాణమువంటి కొన్ని కావ్యములందు తప్ప సామాన్యముగా తెలుగు కావ్యములు మూడాశ్వాసముల నుండి ఎనిమిదాశ్వాసములవరకు నున్నవని చెప్పవచ్చును.

## 2. ఆశ్వాసాద్యంత విశేషములు :

తెలుగు కావ్యములలో ప్రథమేతరాశ్వాసముల ప్రారంభమందు కందపద్యము సర్వత్ర నియతముగా నున్నది. ద్విపద తరువాత కందమే దేశీయ పద్యములలో చిన్నపద్యము. ద్విపదలో లేని పద్యగమన వైవిధ్యము కందమునం దున్నది. 'దక్షిణదేశ భాషాచ్ఛందస్సంప్రదాయములకు సరివచ్చు మాత్రాగణచ్ఛందములోని ఆర్యాజాతిభేదమే యీ కందపద్యమగుటచేత ప్రాచీన దేశీయకవిత్వములో దీనికి ప్రాధాన్యము కలిగియుండవచ్చును. ఆర్యాగీతియే ప్రాకృతమున 'ఖందసీ' యను పేరుగలదై యుండినట్లును, ఆంధ్రకన్నడములలోని కందము ప్రాకృతము మూలముగా నీ భాషలలో చేరినట్లును దలంపబడుచున్న'[1]. దని శ్రీ కోరాడరామకృష్ణయ్యగారు వ్రాసిరి. ప్రాచీన తెలుగు కవులు కందమును ఎక్కువగా వాడినారు. కథాగమనము శీఘ్రతర మొనర్చుటకును, సంగ్రహముగా విషయము నెదుటివారి హృదయమునకు హత్తునట్లు చెప్పుటకును కందమే యుచితముగా నుండును. దేశీయ పద్యమగుటచే కవులు తమ కావ్యములందు ఆశ్వాసాదిని కందమును వాడినారు. ఆశ్వాసాదిని కందము తరువాత ఒక వచనము సర్వసాధారణముగా పెక్కు కావ్యములందు కన్పట్టును. నిర్వచనోత్తర రామాయణమువంటి కొన్ని కావ్యములందు

1. చూ. దక్షిణదేశ భాషాసారస్వతములు.... దేశి. పుట 127.

**ఆశ్వాసాదిని కందము తరువాత మరొక కందము రచింపబడి అటుతరువాత కథారంభము చేయబడినది.**

ఆశ్వాసాంత్యమందు ఒక వృత్తము, తరువాత నొక కందము, అటు **పిమ్మట** ఒక విశేష వృత్తమును, అంత్యమున కవినిగూర్చిన గద్యయుండుట తెలుగుకావ్యము లందన్నిటను నియతముగా నున్నది. కూచిమంచి తిమ్మకవి రుక్మిణీపరిణయమువంటి కొన్ని కావ్యములందు మాత్రము కొన్ని ఆశ్వాసాంతము లందు రెండు విశేషవృత్తములున్నవి.

ఆశ్వాసాంతమున మాలినీవృత్తమును విశేషవృత్తముగా తిక్కన, మంచన, ఎఱ్ఱన, పోతనాదులు తమ కావ్యములందు వాడినారు. మాలినీవృత్తము తోపాటు స్వాగతము, వసంతతిలకము, మత్తకోకిలము, ద్రుత విలంబితము, వనమయూరము, తోటకము, సుగంధి, మంగళమహాశ్రీ, కవిరాజవిరాజితము, పంచచామరము, తరలము ఇత్యాది విశేషవృత్తములందు నన్నయాదులు తమ ఆశ్వాసాదులం దుపయోగించినారు. ఆశ్వాసాంతములను అపూర్వవృత్తములను గూడ కొందరు కవులు వాడినారు. బహుళాశ్వచరిత్ర ఆశ్వాసాంతమున భ్రమర కాజిత వృత్తమును దామెర్ల వెంగళరాజు వ్రాసినాడు. దీనికి అప్పకవీయమున లక్షణము లేదు. ఆ వృత్త మీ క్రిందిది :

"శ్రీదాలలితచారుదాయిసర సారసాంకురిత సౌరభా
సౌరభానుపవిహారశాలిశిఖి సన్నుహాస పవనానుశ్రీ
సారశోభమిత కీరశ్రీసకల సంస్తుత స్వగుణగౌరవా
...వారిరుహాలినాదవిలసద్వశః కృతవిశారదా"

—బహుళాశ్వచరిత్ర. (3-105)

ఇది 21 వ ఛందములోనిది. ఇందు రస రస రస ర అను గణము లున్నవి. పదమూడవ అక్షరము యతి. ఇందు ప్రతిపాదమునకు ముక్తపదగ్రస్త ముతో నడచు ఒక సమాసమున్నది. పద్యములోని మొట్టమొదటి పదము కట్టకడపటి పదము ఒకటే.

తెలుగు కావ్యములలోని ఆశ్వాసాద్యంతములు సంబోధనలని, విభక్త్యంతములని రెండు విధములు. నన్నయ భారతమున ఆశ్వాసాద్యంత పద్యములు రాజరాజనరేంద్రుని సంబుద్ధ్యంతములుగా నున్నవి. తిక్కనకూడ భారతమున ఆశ్వాసాద్యంతములను కృతిపతిని సంబోధించుచు చెప్పినాడు. ఈ సంబోధనా సంప్రదాయమును పలువురు తెలుగు కవులు ఆశ్వాసాద్యంతములందు పాటించినారు.

షోడశకుమారచరిత్రకు అవతారిక లభ్యముకాలేదు. అందలి ఆశ్వాసములలోని అద్యంతపద్యములవలన కృతిపతియగు సూరామాత్యుని గూర్చిన విషయములు పెక్కు తెలియుచున్నవి. సూరామాత్యుడు ఆఖ్యానము, కల్పితకథ, ఉపాఖ్యానము ఆఖ్యాయికా ప్రపంచరహస్య వ్యాఖ్యాన వ్యవహరణ ప్రఖ్యాత చరిత్రుడు (1-39). రామాయణము, భారతము, పారాశరసూక్తి, కూర్మపురాణము, పద్మపురాణము మున్నగు పురాణవిలోచన గౌరవ మతిధన్యుడు (2-185). అతడు కేవల పండితుడేగాక అశ్వశిక్షకుడుకూడ. అతడు 'సింధురాత్తప్రముఖ తురగసేవ్యవాజి శిక్షణుడు (5-158). శైవసిద్ధాంతవేది (1-40). నాటకముఖకోహళాది నాట్యరహస్యముల ఉద్ఘాటన నిపుణప్రజ్ఞా చాతుర్యుడు. నూత్న భరతాచార్యుడు (8-91).

ఆశ్వాసాద్యంతములందు కృతిపతిని గూర్చిన సంబోధనల మూలమున పెక్కు చారిత్రక విషయములుకూడ వ్యక్తమగుచున్నవి. ప్రబోధచంద్రోదయమున ద్వితీయాశ్వాస ప్రారంభపద్యమున కృతిపతిని సంబోధించుచు చెప్పిన పద్యమిది.

"శ్రీకర వీక్షణదాన శ్రీకర నరసింహనృప వశీకృ నయ వి
ద్యాకరణ చతుర్దశవిద్యాకర ధీరంగ మతి యనంతయగంగా"

గంగయామాత్యుడు విజయనగరరాజుల దండనాయకుడగు సాళువ నృసింహరాయలను తన వశునిగా చేసికొనెనని పై పద్యమువలన వ్యక్తమగుచున్నది. గంగయామాత్యుడు నాసికేతోపాఖ్యానము కృతినందిన విషయము ప్రబోధచంద్రోదయము చతుర్థాశ్వాసాంత పద్యమున సూచింపబడినది (4-71).

కృతిపతిని ఆశ్వాస ప్రారంభమునందును, అంత్యమందును సంబోధించుట తెలుగులో సంప్రదాయము. భానుకవి పంచతంత్రిలో ఒక విశేషము కలదు. అతడు తన గ్రంథమునందు ఎక్కడ నీతులు చెప్పినను ఆ పద్యములను కృతిపతి సంబోధనతోడనే వ్రాసినాడు. పంచతంత్రి కృతిపతి భండారు లక్ష్మినారాయణ. అతడు శ్రీకృష్ణదేవరాయల ఆశ్రితుడు, నాట్యాచార్యుడు.

చెంగల్వ కాళకవి తన రాజగోపాలవిలాసములోని ప్రతి ఆశ్వాసాంతమందును కృతిపతియగు విజయరాఘవుని ప్రేయసియగు ముద్దు చంద్రరేఖ అను నర్తకిని స్మరించినాడు. విజయరాఘవుని ముద్దు చంద్రరేఖానాథునిగా కవి సంబోధించినాడు.

కృత్యాద్యవస్థగా రచింపబడిన ఆశ్వాసాద్యంతమునందలి కృతిపతిని గూర్చిన సంబోధనలనుబట్టి కొన్ని విశేషాంశములు తెలియుచున్నవని పైని నిరూ

పింపబడినది. ప్రాచీన కావ్యములందు ఈ ఆశ్వాసాద్యంతపద్యములు విశిష్టకవితా సంప్రదాయముతో విలక్షణ శిల్పవిన్యాసముతో నొప్పుచున్నవి.

కావ్యమునందలి ఆశ్వాసాద్యంత పద్యములలోని విశేషణములు ఏకవిభక్తికములగునట్లుగా రచించుట ఒక విశిష్టసాహిత్య సంప్రదాయము. ఇది ప్రాచీన కన్నడ కావ్యములందు కలదు. ఈ విభక్త్యంత సంప్రదాయము తెలుగున మొట్ట మొదట నన్నెచోడునితో ప్రారంభమయినది. దీని మూలమున కథానాయకునివలెనే కృతిపతియు కావ్యకథయందు పాల్గొనుచున్నాడను స్ఫూర్తి పాఠకులకు కల్గును. నన్నెచోడుడు ఈ సంప్రదాయమును కన్నడ కవులనుండి గ్రహించియుండును. నన్నెచోడునికి తరువాత తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందును, కేతన దశకుమారచరిత్రయందును, భాస్కరుడు....భాస్కర రామాయణములోని అరణ్య కాండమునందును మంచన కేయూరబాహు చరిత్రమందును, విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి యందును, కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక యందును, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నము నందును ఆశ్వాసాద్యంత పద్యములు ఏకవిభక్తికములగు నట్లుగా రచించినారు. విభక్త్యంత సంప్రదాయ మును పాటించుటలో తిక్కన కేతనాదులలో మరొక నియమముకూడ కలదు. ఆశ్వాసమును ఏ విభక్తితో ప్రారంభించిన ఆ విభక్తితో కథను ప్రారంభించి మొట్ట మొదటి పద్యమునుగాని గద్యమునుగాని రచించుట తిక్కనాదుల కావ్యములందు కలదు. నన్నెచోడుడు ఈ ఎత్తుగడ విభక్తిని కొన్ని ఆశ్వాసముల మొదటి పద్యమునందు వాడినాడు. కొన్ని ఆశ్వాసములందు నన్నెచోడుడు ఎత్తుగడ విభక్తిని తప్పినాడనియు తిక్కన కేతనలు ఎక్కడనుకూడ ఎత్తుగడ విభక్తిని తప్పలే దనియు సోదాహరణముగా శ్రీ ఆరుద్రగారు చూపించినారు.[1]

మంచన విభక్త్యంత రచనా సంప్రదాయమును పాటించుటలో ఒక విశేష మును చూపియున్నాడు. విభక్త్యంతములను వ్రాయువారు ఎచ్చటను—సంబోధన నుపయోగింపరు. మంచన అట్లుగాక కేయూరబాహుచరిత్ర చతుర్థాశ్వాసమును ప్రథమావిభక్తితో ప్రారంభించి ఆ యాశ్వాసమును సంబోధనముతో ముగించి యున్నాడు.

గ్రంథాశ్వాసాంతపద్యములను విలక్షణ విన్యాసముతో విరాజిల్లునట్లు ప్రాచీనకవులు రచించినారు. తిక్కన భారతములో ప్రతి పర్వాంతములోను

1. సమగ్రాంధ్రసాహిత్యం—I, పుట. 176-178

ఆనందముద్రను వాడినాడని గుర్తించినది కట్టమంచి రామలింగారెడ్డిగారు. తిక్కన భారత పర్వాంత పద్యములలో నాల్గవ పాదములో విధిగా ఆనందముద్రయుండునని సుదీర్ఘ సమాసములను వేరుచేసి శ్రీ ఆరుద్రగారు చూపించినారు.[1] 'కావ్యం మొట్ట మొదటి పద్యంలో కాక రెండవ నెంబరు వచనంలో భావానందం ఉంది. కనుక గ్రంథాంతంలో ఉపథాపద్యంలో (ఆఖరిదానికి ముందున్న దానిలో) కూడా భావానందం వాడితేనేగాని శిల్పంలో నిండుదనంరాదు. అందుకే ఉపథాపద్యంలోపలే 'కేవల భావానందమయా, వేదవ్యాసవర్ణనారూఢదయా' అని ఉపథాచరణంలో వాడి సరిపుచ్చారు. (స్వర్గా 96)''[2] తిక్కన భారతములో గ్రంథాదిని కృతికర్త భావానందభరితాంతఃకరణుడు. గ్రంథాంతమున కృతిపతి సంభృతానందభావుడు.

## 3. ఆశ్వాసాంత గద్యలు, విశేషాంశములు :

ఆశ్వాసాంతమందు కవిని గూర్చిన గద్య యుండును. ఆశ్వాసపరిసమాప్తిని గద్యముతో చెప్పు నాచారము తెలుగు కావ్యములందు కలదు. కాని ఆముక్తమాల్యద కర్త మాత్రము పద్యములతోడనే ఆశ్వాస పరిసమాప్తిని తెల్పుట ఒక విశేషము. ఆముక్తమాల్యద సప్తాశ్వాసాంతములందును మత్తేభపద్య సప్తకము కలదు. ఆముక్తమాల్యద కావ్యాంత పద్య మిది :

''ఇది నీలాచల నీలచేలక సుభద్రేందీవరాభాక్షి కో
ణదృగంచద్భుజవీర్యధుర్యజయసన్నాహోద్భటీవాద్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయమహిజాన్యుత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరు హృద్యంబైన పద్యంబులన్''

—ఆముక్తమాల్యద (7-76)

ఆముక్తమాల్యద అన్ని ఆశ్వాసములందును ఒకే పద్యము ప్రయుక్తముకాదు.

పాల్కురికి సోమనాథుడు తన ద్విపదకావ్యములందు ఆశ్వాసాంత గద్యను వ్రాయలేదు. గద్యలో చెప్పు సంగతుల నన్నిటిని సోమనాథుడు ద్విపదలోనే చెప్పినాడు. సోమనాథుడు గద్యపద్యోదాత్తకృతులు ద్విపదలు సమమని భావించినాడు. కనుక గద్యకు బదులు ద్విపదలనే చెప్పినాడు. తక్కిన ద్విపదకావ్యకవు లందరుకూడ ఆద్యంతములందును ద్విపదలనే చెప్పినారు.

---

1. సమగ్రాంధ్రసాహిత్యం - II. పుట. 131-132,

2. సమగ్రాంధ్రసాహిత్యం - II. పుట. 138.

తిక్కన నిర్వచనోత్తరరామాయణములో ప్రతి ఆశ్వాసాంతమునందును గద్యము వ్రాసినాడు. దీనినిబట్టి తిక్కన కాలమునాటికి వచనము, గద్య అనునవి ఒకటి కాదనియు అవి భిన్నములనియు తెలియును. కాని 'గద్యమ్మున దండి చెప్పిన కథాక్రమమొప్పఁ దెనుంగుబాస గద్యమ్మును బద్యమున్ బెరయ నంచిత భావరసోదయాభిరామమ్మగునట్లుగా దశకుమారచరిత్రము సెప్పఁబూనితిన్' (దశ. 1-25) అని కేతన చెప్పుటచే చంపూకావ్యములలోని గద్యము వచనము ఒకటే అనుట తెలియును.

ఆశ్వాసాంతములందుండు గద్యసంప్రదాయము వేరు, ఆశ్వాసముల లోపల నుండు గద్యసంప్రదాయము వేరు అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వివరించినారు.[1] ఆశ్వాసాంత గద్యలు విరుదు గద్యలు అని నిడుదవోలువారు అర్థము చెప్పినారు. కాని లక్షణకారుల నిర్వచనము ప్రకారము విరుదు గద్యలు సంబోధనాంతములుగా నుండవలెను. ఆశ్వాసాంత గద్యలందు సంబోధన లుండవు కదా! అవి ప్రథమపురుషలో చెప్పబడును. అయినను ఆశ్వాసాంత గద్యలు బిరుదుగద్యలే అని వేంకటరావుగారి అభిప్రాయము.

అనంతామాత్యుడు తన ఛందోదర్పణములో గద్యలక్షణమును చెప్పి దాని కొక లక్ష్యమును రచించినాడు. చూడుడు:

"కనుఁగొనఁ బాదవిహీనమై పనుపడి పాదగద్యమౌలె బహుముఖరచనం
బున వెలయు గద్యమని నాఁ దెనుఁగుకృతుల వచనమునఁ గదీపించుఁ గడున్"

(2-2)

గద్యము: 'స్వస్తి సమస్త భువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగపతి సింహాసనారూఢ సురనికర మకుటతటఘటిత సురుచిరమణిగణ ప్రభావిభాసితపాద పీఠ....కౌండిన్యవరద శ్రీ యనంతపద్మనాభ నమస్తే నమస్తే నమః'.

(2-3)

ఈ గద్యము శాసనములందువలె 'స్వస్తి'తో ప్రారంభింపబడి దండకములందువలె 'నమస్తే నమస్తే నమః' అని ముగింపబడినది. ద్వితీయాశ్వాసము చివర అనంతామాత్యుడు దండకలక్షణమును ఆ ఛందముననే చెప్పుచు 'దండకాకారమేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్' (2-135) అని ముగించినాడు. ఇందు

1. ఆంధ్రవచనవాఙ్మయము పుట 8.

'నమస్తే నమస్తే నమః' అని ముగింపలేదు. కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము వీనియందు దండకము సంబోధనలతోడనే అంతమగుచున్నది. కాని మొట్టమొదటి దండకమును వ్రాసిన నన్నయమాత్రము దండకమును 'శ్రీ'తో ప్రారంభించి 'నమస్తే నమస్తే నమః' అని ముగించినాడు (అరణ్యపర్వము 1-324). ఈ లక్ష్యమే తరువాతి కవులకు మార్గదర్శకమయినది. దండకరచనమున లక్షణకారుల లక్ష్యమును కవులు గ్రహింపలేదు.

కావ్యావతారికలవలెనే ఆశ్వాసాంతగద్యలుకూడ సాహిత్యచరిత్రకు చాల ముఖ్యమైనవి. ఆశ్వాసాంతగద్యలందు కవినిగురించియు అతని కావ్యమును గురించియు పెక్కువిషయములు తెలియుచున్నవి.

1. నన్నయ తన భారతములో ప్రతి ఆశ్వాసాంతగద్యలోను విషయసూచికను తెల్పినాడు. ఈ విషయసూచికనుబట్టి గ్రంథముయొక్క ప్రాముఖ్యము తెలియును. సంగ్రహముగా కథావిషయములు సుబోధకమగుచున్నవి. నన్నయ భారతములోని ప్రథమాశ్వాసాంత గద్యను పరికింపుడు:

"ఇది సకలసుకవి జనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునం దాది పర్వంబున ననుక్రమణికయును బౌష్యోదంక మాహాత్మ్యంబును భృగువంశ కీర్తనంబు నన్నది ప్రథమాశ్వాసము."

ఇట్లే తక్కిన ఆశ్వాసాంత గద్యలలో ఆ ఆశ్వాసములోని విషయసూచిక వివరింపబడినది. నన్నయకు తరువాతి కవులగు మారన మార్కండేయపురాణమునందును, మడికి సింగన పద్మపురాణమునందును, అనంతామాత్యుడు భోజరాజీయమునందును, దోనూరు కోనేరునాథకవి బాలభాగవతమునందును, సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమునందును, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమునందును, ప్రౌఢకవి మల్లన రుక్మాంగదయందును, వేంకమాంబ వేంకటాచల మాహాత్మ్యమునందును, కృష్ణకవి శకుంతలా పరిణయమునందును ఆశ్వాసాంత గద్యలో విషయసూచికను తెల్పియున్నారు. తెలుగులో ప్రథమచ్ఛందోగ్రంథమగు కవిజనాశ్రయము ఆశ్వాసాంత గద్యలో విషయసూచికలేదు. కాని కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, నరసభూపాలీయము, అప్పకవీయము మున్నగు లక్షణగ్రంథములందలి ఆశ్వాసాంత గద్యలలో విషయసూచిక వివరింపబడినది. దీనినిబట్టి ఆయా ఆశ్వాసములం దేయే విషయములున్నవో శ్రమలేకుండ స్పష్టముగా తెలిసికొనవచ్చును.

2. గ్రంథము సంపూర్ణమా? అసంపూర్ణమా? అను విషయమును తెలిసి కొనుటకును ఆశ్వాసాంత గద్య యుపకరించుచున్నది. తెలుగు కవులు పెక్కుమంది తమ కావ్యాంతగద్యలో గ్రంథము 'సంపూర్ణమ'ని తెల్పినారు. 'కుమార సంభవం బను కథయందు ద్వాదశాశ్వాసము సంపూర్ణము' అని నన్నెచోడుడు కుమారసంభవ కావ్యాంతగద్యలో వ్రాసినాడు. 'ఉత్తరరామాయణంబను మహాకావ్యంబునందు సర్వంబును దశమాశ్వాసము' అని తిక్కన నిర్వచనోత్తరరామాయణాంత్యగద్య యందు తెల్పినాడు. మారన తన మార్కండేయపురాణములోని గ్రంథాంత గద్యలో...మార్కండేయపురాణంబునందు...ననుకథలంగల యష్టమాశ్వాసంబు సర్వంబును సంపూర్ణము' అని వ్రాసినాడు. కేయూరబాహుచరిత్ర, నృసింహ పురాణము, హరివంశము, శృంగారశాకుంతలము, జైమినీభారతము, ప్రబోధ చంద్రోదయము, వరాహపురాణము, విక్రమార్కచరిత్ర, భోజరాజీయము, భీమే శ్వరపురాణము, హరవిలాసము, పంచతంత్రము, మనుచరిత్ర, పారిజాతాపహర ణము, పాండురంగమాహాత్మ్యము, కళాపూర్ణోదయము, పాంచాలీపరిణయము, చెన్నబసవపురాణము మొదలగువానియందలి గ్రంథాంతగద్యలందు 'సంపూర్ణము' అను మాటలుండుటనుబట్టి ఆ కవులు ఆ గ్రంథములను సంపూర్ణముగానే రచించి నారని నిశ్చయింపవచ్చును. ప్రభావతీ ప్రద్యుమ్నము, నిరంకుశోపాఖ్యానము, సుదక్షిణాపరిణయము, సాంబోపాఖ్యానము, విజయవిలాసము—ఇత్యాది కొన్ని కావ్యములందలి గ్రంథాంతగద్యలందు 'సంపూర్ణము' అని గాని 'అసంపూర్ణము' అని గాని లేదు. దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము తృతీయాశ్వాసము అసంపూర్ణముగా నున్నది. గ్రంథము సంపూర్తిగా లభ్యము కాలేదు. కనుక తృతీయాశ్వాసాంత గద్య నాసికేతోపాఖ్యానమున ముద్రితము కాలేదు. కదిరీపతి శుకసప్తతికూడ అసంపూర్ణముగా నున్నది. ఇందలి ప్రథమభాగము మాత్రమే ముద్రితమైనది. ఇందు చతుర్థాశ్వాసములో కొంతభాగము ముద్రితమైనది.

అప్పకవి ఎనిమిదాశ్వాసముల లక్షణగ్రంథమును వ్రాయబూనినట్లు అప్ప కవీయము పీఠికలోని ఈ క్రిందివచనమువలన తెలియుచున్నది.

వ. "ముందు బృందారకభాష నశేష విద్యాజలజాసనుండగు శబ్దానుశాస నుండు సంక్షేపంబుగాఁ గూర్చిన యంధ్రవ్యాకరణంబునందలి సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁ బలుకుల నేను విస్త రించి భాషాపరిచ్ఛేదంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్య

పరిచ్ఛేదంబును, సంధి పరిచ్ఛేదంబును, తత్సమ పరిచ్ఛేదంబును, దేశ్య పరిచ్ఛేదంబును, క్రియా పరిచ్ఛేదంబును నను నామంబుల నభిరామంబులగు నాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి బాలసరస్వతి సకలభాషాకవి మహోపాధ్యాయ ప్రణీతాంధ్ర వ్యాఖ్యాన గ్రంథం బాధారంబుగా రచియింపంబూని''

—అప్పకవీయము, పీఠిక, 96

కాని అప్పకవీయము ఏ ప్రతిలో చూచినను అయిదాశ్వాసములు మాత్రమే కనబడుచున్నవి. 'వళిప్రాసపరిచ్ఛేదం బను తృతీయాశ్వాసము సంపూర్ణము' అనియు 'పద్యపరిచ్ఛేదంబను చతుర్థాశ్వాసము సంపూర్ణము' అని చెప్పుటచే అప్పకవీయములో తృతీయ చతుర్థాశ్వాసములు సంపూర్ణముగా రచింపబడినట్లు తెలియును. అప్పకవీయములోని తక్కిన ఆశ్వాసాంతగద్యలందు 'సంపూర్ణము' అనుమాటలేదు. గ్రంథాంతగద్యమిది :

''ఇది శ్రీమదాపస్తంబసూత్ర భరద్వాజగోత్ర కామేపల్లి పురమందిర నందనందన చరణారవింద వందనాభిలాష మనీషాప్రాభవ వేంకటార్యతనూభవ విద్యావిశేష సూరాచార్య కాకునూర్యప్పకవివర్య విరచితంబైన యంధ్రశబ్ద చింతామణి యను వ్యాకరణశాస్త్రంబునం దష్టాదశార్యవృత్తంబులు నష్టచత్వారింశత్సూత్రంబులుం గల సంధి పరిచ్ఛేదమను పంచమాశ్వాసము.''

పైని పేర్కొనిన గద్యయందు 'సంపూర్ణము' అని లేమిచే అప్పకవీయము అసంపూర్ణముగానే రచితమైనదని యూహింపవచ్చును.

పతివ్రతాచరిత్రమను ద్విపద గ్రంథము కవినామాది విషయమునందే గాక కథలలో కూడ కొంతవరకు అసంపూర్ణముగనే ఉన్నది[1]. కృత్యవతరణికలో డెబ్బదికథలున్నట్లు తెలియుచున్నది. కాని,

''సరస పతివ్రతా చరితంబునందు
నరుస ముప్పది రెండవ కథ చెన్నొందె''

అని గ్రంథాంతములోని ద్విపదనుబట్టి ఇందు ముప్పది రెండు కథలు మాత్రమే వర్ణింపబడియున్నట్లు తెలియును. కాని ముద్రితగ్రంథమునందు ఇరువది ఒక్కకథలుమాత్రమే ప్రకటింపబడినవి.[2] తక్కిన పదునొకండు కథలను గూర్చిన వివరము లేవియు తెలియవు.

1. చూ. ద్విపదవాఙ్మయము, పుట 339.
2. మద్రాసుప్రభుత్వ ప్రాచ్యపుస్తకభాండాగార ప్రచురణ నెం. 60, సం. 1958.

3. కవులను గురించిన పెక్కువిషయములు ఆశ్వాసాంత గద్యలమూల మున తెలియును. కొందరు కవులు తమకు పరమేశ్వర వరప్రసాదమువలన కవిత లభించినదని తెల్పినారు. మరికొందరు వాణీప్రసాదలబ్ధమని నుడివినారు. కొందరు తమ కవితాగురువును ఆశ్వాసాంత గద్యలో స్మరించినారు. మారన మార్కండేయ పురాణము ఆశ్వాసాంత గద్యములో తిక్కనను, దుగ్గన నాసికేతోపాఖ్యానము ఆశ్వాసాంత గద్యలలో శ్రీనాథుని పేర్కొని స్తుతించినారు. ఎఱ్ఱన, పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు, అల్లసాని పెద్దన, సంకుసాల నృసింహకవి మొదలగువారు తమ గ్రంథాంత గద్యలందు తమ గురువులను భక్తితో స్మరించినారు. కేతన, అనంతామాత్యుడు, దూబగుంట నారాయణకవి మొదలగువారు తమ కవిత 'సకలసుకవిజన ప్రసాద విభవము' అని తమ ఆశ్వాసాంత గద్యలందు పేర్కొనినారు. ఉేకుమళ్ల రంగశాయి వాణీవిలాసవనమాలిక ఆశ్వాసాంత గద్యలో మొదట గ్రంథరచనకు తోడ్పడిన మహంకాళి వెంకటపతిని పేర్కొనినాడు. వాణీవిలాసవనమాలికా గద్య ఇది...."ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వరవరప్రసాద కవితావిచిత్రకుత్సగోత్ర పవిత్ర మహంకాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్రపాత్ర వినయగుణసమేత వెంకటపతి సహాయ ఉేకుమళ్లాన్వయ...రంగశాయి ప్రణీతంబైన వాణీవిలాసవన మాలిక.'' ఎఱ్ఱన జక్కనాదులు 'సుకవిమిత్ర సంభవ' మని తమ కవితను పరిగణించినారు. శంకరకవి, దూబగుంట నారాయణకవి మొదలగువారు తమ గ్రంథాశ్వాసాంత గద్యలందు తమ గోత్రసూత్రాదికమును తెల్పినారు. కులగోత్రాదులను గాని తల్లిదండ్రులనుగాని ఆశ్వాసాంత గద్యలందు స్మరింపని కేతన ఎఱ్ఱనాది కవులుకూడ నున్నారు. కవి పితృపితామహులు, గోత్రసూత్రములు ఆశ్వాసాంత గద్యలో సూచింపబడును.

4. కవులనుగూర్చిన సాహిత్య విషయములుకూడ ఆశ్వాసాంత గద్యమున తెలియుచున్నవి. నాచనసోముని ఉత్తరహరివంశమునకు అవతారిక కానరాదు. అందలి ఆశ్వాసాంత గద్యవలననే అతనిని గూర్చిన వివరములు తెలియుచున్నవి. ఉత్తర హరివంశములోని ఆశ్వాసాంత గద్య ఈ క్రిందిది :

''ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీ మత్సకలభాషాభూషణ సాహిత్యసరపోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణ సనాథ నాచన సోమనాథ ప్రణీతంబైన ఉత్తరహరివంశము.''

నాచనసోముడు సకల భాషాభూషణుడు. సాహిత్య రసపోషణుడు. సంవిధాన చక్రవర్తి. సంపూర్ణకీర్తి. నవీనగుణసనాథుడు. నాచనసోముని గూర్చిన ఈ బిరుదములు అతని సాహిత్యసంపదను వెల్లడించును.

రఘునాథనాయకుని వాల్మీకి చరిత్రలోని ఆశ్వాసాంత గద్య సుదీర్ఘముగా రచింపబడినది. అందు రఘునాథనాయకుని బిరుదులు, సాహిత్యవిషయములు, వితరణాది గుణములు వివరింపబడినవి. అందలి ఆశ్వాసాంత గద్యమిది :

"ఇది శ్రీరామచంద్ర సాంద్ర కరుణా కటాక్ష లబ్ధ సిద్ధ సారస్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్య కళాభోజ, సత్యసంభూషితముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషిత ప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదాన వైభవావర్తిత కీర్తి భాసుర, నిజనామాంకితాకలంక వస్తు సమగ్ర బహుళాగ్రహార భూషిత, చోళధరామండల నిఖిలభోగ విభవ నిర్జితాఖండలసాధిత సముద్రాంతరద్వీప పరనృపాల సంస్తుత ప్రతాప, నేపాళ భూపాల స్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య రామసేతు శ్రీరంగ విజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర సర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జిత సముద్ర సదాశ్రిత భరణ దీక్షాదక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్యదిగంత ప్రసిద్ధ తరౌదార్య సుజ్ఞానజనక సతత సంసేవిత జనకపోషిత విద్వత్కవియూథ, భువనశోభిత గుణసనాథ, బలపత్పరిపంథిగృహీత సామంత మహీకాంత విమోచన శ్లాఘనీయ బాహాబల మూర్తిమాందాగర్భ్యకు క్తిముక్తాఫల, చినచెవ్వనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర రూపరేఖావిజితకుసుమసాయక సకలధర్మసంధాయక, రఘునాథ నాయక ప్రణీతంబైన వాల్మీకి చరిత్రంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.''

కొందరు కవులు తమ గ్రంథాశ్వాసాంత గద్యలందు తమ బిరుదులను పేర్కొనినారు. కేతనకు 'అభినవదండి' అనియు, ఎఱ్ఱనకు 'శంభుదాసు' డనియు, పెద్దనకు 'ఆంధ్రకవితాపితామహు' డనియు, చింతలపూడి ఎల్లనార్యునికి 'రాధామాధవు' డనియు, బిరుదులున్నట్లు వారి గ్రంథాశ్వాసాంత గద్యలనుబట్టి తెలియుచున్నది. శ్రీనాథుడు కాశీఖండము ఆశ్వాసాంత గద్యలందు మాత్రమే 'కవిసార్వభౌమ' బిరుదమును పేర్కొనినాడు. ఉద్భటారాధ్యచరిత్ర ఆశ్వాసాంత గద్యనుబట్టి 'కుమారభారతి' అనియు, పాండురంగ మాహాత్మ్యములోని ఆశ్వాసాంత గద్యను

బట్టి 'సరసకవితా సనాథ' అనియు తెనాలి రామకృష్ణకవికి బిరుదులైనట్లు తెలియును.

5. రాజాశ్రయమున వర్ధిల్లిన కొందరు కవులు తాము ఆయా రాజులవలన రాజచిహ్నితములను బడసినట్లు తమ గ్రంథాశ్వాసాంతగద్యలందు తెల్పియున్నారు. విజయవిలాసములోని ఆశ్వాసాంత గద్యము :

"ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ (ప్రసిద్ధ) సారస్వతసుధా సార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయధురీణ సకలకళా ప్రవీణాచ్యుతేంద్ర రఘునాథభూపాలద త్తహ స్తముక్తాకటక విరాజమాన వేంకటకవిరాజ ప్రణీతంబయిన విజయవిలాసం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము."

చేమకూరి వేంకటకవి రఘునాథభూపాలునివలన రాజోచితోపచారములను బడసినట్లు ఈ ఆశ్వాసాంత గద్యనుబట్టి తెలియుచున్నది. రాధికాసాంత్వనమును రచించిన ముద్దుపళని తంజావూరు సంస్థాన ప్రభువైన ప్రతాపసింహమహారాజుచే 'అనేకచామీకరాంబరాభరణము'లను స్వీకరించినట్లు ఆశ్వాసాంత గద్యవలన వ్యక్త మగుచున్నది. 'తిరుమలక్షమాకాంత కరుణా కటాక్ష లక్షిత స్వచ్ఛముక్తా గుళుచ్ఛ సితచ్ఛత్ర చామర కళాచికా కనకాందోళికాది రాజోపచారుడ' నని లింగనమఖి కామే శ్వరకవి తన సత్యభామా సాంత్వనమునందలి ఆశ్వాసాంతగద్యమున చెప్పి కొన్నాడు. దీనినిబట్టి కామేశ్వరకవి తిరుమలనాయకునిచేత గొప్ప గొప్ప సన్మానము లందినట్లు తెలియుచున్నది. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని అహల్యా సంక్రందనములోని ఆశ్వాసాంత గద్యమును పరికింపుడు:

"ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికా ఛత్రచామర విజయకాహళ భూరి భేరీ బిరుదధ్వజ ప్రముఖనిఖిలసంపత్పారంపరీ సమేధమాన సముఖ మీనాక్షి నాయక తనూభవ శ్రీ మీనాక్షీదేవి కటాక్షలబ్ధ కవితా సాంప్రదాయక వేంకటకృష్ణప్ప నాయక ప్రణీతంబైన యహల్యాసంక్రందనంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము."

దీనినిబట్టి సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు ప్రఖ్యాతుడగు విజయరంగ చొక్కనాథనాయకుని (1704-1731 A.D.) వలన గజతురంగమాందోళికా ఛత్ర చామర విజయకాహళభూరి భేరీ బిరుదధ్వజప్రముఖాదులను బడసినట్లు స్పష్టమగును.

6. కుచేలోపాఖ్యాన కర్తయగు గట్టు ప్రభువు వంశాదికము అవతారికలో కానరాదు. అతని వంశాదికమును తెలిసికొనుటకు ఆశ్వాసాంత గద్యయే శరణ్యము. ఆశ్వాసాంత గద్య ఈ క్రిందిది :

"ఇది శ్రీమద్భ్రమరాంబికా వరప్రసాదలబ్ధ సరస కవితా ధురంధర సకల కవిమిత్ర యల్లనామాత్య పుత్ర సకలసద్గుణవిధేయ గట్టుప్రభునామధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సమాప్తము."

గ్రంథావతారికలు లభ్యము కామిచే కొందరి కవుల వంశాదికమును తెలిసికొనుటకు వీలుపడదు. అట్టి వారి వంశాదికమును తెలిసికొనుటకు ఆశ్వాసాంత గద్యలు కొంతవరకైనను తోడ్పడుచున్నవి.

అయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యుదయావతారికలో తన్నుగూర్చి ఏమియు తెలుపలేదు. ఆశ్వాసాంత గద్యను బట్టియే రామభద్రకవినిగూర్చి కొంత వరకు తెలిసికొనవచ్చును. రామాభ్యుదయాశ్వాసాంత గద్య ఈ క్రిందిది :

"ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీర శతక నిర్మాణ కర్మఠ జగదేక ఖ్యాతి ధుర్యాయ్యలరాజు తిప్పయ మనీషి పర్వతాభిదాన పౌత్రాక్కయార్య పుత్ర పరిశీలిత సమిద్ధ రామానుజమతసిద్ధాంత మర్మముమ్మడి వరదాచార్య కటాక్ష వీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయ మహాప్రబంధంబునందు సర్వంబును అష్టమాశ్వాసము."

దీనినిబట్టి రామభద్రకవి రామానుజమతసిద్ధాంత మర్మము నెరింగినవాడనియు, అతని తాత తిప్పయకవి ఒంటిమెట్ట రఘువీరశతక నిర్మాత అనియు తెలియును.

## 4. ఫలశ్రుతి :

తెలుగులో గ్రంథాంతమున ఆశ్వాసాంత గద్యలకు ముందు ఫలశ్రుతిని కొందరు కవులు చెప్పినారు. గ్రంథమును వ్రాసినను, చదివినను, వినినను, సంగ్రహించినను ధనధాన్యారోగ్యపుత్రవంతులగుదురనియు, పరమేశ్వరుడు వారికి ఈప్సితార్థము లీడేర్చుననియు కవి పాఠకుల నుద్దేశించి ప్రబోధించుట ఈ ఫలశ్రుతి

లోని ప్రధానాంశము. ఈ ఫలశ్రుతిని గ్రంథాంతమున చెప్పుటవలన ఆ గ్రంథ మాహాత్మ్యమును పాఠకుల చిత్తమునకు సన్నిహితముచేయుటయే పరమప్రయోజనముగా కవులు భావించియుందురు. నన్నెచోడుని కుమారసంభవ కావ్యాంతము నందు ఫలశ్రుతి ఇట్లు కలదు :

"...మత్కృతి సదువుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికా గుహులిత్తు రీప్సితములు
వారిమే మెయిఁ గొనియాడ వారి కోర్కి
గొనక జంగమ మల్లికార్జునుఁడు నొసఁగు"

—కుమారసంభవము (12-226)

పాల్కురికి సోమనాథుడు తన ద్విపద కావ్యముల ప్రారంభమునందు గ్రంథమాహాత్మ్యమును తెల్పుటే గాక గ్రంథాంతములందును ఫలశ్రుతిని విశదీకరించినాడు. పండితారాధ్య చరిత్ర పర్వతప్రకరణాంతమునందలి ఫలశ్రుతిని గమనింపుడు:

"ఆయూష్మతి మల్లికార్జున పండి
తారాధ్య చరిత మాద్యంతంబు వినినఁ
జదివిన వ్రాసిన సంగ్రహించిన స
ముదితాభిమత ఫలంబులు వొందు టరుదె?
కావున నీ కృతి గారవించినను
వావిరిఁ జదివిన వ్రాసిన వినిన
నరు దొంద వారల కభిమతార్థములు
గరుణించు శివుడు మంగళమహాశ్రీలు"

తెలుగువారికి పురాణప్రీతి మెండు. పురాణములు వినినచో పుణ్యము, పురుషార్థము సిద్ధించు నని వారి నమ్మకము. కవులును తమ గ్రంథముల వ్యాప్తికి గ్రంథమాహాత్మ్యముతోపాటు ఫలశ్రుతినికూడ గ్రంథాంతమున చేర్చినారు. మార్కండేయపురాణము, ద్విపద పరమయోగి విలాసము, మనుచరిత్ర, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, సౌగంధిక ప్రసవాపహరణము - ఇత్యాది కావ్యాంతములందు ఫలశ్రుతి రచింపబడినది. మనుచరిత్రను విన్నచో అమరత్వము కూడ సిద్ధించునని పెద్దన ఇట్లు చెప్పినాడు:

"శౌరిక నీ స్వారోచిషు చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధన ధా
న్యారోగ్య పుత్రవంతులునై రూఢిగఁ గంద్రు పిదప నమరత్వంబున్"
—మనుచరిత్ర. (6-122)

కొన్ని గ్రంథములందు అంత్యమున దేవతాస్తుతి పూర్వకముగా గ్రంథమునకు ప్రసిద్ధికలఁగుగాక అని యాశీర్వదించుటయు కలదు. ప్రభావతీప్రద్యుమ్న కావ్యాంతమున ఇట్లు కలదు:

"అఘహరణ హరివంశ కథాశ్రయంబు
నాత్మపుత్రగుణ స్తవ నాంకితంబు
నైన యీ కావ్యమునకు మహాప్రసిద్ధి
నిచ్చుఁగావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు"
—ప్రభావతీ ప్రద్యుమ్నము. (5-221)

కవి తన గ్రంథమును ఆదరింపుడని పాఠకులను కోరుటయు గ్రంథాంత ఫలశ్రుతిలో కలదు. కళాపూర్ణోదయమునందలి ఫలశ్రుతిని పరికింపుడు:

"పూర్ణసమస్త సద్గుణవిభూషితుఁడై పొలుపొందు నా కళా
పూర్ణు కథల్ వినం జదువఁ బొల్పుగ సంతతి వైభవాది వి
స్తీర్ణ శుభంబుకల్మి కజాదివనమున్నది గల్గెఁగాన, నా
నిర్ణయ మార్యులెల్ల మదినిల్పి వినుండు, పఠింపుఁ డింపుతోన్"
"భవ్యత నెల్ల దేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధమగుఁ గావుత; నిత్యము సర్వలోక సు
స్తవ్యనిజస్మృతిన్ వెలయు తాండవకృష్ణు కృపన్; పవిత్ర శా
స్త్రవ్యసనాతిధన్యమగు సజ్జనకోటి యనుగ్రహంబునన్"
—కళాపూర్ణోదయము. 8-267; 268.

దోషనివారణకు, పుణ్యప్రాప్తికి భాగవతము, విరాటపర్వము, రంగనాథ రామాయణము, నలచరిత్ర మున్నగు గ్రంథములను పురాణముగా పఠించుట, వినుటయు తెలుగునాట నేటికిని కలదు. ఆపదవేళలందు పురాణమును చెప్పించుట, వినుటవలన సౌభాగ్యము చేకూరునని నమ్మువారు నేడును పెక్కుమంది యున్నారు.

మన్నారుదాసచరిత్రను వినినను, చదివినను, వ్రాసినను, 'ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి', 'ధనకనక వస్తువాహన సమృద్ధి' మాత్రమేకాక 'నిరుపమాన కవిత్వపాండిత్యమహిమ' కూడ కల్గునని రంగాజమ్మ గ్రంథాంతమున ఫలశ్రుతి

చెప్పినది. ఇప్పుడు మనకు ధన కనక వస్తు వాహనములు లభించినను లభింపకపోయి వను ఆనాడు ఆ కావ్యమును వ్రాసినందుకు, సభలో చదివినందుకు, అందరికి విని పించినందుకు ఆమెను విజయరాఘవుడు మెచ్చుకొని కనకాభిషేకము గావించి నాడు. రంగాజమ్మ తన కృతుల గద్యలో 'విజయరాఘవ మహీపాల విరచిత కన కాభిషేక'నని చాటుకొన్నది.

ఇట్లు కావ్యావతారికలలో చెప్పబడిన కొన్ని విశేషాంశములకు ఆశ్వాసాంత గద్యలు కొంత బలమును చేకూర్చుచుండుట కూడ గమనింపదగిన విషయము.

# 18
# సింహావలోకనము

ఆంధ్ర కావ్యావతారికలను గూర్చిన ఈ పరిశోధనయందు పూర్వప్రకరణము లలో ప్రధానముగ తెలిసికొనిన ముఖ్యవిషయము లివి :

'ఉపక్రమణిక'లో అవతారికను నిర్వచించి, అవతారికా సంప్రదాయము యొక్క ప్రాముఖ్యమును వివరించితిమి.

'కావ్యారంభము' అను ప్రకరణమున కృత్యారంభ పద్యములోని విశేషము లను—శ్రీకారప్రయోగము, పద్యారంభగణము, ఆశీర్వచనము, నమస్క్రియ, సూచ్యార్థ సూచనము - అనువానిని చర్చించితిమి.

'దేవతాస్తుతి' అను ప్రకరణమున శైవవైష్ణవాది మతసంప్రదాయములు, కృతికర్త కృతిపతుల మతభావరీతులు మున్నగు అంశములను పరిశీలించితిమి.

'గురుస్తుతి—పితృప్రశంస' అను ప్రకరణమున కృతికర్త కృతిపతుల గురువులను గూర్చి తెలిసికొంటిమి. కవి కాలాదుల నూహించుటకు, మతభావ రీతులు, విద్యావైదుష్యము నెరుంగుటకు కృత్యాది గురుస్తుతి తోడ్పడుచున్నదని నిరూపించితిమి.

'సుకవిస్తుతి—విద్వజ్జన ప్రశంస' అను ప్రకరణమున పలువురు సంస్కృతాంధ్ర కవి పండితులను పేర్కొంటిమి. ఆయా కవులకు గల పూర్వకవి విరచితా పూర్వకావ్య భావరససుధాచర్వణమునకు, కవి కాలాదుల నూహించుటకు కృత్యాది కవిస్తుతి తోడ్పడుచున్నదని సోదాహరణముగా చర్చించితిమి.

'కుకవినింద' అను ప్రకరణమున కుకవులను వారి కావ్యపద్ధతులను గూర్చి పరిశీలించితిమి. కుకవి నిందకూడ కవుల కవితారీతు లెరుంగుటకు కొంత తోడ్పడు చున్నదని సప్రమాణముగా తెలిపితిమి.

'కావ్యోత్పత్తి ప్రశంస' అను ప్రకరణమున గ్రంథరచనా బీజమునుగూర్చి చర్చించితిమి. సప్తసంతానములలో కావ్యము ఉత్కృష్టమనుట, స్వప్నవృత్తాంతము మున్నగు కారణములుగ తెలుగులో కావ్యోత్పత్తి జరిగినదని గ్రహించితిమి.

'కవితాపరామర్శ' అను ప్రకరణమున కావ్యరచనాసామగ్రికి సంబంధించిన లక్షణములను ప్రత్యక్షీకరించితిమి. భాష, అనువాదప్రశంస, కవితా భేదములు ఇత్యాది అంశములనుకూడ సోదాహరణముగ చర్చించితిమి.

'కావ్యప్రశంస' అను ప్రకరణమున కథాప్రాశస్త్యము, నాయకప్రాశస్త్యము రచనాప్రశస్తి, కావ్యమాహాత్మ్యములను గూర్చిన విశేషాంశములు చర్చింపబడినవి.

'గ్రంథాంకితము—కృతిపతులు' అను ప్రకరణమున తెలుగులో అంకితము చేయు పద్ధతిని, కృతిపతులనుగూర్చి వివరించితిమి.

'కృతికర్త వంశాది వర్ణనము' అను ప్రకరణమున కవినిగూర్చిన విశేషాంశములను పరిశీలించితిమి.

'కృతిపతి వంశగుణాది వర్ణన' అను ప్రకరణమువలన కృతిపతి, కృతి ప్రేరేపకుడు, కృతిపతికి పతి వీరివి గూర్చిన వంశాదికమును గ్రహించితిమి.

'షష్ఠ్యంతములు' అను ప్రకరణములో కృతిపతి గుణగణాదికములనుగూర్చి తెలుపు షష్ఠ్యంత రచన తెలుగు కావ్యావతారికలలో స్వతంత్రముగా ఏర్పడిన ఒక విశిష్ట సంప్రదాయమని గ్రహించితిమి.

'కథాసూత్ర ప్రశంస' అను ప్రకరణమున కావ్యావతారికలోని కథావతారికా వాక్యమునుబట్టి ఆ గ్రంథము కవి దృష్టిలో పురాణమా? కావ్యమా? ప్రబంధమా? అను నటువంటి విశేషములను తెలిసికొనవచ్చునని పేర్కొంటిమి.

'అవతారికా నిర్మాణము—కొన్ని విశేషాంశములు' అను ప్రకరణమున అవతారికను ప్రథమపురుషలో వ్రాయుట, అన్యకవులచే అవతారికలు వ్రాయబడుట,

అవతారికలో పూర్వకవుల కావ్యరచనలు పేర్కొనబడుట. విశేషవృత్త రచన చేయుట—అను విశేషాంశములుకూడ ఆంధ్ర కావ్యావతారికా నిర్మాణములో గమ నింపదగిన లక్షణములని సోదాహరణముగా చర్చించితిమి.

'చారిత్రకాంశములు' అను ప్రకరణమున కృతికర్త, కృతిభర్తల వంశా వళిని షష్ఠ్యంతాదులను ఆధారముగా పలువురు తెలుగు కవులు తెల్పిన చారిత్రకాంశ ములను పరిశీలించితిమి. దేశచరిత్రకు, వాఙ్మయచరిత్రకు, సాంఘికచరిత్రకు అవి తోడ్పడు విధమును చర్చించితిమి. కవుల కావ్యరచనాకాలమునుకూడ కొంత వరకు నిరూపింప యత్నించితిమి.

'కావ్యస్వరూపము-ఇతర విశేషములు' అను ప్రకరణమున కావ్యావతారిక లందు చెప్పబడిన కొన్ని విశేషాంశములు ఆశ్వాసాద్యంత పద్యములందు, ఆశ్వా సాంతగద్యలందును చోటు చేసికొనిన విషయమును గమనించితిమి. ఆశ్వాసవిభా గము, ఆశ్వాసాద్యంత విశేషములు, ఫలశ్రుతి - వీనినిగూర్చి చర్చించితిమి.

పైన పేర్కొనిన ప్రకరణములలో చెప్పని ఈ క్రింది విశేషములుకూడ ఆంధ్ర కావ్యావతారికల ప్రాధాన్యమునకు తార్కాణము లగుచున్నవి.

శుభోదయమున కావ్యమును ప్రారంభించినట్లు కొందరు కవులు తమ కావ్యావతారికలందు తెల్పియున్నారు. నన్నెచోడుడు బహుకళాకోవిదుడు, దైవ జ్ఞుడు, జ్యోతిశ్శాస్త్రపారగుడు. అతడు కుమారసంభవావతారికలో చెప్పిన పద్య మును చూడుడు :

"అన్యతారక వితతుల నాదరించి
వెలయు సత్కవి బుధగురు బలము వడసి
యొనర దైవజ్ఞు నట్లు శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ"

— కుమారసంభవము. (1-84)

పై పద్యమునుబట్టి నన్నెచోడుడు తన కుమారసంభవమును దైవజ్ఞునట్లు శుభోదయమున బుధ గురు బలము బడసి రచించియున్నట్లు వ్యక్తమగును. 'శుక్రుండు వక్రంబుసొచ్చి' అని తారకునికి శుక్రుడు వక్రమైనందున రెండు పర్యా యములు కావ్యహాని యైనట్లు వర్ణించుటచే నన్నెచోడుని దైవజ్ఞత వ్యక్తమగు

చున్నది. శ్రీనాథుడుకూడ హరవిలాపమును 'శుభముహూర్తమున' చెప్పియున్నట్లు అవతారికలో సూచించియున్నాడు.

తెలుగు లిపినిగూర్చిన ప్రశంసను కొందరు కవులు తమ కావ్యావతారికలందు గావించి యున్నారు.

జక్కన విక్రమార్కచరిత్రకు కృతిపతియైన వెన్నెలకంటి సిద్ధనమంత్రి యందొక అద్భుతమైన విశేషము రెండు చేతులతో చక్కగ తెలుగు లిపిని వ్రాయ గల సవ్యసాచిత్వము, తెలుగు లిపివలెనే ఇతర భాషా లిపులను ధారాళముగా చదువ గల నేర్పరితనమును. విక్రమార్క చరిత్రావతారికలోని ఈ పద్యమును చూడుడు:

"అణిముత్తెముల సోయగము మించిన వ్రాలు వరుసతో నిరుగేల వ్రాయనేర్చె
నాత్మీయ లిపియట్లు లన్యదేశంబుల లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె"

—విక్రమార్క చరిత్ర (1-50)

ఈ విషయము విక్రమార్కచరిత్ర తృతీయాశ్వాసాంతమందును ఒక పద్య ములో చెప్పబడినది (3-137). సిద్ధనమంత్రి గొప్ప గణితశాస్త్రజ్ఞుడు, చక్కని కవి త్వము చెప్పగల సమర్థుడునై యుండెనని తెలియుచున్నది (విక్రమార్కచరిత్ర-1-50).

పాండురంగమాహాత్మ్యమును కృతిగొన్న విరూరి వేదాద్రి మంగయ గురవ రాజు కుమారుడైన పెద్ద సంగభూపాలునొద్ద వ్రాయసగాడు. తెనాలి రామకృష్ణకవి విరూరి వేదాద్రిమంత్రి రాయసమును వర్ణించుచు తన కాలమునాటి రాయసమును గురించి విస్తారముగా పాండురంగ మాహాత్మ్యావతారికలో వివరించినాడు. ఈ పద్య మును చూడుడు:

"పట్టె వ్రట్టువయును బరిపుష్టి తలకట్టు
గుడిసున్న కియ్యయు సుడియు ముడియు
నైత్వంబు నేత్వంబు నందంబు మందంబు
గిలకయు బంతులు నిలుపు పొలుపు
నయము నిస్సందేహతయు నొప్పు మురువును
దచ్చి వేసిన యట్లు తనరుటయును

షడ్వర్గ శుద్ధియుం జాతి యోగ్యతయును
వృద్ధి ప్రియత్వంబు విశద గతియుఁ
గీలు కొన రాయసంబుల వ్రాలు వ్రాయుఁ
గొంకుఁ గొనరును శేతప్పుఁ గొనకయుండ
లలిత ముక్తాఫలాకార విలసనమున
మతిమరున్మంత్రి వేదాద్రి మంత్రివరుడు"

—పాండురంగ మాహాత్మ్యము (1-71)

వేదాద్రిమంత్రి రాయసములు లలిత ముక్తాఫలాకార విలసనములుగా నుండునని, కవి పై పద్యమున తెల్పియున్నాడు. పట్టె, వట్రువ పరిపుష్టి కలవిగా నుండవలయునని, తలకట్టు, గుడి, సున్న, క్యావడి, వట్రువసుడి, మావత్తు, ఐత్వము, ఏత్వము మందముగా నుండవలెనని, వలపలగిలక బంతులు నిలువు పొలుపుగా నుండవలయునని, అన్నిటియందు నొక న్యాయముండవలయునని రామృష్ణకవి చెప్పియున్నాడు. ఆ యక్షరములు నిశ్చయముగా దెలియవలయును, ఒక యందముండవలయును, చెక్కినట్లుండవలెను, హల్లులు తజ్జాతిని చెప్పవలెను.

తెలుగు కావ్యావతారికలలోని కొన్ని విషయములు చరిత్రకారులకు, సాహిత్య పరామర్శకులకు మిగుల తోడ్పడుచున్నవి.

తరచుగా శాసనములలో రేనాడు-ఏడువేలు, వెలనాడు - ఆరువేలు అని ఒక 'వాడు' చెప్పినవెంటనే ఒక సంఖ్యను చెప్పుదురు. ఈ సంఖ్య గ్రామములా కాదా అను విషయమున చరిత్రకారులలో భిన్నాభిప్రాయము లున్నవి. మంచన తన కేయూరబాహుచరిత్రావతారికలో చెప్పిన ఒక పద్యమువలన అది గ్రామసంఖ్యయని స్పష్టముగా విశదమగుచున్నది. ఆ పద్యమిది :

"అరుదందన్ వెలనాటి చోడమనుజేంద్రాజ్ఞాపనంబూని దు
స్తరశక్తిం జని యేకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైక లగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై"

—కేయూరబాహు చరిత్రము (1-27)

ఒక జాతియొక్క సాంఘిక రాజకీయాది చరిత్ర నిర్మాణమునకు శాసనాది సాక్ష్యములేగాక కవుల కావ్యములును ఎక్కువ తోడ్పడును. కావ్యావతారికలలో కృతికర్త కృతిభర్తల వర్ణనాదికములందు చారిత్రకాంశములతోపాటు సాంఘిక జీవిత విశేషాదులుకూడ సూచింపబడియున్నవి.

రెడ్డిరాజుల దాతృత్వమును శ్రీనాథుడు తన కావ్యావతారికలందు వివరించి యున్నాడని పూర్వప్రకరణములలో తెలిసికొంటిమి. వేమభూపాలుని దాతృత్వమును వర్ణించుచు శ్రీనాథుడు తన కాలమునాటి బ్రాహ్మణుల స్వరూపమును సాక్షాత్కరింపజేసి యున్నాడు. ఈ పద్యమును చూడుడు :

"ధరియింప నేర్చిరి దర్భ పెట్టెడు వ్రేళ్ల నీల మాణిక్యాంగుళీయకముల
కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ గస్తూరికా పుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ దారహారములు ముత్యాల సరులు
చెరువంగ నేర్చిరి శిఖల చెన్నడుములఁ గమ్మని క్రొత్త చెంగల్వ విరులు
ధామముల వెండియును బైఁడి దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారముల యందు
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి యేలింపఁ గోశమీ తటమునందు"

—భీమేశ్వర పురాణము (1-41)

ఈ పద్యము కాశీఖండావతారికయందును మార్పేమియు లేకుండ చెప్పబడినది.

భీమేశ్వరపురాణ కృతిపతియగు అన్నమంత్రి అన్నయైన లింగనమంత్రి ద్వాదశీపుణ్యవేళల బ్రాహ్మణులకు సమృద్ధమైన భోజనములు పెట్టెడివాడని వర్ణించుచు శ్రీనాథుడు తన కాలమునాటి విశిష్టభోజన పరిపాటిని తెల్పియున్నాడు. చూడుడు :

"ఖండ శర్కర జున్ను కండచక్కెరలు దోసెలు వడల్సేవె పాసెములతోడఁ
గమ్మఁగాఁగాచిన కఱియాల నేతితోఁ గమనీయ పంచభక్ష్యములతోడ
సచ్చారువులతోడ శాకపాకములతోఁ బక్వమైన పెసరపప్పుతోడఁ
దేనియధారతోఁ బానకంబులతోడ శిఖరి పాడబరస శ్రేణితోడ

నచ్ఛలవణాదికముతోడ నమృతఖండ
పాండురంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము పెట్టు ద్వాదశీ పుణ్యవేళ
లింగమంత్రి నవీన దక్షాంగనుండు'

—భీమేశ్వర పురాణము (1-61)

పైన సూచించినట్లు ఒక్క కవిని మాత్రమే గాక కవి కాలమునాటి పలు విధములగు నితర విషయములనుగూడ మనము కావ్యావతారికల మూలమున తెలిసికొనవచ్చును. ఆంధ్రభాషాచరిత్రకారులకు, విమర్శకులకును ఈ కావ్యావతారికలు మిగుల తోడ్పడుచున్నవి. అవతారికా రచన తెలుగు గ్రంథనిర్మాణమునందు పరిణమించిన స్వతంత్ర సంప్రదాయము అనుటలో విప్రతిపత్తిలేదు. తెలుగు కవులనుగూర్చి, కావ్యములనుగూర్చి సమగ్రముముగా నెరుంగుటకు ఆంధ్ర కావ్యావతారికలకు అధిక ప్రాధాన్యమున్నదనుటలో కూడ విప్రతిపత్తి లేదు.

# ఉపకరించిన గ్రంథములు


1. ఆంధ్రకవి తరంగిణి - చాగంటి శేషయ్య
2. ఆంధ్రకవి సప్తశతి - బులుసు వేంకటరమణయ్య
3. ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు
4. ఆంధ్ర వాఙ్మయారంభదశ - ద్వితీయసంపుటము - నన్నయ యుగము, డాక్టరు దివాకర్ల వేంకటావధాని
5. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటములు
6. కవిత్వ తత్త్వ విచారము - కట్టమంచి రామలింగారెడ్డి
7. కవిరాజ శిఖామణి - తిమ్మావజ్ఝల కోదండరామయ్య
8. కుమార సంభవము - కాళిదాసు
9. కుమార సంభవ విమర్శనము - శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి
10. తెలుగు ఛందో వికాసము - కోవెల సంపత్కుమారాచార్య
11. తెలుగు భాషలో ఛందోరీతులు - రావూరి దొరస్వామి శర్మ
12. తెలుగులో ఛందోరీతులు - డాక్టరు జి. వి. సీతాపతి
13. తెలుగు సంస్కృతి - 3 వ సంపుటము, విజ్ఞాన సర్వస్వము
14. దక్షిణ దేశ భాషా సారస్వతములు, దేశి - కోరాడ రామకృష్ణయ్య
15. ద్విపద వాఙ్మయము - డాక్టరు జి. నాగయ్య
16. నన్నెచోడుని కవిత్వము - అమరేశం రాజేశ్వర శర్మ
17. నన్నెచోడుని కవిత్వము - వేదము వేంకటరాయశాస్త్రి
18. భారతి సంపుటములు
19. రఘువంశము - కాళిదాసు
20. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక

21. విజయనగర రాజ్య చరిత్ర - టేకుమళ్ల అచ్యుతరావు
22. విశ్వ సాహితి - 6 వ సంపుటము - విజ్ఞానసర్వస్వము
23. శాసన పద్యమంజరి
24. సంస్కృత వాఙ్మయ చరిత్ర - మల్లాది సూర్యనారాయణశాస్త్రి
25. సమగ్ర ఆంధ్ర సాహిత్యం - 11 సంపుటములు - ఆరుద్ర
26. సాహిత్య దర్పణము - విశ్వనాథుడు
27. హర్ష చరిత్ర - బాణుడు
28. A History of Andhra Literature (2 parts) - టేకుమళ్ల అచ్యుతరావు
29. The practical Sanskrit English Dictionary - V. S. Apte.
30. South Indian Inscriptions - Vol. IV, VI, X.

1. అచ్చ తెనుగు రామాయణము - కూచిమంచి తిమ్మకవి
2. అనిరుద్ధ చరిత్ర - కనుపర్తి అబ్బయామాత్యుడు
3. అనుభవసారము - పాల్కురికి సోమనాథుడు
4. అప్పకవీయము - అప్పకవి
5. అష్టమహిషీ కల్యాణము - తాళ్లపాక చిన్నన్న
6. అహల్యా సంక్రందనము - సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు
7. ఆంధ్ర భాషా భూషణము - కేతన
8. ఆముక్త మాల్యద - కృష్ణదేవరాయలు
9. ఉత్తరకాండ - కాచవిభుడు, విట్ఠలనాథుడు
10. ఉత్తర రామాయణము - కంకంటి పాపరాజు
11. ఉత్తర హరివంశము - నాచన సోమన
12. ఉద్భటారాధ్య చరిత్ర - తెనాలి రామలింగ కవి
13. ఉషాకల్యాణము - తాళ్లపాక చిన్నన్న
14. కవికర్ణ రసాయనము - సంకుసాల నృసింహకవి
15. కవిజన రంజనము - అడిదము సూరన

16. కవిజనాశ్రయము - మల్లియ రేచన
17. కవిరాజమనోరంజనము - కనుపర్తి అబ్బయామాత్యుడు
18. కళాపూర్ణోదయము - పింగళి సూరన
19. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
20. కావ్యాలంకార సంగ్రహము (నరస భూపాలీయము) - భట్టుమూర్తి
21. కాశీఖండము - శ్రీనాథుడు
22. కాళహస్తి మాహాత్మ్యము - ధూర్జటి
23. కుచేలోపాఖ్యానము - గట్టు ప్రభువు
24. కుమార సంభవము - నన్నెచోడుడు
25. కృష్ణరాయ విజయము - కుమార ధూర్జటి
26. కేయూరబాహుచరిత్ర - మంచన
27. క్రీడాభిరామము - వినుకొండ వల్లభామాత్యుడు
28. చంద్రభానుచరిత్రము - తరిగొప్పుల మల్లన
29. చిత్రభారతము - చరిగొండ ధర్మన
30. చెన్న బసవ పురాణము - అత్తనూరి పాపకవి
31. ఛందోదర్పణము - అనంతుడు
32. జైమిని భారతము - పిల్లలమర్రి పినవీరభద్రుడు
33. దశకుమార చరిత్ర - కేతన
34. నరపతి విజయము (రామరాజీయము) - అందుగుల వెంకయ్య
35. నవచోళ చరిత్రము - పోశెట్టి లింగన
36. నవనాథ చరిత్ర - గౌరన
37. నారసింహపురాణము - హరిభట్టు
38. నాసికేతోపాఖ్యానము - దగ్గుపల్లి దుగ్గన
39. నిరంకుశోపాఖ్యానము - కందుకూరి రుద్రయ
40. నిర్వచనోత్తర రామాయణము - తిక్కన
41. నీతితారావళి - మడికి సింగన
42. నీలాసుందరీపరిణయము - కూచిమంచి తిమ్మకవి
48. నృసింహపురాణము - ఎఱ్ఱాప్రెగడ

44. పంచతంత్రము - దూబగుంట నారాయణ
45. పంచతంత్రము - బైచరాజు వేంకటనాథుడు
46. పంచతంత్రి - భానుకవి
47. పండితారాధ్య చరిత్ర - పాల్కురికి సోమనాథుడు
48. పరమయోగి విలాసము - తాళ్లపాక చిన్నన్న
49. పల్నాటి వీరచరిత్ర - శ్రీనాథుడు
50. పాంచాలీ పరిణయము - కాకమాని మూర్తికవి
51. పాండురంగ మాహాత్మ్యము - తెనాలి రామకృష్ణుడు
52. పారిజాతాపహరణము - నంది తిమ్మన
53. ప్రభావతీ ప్రద్యుమ్నము - పింగళి సూరన
54. ప్రబోధ చంద్రోదయము - నందిమల్లయ, ఘంట సింగన
55. బసవపురాణము - పాల్కురికి సోమనాథుడు
56. బహుళాశ్వ చరిత్ర - దామెరల వెంగళ నాయకుడు
57. బాలభాగవతము - దోనూరు కోనేరునాథుడు
58. బిల్హణీయము - చిత్రకవి సింగరార్యుడు
59. భాగవతము - బమ్మెరపోతన
60. భారతము, ఆదిపర్వము - నన్నయభట్టు
61. భారతము, విరాటపర్వము - తిక్కన
62. భాస్కర రామాయణము
63. భీమేశ్వర పురాణము - శ్రీనాథుడు
64. భోజరాజీయము - అనంతామాత్యుడు
65. మనుచరిత్రము - అల్లసాని పెద్దన
66. మల్హణ చరిత్రము - ఎడపాటి ఎఱ్ఱయ
67. మార్కండేయ పురాణము - మారన
68. మైరావణ చరిత్రము - మాడయ్యాకవి
69. మొల్లరామాయణము - ఆతుకూరి మొల్ల
70. యయాతి చరిత్ర - పొన్నికంటి తెలగన
71. రంగనాథరామాయణము - గోన బుద్ధభూపతి

72. రఘునాథరామాయణము - రఘునాథనాయకుడు
73. రాఘవ పాండవీయము - పింగళి సూరన
74. రాజగోపాల విలాసము - చెంగల్వ కాళకవి
75. రాజవాహనవిజయము - కాకమాని మూర్తికవి
76. రాజశేఖర చరిత్ర - మాదయగారి మల్లన
77. రాజశేఖర విలాసము - కూచిమంచి తిమ్మకవి
78. రాధామాధవము - చింతలపూడి ఎల్లనార్యుడు
79. రాధికాసాంత్వనము - ముద్దుపళని
80. రామాభ్యుదయము - అయ్యలరాజు రామభద్రుడు
81. రామాయణము - కట్ట వరదరాజు
82. రావణ దమ్మీయము (లేక లంకావిజయము) - పిండిప్రోలు లక్ష్మణకవి
83. రుక్మాంగద - ప్రౌఢకవి మల్లన
84. రుక్మిణీపరిణయము - కూచిమంచి తిమ్మకవి
85. వరాహపురాణము - నందిమల్లయ, ఘంట సింగనలు
86. వసుచరిత్రము - రామరాజభూషణుడు
87. వాల్మీకిచరిత్ర - రఘునాథనాయకుడు
88. వాసిష్ఠరామాయణము - మడికి సింగన
89. విక్రమార్కచరిత్ర - జక్కన
90. విజయవిలాసము - చేమకూర వేంకటకవి
91. విప్రనారాయణచరిత్ర - చదలువాడ మల్లన
92. విష్ణుపురాణము - వెన్నెలకంటి సూరన
93. వీరభద్రవిజయము - పోతన
94. వేంకటాచల మాహాత్మ్యము - తరిగొండ వేంకమాంబ
95. వైజయంతీవిలాసము - సారంగు తమ్మయ
96. శకుంతలాపరిణయము - కృష్ణకవి
97. శశాంకవిజయము - శేషము వేంకటపతి
98. శశిరేఖాపరిణయము - రత్నాకరము అప్పప్పకవి
99. శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యుడు

100. శివరాత్రి మాహాత్మ్యము - శ్రీనాథుడు
101. శివలీలా విలాసము - నిశ్శంక కొమ్మన
102. శుకసప్తతి - పాలవేకరి కదిరీపతి
103. శృంగార నైషధము - శ్రీనాథుడు
104. శృంగార శాకుంతలము - పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు
105. సత్యభామా సాంత్వనము - లింగన మఖి కామేశ్వరకవి
106. సాంబోపాఖ్యానము - రామరాజు రంగప్ప రాజకవి
107. సారసంగ్రహ గణితము - పావులూరి మల్లన
108. సింహాసన ద్వాత్రింశిక - కొరవి గోపరాజు
109. సుగ్రీవవిజయము - కందుకూరి రుద్రకవి
110. సుదక్షిణాపరిణయము - తెనాలి అన్నయ
111. సౌగంధిక ప్రసవాపహరణము - రత్నాకరము గోపాలరాజు
112. హరవిలాసము - శ్రీనాథుడు
113. హరివంశము - ఎఱ్ఱాప్రెగడ
114. హరిశ్చంద్ర నలోపాఖ్యానము - రామరాజభూషణుడు
115. హరిశ్చంద్రోపాఖ్యానము - గౌరన
116. హరిశ్చంద్రోపాఖ్యానము - శంకరకవి

మిగిలిన గ్రంథములు ఆయా స్థలములయందే పేర్కొనబడినవి.



# సూచి

అచ్చ = అచ్చతెనుగు కావ్యము; అల = అలభ్యము; క = కన్నడము; కృ. ప. = కృతిపతి; గ్రం = గ్రంథము; జా. గే = జానపదగేయము; త = తమిళము; దూ. నా. = దూబగుంట నారాయణకవి; ద్వి = ద్విపదకావ్యము; ప = పద్యకావ్యము; ప్రా = ప్రాకృతకవి; వై. వేం. = వైచరాజు వేంకటనాథుడు; వచ = వచనకావ్యము; సం = సంస్కృతము; స్థ = స్థలము.